గ్రంథాలయ పుస్తకశాల ౧౦.

# భూమి - రైతు - రాజు

కర్త:
శ్రీ మానికొండ సత్యనారాయణశాస్త్రి
బి. ఏ., బి. ఎల్.,
"బ్రిటిష్ మహాయుగము" గ్రంథకర్త

ప్రకాశకులు:
గ్రంథాలయ పుస్తకశాల
పటమట పోస్టు, (వయా) బెజవాడ.
బ్రాంచి: తెనాలి.

# మా మాట!

మన దేశము పూర్ణముగా వ్యవసాయదేశము. ఈ పరిశ్రమ ఫలవంతముగా సాగవలెనంటే ఉత్పత్తిదారులుగా ఉండే వారికి భూమియందు పూర్ణమైన శ్రద్ధ ఉండవలెను. అట్టి శ్రద్ధ కలుగడానికి ఇది నాది, దీనివలన నేను బాగుపడుదును, లోకమును బాగుపరుతును అనే భావము బాగా ఉత్పత్తిదారులలో ప్రబలవలెను.

ఇట్టి ఉత్సాహజనకమైన పరిస్థితి ఉండడానికి భూస్వామ్యమునకు సంభవించిన తేడాలు ఆ టం క ము ల గు చు న్న వి. భూస్వామ్య మంటే ఏమో? కాలానుగతంగా అది ఎట్లెట్లు మార్పులు పొందిందో? దానిచరిత్ర ఏమో? ఎప్పు డది ఎన్ని విధముల ఛిన్నాభిన్నమై పోయిందో? మొదలైన సంగతులన్నీ గ్రహించితేనేగాని మనము ముందుకు ఏమి పరివర్తనము చేయవలెనో గ్రహించలేము.

కడచిన పర్యాయము కాంగ్రెసుమంత్రులు అధికారము తీసుకొన్నప్పుడు ఈ సమస్యను వారు ఒక విధంగా విమర్శకు కొనివచ్చిరి. ముఖ్యముగా జమీందారుల చరిత్రను ఆమూలాగ్రంగా పరీక్షించి, రైతుకూ జమిందారుకూ ఉండే సంబంధబాంధవ్యములను తేల్చి, రైతును సంరక్షించవలెననే ఉద్దేశ్యమే వారిని ఈ పనికి పురికొల్పిందన్నమాట నిజమే. కాని ఈ సమస్యను విడదీయడానికి వారు భూమిహక్కులకు సంబంధించిన సామాన్యవిషయాలన్నీకూడ అవగాహన చేసుకోవలసివచ్చింది.

కాబట్టి జమీందారీవిధానసంస్కారానికి పూనుకొని ఆ మంత్రివర్గమువారు తీసుకొన్న సాక్ష్యము, తయారుచేసిన రిపోర్టు పెద్దపెద్దసంపుటాలుగా ఏర్పడిపోయింది.

అప్పట్లో ఈ విషయాన్ని పట్టుదలగా విమర్శించిన మంత్రి శ్రీ టంగుటూరి ప్రకాశంగారు. శ్రీ మానికొండ సత్యనారాయణ శాస్త్రిగారు వారికి కుడిభుజంగా పనిచేసిన వారు. చిన్నతనంనుండి శాస్త్రిగారు గ్రామపునరుద్ధరణ విషయములో ఎక్కువ అభినివేశంతో విషయవిమర్శచేసినవారు కావడంచేత ఈ క్రొత్తఅనుభవం వారి సహజప్రతిభకు మెరుగు పెట్టింది.

అట్టి అనుభవశాలియైన గ్రంథకర్త వేదకాలము దగ్గర నుంచీ భూమిహక్కులు ఎట్లెట్లు మారినవో విమర్శిస్తూ నేడు మనదేశములోని అన్నిప్రాంతాలలోనుండే హక్కువిధానాలను పేళ్లతో, వర్ణనతో, విమర్శతో చరిత్రాత్మకంగా వివరించి ఈ గ్రంథమును మాకు వ్రాసి యిచ్చినారు. వారి స్వాభిప్రాయములు దాచక బాహాటంగా ప్రకటించినారు. వారికి తోచిన తీర్మానాలు ప్రతిపాదించినారు. అన్ని సూక్ష్మాంశములతో కూడ మన మేకీభవించకపోవచ్చును. కాని మొత్తము మీద వారి ధోరణి నవీనయుగానికి చాల అత్యవసరమైన దనడం నిస్సందేహము. వారికి మేము కృతజ్ఞులము. చదువరు లందరుకూడ గ్రంథము చదివిన తర్వాత వారియెడల మేము చూపిన కృతజ్ఞతనే చూపగల రనడం సత్యము.

ఇప్పుడు మళ్ళీ ఎన్నికలు జరుగుచున్నవి. మళ్లీ ప్రజా ప్రభుత్వా లేర్పడగలవు. మళ్ళీ భూమిహక్కులనుగూర్చిన విమ

ర్యలు శాసనసభలలో జరుగగలవు. మనము కోరేది నిజమైన ప్రజలప్రభుత్వమే అయినట్లయితే భూమితో సంబంధించిన ఒక్కొక్క వ్యక్తి ఈ గ్రంథంలో తెలిపిన వివరాలను చదువుకొని తన అభిప్రాయం స్వయంగానూ, పదిమందితో కలసిన్నీ స్పష్టంగా తెలియజేయువాడు కావలెను. జనానీకంలో అట్టి శక్తిని కలిగించే ఉద్దేశంతోనే ఈ గ్రంథాన్ని ప్రకటించడానికి పూనుకున్నాము. ఈ గ్రంథావలోకనముచేసి ఎందరిచేత దీన్ని చదివించగల్గితే అందరిచేత చదివిస్తారని విశ్వసిస్తున్నాము.

ఇట్లు,

ప్ర కా శ కు లు.

---

ఆ. దే. గ్ర. సంఘము. పటమటలంక

## ఆంధ్ర గ్రంథములు : మొదటి జాబితా

గ్రంథాలయాలలో నుంచదగిన ప్రాథమిక పుస్తకాల పట్టిక. వివిధ విషయములకు సంబంధించిన 225 పుస్తకాలకు పేరు, కర్త, ప్రకాశకులు, కూర్పు, సైజు, పేజీలు, వెల వరుసగా గలవు. "దిన, వార, మాసపత్రికలు, గ్రంథాలయాలలో నుంచవలసిన ఇతరపరికరాలు" ఇందు చేర్చబడినవి.

1945. 8 డెమ్మీ 36 పుటలు, వెల పోస్టేజీతో రు 0-7-0

దొరకుచోటు :— గ్రంథాలయ పుస్తకశాల.

పటమటలంక, (వయా) బెజవాడ.

---

4

# అభినందనము

శ్రీ మానికొండ సత్యనారాయణ శాస్త్రిగారు సత్యాగ్రహి, గొప్పరాజకీయవేత్త, అపరిగ్రహశీలుడు, కవి, స్నేహపాత్రుడు. ఏతదనేక సుగుణ పుంజము లొక్కచో నునికి యరిది. ఇట్టివాడు వ్రాసిన గ్రంథముపై నేది వ్రాయుటకును నా కధికారము లేదు. కాని వారి భాషారచననుగూర్చి యొక్కమాట చెప్పగలను. వారి భాష వ్యావహారికాంధ్రమునకు ప్రమాణ ప్రాయమైనది. విషయము పట్టి లౌకిక వ్యవహారసంకులమై యున్నప్పుడు దానిని సామాన్య పాఠకుని మనసున కెక్కునట్లు వ్రాయుటకు, దానియందు దేశీయమైన పలుకుబడి సొగసుతో విశదతరమైన యభిప్రాయప్రకటనమునకు యోగ్యమైన భాషా పాటవమును ప్రదర్శించుటకు— ఎక్కువ శక్తి కావలయును. మేము వాడుకభాషలో వ్రాయుదు మనుకొనుచున్నవారు కొంత యిచ్చముగా సాంస్కృతిక బహుళమైన భాష నవలంబించి ప్రత్యయాంతవికారమాత్రముచే నది వాడుకభాష యగు నని దుర్భ్రమ నొందుచున్నారు. అట్టివా రీ గ్రంథమును దిలకించి నిజమైన వ్యావహారికభాషాస్వరూపమును గ్రహింతురు గాక యని మనవి.

ఇట్టి గ్రంథము లింకను వ్రాసి భాషకు దేశమునకు నిరోధికసేవ గావించుటకై శ్రీ శాస్త్రిగారికి పరమేశ్వరుడు దీర్ఘాయుర్దాయము — శాస్త్రిగా రైశ్వర్యమును వాంఛింపరు గనుక — ప్రసాదించుగాక యని యభ్యర్థించుచున్నాను.

విశ్వనాథ వేంకటేశ్వరులు.

# విషయసూచిక

## మొదటి భాగము



## రెండవ భాగము

# తప్పొప్పుల పట్టిక

[పాఠకులు ముందుగ యీ సవరణలను చేసికొందురుగాక]

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 24 | 2 | సర్వ్వేశ్వరుడు | సర్వేశ్వరుడు |
| 49 | 8 | "చేయువారు" అనుమాట తరువాత (.) తీసివేసి "కుడియిరుప్పు దారులను వారు" అనుమాటలకు బ్రాకెట్లు వేసుకొనవలెను. | |
| 50 | 17 | కాక | లేక |
| 93 | 9 | ఒప్పుకొనవచ్చును | ఒప్పుకొనివచ్చును |
| 106 | 15 | చాదలి | చాదరి |
| 138 | 6 | 1892 | 1802 |
| 163 | 8 | సుచో | సుచ్ |
| 176 | 9 | "వినండి" అనుమాటను కొట్టివేసుకొనవలెను. | |

176 NB:— యీ పేజీ దరిమిలా 8 పేజీలకు పేజీలసంఖ్య సక్రమముగ సవరించుకొనవలెను.

180 సవరణ పేజీ NB:— హెడ్డింగులో అంక IX కి బదులు XI అని దిద్దుకొనవలెను.

180 ,, 11 (పంక్తి) "మాత్రము యీ దిగువ ముద్రించుచున్నాము" అనుమాటలకు బదులు "చదివినచాలును" అని సవరణ చేసుకొనవలెను.

192 B. దీని తరువాత పేజీ సంఖ్య "359C" కి బదులు "192C" అని చదువుకొనవలెను.

| | | | |
|---|---|---|---|
| 192 H. | దిగువనుండి పైకి 3 పంక్తి | Non pattalands may be of the | nonpatta lands. Pattalands may be of the |

# ముందు ఒక్క—మాట

ఈ గ్రంథమందు అనాదినుండియు భూమికి, రైతుకు రాజుకు (అనగ, రాజ్యాంగమునకు) ఎట్టి సంబంధముండెనో చారిత్రకదృష్ట్యా "లా" దృష్ట్యా చూచి, వివరించితిమి. అనాది నుండి నేటివరకు పారుచున్న కాలప్రవాహములో, ఆ యా కాలములలో ప్రజలను ప్రేరేపించిన భావములనుబట్టి, ఆయా భూమి విధానములలోని మెరుగుతరుగులను వివరించితిమి. ఆ కాల పరిస్థితులలో మెరుగులనుకొన్నవి నేటిమానవుల భావములను బట్టి, ప్రపంచ పరిస్థితులనుబట్టి, మెరుగులుగ మన కీనాడు కన్పింపక పోవచ్చును. నేటికి 150 ఏండ్లక్రిందట చేయ బడిన జమీందారీ పర్మనెంటు సెటిల్‌మెంటు మంచిదా చెడ్డదా యని మనమిప్పుడు యీ నాడు మన బుర్రలోవున్న భావములతో చూచి, తీర్పుచెప్పుట సరికాదు. పర్మనెంటు సెటిల్‌మెంటుగాని, జమీందారీ పద్ధతిగాని మంచిది కాదని మన కీనాడు తోచినయెడల, దానిని మనమిప్పుడు రద్దుపరచు కొనుట కెట్టి యాక్షేపణయు లేదు. రద్దుపరచుకొని తీరవలెను_ తీరుదుము.

అట్లే ఇనాముదార్ల విషయములోకూడ, అప్పటి భావ ములనుబట్టి కొందరు వ్యక్తులకు, సంస్థలకు భూములున్ను, భూమి శిస్తులున్ను దానముగ ఇవ్వబడెను. అట్టిదానముల యొక్క ప్రయోజనములుగాని, అవసరములుగాని, నేడు తీరి పోయి యుండవచ్చును. లేక అవి ఈనాటి యూహలకు అర్థ హీనముగ గన్పట్టవచ్చును. కనుక, ఈ నాటి భావముల కను

కూలముగ, వాటినన్నీ మార్పుదల చేయుట అవసరము - చేసి తీరుదుము.

ఇక, రైతులకు, రాజ్యాంగమునకు నేరుగ జరిగే రైతు వారీ పద్ధతిలోగల తికమకలనుగూడ చారిత్రక దృష్ట్యానున్నూ ఇంతవరకున్న 'లా'దృష్ట్యానున్నూ వివరించితిమి. ఆ దృష్ట్యానే కొన్ని సూచనలనుకూడ ఇక ముందు ల్యాండు రివిన్యూ పాలసీని గురించి చేసితిమి.

ఆ భూ అధ్యాయములలో, ఏమేమి సూచనలను చేసినను, రిమార్కులు చేసినను, సద్యః అప్పటికి చర్చించుచున్న పాయింటును మాత్రమే దృష్టిలో పెట్టుకొని చేయబడినవి. కాని, అవన్నియు, మహా ఉరవడిగ త్రోసికొనివచ్చుచున్న నూతన భావములకు, నవనవాభిప్రాయములకు లోబడియే యని గ్రహింపనగును. ఈ భావ ప్రవాహమునకు అడ్డులేదు. నిలుకడ లేదు. అది సంతతస్రవంతి. ఈ రోజున ఉన్న భావములే ఆఖరు భావములనియు వీని కిక మార్పుండదనియు అనుకొనరాదు.

నేడు ప్రపంచము నావరించిన సోషలిస్టు, కమ్యూనిస్టు భావముల దృష్ట్యా, ఈ గ్రంథమందు వివరించిన జమీందారీ' ఇనాందారీ, రైత్వారీ ఇత్యాది భూ విధానము లేవిన్నీ నిలువవు. అవసరములున్నూ కావు. ఇవన్నియు ఒక్కపెట్టున, క్రుంకుడు వేళ్ళతో సహా ఊడబెరికి, తుడిచివేయ బడవలసినవే. ఈ 'కమ్యూనిష్టు' విధానములో జమీందారుడు లేడు, ఇనాం దారుడు లేడు, రైతు లేడు; యజమాని లేడు, కూలీ లేడు; షాహుకారు లేడు; జీతము లేదు, కూలీ లేదు. ఇప్పుడున్న రీతి రాజ్యాం

గనులేదు, పన్నులేదు; డబ్బు, నాణెములు లేవు; బహుశః దేవుడు కూడ లేడు. కులములు, ప్రత్యేకపు హక్కులు లేవు. మనిషికి మనిషికి తారతమ్యములు లేవు. ఉన్నదల్లా, (1) మనిషి (2) ఆ మనిషికి ఆకలిబాధ, ఇతర వస్త్రాదిక అవసరములు, షోకులకు బుద్ధి వికాసములకు సంబంధించిన అవసరములు తీర్చుటకు సాధన భూతమైన భూమి, (3) (ఎ) ఈ భూమినుండి మనుష్యులందరికి సరిసమానముగ యీ అవసరములన్నీ సమకూర్చుకొనుటకు కావలసిన శ్రమను, కృషిని, అందరూ సమానముగ పంచుకొని చేసికొనుట, (బి) తత్ఫలితములను అందరూ సమానముగ అనుభవించుట. ఇంతే.

ఈ వైశేక దృష్ట్యా చూచినప్పుడు జమీందారీ ఇనాందారీ రైతువారీ పద్ధతులేవీ అవసరములేదు, పనికిరావు, అని చెప్పితిమిగనుక అసలీ గ్రంథభాగములు రచించుట, పఠించుటయే అనవసరమగును. కాకపోతే, పూర్వమెట్లుండెనో ఇప్పుడెట్లున్నదో కొంచెము తెలిసికోడానికి చదివితే చదవవచ్చును. వెనుకటి లోపములు ముందుజరుగకుండ ఉండడానికి, భావికాలమునకేమైనా సలహా సహాయము దొరుకుతుందా అని తెలిసికోడానికైనా చదువవచ్చును.

ఇక, భావికాలపరిస్థితులు 'కమ్యూనిస్టు' సిద్ధాంతముల ప్రకారము ఎట్లుండవలెనని తెలుసుకొనగోరువారు, నాచే రచింపబడిన "గ్రామము" "గ్రామస్వరాజ్యస్కీము" అను రెండు ప్రచురణలను చదివిన చాలును.

"కమ్యూనిజం" అనునది మన హిందూదేశమునకు క్రొత్తకాదు. దానిని నేడు మనము రష్యానుండి అరువు తెచ్చు

కోవలసిన పనిలేదు. అచ్చటి కమ్యూనిజము నా యెరిగినంత వరకు దౌర్జన్యము మిత్రద్రోహము రక్తపాతము కటికనిరంకుశము మున్నగు లోకకంటకపద్ధతులపై స్థాపింపబడినది. ఈ పద్ధతులు మనకు కేవలము విరుద్ధములు, గర్హ్యములు. వాని నిక్కడ దిగుమతి జేయుచూచుట అవివేకము. లోకశాంతికి దారిదీయువలెనంటే, యీ మార్గములను పరిత్యజించి అహింస ప్రేమ పరస్పర సహకార భావము మున్నగు సాత్త్విక పద్ధతులపై గాంధి పంథాననుసరించి మన పూర్వపు కమ్యూనిజమును హిందూదేశములో పునఃస్థాపనము చేయవలెను.

"కమ్యూనిజము" అను ఇంగ్లీషుపదము, మన ప్రాచ్య గ్రంథములలో లేకపోవచ్చును. అయితే, ఇది "సాముదాయిక స్వాస్థ్యము" అను పేరుతో నాడు, మన పురాతన గ్రంథములలో వ్యవహరింపబడు చుండినది. సంపదుత్పత్తికి హేతుభూతమైన భూమి ఒకరిసొమ్ముగాక-ఒకరి ప్రయోజనమునకు ఆస్తిగాక-సంఘస్థులందరికి ఉమ్మడిహక్కుగనుండెను. ఇదియేగద కమ్యూనిజమునకు బీజము. మానవ సంఘమునకు గ్రామమే సహజమగు "యూనిట్"గ-కనీసపు కొలమానముగ-నుండెను. ఈ "గ్రామము" యొక్క ఉత్పత్తి, స్వరూపము, ప్రాశస్త్యము యీ గ్రంథము మొదటిభాగము మూడు అధ్యాయములలో వివరింపబడి యున్నది గనుక, ఇట మరల వివరింపబనిలేదు. మన పూర్వకాలపు "కమ్యూనిజము" ఎట్టిదో తెలిసికొనగోరు వారు యీ మూడు అధ్యాయములను శ్రద్ధగ చదువవలెను. ఇది మన దేశీయమైన కమ్యూనిజము. దీనిని ఆధారము చేసికొనియే నా "గ్రామస్వరాజ్య స్కీము" తయారు చేయబడి

నది. ఇది మన సాంప్రదాయములకు సంస్కృతికి మన అహింసా పథమునకు లోకశాంతిప్రతిపాదనకు అనుగుణ్యముగ నున్నది.

కనుక, ముఖ్యముగ యువకు లెల్లరు రష్యాయొక్క 'పరకంటక' మార్గమున బడక, యీ మన పురాతన "సాముదాయక స్వాస్థ్య" పథమున, మన దేశమును పునర్నిర్మాణము గావింప బూనుదురు గాక యని కోరుచున్నాను—

కేవలము పూర్వకాలపు పరిస్థితులను యథాతథముగ ఇప్పు డిక్కడ కాపీచేయవలసిన పనియు లేదు. వాటి పునాదుల పైన, యీనాటి పరిస్థితుల కనుకూలమగు కొలది సర్దుబాటులు గావించుకొని, మరీ, మన దేశపు పునర్నిర్మాణమును చేయవలసి యుండును. ఈ సర్దుబాటులు ఎట్టివో, నా "స్కీమును" చదివిన వారికి గోచరింప గలవు.

—మానికొండ సత్యనారాయణశాస్త్రి

ఉరుటూరు

పామర్రుపోస్టు

కృష్ణాజిల్లా

22—8—1945



VI



గ్రంథకర్త:

శ్రీ మానికొండ సత్యనారాయణశాస్త్రి,

బి. ఏ., బి. యల్. (1939)

# భూమి, రైతు, రాజు

(మొదటి భాగము)

## మొదటి అధ్యాయము

## భూమిహక్కు, దానిమూలము.

౧

ఆకాశా ద్వాయుః వాయో రగ్నిః అగ్నే రాపః అద్భ్యః పృథివీ
పృథివ్యా ఓషధయః ఓషధీభ్యోऽన్నమ్ అన్నాత్ పురుషః.

— తైత్తిరీయం.

### భూమి పుట్టుక

ఈశ్వరుడు విశ్వమును సృష్టించిన క్రమములో ముందు ఆకాశము, తరువాత వాయువు, తేజస్సు, (అనగ అగ్ని, లేక వెలుతురు), ఆపస్ (అనగ నీరు) పృథివి, (అనగ భూమి.) అను వానిని ఒకదాని తరువాత ఇంకొకదానిని సృజించె నని చెప్పెదురు. ఒకదానిలోనుండి, ఇంకొకటి క్రమానుసరణిని సృష్టి అయ్యె ననియు కలదు. ఇవియే "పృథివ్యాపస్ తేజో వాయు రాకాశము"లనబడు పంచభూతములుగ తలక్రిందు క్రమమున పేర్కొనబడుచున్నవి. విశ్వనిర్మాణమునకు హేతుభూతమైన

పంచభూతములలో, సమస్తజీవరాసులు నివసించుటకును, ఈ జీవరాసులను బ్రతికించే అన్నము ఓషధులు పండుటకును, మూలాధారమై, రూపముదాల్చి నిల్చినది ఈ పృథివీ భూతము.

## మానవుని పుట్టుక

పంచభూతముల సృష్ట్యనంతరము, మానవునిసృష్టి జరిగింది. సమస్తజీవరాసులలోకి మానవుడు ఉత్తముడుగ పరిగణింపబడుచున్నాడు. ప్రప్రథమమునుండి నేటివఱకు, మానవుని జీవితచరిత్ర పరిశీలించి చూచినట్లయితే, మనకు అనేక దశలు కన్పించును.

## భూమికి మనిషికి సంబంధము

నేడు మానవులు "ఈ భూమి నాది: ఈ పశువులు: ఈ వస్తువులు నావి, ఇతరులు వీని జోలికి రాకూడదు; ఇవి నా హక్కు" అని భూమిచుట్టు సర్వేరాళ్లు, కంచెలు పాతుకొని, ఆకట్టుకొని కూర్చున్నారు. ఇట్టి హక్కు లెట్లేర్పడినవి? భూమి పుట్టినప్పటినుండి, మనుష్యుడు పుట్టినప్పటినుండి ఏర్పడినవా? అయినచో ఎట్లు, ఎప్పుడు పుట్టినవి? ఎట్లు ఈ రోజు వరకు పరిణామము పొందుచు వచ్చినవి? కొంచెము విచారించి చూచెదము.

## హక్కు అనేదాని పరిణామము

మానవుడు అనాదిని భూమిపై కాలిడినపుడు, అంతయు అడవులు, అరణ్యములు, నదీ నదములు. పల్లెలు లేవు, పట్టణ

ములు లేవు, బిల్డింగులు లేవు, ఆనకట్టలు లేవు. సమస్త ప్రాణులకు సహజ మగు ఆకలిబాధ తీర్చుకొనుటకై మానవుడు ప్రథమదశలో ఈ భూమిపై తిరుగాడు లేళ్ళు, పందులు మొదలగు జంతువులను వేటాడి పట్టుకొనియు; నీళ్ల యందు లభ్య మగు చేపలు మొదలగు జలచరములు పట్టుకొనియు, గాలిలో నెగురు పక్షిజాతులఁ జంపి తినియు, కాలక్షేపము చేసినట్లు కన్పించును. భూమ్యాకాశములందు విచ్చలవిడిగ తిరుగాడు ఈ జంతువులు ఎవరిసొమ్ము? ఇవి ఎవరి హక్కు? ఇవి యెవరి ఆస్తి? వీటిని ఒకరు పట్టుకొన వచ్చును, ఇంకొకరు పట్టుకొనరాదు అని హద్దులు, నియమములు, ఏర్పరచే దెవరు? ఎవరును లేరు. వీటిని ఎవరు ముందుగ పట్టుకుంటే వారివే.అవుతవి. ముందు ఒకడు పట్టుకొన్నతరువాత, ఇంకొకడు వచ్చి తగాదా పెట్టుటకు వీలులేదు. అథవా, అట్టి తగాదా వస్తే క్రియను ఎవడు బలవంతుడైతే అది వాడిదే అవుతుంది. ఇందుకు భారతము అరణ్యపర్వములోని కిరాతార్జునీయకథయే నిదర్శనము. అరణ్యములో విచ్చలవిడిగా తిరుగు పందిని అర్జునుడును, కిరాతవేషమున వచ్చిన పరమేశ్వరుడును, బాణములతో కొట్టిరి. "ఎవరు ముందు కొట్టిరి" అనే తగాదా వచ్చినది. "నే ముందు కొట్టా నంటే, నే ముందు కొట్టా నని" ఇద్దరు తగాదా పడ్డారు. "నా యేసిన మృగంబు నేసి మృగయాధర్మవిరోధం బేల చేసితి"వని అర్జునుడు కిరాతుని ఆక్షేపించెను. "నేను ముందుగా కొట్టాను; నా దెబ్బతో అది చచ్చినది; నీ ప్రతాప మేమున్నది, పొమ్ము" అని కిరాతుడు అర్జునుని ఆక్షేపించెను. ఇరువురు తగాదాపడి కొట్లాడు

కొనిరి. అర్జునుడు ఓడి మూర్ఛపడిపోయినాడు. పరమేశ్వరుడు కరుణించి వరమిచ్చిపోయినాడు. కాబట్టి భూమిపై, గాలిలో, నీళ్ళలో, విచ్చలవిడిగ తిరుగాడు జంతుజాలములు ఒకరి సొమ్ము కావు. ఎవరు ముందు పట్టుకుంటే వారివే. మనుధర్మ శాస్త్రము, 9 వ అధ్యాయము, 44 వ శ్లోకము చివరి భాగ ములోకూడ మనువు ఇట్లే చెప్పెయున్నాడు.

## దేశద్రిమ్మరి దశ—వ్యవసాయము

కేవలము జంతువుల వేటాడి మాంసమువలన జీవించుట అను అనాది దశ దాటి, మానవుడు భూమిమీాద ధాన్యాదు లను పండించి, వీనివలన క్షుధానివారణ జేసికొనుట అను రెండవ దశకు వచ్చినాడు. అడవులలో సహజముగ లభ్యమగు కాయలు, దుంపలుగాక, భూమిని కుళ్ళగించియో, దున్నియో అందు గింజలను జల్లి, పంట పండించుకొనుటకూడ ఏర్పడెను. మనుష్యులు కొద్దిమందియు, భూమి విస్తారముగను ఉన్న ఆ కాలములో మానవులు తమ దారాపుత్రాదులతో గుంపులు గుంపులుగ బయలుదేరి, అక్కడక్కడ కొన్నాళ్ళు నివసిం చుచు, కొంత కాలమునకు మరియొక చోటుకు పోవుచునుండిరి. ఇట్టి దేశద్రిమ్మరిసంఘములు నేటికిని లంబాడీతండాలు, ఎరుకల ఏనాది గుంపులు మొదలగు జాతుల యందును, భద్రాచలం వగైరా అడవి ప్రాంతములలోని కొండజాతుల యందును, మనము చూచుచున్నాము.

## "కుమ్రీ" లేక, తాత్కాలికపు వ్యవసాయము

ఈ గుంపులు అడవులలో కొంత ప్రదేశమును ఛేదించి,

ఆ ఛేదించిన చెట్లను, పొదలను తగులబెట్టుదురు. ఆ బూడిదనే ఎరువుగ చేసి, నేలను దున్ని, విత్తనములు చల్లి, పంటలను పండించుకొని, తిందురు. మరుసంవత్సరము అక్కడనుండి మరియొక ప్రదేశమునకు కదలి, అక్కడకూడ ఇట్లే చేయుదురు. ఈ రీతిగ, వీరు ఒకచోట స్థిరముగ నుండక, అక్కడక్కడ తిరుగాడుచు, పంటలు పండించుకుంటూ, తింటూ పోతూ ఉందురు. ఈ మాదిరి వ్యవసాయమునకే "కుమ్రీ" వ్యవసాయ మని పేరు. ఇది నేటికిని ఏజన్సీ ప్రాంతాలలోను, దక్షిణ కన్నడం మొదలగు పర్వతారణ్యప్రాంతాలలోను కనుపించు చున్నది.

## మొదటగ ఆక్రమించుకొని బాగుచేసుకొన్న వానిదే భూమిహక్కు

ఇట్లు వ్యవసాయము చేసుకొను భూమియందు వీరికి గల హక్కు ఏమి? ఆ సాలును ఆ పంట పండించుకు తినేవరకే తప్ప, వారు ఆ భూమియందు ఎక్కువ హక్కును కోరి ఎరుగరు. ఎవరు ఏ ప్రదేశాన్ని, ముందుగ ఆక్రమించుకొని, చెట్లు తుప్పలు కొట్టివేసి, బాగుచేసుకుంటారో, అది వారికి ఆ పంట కాలం వరకు, హక్కుగ ఉంటుంది. పంట తిని వెళ్లిపోయిన తరువాత ఇంకెవరైనా వచ్చి దానిని ఆక్రమించుకుంటే, తగాదా పెట్టేవారు లేరు. భూమియందు మానవునకు మొట్ట మొదటగ "హక్కు" అనేది ఏర్పడడానికి ప్రథమచిహ్నము ఇదే — అనగా శాశ్వతరీ లేక తాత్కాలికవ్యవసాయం చేసుకోవడమే. అదిన్ని ముందు ఎవరు వ్యవసాయం చేస్తే

వాడిది. మనువు తన ధర్మశాస్త్రం, 9 వ అధ్యాయం, 44 వ శ్లోకములో ఏమి చెప్పినాడు?" ఈభూమి లేక పృథివి "పృథు" చక్రవర్తిభార్య యని పూర్వకాలజ్ఞులగు ఋషులు తలంచు చున్నారు. వారు చెప్పిన దేమనగా, ఎవరైతే భూమిపై గల అడవులు, తుప్పలు ఛేదించి శుభ్రపఱచి, దున్నుతారో, వారిది ఆ భూమి.

## స్థిరనివాసములు - గ్రామములు

మానవసంఘములు తమ పిల్ల మేకలతో దేశ ద్రిమ్మరులుగా తిరుగాడు దశ దాటి, కొంతకాలమునకు తృణకాష్ఠ జలసమృద్ధిగల చోట్ల స్థిరనివాసము ఏర్పరుచుకొనుట జరిగినది. వ్యవసాయపద్ధతులుకూడ అభివృద్ధి చెందినవి. అడవులు తగులబెట్టి, అక్కడ ఒంపరరీగ గింజలు చల్లుకొని, పండించుకొని, కోసికొని తిని లేచిపోవడం లేకుండ, స్థిరముగ ఒక చోట కాపురము వుండి, నేలను ఏటేటా దున్నుకొనియు, ఎరువుల వేసియు, నీళ్లు బెట్టియు స్థిరముగ వ్యవసాయం చేసుకునే పరిస్థితులు ఏర్పడినవి. కేవలము తమ దారాపుత్రులు, కుటుంబీకులేగాక, ఇంకా ఇతరజనాన్నికూడ ప్రోగుచేసుకొని, అందరు కలసి పరస్పరసహాకారభావముతో ఒక చోట కాపురము ఉండడ మనే స్థితి ఏర్పడినది. ఇట్టి స్థిరనివాసములకే "గ్రామము" అనే పేరు వచ్చినది.

## భూమిహక్కు గ్రామసంఘానిది

ఒక్కొక్క గుంపు ఒక్కొక్క ప్రదేశాన్ని ఆక్రమించు

కొని, అక్కడనే ఇండ్లు వాకిళ్లు కట్టుకొని, ఆ ప్రదేశాన్ని క్రమంగా సాగుబడి క్రిందికి తెచ్చుకొనుచుండిరి. "ముందు ఎవరు ఆక్రమించుకుంటే వాడిదే భూమి" అనే సిద్ధాంతం ప్రకారం 'ఈగుంపు ఆక్రమించుకొన్న ప్రదేశమంతా గుంపుది. ఈ ప్రదేశముపై హక్కు ఈ గుంపుది. ఆ గుంపులోని వ్యక్తులకు విడివిడిగ హక్కులేదు. ఈ రీతిగా ఒక గ్రామగుడికట్టులోని భూమిహక్కు ఆ గ్రామస్థు లందరిదిన్ని, గ్రామమంతా ఒకటే సంఘము; ఒకటే గుంపు. భూమి యావత్తు ఒక్కసాము దాయకపు భూమి. ఈ భూమికి హక్కుదారు డెవరంటే ఆ గ్రామ సంఘమే. భూమి యావత్తు ఉమ్మడిగ వ్యవసాయం చేయడం, అందరూ పంచుకొని తినడం.

వెసులుబాటు కోసం, ఉమ్మడిభూమిని గ్రామంలో కొన్ని కొన్ని కుటుంబాలు విడివిడిగా వ్యవసాయం చేసుకొన్నప్పటికి, అది ఆ సంవత్సరానికే. మరు సంవత్సరము మరొక చెక్కను తీసుకొని, వ్యవసాయం చేసుకోవడం జరుగవచ్చును. ఈ రీతిగా విడిగా ఎప్పుడైనా, ఎవడైనా, ఏ చెక్కనైనా దున్ని, పండించుకొన్నప్పటికి, దానియందు అతనికి ప్రత్యేకపు హక్కు ఏమీలేదు. చుట్టూ సర్వేరాళ్లు పాతుకొని, "ఇది నాభూమి; ఎవరూ దీనిలో అడుగుపెట్టరాదు" అని అడ్డకట్టుకొనడానికి వీలు లేదు.

### సాగుబడిక్రిందికి వచ్చిన భూమిలో వ్యక్తులకు వేర్వేరు హక్కు లెట్లేర్పడినవి?

కొంతకాలానికి, ఈ స్థితికూడా మారినది. పని వెసులు

బాటు కోసమని చెప్పి గ్రామంలో కొన్నికొన్ని కుటుంబాలు వేర్వేరు చెక్కలు దున్నుకోవడం ఎప్పుడైతే ప్రారంభమైనదో, క్రమక్రమంగా వారికి ఆ యా చెక్కలయందు ప్రత్యేక అభిమానం ఏర్పడడ మనేది సహజము. అదిగాక, ఒకడు ఒక సంవత్సరము కష్టపడి బాగా బాగుచేసుకొన్న పొలాన్ని మఱు సంవత్సరము వాని దగ్గరనుండిలాగుకొని ఇంకొకసోమరికి ఇవ్వడం ఏమి సబబు అని అనిపిస్తుంది. ఈ భావము క్రమంగా గట్టిపడి, ఎవడు బాగుచేసుకొన్న భూమి వాడికే స్థిరంగా ఉండిపోవాలనే స్థితి ఏర్పడుతుంది. ఈ రీతిగా ఆ యా చెక్కలయందు వ్యక్తులకు శాశ్వతమైన ప్రయివేటు హక్కులనేవి అంగీకరింపబడడం జరిగింది.

## బంజర్లు, మందబయళ్ళు, అడవులు వగైరాలలో ఉమ్మడిహక్కు నిలిచియుండుట

అయితే, సాగుబడిలోనికి తేబడిన భూమి ఈ రీతిగా వ్యక్తులకు వేర్వేరు హక్కుభుక్తములుగా ఏర్పడిపోయినప్పటికి, ఇంకను సాగుబడిలోనికి రాని బంజరుభూములు, అడవులు, మందబయళ్ళు, మేతబీళ్ళు మొదలగునవి గ్రామ సంఘమునకంతకు ఉమ్మడిహక్కు గలవిగానే ఉండిపోయినవి. ఈ ప్రదేశాలలో అందరు ఉమ్మడిగా పశువులను మేపుకోవచ్చును. అడవులలోనుండి కట్టె, కంప, ఎరువు, ఆకు తెచ్చుకోవచ్చును. వీటిని, ప్రత్యేకముగ ఎవరుగాని, ఆకట్టుకొని కూర్చోడానికి వీలు లేదు.

ఈ రీతిగా భూమియందు "హక్కు" అనే టటువంటిది

గ్రామ సంఘములకు, వ్యక్తులకు ఎట్లెట్లు ఏర్పడడానికి అవకాశము లుండెనో, బుద్ధిసూక్ష్మతచే చర్చించితిమి. పూర్వము, ఆ యా దేశములలో, ఈ భావములే ఎట్లెట్లు ఉద్భవమయ్యెనో తెలుపు గ్రంథాధారముల కొన్నిటి నిట వివరించెదము.

## గ్రంథాధారములు

### జైమిని సూత్రములు 6 వ అధ్యాయం 7-2

"భూమి ఒకరిది కాదు; అందరికి సాముదాయపు హక్కు గలది" అనే మాట క్రీస్తుకు పూర్వము అనేక సంవత్సరాలనాడు రచింపబడినదని తెలిసినవారిచేత అంగీకరించబడిన జైమిని సూత్రములలో స్పష్టముగ నిర్వచింప బడియున్నది. "భూమి అందరికి సాముదాయకమైనది కాబట్టి, దానిని ఇచ్చివేయడానికి ఎవరికీ వీలులేదు" అని జైమిని సూత్రము.

## ఖాండులు, తోడాలు, మున్నగు అనార్యజాతుల అభిప్రాయము

అనార్యజాతివారగు ఖాండులు, నీలగిరి ప్రాంతములోని తోడాలునుకూడ ఇట్టి భావమునే కలిగియున్నారు. వారు ఆక్రమించికొన్న భూమి వారి సాముదాయకపు భూమి అని వారి వాదన.

## "ఏనోగ్రాడఫ్" అనే పాశ్చాత్య పరిశోధకుని అభిప్రాయము

భూమి ఆదికాలమున వ్యక్తుల సొమ్ము కాదనిన్ని, గుంపుల తాలూకు ఉమ్మడిసొమ్ము అనిన్ని పురాతనగ్రంథము

లయు, పురాతన జాతులయు సుస్థిరభావమైనట్లు "వినోగ్రాడఫ్" అను పాశ్చాత్య పండితుడు గొప్ప పరిశోధన చేసినమీదట నొక్కి వక్కాణించుచున్నాడు.*

## మహమ్మదు, అతని శిష్యుల అభిప్రాయము

మహమ్మదీయ మతస్థాపకు డగు మహమ్మదు ప్రవక్త కూడ "బంజరు భూమిని ఎవరైతే సాగుచేయుదురో, ఆ భూమి వారిదే అగును" అని చెప్పియున్నాడు. బంజరు భూమిని సాగుచేసుకోడానికి రాజుయొక్క అనుమతికూడ అవసరములేదని అబూయుసుఫ్-మహమ్మదు, అను అతని శిష్యులిద్దరి అభిప్రాయము. వేటలో పడిన జంతువు, దానిని కొట్టినవాడి సొమ్ము ఎట్లయినదో, ఆ ప్రకారమే మొదట సాగుచేసినవాడిదే భూమిహక్కు అని ఈ శిష్యుల మతము.

## జస్టినియన్ అనే రోమనులా స్థాపకుని అభిప్రాయము

రోమన్‌లా కర్తకు మూలకారకుడగు "జస్టినియన్" ఏమి చెప్పినాడు? "అడవిమృగములు, పక్షులు, చేపలు అనగ నేలయందును, నీటిలోను ఆకాశమునందును తిరుగు జంతువులు ఎవరిచేతనైతే పట్టుపడుతవో, అవి వారి సొమ్మే

* "In so far as agriculture has historically developed out of pastoral husbandry there seems to be hardly any thing more certain in the domain of archaic law than the theory that the soil was orginally owned by groups and not by individuals, and that its individual appropriation is the result of a slow process of development."

అగును. ఇది సర్వమానవజాతుల ధర్మము. అంతేకు పూర్వము ఎవరి సొమ్మూ కాకుండ వున్నవస్తువు, మొట్టమొదటగ ఆక్రమించుకొన్నవారికి హక్కు అగును.

## గౌతమ ధర్మసూత్రకారుని అభిప్రాయము

ఒక వస్తువునకు హక్కు సంపాదించడానికి నాలుగు మార్గములు కలవని గౌతమ ధర్మసూత్రములు (10వ అధ్యాయము, 39వ శ్లోకము) చెప్పుచున్నవి. అవేవనగ, (1) వారసత్వమువల్ల, (2) కొనుక్కోవడంవల్ల, (3) విభాగంవల్ల, (4) ఆక్రమించుకోవడం, లేక దొరకడంవల్ల. ఇందులో చెప్పబడిన నాలుగవ పద్ధతి లోగడ ఎవరి స్వాధీనములోనూ లేని బంజరు భూములు, అడవిమృగములు, వగైరాలకు వర్తించును.

## ఇటీవల కోర్టుతీర్పుల సారాంశము

పురాతన గ్రంథములలోనే గాక, ఇటీవల కొన్ని కోర్టు తీర్పులలో కూడ "మొదట ఆక్రమించుకొన్నవాడిదే భూమిహక్కు" అనే సిద్ధాంతము అంగీకరించ బడినది. 9. మద్రాసు 175 నెంబరు (సెక్రటరీ ఆఫ్ స్టేట్ వీరరాయన్) అనే కేసులో సర్ ఛార్లెస్ టర్నర్, ముత్తుస్వామి అయ్యర్ అనే జడ్జీలు, "మొట్టమొదటగ బాగుచేసి సేద్యములోనికి తెచ్చినవానిదే భూమిహక్కు. ఇది హిందూ ధర్మశాస్త్రము లోని సామాన్య నియమము" అని చెప్పియున్నారు. ఈహక్కు కొద్ది పరిమితి కలదేకాదు. సర్వ సంపూర్ణమైనది" అనికూడ

11 M. I. A. 345, "గంగా గోవిందమండల్" "24 పరగణాల కలెక్టరు" అనే కేసులో స్పష్టము చేయబడినది.

## రాజు పుట్టుక, అతని హక్కు, బాధ్యతలు

భూమి, దానిని సేద్యము చేయుచున్న రైతుఉండగ మధ్య మూడవవాడు "రాజు" అనేవాడు ఎక్కడనుండి వచ్చినాడు? ఇతని పని ఏమి? ఇతనికిగల హక్కులేమి, బాధ్యతలేమి? ఈ ప్రశ్నలకు జవాబు చెప్పుటకు మానవ సంఘ చరిత్ర నొకసారి తిరుగవేయ వలెను. మానవులు మొదట అరణ్యములలో తిరుగాడుచు, మృగముల వేటవల్ల జీవించు చుండిరనియు, తరువాత కొన్ని కుటుంబములు గుంపులుగను, తండాలుగను చేరి అచ్చటచ్చట అడవులను ఛేదించి తాత్కాలికపు వ్యవసాయము (కుమ్రీవ్యవసాయము) చేసికొనుచు, తిరుగాడుచుండిరనియు, దరిమిలా కొన్ని గుంపులు జేరి అనువైన చోట్ల గ్రామములుగ స్థిరపడిపోయిరనియు, పైనచెప్పియుంటిమి. ఇట్లు స్థిరపడిన గ్రామములు విచ్ఛిన్నము గాకుండ ఉండునిమిత్తము వారిలోవారు కొన్ని కట్టుబాటులను జేసికొనిరి. ఈ కట్టుబాట్లను గురించిన వివరములు వేరే అధ్యాయములో తెలిపెదను.

కాలము గడచిన కొద్ది, పరస్పర సహాయము నిమిత్తము, కొన్ని గ్రామములు కలసి ఒక ఖండముగను, కొన్ని ఖండములు కలసి నాడులుగను, దేశములుగను, వేరు వేరు చోట్ల వేర్వేరు పేర్లతో ఏర్పడెను. వీనితాలూకు కట్టుబాట్లు చెడకుండ కాపాడుటకును, ప్రజలలో ఒకరి నొకరు హింసించుకొనకుండ సంరక్షించుటకును, ఇతరులను బాధించే దుర్మా

గ్గులను శిక్షించుటకును ఒక ఏర్పాటు అవసరమయ్యెను. ఇది ఆదియందు అవసరములేక, దరిమిలా కొంతకాలానికి ఏర్పడిన అవసరము. దీనిని తీర్చడానికి అధికారము వహించే వ్యక్తో, వ్యక్తులసంఘమో, కావలసి వచ్చింది! ప్రాచీనకాలాలలో రాజ్యా లేలిన ప్రజాసంఘాలు అక్కడక్కడ కలవు. కాని మొత్తముమీద సర్వసాధారణంగా ప్రజలందరు కలసి, "రాజు" అనే వానిని, ఏర్పాటు చేసుకొన్నారు. సంఘక్షేమమునకు ఏ ఏ పనులు అవసరమో, అవి అన్నీ చేయడానికి అతనికి ప్రజలు అధికారము ఇచ్చినారు. ఈ అధికారం చెలాయించ డానికి కావలసిన మనుష్యబలము, ధనబలము, యావత్తు ప్రజలు అతనికి ఇచ్ఛాపూర్వకముగా ఇచ్చినారు. తమ శరీర బలములో భాగమును, తాము కష్టపడి పండించిన పంటలో భాగమును, రాజున కిచ్చి, అతనికి సంఘసేవనిమిత్తము అపార మైన శక్తిని ప్రజలే కలుగ జేసినారు.

ప్రజలు ఈ రీతిగా తన కిచ్చిన బలముతోను వారిసహ కారముతోను "రాజు" అనేవాడు సంఘము, దేశము, చెడి పోకుండ అందరికి సౌఖ్యము కలిగించే ఏర్పాట్లను, డిపార్టు మెంటులను నిర్మించి, పైన తాను కాపుండి, నడిపించుచున్నాడు. అందరికి సౌఖ్యము కలుగజేసేవాడు, అందరి మనస్సులను సంతోష పరచేవాడు, అనగా రంజింపజేసేవాడు గనుకనే అతనికి "రాజు" అనే పేరు వచ్చినది. పై అంశములను బట్టి చూడగా, రాజు అనేవాడు స్వయంభువు కాడనిన్ని, ఎవరికీ సంబంధములేకుండా ఎక్కడనో ఆకాశమునుండి తనంతట తానుగ ఊడిపడిన వ్యక్తి కాడనిన్నీ, అతనికి ప్రజ లిచ్చిన బలమే

తప్ప వేరేబలముగాని, హక్కులుగాని, అధికారముగాని లేవ నిన్ని, ప్రజలు వుండమంటే ఉండేటటువంటిన్ని, పొమ్మంటే పోయేటటువంటిన్ని, వ్యక్తి అనిన్ని, స్పష్టమగుచున్నది. ఈ భావములే భారతము మున్నగు మన పురాతనగ్రంథములందు కన్పించు చున్నవి.

## రాజు ఉండవలసిన అవసరము?

ఒకరి సొమ్ము ఒకరు అపహరించకుండ, ఒకరి నొకరు హింసించకుండ ఉంటే, నిజానికి రాజు అనేవాడే అవసరముండదు. ఒక్క ఉదాహరణ చూడండి:—దేశంలో దొంగతనాలు దార్జన్యాలు లేవనుకోండి. అప్పుడు పోలీసు డిపార్టుమెంటు ఎందుకు? ఒకరి ఆస్తి ఒకరు కాజెయ్యరనుకోండి. అప్పుడు సివిల్ కోర్టులు యెందుకు? ఈ రీతిగా, ధర్మము నాలుగు పాదాలా నడుస్తుంటే, నిజానికి రాజు అనేవాడే ఉండ నక్కర లేదు. పూర్వము కృతయుగములో, ప్రజలలో అధర్మము లేకుండిన ట్లును, అందువల్ల రాజు అవసరము లేక పోయినట్లును తరువాత కొంతకాలానికి వారిలో కామక్రోధాలు చెలరేగి, ఒకరి నొకరు హింసించుకో సాగినట్లును, అప్పుడు ప్రజలంతా చేరి లోఅక్రమాలను అణచి, ప్రజలకు సౌఖ్యము చేకూర్చడానికి "రాజు" అనేవాణ్ణి ఏర్పరుచు కొన్నట్లును మహాభారతము, శాంతిపర్వము, ద్వితీయాశ్వాసము 196 మొదలు 200 వరకు గల పద్యములలో వర్ణింపబడియున్నది.

రాజున్నూ తక్కిన మనుష్యులవంటివాడే గద; అతడున్నూ ఇతరులవలె మామూలు కాళ్లు చేతులు కలవాడే కద;

అయితే అతనికి ఈ ఘనత, ఈ అధికారము, ఎట్లు కలిగినది- ధర్మరాజు అంపశయ్యయందున్న భీష్ములవారిని ప్రశ్నించడము దానికి ఆయన ప్రత్యుత్తరమివ్వడం ఈదిగువ పద్యములో కలదు.

## భా ర త ప్ర మా ణ ము లు

ధర్మరాజు ప్రశ్న:—

సీ॥ రాజనామమునకు భాజనంబై మహా
  ద్భుతచరిత్రుం డగు పురుషుం డొకడు
గలిమికి మూలంబు ఘనవిశేషము గల్గ
  నోపుం గౌరకుల దీపజనన!
యది యెఱింగింపవే, యవయవంబులుం బ్రాణ
  మానసంబులు జన్మమరణములు శ
రీరయాత్రయు నెల్లవారికి నెట్టట్ల,
  కాని విభేదంబు గాన మట్టి

ఆ॥ రాజొకండు భూరితేజస్వి బుద్ధిమ
జ్జనుల నెట్లు దనవశంబు సేయు
నిలుపం జెరువ నెల్ల యిలయును నేల దై
వ నిభుండగుచు మ్రొక్కుగొనంగంజాలె?

ఈ ప్రశ్నకు భీష్ముడిట్లు సమాధానము చెప్పుచున్నాడు:—

క॥ విను తొల్లి కృత యుగంబున,
మనుజులయెడ దండనీతిమంతుండై రా
జన నొకండు కలిగి యరయుట,
మనుజేశ్వర ! లేదు ధర్మమతి మంత్రి తగన్.

క. ఒండొరులకు రక్షకులై
యుండుదు రట్లుండ దైన్య మొదవిన లోభం
బొండొండ పెరిఁగి ధర్మము
ఖండితమై మొదలుకొని రకార్యంబులకుఁ.

క. క్రమమ్మునఁ గామము రాగము
దమ మనముల నొదవఁగా మదం బెక్కిన వి
భ్రమ మొందుచు విచ్చలవిడి
విమార్గచరితముల వేదవిధ్వంసకులై.

క. మనుజులు ధర్మము బొడవడఁ
చిన వేదము గర్మములును చెడుటకు భయమ్మం
దిన యింద్రాదులు గమలా
సనుఁ గానఁగ మునులుఁ దారుఁజనిరి నరేంద్రా!

అప్పుడు బ్రహ్మదేవుడు నీతిశాస్త్రము సృష్టించి, వారల కివ్వగా, ఆ శాస్త్రప్రకారము ప్రజలను నడిపించగల శక్తిమంతు నొకని మా కిప్పించవలసినదని వారు విష్ణుమూర్తిని ప్రార్థింతురు. అప్పుడు విష్ణుమూర్తి "రాజు" అనే వానిని సృష్టించి యిచ్చును. ప్రజలందరి సహాయం ఉంటేనే గాని నేను ఈ డ్యూటీ నెత్తిమీద వేసుకోజాలనని అతడనును. అప్పుడు దేవతలందరు తమతమ శక్తులను అతని కిత్తురు. ఇంద్రుడు వైభవము ఇస్తాడు: మేరువు బంగారము ఇస్తుంది; ఈ విధంగా అందరు అన్ని శక్తులు ఇస్తే, అప్పుడతను రాజ్యభారము వహిస్తాడు.

క. సురపతి విభవము మేరువు
హిరణ్యమును గిన్న రేశుఁ డీడితసంప
ద్గురుతము నొసఁగిరి రథకరి
తురగభటావళులు దలఁపుతో నొడఁగూడెన్.

శాంతిపర్వము ద్వితీయాశ్వాసములోనే ఇంకొక ఘట్టములో (255.వ పద్యము మొదలు) ఈ రీతిగా చెప్పబడియున్నది:—

సీ. జను లొక్కతఱిఁ దొల్లి సమయంబు దమలోనఁ
జేసి క్రూరతయు ముచ్చిమియు అంకు
సైఁపక యట్టి దుర్జను నందఱును గూడి
శాసించువారుగాఁ జాలి తమకు
నధిపతియుగ నొరు నాసపడకయుండి
నడవడి బహుకారణములఁ జిక్కు
వడిన విషణ్ణులై, బ్రహ్మఁ గానఁగ బోయి
మాకు రక్షకుఁడుగ మహిపుఁ డొకఁడు
తే. వలయు రూపింపు మాతనిఁ గొలిచి బ్రదుకు
వార మనుటయు నజుఁడును వారివలని
కరుణ మనువు నిరూపించె నరు లసత్య
నిరతు లని పాలనమునకుఁ జొరఁ డతండు.

వ. చొరకున్న నజ్జనంబు లమ్మహాత్మునితో "నీకుం బుయిలోడ నేల? పశిజలచేతఁ బశువులయందును, బసిండిని నేఁబదియగు నంశంబును, ధాన్యంబున దశమ భాగంబును, భాండారంబుగఁ బుచ్చుకొని, శస్త్రిజీవులనెల్ల నీవారిం జేసికొని,

బలవంతుండవై, దుష్టనిగ్రహ శిష్టప్రతిపాలనం బాచరింపు మేమందరము నీ పనుపు సేయంగలవారము. అధర్మవర్తనులు నీచేతం జెడువారు; ధర్మంబున నాఱవపాలు నిన్నుం జేరంగల యదిగా నొడంబడితిమి. ఇంద్రుడు దేవతల రక్షించుమాడ్కి మమ్ము రక్షించుకొని సుఖంబుండు మనుటయు [257]

క॥ అతఁ డొడఁబడి యత్తెఱఁగున,
నతి బలవంతుఁడయి నీతి, నంచిత మగు ను
ద్ధతవిక్రమమునఁ దగ నీ,
క్షితిఁ బాలించె, సుఖులై రశేషజనములున్॥—[258]

## రాజు హక్కులేమి? పంటలో షష్ఠభాగం:—

'మొదటగ ఆక్రమించుకొన్నవారిచే భూమి హక్కు' అని అంటే, ఇక రాజు మాట ఏమి? "భూమిలో పండిన పంటలో కొంతభాగం మాత్రం—అదిన్నీ ప్రజల ధనమాన ప్రాణాదులను కాపాడడ మనే పని నిర్వహించే నిమిత్తం మాత్రమే—రాజు తీసికొనుటకు అర్హుడు. అంతకు మించి అతని కేమిన్నీ హక్కులేదు"—అని మనపూర్వధర్మశాస్త్రము లన్నీ ఘంటాపథముగ ఘోషించి చెప్పుచున్నవి. ఈ రీతిగ, పంటలు వగైరాలలో రాజు కివ్వబడే వాటాకే "రాజభాగ మని పేరు. మనువు ఏమన్నాడు?-నేలస్వభావమును బట్టిన్నీ, దానికి చేయవలసిన కృషినిబట్టిన్నీ, పండిన పంటలో రాజు 8 వ వంతో, 6 వ వంతో, 12 వ వంతో తీసికోవచ్చును." [మను. VII 130] యుద్ధములు వగైరా ఉపద్రవాలువస్తే, నాలుగోవంతువరకు కూడ తీసికోవచ్చు నట.

గౌతముడు, నారదుడు, బోధాయనుడు, విష్ణువు మొదలైన స్మృతికర్త లందరు ఆరవభాగమును (షష్ఠభాగమును) గురించే ఎక్కువగ చెప్పియున్నారు. పండించిన ధాన్యాదుల లోనే గాక ఎవరు ఏవస్తువులు తయారుచేస్తే ఆ వస్తుసముదాయములో ఆరవవంతు రాజుకు ఇవ్వవలె నని విష్ణుస్మృతి (III. V. 25) చెప్పుచున్నది.'' మాంసము, తేనె, నెయ్యి, ఓషధులు, సుగంధద్రవ్యములు, పుష్పములు, ఫలములు, దుంపలు, ద్రవపదార్థములు, సంబారుద్రవ్యములు, కొయ్య సామానులు, తాటియాకులు, వగైరా ఆకులు, తోళ్లు, కుండలు, రాతిపాత్రలు, వెదుళ్లతో చేసిన బుట్టలు వగైరా సామగ్రి'' — వీటి అన్నింటిలో ఆఱవపాలు రాజుకు పన్నుగ చెల్లింపబడవలె నని విష్ణుస్మృతిలోని పై వాక్యము చెప్పుచున్నది. పన్నులు పూర్వము రొఖ్ఖరూపముగ గాక, *వస్తురూపేణా ఇవ్వబడుచుండె ననుటకు విష్ణుస్మృతిలోని ఈ వస్తువుల పేర్లే నిదర్శనము.

సంఘానికి సరిపడ ధాన్యాదులు పండించడం - వ్యవ

---

* సర్కారువారు పన్నులు రొఖ్ఖ రూపముగ గాకుండ, వస్తురూపేణా పుచ్చుకొనుట పూర్వము, ఇటీవల కొంతకాలం క్రితం వరకు కూడ సాధ్యమైనప్పుడు, ఇప్పుడేల సాధ్యముకాదు? పరిపాలనా విధానము యావత్తు నా "గ్రామస్వరాజ్యస్కీము"లో వివరించిన రీతిగ మార్పు చేసేయెడల, పన్నులు ఇప్పుడైనను, ఇక ముందైననుకూడ' రొఖ్ఖంగా కాకుండ, వస్తురూపేణా పుచ్చుకొనుట కెట్టి అభ్యంతరముగల్గి ఉండదు. నాణె పద్ధతిలో ప్రజలు పడే ఘోరబాధలకంటె, వస్తుమార్పిడి విధానంలో ల మేళ్లు ఎన్నో గలవని లోకాని కిప్పటికి తెలియవచ్చుచున్నది.

సాయకుల విధి. రైతుయొక్క అజాగ్రత్తవల్ల పంటలు నష్టమైతే, రాజు సదరు రైతును దండించవచ్చును. అనగ, రాజభాగమునకు పదిరెట్లు దండన విధించవచ్చును. కేవలం రైతుయొక్క అజాగ్రత్తవల్ల గాక, అతనికి తెలియకుండ, అతని నౌకర్లయొక్క అజాగ్రత్తవల్ల పంట నష్టమైయుంటే, పై చెప్పిన్లదానిలో సగం దండనమాత్రమే విధింపబడు నని మన ధర్మశాస్త్రములు చెప్పుచున్నవి.

రాజభాగం — అనగా సర్కారు శిస్తు — ఏ రైతైనా చెల్లించకపోతే, అతనిని భూమినుండి తొలగించడమనే దండన మన హిందూధర్మశాస్త్రములలో ఎక్కడా కలికాని కైనా కనిపించదు. ఎందుకంటే, భూమికి హక్కుదారుడు రైతే కాని రాజు కాదుగద! భూమి రాజుసొమ్ము కాదు. లాక్కోడానికి! శిస్తు చెల్లించకపోతే, శరీరదండన వగైరా ఇతరవిధమైన దండన విధించడం వుండెనుగాని, భూమి లాగికోవడ మనేదే లేదు.

ఇంతవరకు, రాజు అనేవాడు ఏర్పడవలసి వచ్చిన అవసర మేమియో, అతనికి ఉన్న హక్కులేమియో చెప్పితిమి. ఇక, అతనికి లేని హక్కులేమియో చెప్పుట అవసరము. ఎందుకంటె, ఇటీవల అనేక కారణములచేత, వస్తుతః రాజుకు లేనటువంటి హక్కులను ఎన్నింటినో తీసికొనివచ్చి కొందరు అతనికి అంటగట్టినారు! అందువల్ల, అనేక అనర్థములు ప్రజకు వాటిల్లినవి. ఈఅనర్థము లన్నీ తొలగవలెనంటే, నిజానికి అతనికి లేని హక్కులేమో (అనగ, ఉన్నవనే భ్రమలో వుండి, నిజానికి లేనటువంటి హక్కులేమో) స్పష్టముగ మన మందరం తెలిసికొనుట అత్యవసరం.

భూమి యావత్తుకు రాజే అధిపతి, యజమాని యనిన్నీ; అతని దయాధర్మబిచ్చాన్ని బట్టియే తక్కిన ప్రజలంతా ఆ భూమిలో కాపురం వుండక వ్యవసాయం చేసుకోవడంగాని, జరుపుకోవలసి వున్నదనిన్ని, ప్రజకేమీ భూమియందు స్వత స్సిద్ధమగు హక్కు లేదనిన్నీ, రాజు ఉండమంటే ఉండేటట్లున్ను, లేచిపొమ్మంటే పోయేటట్లున్ను ప్రజలు ఉండా లనిన్నీ ఒక సిద్ధాంతి ఇటీవల బ్రిటీష్‌ప్రభుత్వం వచ్చిన తరువాత మన దేశంలో లేవదీయబడినది. ఇది కేవలం తప్పుడుసిద్ధాంతం: ఇది ఇంగ్లండు దేశంలో రైటు కావచ్చునేమోగాని, మన దేశం లో సుతరాం తప్పు. ఇది మన అనాది నుండి వచ్చుచున్న సాంప్రదాయములకు, ధర్మశాస్త్ర ప్రమాణములకు కేవలము తల్లక్రిందులు. మన పూర్వ గ్రంథాలలో ఏవంక చూచినా సరే ఈయంశము చక్కగ ఋజువు అయితీరుతుంది. ఎక్కు వగ వెదకి పరిశోధనచేయ నక్కరలేదు. ఇంతటి స్పష్టమైన విషయమును, మనలో కొందరు స్వార్థప్రేరితులై, తెలియని పరాయి ప్రభుత్వాధికారులతో లాలూచీయై తల్లక్రిందులు చేయ జూచుట ఆశ్చర్యము!

## గ్రంథాధారములు

పై యంశములు ఋజువుచేయుటకు పూర్వ గ్రంథ ములనుండి కొన్ని ఆధారములను ఈ దిగువ క్లుప్తముగ సూచించెదము.

'విశ్వజిత్' అనబడే యజ్ఞములో యజ్ఞము చేసే భర్తుడు తనకున్న భూమి యావత్తు యజ్ఞము చేయించే హోతకు దానము చేయవలెనని యున్నది. ఈ సందర్భములో జైమిని సూత్రకారుడు ఒక చర్చ చేసెను. భూమిని యావత్తు రాజు దానము చేసివేయ వచ్చునా ? అనే ప్రశ్న చేయబడి దానికి సమాధానము ఈ రీతిగ చెప్పబడినది. రాజుకు భూమి యందు హక్కు లేదు; సామంతరాజుకున్ను లేదు. "భూమి యావన్మంది ప్రజలదిన్నీ" రాజు భూమిని దానము చేయ వలెనంటే, ప్రజలనుండి కొని మరీ దానము చేయవలె నని జైమిని చెప్పియున్నాడు. తంజావూరు రాజులు దేవాలయము లకు, బ్రాహ్మణులకు భూములను దానము చేసినప్పుడు ఆసాములనుండిగాని, గ్రామసంఘముల నుండిగాని కొని మరీ దానము చేసినట్లు నిదర్శనములు గలవు. ఇండియాను పాలించిన మహమ్మదీయ ప్రభువులు కూడ ఇదేరీతిగ చేసిరి. భూమి హక్కు మాదే నని తురకప్రభువు లెన్నడూ చెప్పి యుండ లేదు. ఢిల్లీకి చుట్టుపట్టుల నున్న భూములు కొన్ని తనకు కావలసివస్తే, ఔరంగజేబు చక్రవర్తి "లుండీ" "పలాణ్" వగైరా పరగణాల భూములను డబ్బు పెట్టి కొనుక్కొనెను. అక్బరాబాద్, ఇలహాబాద్, కోటలు కట్టుటకు స్థలము కావలసి వస్తే, అక్బరు చక్రవర్తి సదరు స్థలములను డబ్బుపెట్టియే కొనుక్కొనెనుకాని, భూమిహక్కు నాదే నని చెప్పి జబరదస్తీగా లాగికొన లేదు. ఆ విధముగానే, షాజహాన్ చక్రవర్తి "షాజ హాన్ బాద్" కోట కోసమున్ను, అలంగీర్ పాదుషా "అవ రంగబాద్" కోట కోసమున్ను, మరికొన్ని మశీదులకోసమున్ను

కూడ, భూములను కొనిరేగాని, తమవే"యని చెప్పి లాగికొన లేదు.

'వ్యవహారమయూఖ' వ్యాఖ్యవ్రాసిన నీలకంఠుడుకూడ ఈ యభిప్రాయమునే బలపరచుచున్నాడు. పరరాజును ఓడించి, అతని రాజ్యమును ఆక్రమించుకున్నప్పుడుకూడ, జయించిన రాజుకు ఆ ప్రజల తాలూకు భూములుగాని, ఇండ్లు వాకిండ్లుగాని, స్వంతఆస్తిగ చెందజాలవు. శిస్తుమాత్రము తీసికోడానికే అతనికి హక్కు వుండు నని నీలకంఠుడు చెప్పుచున్నాడు.

'పూర్వమీమాంస' ఆరవగ్రంథము ఇట్లు చెప్పుచున్నది:—

"ప్రతి గ్రామములోను, పొలములోను, ... హక్కు భూమికారులదే; రాజు పన్నులు మాత్రము తీసికొనవలెను. రాజు భూదానము చేసినాడంటె, భూమి హక్కు ఇచ్చినా డని కాదు; తనకువచ్చే పన్నునుమాత్రం ఇచ్చినా డని అర్థము. అయితే, "భూమికార్ల" నుండి రాజు భూమిని కొన్నప్పుడు భూమి హక్కుసహా రాజుకు సంక్రమించుతుంది."

అయితే రాజుకు "పృథ్వీపతి" "భూమీశ్వర" మొదలైన బిరుదులు గలవుగద, దానినిబట్టి భూమికి హక్కుదారుడు రాజే యని ఎందుకనకూడదు? అని కొందరనవచ్చును. అవి కేవలము కవితాచమత్కృతిచే నొసంగబడిన శుష్కబిరుదులే గాని, రాజుకు వస్తుతః గల హక్కులను నిరూపింపజాలవు.

"భూమీశ్వరు" డను బిరుదంతోపాటు రాజుకు "నరేశ్వరుడు" "నరపతి" మొదలైన బిరుదులుకూడ కలవు. అంతమాత్రముచేత అతని పరిపాలనలో నున్న నరులందరు అతని ఆస్తియని చెప్పవచ్చునా?

రాజు అనుమతితో నిమిత్తం లేకుండానే, భూమిని అమ్ముకొనుటకుగాని, తాకట్టు వగైరాలు పెట్టుకొనుటకుగాని ప్రజలకు హక్కుగలదు. రాజుకి భూమియంతు హక్కువుంటే, ఇదెట్లు సంభవం అవుతుంది?

## మహమ్మదీయ పరిపాలనలో

భూమి హక్కు రాజుదా? రైతుదా? అనే విషయంలో మహమ్మదీయ మత సాంప్రదాయము లెట్లున్నవో కొంచెము తెలిసికొందము.

మహమ్మదీయులు ఏదేశము పైకియైనను దండెత్తిపోయే ముందు, "మీరంతా మా మతము స్వీకరించవలసినది" అని వారి మతగురువు "ఇమాము" సదరు దేశప్రజలకు శ్రీముఖము పంపును. ఇట్లు ముందుగ కబురు పంపనిది, వారు యుద్ధము చేయకూడ దట. అది అధర్మయుద్ధ మగు నట. మతమును స్వీకరించుటకు ఆ దేశప్రజలు అంగీకరించినయెడల, వారు తక్కిన మహమ్మదీయ మతస్థులతోపాటే సర్వసౌకర్యములును పొందుదురు.

ఊషర్ అనగ వారిభూములపై మిక్కిలి తేలికయగు "ఊషర్" అనబడు పన్నుమాత్రము విధింపబడును - ఇది పంటలో పదవవంతు వుండును.

మతములో కలియుటకు ప్రజలు అంగీకరించనిచో "పోనీ 'జిజియత్' అనబడు తలపన్ను అయినను ఇస్తారా?" అని ఇమామ్ అడుగును. ఈ తలపన్ను ఇచ్చుటకు ప్రజలు అంగీకరించిన యెడల, వారు మతము మార్చుకో నక్కర లేకుండ, మహమ్మదీయ రాజ్యములో సుఖముగ కాపురముండవచ్చును. అయితే, ఈ తలపన్నుతో పాటు భూములమీద 'ఖరాజ్' అనబడు భూమిపన్ను కూడ ఇచ్చుకొనవలెను.

జిజియత్ తలపన్ను

మతమును స్వీకరించుటకుగాని, తలపన్ను ఇచ్చుటకుగాని అంగీకరించక, ఈ రెండుపద్ధతులును కూడా ప్రజలు నిరాకరించేయెడల, అప్పుడు ఇమామ్ వారిపై తీవ్రముగ దండెత్తిపోయి, వారి దేశమును జయించును. భూములన్నీ కొల్లగొట్టి సిపాయిలకు లూటీగా పంచిపెట్టును. ఇట్లు కొల్లగొట్టబడిన భూములకే "ఘనీమత్." అని పేరు. మహమ్మదీయ మత ప్రకారము విధింపబడు భూమిపన్ను ముఖ్యముగ రెండు రకములుగ నున్నది.

ఘనీమత్ కొల్లగొట్టబడిన భూములు.

(1) ఊషర్ (2) ఖరాజ్: ఖరాజ్ కూడ తిరిగి రెండురకములు. (1) ముకాసిమ్మా, (2) వజీఫా.

'ఊషర్' అనేది చాలా తక్కువ రేటు — పేదవాళ్లు కూడ తేలికగ, ఇచ్చుకోతగినంత తక్కువగ ఉంటుందట. అది భూమిమీదగాక, పండిన పంటలో ఎంతో తక్కువ భాగముగ వుంటుంది. ఇట్టి సౌకర్యమైన తేలిక రేటు స్వమతస్థ

లగు మహమ్మదీయులకు మాత్రమే అభిమాన పూర్వకముగ విధింపబడు చుండెడిది. ఇక 'ఖరాజ్' అనేది పంటమీదగాక భూమిమీదనే విధించబడునట. అనగ, పంట పండినా పండక పోయినా, రైతు పన్ను ఇచ్చుకొని తీరవలసినదే. ఇట్టి భారమగు పన్ను సాధారణముగ మహమ్మదీయుల మీదగాక; తదితర మతస్థుల భూములమీద విధింప బడవలెనని యున్నదట. ఇది అచ్చమైన మహమ్మదీయ మత సాంప్రదాయము. అయితే, ఇట్టి అక్రమ మగు . జబరదస్తీ సాంప్రదాయమును ఏ తురక ప్రభువుగాని అమలు జరుపుటకు ఇండియాలో సాహసించ లేకపోయెను. ఏలననగ, మహమ్మదీయులు హిందూదేశమును అంత సంపూర్తిగ జయించలేక పోయిరి. ప్రజలను అంత నిర్వీర్యులనుచేసి గాజులు తొడిగించి కూర్చుండబెట్టలేకపోయిరి. అందువల్ల ఈ మార్గ మవలంబించలేదు. ఒక్క "అల్లా ఉద్దీన్" అనే తురక ప్రభువు మాత్రము 14 వ శతాబ్దారంభమున దక్షిణ దేశములో ఈ విధమగు జబరదస్తీ చేయుటకు కొంత ప్రయత్నించెనే గాని, అదిన్నీ కొనసాగలేదు. కాబట్టి, *అచ్చమగు ఖరాజ్' ఇండియాలో ఎన్నడున్ను విధింపబడలేదు.

'అచ్చమగు ఖరాజ్' సిద్ధాంతమును సడలించుటకు గాను, మహమ్మదీయ ప్రభువులు 'ఖరాజ్' ను రెండు రకములు జేసిరి. (1) ముకాసిమ్మా, (2) వజీఫా. ముకాసిమ్మా'అనేది, భూమి మీద పంట వున్నప్పుడే. (దానిలో కొంతభాగము మాత్రమే) — ప్రభువుచే తీసికొనబడు చుండెను. ఇది మన హిందూప్రభువుల ' రాజ భాగమును '

పోలి యుండెను. ఈ హిందూసాంప్రదాయమునే తురక ప్రభువులును అవలంబించిరి. మహమ్మదీయ శాస్త్రప్రకారము ఇట్టి సౌకర్యము ఒక్క మహమ్మదీయులకే ఇవ్వ తగియున్నను పరిస్థితులను బట్టి, ఇట్టి దానిని తదితర మతస్థులకు కూడ ఆ నాటి తురకప్రభువులు ఇండియాలో ఇచ్చిరి. ఇక 'వజీఫా' అనేది భూమిమీద పంటయున్నను లేకున్నను, మహమ్మదీయే తరుల మీద పన్ను విధింపబడ వలసియుండెను. కాని యిది ఇండియాలో ఏ తురక ప్రభువున్ను విధించ లేదు.

ముజరాత్　ఏ రైతైనను భూమిని వదలి వెళ్లిపోయినచో, ఇమామ్ ( మతగురువు ) ఆ భూమిని ఇంకొక రైతుకు ఏదో శిస్తుకట్టి ఇవ్వవచ్చును; లేదా, సొంత సేద్యము చేయ వచ్చును; లేదా పాలిపద్ధతిని ఎవరికైనా ఇవ్వవచ్చును. ఈ పాలిపద్ధతికే ముజరాత్ అని పేరు.

ఊషర్, ఖిరాజ్, ముకాసిమ్మా, వజీఫా, అనే వాటిలో ఏ రకమైన పన్ను నబాబు తీసికొనుచున్నప్పటికి, అంత మాత్రముచేత నబాబుకు భూమియందు హక్కు ఎన్నడు ఏర్పడలేదు. ఏ నబాబున్నూ — భూమిహక్కు నాదేనని ఎన్నడూ అనలేదు. పన్ను చెల్లించే భూమికి ప్రభువుకు హక్కు లేదు. అందుచే అతడు భూమిని దానము చేయ జాలడు. అందుండి వచ్చు పన్నును మాత్రము దానము చేయగలడు' అని 'మదేనో షార్‌హిబాజ్' అనే మహమ్మదీయ గ్రంథము స్పష్టముగ చెప్పుచున్నది.

ఇంగ్లీషు పాలనలో:—

హిందూ మహమ్మదీయ మతగ్రంథములున్ను, సాంప్రదాయములున్ను ఈరీతిని ఘోషించుచున్న ఈ సూత్రమునే అనగ రాజుకు పన్నుకు తప్ప భూమికి హక్కు లేదు అనే సూత్రమునే ఇంగ్లీషు పాలనలో కూడ కంపెనీ అధికారములు అంగీకరించక తప్పినదికాదు. జమీందార్లతో పర్మనెంటు సెటిల్ మెంటు జరిగిన రోజులలో ఈ అంశము ఎంతో గాఢముగ మథింపబడి సారాంశము చక్కగ తేల్చబడినది. ఆ వివరములన్ని ఈ గ్రంథములోనే "జమీందారీ పద్ధతి" అనే అధ్యాయములో విపులముగ చర్చించబడును గాన ఇప్పటికి ఊలకే ఉటంకించి మాత్రము వదలివేస్తున్నాను.

ఇంగ్లీషు కోర్టులు కూడ ఈ సూత్రము నంగీకరించినవి. ఇటీవల, ఒక్క బిళ్లపాడు కేసులో మాత్రము — సూర్యనారాయణ, పోతన్న అనే కేసులో మాత్రము [ 41 మద్రాస్ 1012 : 45 . 1A . 209 ] జడ్జీలు తప్పటడుగు వేయజూచినప్పుడు, దరిమిలా ప్రీవీకౌన్సిలు తీర్పులు వచ్చి, ఈతప్పును సవరించినవి.

భూమిహక్కు ఎవరిది? అనే సమస్యలో ఇండియా సాంప్రదాయములకున్ను, ఇంగ్లండు సాంప్రదాయాలకున్నూ తల్లక్రిందులైన తేడాయున్నది. ఇంగ్లండులో భూమియావత్తు రాజుదే: ప్రజలందరు రాజుక్రింద కౌలుదార్లో, లేక పాలేర్లో. ఈ విషయములో ఇంగ్లీషు సాంప్రదాయములను గురించిన వివరములు ఈ గ్రంథము 2వ అధ్యాయములోవివరింపబడినవి.

ఇండియాను పరిపాలింపవచ్చిన మొదటి రోజులలో,

ఆ నాటికంపెనీనౌకర్లకు ఇక్కడ ఇండియాలోని భూమి వద్ధతు లేమిటో తెలియక తికమకపడిరి. తమ ఇంగ్లీషు సాంప్ర దాయములను తీసికొనివచ్చి ఇక్కడ ప్రవేశపెట్ట జూచిరి. ఒకప్పుడొక అభిప్రాయమున్ను, మరొకప్పుడు మరొక అభి ప్రాయమున్ను, పరిపాలకులు, రివిన్యూబోర్డులవారు, వివ రించుచూ, భూమివ్యవహారముల నన్నిటిని ఇండియాలో నానా తీన్ తేరా చేసివైచిరి. ఏమీ తెలియని తెల్లవారు వచ్చి, పెద్ద పండితులవలె చర్చలు, వాదోపవాదములు చేసి, గవర్నమెంటు రికార్డుల నన్నిటిని నింపిరి. ఆ రికార్డు లన్నిటితో మనము ఇప్పుడు, తల బ్రద్దలుకొట్టుకొనుట ఇచ్చట అనవసరం. తేలిన సారాంశ మేమంటే, పర్మనెంటు సెటిల్మెంటు నాటితో ఈ వాదము లన్నియు మాటుమణగి, భూమిహక్కు ప్రజలదేగాని, ప్రభువుది కాదు అనే సిద్ధాంతము స్థిరపరుపబడెను. కాని, క్రమక్రమముగ, ఎవరికి తెలియకుండ, డబ్బుగల జమీందార్లు ఈ వాదమును తిరిగి ఎప్పటి కప్పుడు లేవగొట్టుచూ రావడంవల్ల, హైకోర్టులు, ప్రీవీకౌన్సిల్లుకూడ మరల తికమకలో పడడం తటస్థించినది. మరల, ఈ తికమక నంతా సర్దుకోడానికి, ఇటీవల, 1937–1939 సంవత్సరముల మధ్య, కాంగ్రెస్ గవర్నమెంటులో, ప్రకాశంపంతులుగారి రివిన్యూమంత్రిత్వపు హయాములో పద్దెనిమిదిపర్వాల గ్రంథము వ్రాయ వలసి వచ్చిందంటే, ఎంత ఆశ్చర్యమో చూడండి!! డబ్బును, స్వప్రయోజనమున్ను గలవారు వుంటే ప్రభుత్వా లను, హైకోర్టులను కూడ ఎట్లా తల్లక్రిందులు చేసి, 'లా' నంతను నానా తీన్ తేరా చేసివేయ గలరో,– దానివల్ల పేద వారికి తన వాదమును నిలవబెట్టుకోడానికి ఎంతటి బ్రహ్మ

ప్రళయము కల్పించవలసివుంటుందో, ఈ ఒక్క నిదర్శనంవల్ల తెలియగలదు.

## బంజర్లలో హక్కు ఎవరిది?

ఇంతవరకు సాగుబడిభూమిని గురించి చెప్పితిమి. ఇక సాగుబడిలో లేని బంజర్లమాట యేమి? వీటిలో హక్కు ఎవరిది? వీటిలోకూడ పూర్వపు హిందూరాజు లెవరు గాని హక్కును కోరియుండలేదు. ఏ గ్రామ గుడి కట్టులోగాని చేర కుండ కేటాయింపుగ వున్న బంజరు ఒక్కటికూడ లేదు. ఒక భూమి నేడు బంజరుగనున్నను కాలక్రమమున రైతులు దానిని సేద్యము లోనికి తెచ్చుకొనుట కెట్టి అభ్యంతరమును లేకుం డెను. గ్రామగుడికట్టులోని భూమి యావత్తు గ్రామస్థులదై యున్నప్పుడు, అందలి బంజరుభూములుకూడ గ్రామస్థులవి గాక, రాజులవి ఎట్లగును? రాజు ఎవరికైనా బంజరు భూమిని దానము చేయదలచినప్పుడుకూడ సదరు బంజరును గ్రామ మిరాశీదార్లనుండి కొని మరీ యిచ్చుచుండినట్లు తంజావూరు రాజుల రికార్డునుబట్టి స్పష్టముగ తెలియుచున్నది. ఇనాము కమిషనరుకూడ ఈ యంశమునే స్పష్టముగ ఉదహరించి యున్నాడు. బంజరుభూములను ఎవరికైనా ఇనాముగ ఇవ్వ దలచినప్పుడు పూర్వపు రాజులు సదరు బంజర్లను మిరాశీ దార్లనుండి కొని మరీ ఇనాముగా ఇచ్చుచుండెడివారట. దక్షిణ హిందూదేశములో దొరికిన వెయ్యేండ్ల నాటి శాసన ములు కూడ ఈ మాటనే ఋజువు చేయుచున్నవి.

## మహమ్మదీయ పరిపాలనలో మార్పు

మహమ్మదీయ పరిపాలన వచ్చిన తరువాత బంజర్ల

విషయములో కొంత మార్పు కలిగెను.

"బంజర్లను, ఎవరు సాగుచేస్తే వారిదే హక్కు" అని మహమ్మదు ప్రవక్త చెప్పెనట. ఈ మాటకు అర్థము చెప్పుటలో రెండు తేడాలు ఏర్పడెను. ఇట్టిహక్కు కలగడానికి ముందుగ 'ఇమామ్' యొక్క అనుమతి వుంటేకాని అది కలగదని 'అబూ హనీఫా'యను వ్యాఖ్యాత చెప్పుచున్నాను. ఇట్టి అనుమతితో అవసరం లేకుండానే హక్కు కలుగుతుందని అబూ యుసుఫ్ మహమ్మద్ అను మరి యిద్దరు శిష్యులు వ్యాఖ్యానము చేసిరి. ఈ రెండు రకముల వ్యాఖ్యానములలో అబూహనీఫా వ్యాఖ్యానమే ఇండియాలో చలామణి యగుచుండెను. దీనినిబట్టి, బంజర్లలోహక్కు ఇమామ్‌ది లేక ప్రభువుది అని ఏర్పడుచున్నది, అయినప్పటికి, ఈ హక్కు సొంతము కోసం ఏర్పడిన హక్కుకాదట. ఈ బంజర్లను సంఘముయొక్క ఉపయోగము నిమిత్తము వినియోగించే వరకే హక్కుగాని అంతకు మిక్కిలి ఏమిన్నీ కాదని తెలియుచున్నది. రివిన్యూను పెంపొందించుకో దలచిన కొందరు తురక ప్రభువులు, బంజర్ల హక్కు మాదేనంటూ వాదింపసాగిరి. కాని, ఏ ప్రాంతములలోనైతే గ్రామసంఘములు కట్టుదిట్టముగను బలిష్ఠముగను ఉండెనో ఆ ప్రాంతములలో ఇట్టి ప్రభువుల వాదనలు సాగలేదు. కాని, గ్రామ సంఘములు మెళుకువగను బలిష్ఠముగను లేనిచోట్ల మాత్రము, వీరి జబరదస్తీ ఆటలు సాగినవి.

### ఇంగ్లీషుపాలనలో బంజర్లస్థితి

1800 సంవత్సరప్రాంతమున జరిగిన సెటిల్‌మెంటులో,

బంజరుభూములు 'గ్రామస్థులవేగాని, గవర్నమెంటువి కావు' అని అప్పుడు గవర్నర్ జనరల్‌గ నున్న వెల్లస్లీ ప్రభువు అక్షరాలా వ్రాసిపెట్టియుంచెను. దరిమిలా, 1813 సం॥లో మలబారు జిల్లా సెటిల్‌మెంటు జరిగినప్పుడుకూడ, సీమలోని కోర్టు ఆఫ్ డైరెక్టర్సు'వారు ఏమన్నారంటే, బంజర్లలో గవర్నమెంటు కేమిన్నీ హక్కులేదు' అని ఖండితముగ చెప్పివేసిరి. అయితే, దరిమిలా కొద్దికాలానికే, అప్పుడు గవర్నరుగ నుండిన 'సర్ థామస్‌మున్రోగారి' అభిప్రాయములచే ప్రేరితులై, సీమ డైరెక్టర్లు తమ సిద్ధాంతమును మార్చుకొనిరి. 'బంజర్లు యావత్తు మావే అని అప్పటినుండి గవర్నమెంటువారు స్థిరపరుచుకొని ఆ ప్రకారమే ప్రవర్తింపసాగిరి. ఇదే నేటికిన్నీ నడుచుచున్నది. అయితే, 1813లో మలబారు సెటిల్‌మెంటునాడు చెప్పిన మాట గతి యేమి యను ప్రశ్నవచ్చెను. ఆ మాట ఆ మలబారు జిల్లాకే వర్తిస్తుంది తప్ప, ఇతర జిల్లాలకు వర్తించదని చెప్పి, సర్కారువారు బహుచమత్కారముగ తప్పుకున్నారు !!! కాబట్టి, నేటికి నిలిచియున్న సిద్ధాంతమేమిటంటే, మలబారు జిల్లాలోతప్ప, మిగతా జిల్లాలలో బంజరు భూములు (దక్షిణకన్నడ జిల్లాలోని అడవులునూ) గ్రామస్థులవి కావు, గవర్నమెంటువే అని ముందుగ లెక్కచేయబడును 'గవర్నమెంటువికావు, గ్రామస్థులవే', అని ఋజువు చేసుకో వలసిన భారము గ్రామస్థులదట. మిరాశీ గ్రామములలోని బంజర్ల మాట యేమి యను ప్రశ్నకూడ ఇటీవల, ఒక మదరాసు హైకోర్టు ఫుల్‌బెంచి తీర్పువల్ల గవర్నమెంటు పక్షముగనే పరిష్కరింపబడెను.

# రెండవ అధ్యాయము

## భూమిహక్కుయొక్క లక్షణములు - పేర్లు

భూమిహక్కు రైతుదేగాని, రాజుదికాదని మొదటి అధ్యాయములో నిరూపించితిమి. అయితే, ఈ హక్కుయొక్క స్వభావ మేమి? ఆ యా ప్రాంతములలో ఈ హక్కు ఎట్లు, ఏ ఏ పేర్లతో చలాయింపబడెను? అను విషయములనుగూర్చి ఈ అధ్యాయములో విచారించెదము.

"హక్కు"యొక్క లక్షణమేమి?

భూమిని తన స్వాధీనములో ఉంచుకోడానికి, దానివల్ల వచ్చే ఫలితాలను అనుభవించడానికి, దానిని అమ్ముకోడానికి, తాకట్టుపెట్టుకోడానికి, కౌలు కిచ్చుకోడానికి, మార్చుకోడానికి, తనయిష్టము వచ్చినట్లు దున్నుకోడానికి, త్రవ్వుకోడానికి, వేయేల, తన స్వేచ్ఛానుసారము భూమిపై ఏమైనా చేసుకోడానికి దేనివల్లనైతే వీలు ఏర్పడుతుందో అదే "సంపూర్ణమగుహక్కు" అనబడుచున్నది. పైన వివరించిన అమాంబాపతు స్వేచ్ఛలు కలిగియుండటమే, ఈ "హక్కు" లేక "స్వామ్యము" అనే దానియొక్క స్వభావము. ఈ లక్షణములన్ని వున్నప్పుడు "హక్కువున్నది" అని చెప్పుకోతగివుంటుంది.

"స్వామ్యము" "హక్కు", అనేభావాలు అనేక దేశములలో అనేక పేర్లతో పెంపొందినవి. రోమనుసామ్రాజ్య

"డొమినియమ్" లేక "ప్రాప్రయిటస్"

ములో దీనికే "డొమినియమ్" లేక ప్రొప్రియిటస్" అని పేర్లుండెను. "ప్రొప్రయిటస్" అనే రోమన్ భాషాపదము నుండియే "ప్రొప్రియిటర్" అనగ "సొంతదారుడు" అనే మాట పుట్టినది. ఈ మాటలో "దానాదమన వినిమయ విక్రియాది" సమస్తలక్షణములు ఇమిడియుండెను.

ఇక, ఇంగ్లండుదేశములో భూమికి సొంతదారుడు రాజు తప్ప ఇంకెవ్వరు లేడంటిమి. అయితే, రాజునుండి భూమి కొన్ని పద్ధతులపై ఎవరైనా తీసుకోవచ్చును. వీటిలో అత్యుత్తమ లక్షణములుగల పద్ధతి దాదాపు సంపూర్ణహక్కు అని చెప్పుకో తగ్గ పద్ధతి "ఫీ సింపుల్" (Fee - Simple) అని పిలువబడు

ఫీ. సింపుల్

చున్నది. "ఫీ సింపుల్" అనే దానిలో దానాదమన వినిమయ విక్రియాద్యర్హతలు అన్నీ వున్నవి గాని, సిద్ధాంతములో ఇవన్నీ రాజుకు గలవై అధికారానికి లోబడే యుండవలెననే మాటకలదు. క్రియలో రాజు ఈ తన అధికారాన్ని ప్రజాభిప్రాయానికి జడిసి, చలాయించకపోవచ్చుగాక! సిద్ధాంతములోమాత్రము భూమికి అసలు నిజమైన హక్కుదారుడు రాజేనననీ, తక్కినవారందరు అతనికి లోబడి భూమిల్లో మెలగవలసిన వారేననిన్నీ ఏర్పడియున్నది.

రాజు అనుమతిలేనిదే రైతు భూమిని అమ్ముకోడానికి గాని, తాకట్టుపెట్టుకోడానికిగాని, ఇతరవిధములుగా అన్యాక్రాంతము చెయ్యడానికిగాని వీలులేకుండెను. ఇంగ్లీషు ప్రజలు రాజునుండియే భూమినిగాని; భూమియందలి హక్కులనుగాని

పొందవలసియున్నారు. ఇండియావలె ఇంగ్లీషు ప్రజలకు స్వతస్సిద్ధమగు హక్కులేమీ లేవు. రాజు దయానో భయానో ఇచ్చినవి తప్ప వేరే హక్కులు ప్రజలకు లేవు. ఒక్కొక్కప్పుడు రాజు. తానిచ్చిన హక్కులను లాగి వేయడం కూడ కలదు. ఈ రీతిగా రాజు నుండి భూమిని తీసుకోవడ మనేదానికి ఇంగ్లీషుభాషలో "టెన్యూర్"(Tenure) అందురు. ఈ పదం ఇంగ్లండు పరిస్థితుల ననుసరించి అక్కడ చెల్లుబడియైనను, ఇండియాలో నిజముగ చెల్లుబడి కానేరదు. ఎందుకంటె; భూమిని రాజునుండి తీసుకోవడ మనే మాటయే మనకు లేదు. రాజు ఇచ్చేవాడుగాడు, ప్రజలు పుచ్చుకునేవారు కారు. వస్తుతః, భూమికి హక్కుదారులు ప్రజలే అన్నప్పుడు రాజునుండి పుచ్చుకోవడమనే ప్రసక్తి ఇక్కడ పుట్టనే పుట్టదు. అందువల్లనే "టెన్యూర్" అనే ఇంగ్లీషు మాటకు మన దేశ భాషలలో సరి యగు పర్యాయపదము దొరకకపోవడ మనే చిక్కు ఏర్పడింది. ఈ మాటకు సరియైన అర్థము ఇండియాలో వర్తించక పోయినప్పటికి వేరేమాట దొరకనందువల్ల మన వారు కూడ ఈ మాటతోనే సరిపెట్టుకోవలసివచ్చినది.

"టెన్యూర్" పద నిర్వచనము ఇండియాకు వర్తించదు.

ఇంగ్లండులోని "టెన్యూరు"లు పూర్వకాలమున అనేక రకాలుగ నుండెను. మిలిటరీ టెన్యూర్, "సోకేజీ" అనబడు వ్యవసాయ టెన్యూర్; ఫ్రాంకల్ మాయిన్"అనుమత సంబంధమైన టెన్యూర్, "సార్జంటరీ టెన్యూర్" అనునవి కొన్ని టిని మాత్రము ఉదాహరణముగ తెలిపెదము.

ఇంగ్లీషు "టెన్యూరు"లలో కొన్ని రకములు

(1) "మిలిటరీటెన్యూర్" అనగ తనకు సైన్యసహాయము చేసే షరతుమీాద రాజు భూమిని ఒకనికి ఇవ్వడం. ఈపద్ధతి గా భూమిని తీసుకొన్న ఆసామీా మీాద తొమ్మిది భారములు విధింపబడెను. వీనినే వెట్టిచాకిరీ లని (Feudal services) అని మొదటి అధ్యాయములో "ఫ్యూడల్"పద్ధతిని గురించి చెప్పినపుడు చెప్పితిమి.

(a) హోమేజి:— "నీవే నాకు ప్రభువు" అని అంగీకరించ (Homage) డానికి సూచనగ ఇతడు రాజు ఎదుట మోకరిల్ల బడడం.

(b) "ఫీల్టీ" "నీకు విశ్వాసంగా ఉండి సేవచేస్తా" నని (Fealty) ప్రమాణం చెయ్యడం.

(c) మిలిటరీసప్లయి:— రాజుకు అవసరం వచ్చినప్పుడు (Military service) సైన్యాన్ని సప్లయిచేయడం.

(d) "రిలీఫ్":— తాను చనిపోతే తనకొడుకును మరల (Relief) ఈ టెన్యూర్ క్రిందికి తీసికోడానికిగాను ప్రవేశరుసుం చెల్లించడం.

(e) ఎయిడ్స్:— రాజుకు ఏవైనా అపాయాలు కలిగినపుడు (Aids) వచ్చి సహాయం చెయ్యడం. ఎట్లనగ -

(1) రాజును శత్రువులు పట్టుకుంటే, ఆసామీా వచ్చి డబ్బిచ్చి వదిలించడం.

(2) రాజుగారి పెద్దకొడుకుకు మన "ఉపనయనము"

మాదిరి నైట్ (Knight) సంస్కారమునకు అయ్యే ఖర్చు ఇచ్చుకోవడం.

(3) రాజుగారి పెద్దకూతురు పెళ్ళిఖర్చు ఇచ్చుకోవడం.

(F) "వార్డుషిప్" (Wardship) తన కొడుకు మైనరై యుంటే రాజే అతనికి, అతని ఆస్తికి గార్డియనుగా వుండడానికి అంగీకరించడం. ఈగార్డియన్‌షిప్ మేనేజిమెంటులో ఏమైనా నష్టాలువస్తే రాజు భరించనక్కరలేదు! పైగా, మైనారిటీ వెళ్లినతరువాత తిరిగి ఆస్తి ఇచ్చివేయడానికి ముందు సదరుమైనరే రాజుగారికి కొంత రుసుము (ఫైన్) చెల్లించాలి.

(G) "మ్యారేజి" (marriage) ముందుగ రాజు అనుజ్ఞలేనిది ఆసామీ తన కొడుకుపెండ్లికాని, కూతురుపెండ్లిగాని చేసుకోరాదు. సంబంధం విషయములోకూడ రాజు అనుమతించిన సంబంధమే చేసుకోవాలిగాని, తనయిష్టము వచ్చిన సంబంధము చేసుకోరాదు. తన క్రిందనున్న ఆసామీ శత్రువుల పిల్లలను చేసుకుంటే తన రాజ్యానికి ముప్పువస్తుందనే ఉద్దేశ్యంతో ఈ నియమ మేర్పరుపబడినట్లు కనిపించుచున్నది.

(H) "ఎస్‌చీట్" ఆసామీ బేవారసుగా చనిపోతే అతని Escheat భూమి తిరిగి రాజుకే సంక్రమిస్తుంది.

పరా:—రాజునుంచి వచ్చినది రాజుకే చెందడం సబబే గద! మన ఇండియాలో పూర్వము ఇట్లుకాదు. ఎవరైనా బేవారసుగా పోతే అతని ఆస్తి రాజుకుపోదు. సంఘానికి చెందుతుందని మన ధర్మశాస్త్రాలు చెప్పుతున్నవి. ఈ ధర్మశాస్త్ర పద్ధతి ఇంగ్లీషు "లా" వచ్చిన తరువాత మార్పుచేయబడెను. "కావలి వేంకట - బందరు కలెక్టర్" అనే కేసు చూడండి.

(i) "ఫర్‌ఫీచర్" (Forfeiture) ఆసామీ ఏదైనా గొప్ప నేరము క్రింద శిక్షింపబడ్డప్పుడు అతని ఆస్తి రాజుకే చెందుతుంది.

ఈ ఇంగ్లీషు మిలిటరీ టెన్యూర్‌లలోని పోలికలు కొన్ని మన సామంతరాజులయు, జాగీరుదార్లయు లక్షణములలో నున్నప్పటికి, ఆయాపోలికలు వట్టి పైపైపోలికలేగాని నిజానికి సిద్ధాంతములో సమానములుకావు. మరిన్ని, జాగీరుదార్ల క్రింద సేద్యముచేయు రైతులహక్కులు వారికి స్వతస్సిద్ధమైనవేగాని జాగీరుదార్లనుండి దిగినవికావు. ఇంగ్లీషు పద్ధతికిన్ని మనపద్ధతికిన్ని ఇదే గొప్ప తేడా!

(2) "సోకేజీ (వ్యవసాయపు) టెన్యూర్." భూమి సాగుచేసి, రాజుకు "రెంటు" (అద్దె) ఇచ్చే పద్ధతి ఇది. దీనిలో, అనేక అంతర్భాగము లుండెను. వాటినన్నిటిని వివరించడం అనవసరము గనుక, వదలివేస్తున్నాము. పైన పేర్కొన్న

"మిలిటరీ టెన్యూర్"లోని చాకిరీలు తొమ్మిదింటిలో రెండు మినహా (అనగ, పెండ్లిండ్లు, గార్డియన్ షిప్‌లు తప్ప) మిగతా ఏవున్నా, ఈ టెన్యూరు క్రింది ఆసామీ మీద కూడ మోపబడినవి.

(3) "ఫ్రాన్క్ల్ మాయిన్" అను మతసంబంధమైన "టెన్యూర్." రాజుగారి రాజ్యానికి, కుటుంబానికి, క్షేమం కలిగే నిమిత్తం పూజలు పునస్కారాలు, ప్రార్థనలు చేయడానికిగాను ఈ "టెన్యూర్" ఏర్పరుపబడినది. ఇది మన ఇండియాలోని "పురోహిత" మాన్యము మాదిరిది.

(4) "సార్జంటరీ టెన్యూర్":-రాజుగారి దర్బారులో ఛత్ర చామరాలు ధరించడానికి, రాజుగారు నడుస్తూవుంటే వెండి లేక బంగారు కఱ్ఱదండము పుచ్చుకొని చోపుదారీ కేకలు వేస్తూ వారిముందు నడవడానికి, యుద్ధానికి వెళ్లినప్పుడు జెండాపుచ్చుకొని రాజగారిముందు దోవతీయడానికి ఈ "టెన్యూర్" ఏర్పడినది. దీనిలోకూడ అనేకరకా లున్నవి. ఒకరకములో ఈ "టెన్యూర్" క్రిందనున్న ఆసామీ ప్రతి సాలున ఈ దిగువ సామగ్రి రాజుగారికి సప్లయిచేయవలెను. ఒకవిల్లు, ఒక అంబులపొది, ఒకకత్తి లేక ఖడ్గము, ఒకబాకు ఒక బరిశ, యుద్ధములో చేతివ్రేళ్ళకు, తొడుగుకునే అంగుళి త్రాణములజత, గుర్రాన్నెక్కి స్వారిచేసేటప్పుడు గుర్రాన్ని, తన్ని తొందరించడానికిగాను తగిలించే కక్కులచక్రాలజత.

ప్రజాభిప్రాయము బలపడినకొద్దీ కాలక్రమమున ఈ టెన్యూరులలో నుండే బారమగు బాధ్యతలన్నియును తగ్గింప

బడెను. 1925 సం॥ వరకు భూమిగలవారిమీద ఈ బరువు లన్నీ కొద్దియో గొప్పయో వుండుచునే వచ్చెను. 1925 సం॥ లో ఇంగ్లీషు పార్లమెంటువారు ఒకనూతన చట్టమును అమలులో పెట్టిరి. ఈ చట్టముద్వారా ఈ బరువులన్నీ తీసివేయబడెను. ఇంతకాలము సిద్ధాంతములోనైనా ఈ బరువులను మోయుచుండిన ఇంగ్లీషు ప్రజల పూర్వాచార పరాయణత్వము నేమనవచ్చును ?

హిందూదేశ మందుగల ఆర్య అనార్యజాతులు కూడ దానాదమన వినిమయాది సమస్త లక్షణములతో కూడిన హక్కును భూమిమీద చలాయించుచుండినట్లు "మితాక్షర" "దాయభాగ," వీరమిత్రోదయ, "స్మృతిచంద్రిక," "సరస్వతీ విలాస" మొదలైన హిందూధర్మ శాస్త్రములలో స్పష్టముగా వక్కాణింపబడియున్నది. అయితే, యీ చలాయింపు ఎప్పటి కప్పుడు ఇతరులకు హాని లేకుండుటకై చేయబడిన రాజశాసనములకు లోబడియుండవలెననియు చెప్పబడియుండెను. ఇది సహజము.

మహమ్మదీయ శాస్త్రములలో కూడ ఈ యభిప్రాయము లే చెప్పబడినట్లు లోగడ మద్రాసు హైకోర్టు జడ్జీ పని చేసిన సర్ అబ్దుల్ రహీమ్ సాహెబుగారు తాము రచించిన "మహమ్మదు జూరిస్ప్రూడెన్సు" అనే గ్రంథములో చెప్పియుండిరి.

"హక్కు"కు గల లక్షణములను గూర్చినచర్చ ముగించుటకు ముందు వానిలో ప్రఖ్యాతిగడించిన (Possession)భుక్తము

"Possession"
భుక్తము
దాని ప్రాముఖ్యము

అనే లక్షణమును గురించి కొద్దిగా చెప్ప వలసియున్నది. మిగత లక్షణములు ఒక ఎత్తు, "భుక్తము" ఒక ఎత్తు. అన్ని లక్షణము లున్నను, భుక్తము కాకపోతే హక్కు సంపూర్ణమగుట కష్టము. తక్కిన వేవి లేకయుండినను భుక్తము ఒక్కటే వుంటే, అదే తన హక్కును ప్రతిపాదించుకొనుటకు పదిరెట్లు బలము నిస్తుంది. "ఇతర లక్షణము లేమి లేకపోయి నప్పటికిని, భూమి ఒకరి క్రింద మూడుతరాలవరకూ వుంటే నాలుగోతరమువారి కది ఖాయమై పోతుందని" విష్ణుస్మృతియు, బృహస్పతి స్మృతియు చెప్పుచున్నవి. అన్ని ఇతర సాక్ష్యాల కంటె మూడుతరాల నిరాటంకపు భుక్తియే బలవత్తరమైన సాక్ష్యమని పైస్మృతికర్తల అభిప్రాయము. మరికొందరు స్మృతికర్తలు 30 లేక 20 ఏండ్ల భుక్తమైనా చాలు ననుచున్నారు.

ఇటే ఒకనియందు తక్కిన లక్షణము లెన్నియున్నప్పటికిని భుక్తముగనుక చిరకాలము తనయందు లేకపోతే, మిగతా లక్షణము లన్నియు వ్యర్థమైపోతవి. మరియు, అతనిహక్కు కూడ మాయమై పోతుంది. భుక్తమువల్ల హక్కు కాలక్రమేణా సంపాదించుకోవచ్చును. అట్లే భుక్తము లేనందువల్ల ఉన్న హక్కు కాస్తా ఊడిపోతుంది. తనకు హక్కుగల ఆస్తి యందు, తనకు వ్యతిరేకముగ ఇతరు లెవరైనా భుక్తమునుకలిగి యుంటే, దానికి "వ్యతిరేక భుక్తము" (adverse possession) అంటారు. ఇట్టి వ్యతిరేక భుక్తమును అసలు హక్కుదారుడు చూస్తూ సాగనిస్తూవుంటే, కాలక్రమేణా అతని హక్కు కాస్తా

హరింపైపోతుంది. కనుక తమహక్కులను భద్రముగ సంరక్షించుకోదలచిన ఎవరుగాని వ్యతిరేకభుక్తమును చూస్తూ సాగనివ్వరాదు. కాబట్టి, భుక్తదారునిమధ్య హక్కుదారుని మధ్య తగాదా వచ్చినప్పుడు భుక్తదారునిదే పైచేయిగా నుండును. తన హక్కును స్థాపన చేసుకోడానికి హక్కుదారుడు అప్పుడు ఎక్కువ కష్టము పడవలసి వస్తుంది. అందువల్లనే "Possession is nine points in law", "లా" లో పదింట తొమ్మిది వంతుల బలము భుక్తముదే" అని సామెత పుట్టినది.

## భూమి హక్కుకు పేర్లు

కాణీయాచ్చి — అనాదినుండి భూమియందుగల హక్కుకు, మద్రాస్ రాజధానిలో ఆయాప్రాంతములలో ఏ యే పేర్లుండెనో తెలిసికొందము.

## అరవ జిల్లాలలో

అరవజిల్లాలలో ఈ భూస్వామ్యమునకు "కాణీ"కాణీయాచ్చి, 'ఆధీనం' అనియు, బ్రాహ్మణుల భూవిషయములో స్వాస్థ్యము అనియు పేర్లుండెను. ఇట్టి భూములు గల ఆసామీలను "కాణియాచ్చికరార్" "ఆధీనకర్తార్" "స్వాస్థ్యమ్‌దార్" అనియు అనేకపేర్లతో పిలుచుచుండిరి. అరవభాషలో "కాణి" అనగ ఆస్తి, "ఆచ్చి" అనగ "అధికారము;" "కాణి ఆచ్చి" అనగ, ఆస్తిపై నిరాటంకమును, పారంపర్యమును నగు అధికారము అని అర్థము; కేవలము పంట అనుభవించే కొద్ది హక్కుమాత్రమే

గాక, పిల్లపిల్లతరానా సర్వసంపూర్ణ హక్కులు గలిగి యుండుట యని. ఈ మాట కరము. ఈ మాట ఆదియందు భూమిహక్కు విషయములోనే చెప్పబడినప్పటికి, రానురాను ఇతరవస్తువుల విషయములో కూడ ఇదే మామూలుగ వాడబడుచున్నది. అరవభాషలోని "ఆచ్చి" పదమునకు తెలుగులోని "అచ్చము" నకు సంబంధము ఉండి యుండవచ్చును. "ఈ వస్తువు నాకు అచ్చముగా యిచ్చివేసినారు" అంటే సర్వసంపూర్ణ హక్కులతో ఇచ్చివేసినారని భావము. సంస్కృతములోని "అచ్ఛము" అనగ స్వచ్ఛము అనే అర్థ మిచ్చే మాటకూడ బహుశః దీనికి సన్నిహిత మేమో!

మహారాష్ట్రులు తంజావూరురాజ్య మేలినప్పుడు, భూములయందు రైతులకు గల ఇట్టి పారంపర్యపు హక్కునకు "కుణ భవ" మనే పేరుండెను. దిండిగల్లు ప్రాంతములో ఇట్టి హక్కుగల రైతు "పట్టుకట్టు" రైతు అనబడుచుండెను. మహమ్మదీయ పరిపాలన వచ్చిన తరువాత దీనికే "మిరాశీ" హక్కు అని పేరు వచ్చినది.

"కుణ భవ"
"పట్టుకట్టు"

ఇట్టిహక్కు గల రైతులు "మిరాశీదా" రనబడిరి. 'మిరాశీ' అను పదము అరబ్బీ భాషలోనిది. ఇంగ్లీషుపాలనలో రైతువారీ పద్ధతి వచ్చిన తరువాత "పట్టాదారు" లను పేరు ఎక్కువగ వాడుకలోకి వచ్చెను.

"మిరాశీ"
"పట్టాదారు"

'కాణియాచ్చి' పదమువలెనే 'మిరాశీ' యను పదము

కూడ భూముల విషయములోనే గాక, ఇతర విషయము లలోకూడా పారంపర్యపు హక్కును సూచించు పదముగ వాడబడుచున్నది. తెలుగు జిల్లాలలో వంశపారంపర్యముగా గ్రామనౌకరీ చేసే చాకలులు, మంగలులు, మొదలైన వారికి గల హక్కులను "చాకలి మిరాశీ," "మంగలి మిరాశీ" అనే పేర్లతో పిలవడం వాడుకైపోయినది.

## దక్షిణ కన్నడ జిల్లా.

దక్షిణ కన్నడజిల్లాలో భూమిహక్కుగల వారిని "వర్గదారు" లందురు. వీరినే "మూలవర్గదారులు" "మూల్గారులు" లేక "మూలీ" లు అనికూడ పిలవడంకలదు.

దక్షిణ కన్నడము జిల్లాలో "వర్గ" "వర్గదారు"

ఈ జిల్లా చాలాభాగము కొండలతోను, అడవులతోను నిండియున్నది, కొండ పార్శ్వములందు చదునుచేసి అక్కడకూడ చెట్లుకొట్టి వ్యవసాయము చేయుచుందురు. సమతల ప్రదేశ ములలో వలె ఒకే చోట వందలకొలది ఇండ్లు ఉండే మన మామూలు గ్రామాలు లేవు. ఒక్కొక్క ఆసామికి ఒక గ్రామములోనే గాక వివిధ గ్రామములలో కూడ అక్కడక్కడ చెదురుగ పడియున్న భూముల నన్నిటిని రివిన్యూ వసూలు సౌకర్యము నిమిత్తము పూర్వకాలమున, అనగ అయిదారు వందల ఏండ్ల క్రితము, ఒక ఆకుమీద (అనగా తాటియాకు మీద) వ్రాసియుంచేవారట. ఇట్టి ఆకును సంస్కృతభాషలో "వర్గ"మని యందురు. అందుచేత వీనికి "వర్గ" లనియు, ఆసాములకు "వర్గదారు"లనియు పేరు వచ్చెను. ఒక్కొక్క

"వర్గ"లో సాగుబడికిందికి వచ్చిన భూమిగాక బంజరుభూమి కూడ నుండుచుండెను. "వర్గ"లో యెకరముల కింత శిస్తు అని గాక యావత్తు "వర్గ"కు బిల్‌మక్తాగా ఒకే మొత్తము విధింప బడుచుండెను. భూముల తాలూకు రెవిన్యూలెక్కలను ఈ విధముగా తయారుచేయుటకు కరణము లుండిరి. వీరికే 'శాన్‌బోగు' లనియు పేరు.

ఈ జిల్లాలో కొండచరియలయందు హెచ్చుగా వ్యవసాయము జరుగుచుండును. సాగుబడి పొలములను ఆనుకొని అడవులుండును. ఈ అడవులనుండి పశుగ్రాసము, ఎరువులము, ఇతరఎరువులు స్వేచ్ఛగా తెచ్చుకొని వర్గదారులు వ్యవసాయములో ఉపయోగించుకోవడమనే హక్కు అనాదినుండి వచ్చుచుండెను.

ఇట్టిహక్కు కొండ "నెత్తికట్ట" వరకు గల అడవులలో నుండుచుండెను. వ్యవసాయమునకు ఈ కీగా ఈ అడవి "నెత్తికట్ట" ప్రదేశములు సహాయము (లేక కుమ్మక్) చేయుచుండెను. కావుననే ఈ అడవిప్రదేశాలకు "కుమ్మకీ" భూము లనియు ఈ హక్కును 'కుమ్మకీ' హక్కు అనియు పేరు వచ్చెను. ఇంగ్లీషువారి పరిపాలన వచ్చిన

"కుమ్మకీ" భూములు

తరువాత, అడవు లన్నియు మావే నని చెప్పి వర్గదారులకు గల కుమ్మకీ హక్కులను చాలవరకు తగ్గించివేసిరి. సాగుబడిలో లేని బంజరు భూములన్నీ సర్కారువే ననే సిద్ధాంతము మలబారు జిల్లాలో తప్ప మిగతా అన్ని జిల్లాలలోను ఇంగ్లీషు గవర్నమెంటు

వారు ఎట్లు చలాయింప సాగిరో ఆ చరిత్ర నంతను మొదటి అధ్యాయముయొక్క చివరభాగమందు వివరించి యున్నాము. ఆ సిద్ధాంతప్రకారమే దక్షిణకన్నడజిల్లాలో కూడ అనాదినుండి రైతులసౌకర్యమునకు సహాయము అనగ "కుమ్మక్" చేయుచున్న అడవిభూములన్నీ మావే నని కుంపిణీ వారు అధికారము చలాయింపసాగిరి. దీనివల్లనే వర్గదారుల కుమ్మకీహక్కులు క్రమముగా తగ్గిపోయెను. పూర్వము కొండ నెత్తి కట్టవరకు ఉండినహక్కును పొలాలకి నూరుగజాలవరకు మాత్రమే కంపెనీవారు 1818 సం॥ నుండి నిశ్చరచిరి. 1276 ఫసలీ దరిమిలా సాగుబడిలోనికి వచ్చిన భూములకు ఈ మాత్రపుహక్కుకూడ లేకుండ బూత్రిగ రద్దుపరచిరి. కుమ్మకీహక్కు అంగీకరింపబడినచోట్లకూడ అది సంపూర్ణ గు హక్కుకాదు. అది ఒకవిధమైన "లైసెన్సు" అనగ గవర్న మెంటువారి దయాధర్మబిచ్చముమీద ఆధారపడియుండును. రేపు వారు వల్లకాదంటే ఈ హక్కు ఊడిపోతుంది.

"కదీమ్" "హాసగవి" వర్గలు

"వర్గ"లు 'కదీమ్' వర్గలనియు "హాసగమి" వర్గలనియు రెండురకములు. ఇంగ్లీషు కంపెనీవారు రాకపూర్వము సాగుబడిలోనున్నవానికి కదీమువర్గ లందురు.

"కదీమ్" అనగ పురాతనమైన" అని అర్థము. కంపెనీ రాజ్యం వచ్చినతరువాత కొత్తగ సాగుబడిలోనికి వచ్చిన అనాదిబంజరులను "హాసగమి" వర్గ లందురు. వీనిలో 1276

ఫసలీ అనంతరం వాటికి కుదుస్తుకి హక్కులు లేవని ఇప్పుడే చెప్పితిమి.

శిస్తు భరించే తాహతుల తారతమ్యమునుబట్టి ఈ వర్గ భూములు రెండురకాలుగా విభజింపబడినవి. పూర్తిశిస్తు భరించే వాటికి "భర్తీ వర్గ"లందురు. అంతకు తక్కువ శిస్తుమాత్రమే మోయగలవానికి 'కంభర్తీ వర్గ' లందురు.

"భర్తీ" "కంభర్తీ"

"కంభర్తీలు" మరల 3 రకాలు: మొదట కొద్ది శిస్తుమాత్రమే భరించినా, క్రమక్రమంగా హెచ్చుశిస్తును మోయగల వానికి "వాయిదా" వర్గ లనియు" ఏయేటి కాయేడు తనిఖీజూచి శిస్తువిధింపవలసినవానికి "తనిఖీ" వర్గ లనియు; శిస్తు పూరాగా మోయజాలవని ఒకేసారి రివిన్యూబోర్డువారిచే శిఫార్సు చేయబడిన వాటికి "బోర్డుసిఫార్సు" వర్గ లనియు పేర్లువచ్చెను.

"వాయిదా" "తనిఖీ" "బోర్డుశిఫార్సు" వర్గలు

వర్గలు మరల రెండు విధములుగ విభజింపబడినవి. అనాదినుండి పారంపర్యముగ వర్గదారుల హక్కుభుక్తములలో నున్నవానికి "మూలవర్గ" లనిపేరు. వారసులు నష్టమైపోవుటవల్లగాని, శిస్తు కట్టలేకగాని, రైతులు విడుదలపెట్టడం వల్లగాని సర్కారుకు చెందిపోయిన వర్గలకు "సర్కారుగెస్" వర్గలని పేరువచ్చెను.

మూలవర్గలు "సర్కారుగెస్" వర్గలు

వర్గదారులు తమభూములను స్వేచ్ఛగా అమ్ముకో వచ్చును. కొనుక్కొన్న ఆసామీ, ఆ భూమిపై సర్కారుకు

"కుడితల"
"వలవర్గ"దారులు

చెల్లించవలసిన శిస్తును సరాసరి సర్కారుకు చెల్లించవచ్చును; లేదా, అమ్మిన వర్గదారుని ద్వారా చెల్లించవచ్చును; మొదటిపద్ధతిలో కొనుక్కున్న ఆసామీ "కుడితల" వర్గదారు డనియు, రెండవ పద్ధతిలో "వలవర్గధారు"డనియు పిలువబడుచున్నారు. ఇంగ్లీషురాజ్యములో 'రైతువారీ' పద్ధతి వచ్చిన తరువాత ఈ విభేదము లన్నియు పోయి, అందరు "పట్టాదారు"లనియే పిలువ బడుచున్నారు.

"కుమ్రీ" వ్యవసాయము

వర్గలలోగాని; బైలు అడవులలో అచ్చటచ్చట చెట్లను, పొదలను ఛేదించి వానిని తగులబెట్టి, ఆ బూడిదనే ఎరువుగా వేసి కొంతప్రదేశమును పరంపరగా సేద్యము చేయడం ఇప్పటికిని ఈ దక్షిణ కన్నడ జిల్లాలో కలదు. "కుమ్రీ" యనబడు ఈ అనాదివ్యవసాయపుపద్ధతి గురించి, మొదటియధ్యాయమునందు వివరించియే యుంటిమి. ఈ ప్రదేశమునందు రైతుకు స్థిరమగు హక్కు ఏమియును లేదు. అనాదినుండి వచ్చుచున్న ఈ పరంపర పద్ధతిని బ్రిటిషుగవర్న మెంటుకూడ అంగీకరించియున్నారు.

## మలబారు జిల్లా

మలబారు జిల్లాలో భూమికి సంపూర్ణహక్కుగల ఆసామీలకు "జన్మి" లని పేరు. మహమ్మదీయులు వచ్చి ఈ జిల్లాను జయించి స్వాధీనపరచుకునే రోజువరకు, ఈ జన్మిలు ఏ ప్రభువునకును శిస్తు చెల్లించు చున్నట్లే కనుపించదు.

వీనిని స్వదుంభా లాభూములుగ వీరు అనుభవించుచుండిరి. ఇట్టి విచిత్రపద్ధతి ఈ మలబారు జిల్లాలో తప్ప, మదరాసు రాజధానిలో నెచ్చటను కనుపించదు. భూములందు జన్మిలు దానాదమన వినిమయ విక్రయాది సమస్త హక్కులను చిర కాలమునుండి చెలాయించుచుండిరి.

వీరి సర్వాధికారములకు లోబడి కణందారులు, కుషి కణందారులు, కుడియిరుప్పుదారులు; వెరుంపట్టందారులు అని అనేక రకాల కౌన్యారులేర్పడెను. ఇందులో కణందారు లనువారిలో 1. వ్యవసాయం తామే చేయువారు కొందరు. 2. మధ్యవర్తులు కొందరు. 3. జన్మికి అప్పిచ్చి స్వాధీనతనభా పొందిన వారు కొందరు కలరు. కుషికణందారులనువారు వ్యవసాయం చేసేవారే కాని తోటలవ్యవసాయం మాత్రం చేయువారు. కుడియిరుప్పుదారు లనువారు పొలంలో యిండ్లు వేసుకొని జీవించువారు. వెరుంపట్టాదారులనువారు కడ పటి దర్జాలో స్వయంగా సేద్యం చేసేవారు. జన్మిలపోరు ఎక్కువైపోయి వీరి కెవ్వరికీ హక్కులు నిలకడలేకపోగా ఏబది యేండ్ల ఆందోళన జరిగినమీదట 1929 వ సం॥ లో 1 గుత్త, 2. రైతులను తొలగించే హక్కు వగైరావిషయాలలో జన్మి అధికారాన్ని మితపరుస్తూ కణందారు, వెరుంపట్టాదార్లకు అనుభవపు నిలుకడను కలుగజేస్తూ శాసనము చేయడమైనది.

## తెలుగు జిల్లాలు:

తెలుగుజిల్లాలలో భూమిహక్కుయొక్క స్వభావమెట్లుం డెనో తెలిసికొనుట కాధారము లంతగా కనుపించవు. తక్కిన

"కదీములు"
"పాయకారీలు"

ప్రదేశాలకంటె ముందుగ ఈ తెలుగు ప్రాంతాలె మహమ్మదీయుల పాలన క్రిందికి వచ్చెను. వారు దుర్భర మగు శిస్తువిధించుట వల్ల భూములకు విలువ తగ్గిపోయి, అమ్మేవారూ, కొనేవారూ కూడా లేకుండాపోయిరి. అందువల్ల భూమియందు రైతులచే దానాదమనవినిమయవిక్రియాది హక్కులు చలాయించ బడిన నిదర్శనములు మాసిపోయినవి. అయితే కంపెనీ పరిపాలన వచ్చేనాటికి రెండు రకముల రైతులు భూమిమీద కన బడుచుండిరి. వారికి "కదీము" లనియు, "పాయకారీ"లనియు, పేర్లుండెను. సర్కారుకు శిస్తుచెల్లించు చున్నంతకాలము తమ భూములను నిరాటంకముగ పిల్లపిల్లతరానా అనుభవించే హక్కు గలవారు "కదీము" లనబడుచుండిరి. వీరు ఈ భూము లను అమ్ముకొనుచున్నట్లు నిదర్శనములు కానరావు. కదీముల నుండి భూములు తీసికొని సేద్యము చేయువారికి "పాయకారీ" లని పేరుండెను.

ఇంతవరకు మనము చూచిన యంశములను బట్టి భూమికి హక్కుదారుడు రైతే "స్వామి" రైతున్ను, శిస్తుకు మాత్రమే హక్కుదారుడు రాజున్ను అని తేలినది. అనగ భూమి మీద పండినపంట ప్రధానముగ రెండుభాగములు చేయబడు

"కుడివరము"
"మేల్ వరము"

చున్నది. ఒకటి రైతుభాగము; రెండవది రాజుభాగము. వీనికే "కుడివరము" అనియు, "మేల్ వరము" అనియు పేర్లు. 'కుడి' అనగా అరవభాషలో 'రైతు' అని అర్థము. 'వరమ్' అనగా పంటలో

'భాగము' అని అర్థము. కాబట్టి "కుడివరము" అనగా రైతుభాగము. 'మేల్' అనగ పై భాగము లేక అగ్రభాగము, అనగ ముందుగ రాజుకు చెల్లించవలసిన భాగ మని అర్థము. రాజుకు చెల్లే రాజభాగాన్ని రాజు ప్రజాపరిపాలన నిమిత్తము ఖర్చు పెట్టవలెను. రాజభాగము పోగా రైతుకు మిగిలే రైతుభాగము లేక (కుడివరమును) రైతు తనస్వేచ్ఛానుసారము ఖర్చు పెట్టుకోవచ్చును.

రాజభాగమును రాజు ఏ యే విధముగ వసూలుచేసి కొంటున్నాడో, ఏ యే విధముగ ఖర్చు పెట్టుకొంటున్నాడో వివరముగా రాబోవు ఆ యాఅధ్యాయములలో విచారింతము.

రైతు తనభాగమును ఎట్లుసంపాదించుచున్నాడో, ఎట్లు వినియోగపరచుకుంటున్నాడో చూతము. పొలమును సేద్యము చేయుటద్వారానే రైతుకు ఫలితము వచ్చుచున్నది. ఈ సేద్యమును రైతు నాలుగువిధాల చేయవచ్చును.

(1) తానే స్వయముగ నాగలి చేతబట్టి చేయవచ్చును. (2) పాలేళ్ళను పెట్టి చేయించవచ్చును. (3) ఇతరులను ఎప్పటి కప్పుడు పాలికి కలుపుకొని, చేయుచుండవచ్చును. (4) ఖాయముగ ఇతరుల కెవరికైనా భూమిని, రెంటుకు అనగ అద్దెకు ఇచ్చి వారిచేత చేయిస్తూ పంటలో తాను కొంతభాగము రెంటుగా తీసుకొనుచుండవచ్చును. మదరాసురాజధానిలో ఆ యా ప్రాంతములలో ఈ నాలుగురకాల వ్యవసాయపద్ధతు లున్నట్లు తెలియుచున్నది.

"పాలేళ్లు" పన్నియల్

పైన పేర్కొన్న నాలుగు పద్ధతులలో రెండవదాని యందలి పాలేళ్ళకు దక్షిణాదిని "పన్నియాల్", "పన్నైకరన్", "పడియాల్" అని పేర్లుకలవు. వీరికి సాలుకు ఇంత యని ధాన్యరూపముగా జీతము లేర్పరుతురు. సంవత్సరాంతమున జతపంచలు ఇవ్వడంకలదు. వీరు సాధారణముగ రైతుదొడ్డిలోనే పాకలు వేసికొని ఉంటారు. ఒక్కొక్కప్పుడు సంవత్సరము పొడవున పాలేరుకు అన్నముపెట్టే పద్ధతికూడ వుంటుంది. పంట కోసి, కుప్ప వేసిన తరువాత కుప్పకట్టలు ఇవ్వడమున్ను కద్దు. పొలము మీద చెదురుగా పడిపోయిన ధాన్యపు కంకులను ఏరుకోడానికి కూడ వీరికి ఏర్పాటు వుండును. దీనికే "పరిగ ఏరుకోవడము" లేక "శేషధాన్య సంచయము" అని అంటారు.

పరకుడి

పంటలో భాగ మిచ్చి ఇతరులను పాలికి కలుపుకోవడం మూడవపద్ధతి. పాలివారు సాధారణముగా ఇతరగ్రామమునుండి రావడంకలదు. వీరినే దక్షిణాదిని "పాయకారి" యనియు, "పరకుడి", "అపల్‌గ్రామపరకుడి" అనియు పిలుతురు. సప్లయిచేసిన పరికరాలనుబట్టి కూడ పాలిభాగము నిర్ణయించుకోవడం కద్దు. అరకభాగ మని, ఎద్దుభాగ మని, కడపవగైరా జిల్లాలలో ఏర్పాటు కలదు. వీరు తాత్కాలికపు సేద్యగాండ్రు. వీరికి భూమియందు ఏమీ హక్కు లేదు.

భూస్వామి తనభూమిని ఖాయముగా ఇతర సేద్యగాండ్రకు అద్దె కిచ్చి వ్యవసాయం సాగించడమున్ను కద్దు. ఇది

"ఉల్‌కుడి" పైనపేర్కొన్న వాటిలో నాల్గవపద్ధతి. ఈ రకము సేద్యగాండ్రు ఖాయపుసేద్యగాండ్రగు చున్నారు. వీరికే "ఉల్‌కుడి" అని దక్షిణాదిని పేరు. వీరు సాధారణముగ గ్రామములో ఖాయముగా కాపురముండే వారే. చిరకాలము వ్యవసాయము చేయడంవల్ల భూమియందు వీరికి కొన్ని హక్కు లేర్పడెను. ఉదాహరణము- మా మూలు అద్దె ఇస్తున్నంతకాలము "ఉల్‌కుడి"ని భూమినుండి తొలగించ డానికి భూస్వామియగు రైతుకు హక్కుపోతుంది. ఈ రీతిగ "ఉల్‌కుడీ"లకు భూములందు పారంపర్యపు హక్కు లేర్పడెను. మొదట తాత్కాలికముగ "పాయకారీలు"గ వచ్చినవారు మూడుతరాలవరకు అదే భూమిని సేద్యము చేస్తూవుంటే, నాలుగవతరములో వారు "ఉల్‌కుడి" అనగ "ఖాయపు రైతులు" అయిపోతా రని చంగల్‌పట్టుజిల్లాలో ఏర్పాటు కలదు. భూమి మీదవుండి వ్యవసాయము చేసుకుంటూ వుండడానికి "ఉల్‌కుడీ"లకు ఇట్టి పారంపర్యహక్కు ఏర్ప డ్డప్పటికి దానిని అమ్ముకోడానికిగాని, తాకట్టుపెట్టుకోడానికి గాని, ఇతరవిధముగ అన్యాక్రాంతం చెయ్యడానికిగాని, వీరికి హక్కులేదు. ఏ "ఉల్‌కుడి" యైనా వారసులులేకుండా చచ్చి పోతే, అతనిభూమి తిరిగి భూస్వామికే చెందుతుంది. భూస్వామి యొక్క ఆధిక్యాన్ని గుర్తించడానికి చిహ్నముగ "ఉల్‌కుడి" అతని కేదో రుసుము చెల్లించుచుండవలెను. ఆఖరుకు ఒకవడ్ల కంకియైనాసరే. "ఉల్‌కుడీ" దార్లు భూస్వామికి చెల్లించే అద్దెను తంజావూరుజిల్లాలో "స్వామిభోగ" మనియు,

"తుండువర" మనియు పిలుతురు. ఇది నిజముగ రాజభాగం పోను మిగిలే "కుడివరము" అనే రైతుభాగములో అంతర్భాగ మన్నమాట. "ఉల్ కుడి" ఎన్ని తరాలు భూమిని సేద్యము చేసినా, "కాణియాచ్చిదార్" (అనగ సొంతదారుడు, భూస్వామి) కాజాలడు. గవర్నమెంటువారు "ల్యాండు ఎక్విజిషన్" ఆక్టు ప్రకారము "ఉల్ కుడి" క్రిందినున్న భూమిని లాగుకుంటే, అతనికికూడ కొంత "కంపెన్ సేషన్" ఇస్తారు.

మొదట భూస్వామినుండి కొన్నిఏండ్లకని చెప్పి భూమిని అద్దెకు తీసికొన్న కొందరు సేద్యగాండ్రు కాలక్రమముగ

"సుఖవాసీ"

ఖాయపు హక్కులను సంపాదించిరి. వీరికే "సుఖవాసీ" సేద్యగాండ్రని పేరు. "ఉల్ కుడీ" దార్లకున్న హక్కులే వీరికిని క్రమముగ నేర్పడెను.

అరవజిల్లాలలోని "పరకుడి", "ఉల కుడి" సేద్య

దక్షిణకన్నడజిల్లా

గాండ్రతో సమముగ పోల్చ తగినవాండ్రను దక్షిణ కన్నడజిల్లాలో "చల్ గని", "మూల్ గని" అంటారు.

"చల్ గనీ" సేద్యగాండ్రు కౌంపరగీదార్లు. వీరుసాధారణముగ భూమిమీద పిల్లపిల్లతరానా సేద్యముచేస్తున్నప్పటికి,

"చల్ గని"

వీరికి దానియందు ఖాయపుహక్కు లేమీ లేవు. భూస్వామి ఈ సేద్యగాండ్రిచ్చే అద్దెను తనఇష్టము వచ్చినట్లు హెచ్చింపవచ్చును. సేద్యగానిని భూమినుండి తన ఇష్టమువచ్చినపుడు లేవగొట్టవచ్చును.

ఇక "మూల్‌గని" విషయమట్లుకాదు. ఒకే నిర్ణీతమైన అద్దెను (రెంటును) శాశ్వతముగా తీసికోడానికి మాత్రమే భూస్వామికి హక్కు గలదు. రైతుసాధారణముగ పంటరూపంలోగాని, రొఖ రూపంలోగాని వుంటుంది. "మూల్‌గని" దారునిహక్కు వంశపారంపర్య మైనది. ఇతను తాను సేద్యము చేయుచున్న భూమిని అమ్ముకో వచ్చును, తాకట్టుపెట్టుకోవచ్చును. ఇతరవిధములుగా అన్యా క్రాంతము చేసుకోవచ్చును. ఔరససంతతి లేకపోతే, దత్తత చేసుకొని ఈ భూమిని ఆ దత్తునకు సంక్రమింప జేసుకోవచ్చును. వారసులులేకుండా చచ్చిపోతేమాత్రం భూమితిరిగి భూస్వామికే చెందిపోతుంది.

"మూల్ గని"

భూములపై "మూల్‌గనీ" దార్లు భూస్వాములు కివ్వవలసిన అద్దె (రెంటు) స్థిరమైనదనిన్నీ, హెచ్చించడానికి వీలు లేదనిన్నీ వుండడంవల్ల కొంతకాలానికి ఒక చిక్కు వచ్చినది. భూముల మీద సెటిల్‌మెంటు కాలమందు సర్కారుశిస్తు హెచ్చింప బడినప్పుడు, ఆ హెచ్చుదల "మూల్‌గని" సేద్యగాండ్లుగాక, అసలు భూస్వాములే (మూలవర్గదారులే) ఇచ్చుకోవలసి వచ్చింది. ఈ భూస్వాములకు సేద్యగాండ్లిచ్చే అద్దెకంటె తాము సర్కారుకు చెల్లించుకో వలసివచ్చిన హెచ్చుదల శిస్తే హెచ్చయ్యెను. అందుచేత, భూస్వాములు కొన్నిచోట్ల తమ చేతిసొమ్ము పెట్టుకోవలసి వచ్చెను. ఈ విపరీతస్థితిని మాన్పుటకై 1920 సం॥ లో మద్రాసు గవర్నమెంటువారు

1920 సం॥ పు XIII చట్టము. "మూల్గని రెంటు పెంపుదల ఇక్టు"

[Mulgeni Rent Enhancement Act XIII of 1920] "మూల్గనీ రెంటుపెంపుదల ఆక్టు" అని ప్రత్యేక మొకచట్టము చేయవలసి వచ్చినది. దీని ప్రకారము మూల్గనీ సేద్యగాండ్రు భూస్వాములకు (మూలవర్గదారులకు) చెల్లించవలసిన రెంటును గురించి విచారించి, తగురీతిగా దానిని హెచ్చించుటకు కలెక్టరుకు అధికారమియ్యబడెను.

"వాయిదాగనీ"

కొన్ని నియమితసంవత్సరములకు భూములను కౌలుకివ్వడంకూడా కలదు. ఇట్టికౌళ్లకు దక్షిణ కన్నడజిల్లాలో "వాయిదాగనీ" యనిపేరు.

భూమిమీాద పండినపంట రైతు, రాజు అను యిరువురి మధ్య ఎట్లు పంపిణీ అయ్యేనో యీ దిగువపట్టికలో కండ్లకు కట్టినట్లు చూపబడినది.

భూమిమీద పంట

**మేల్ వరమ్**

రాజభాగము

- నేరుగ రాజే వసూలు చేసుకొనేది. (రైతువారీ)
- జమీందార నే ఏజంటుద్వారా వసూలు చేసుకొనేది (జమీందారీ)
- కొన్ని పబ్లిక్ కారణాలచేత, అంతా గాని కొంతగాని రాజు ఇతరులకు దానముచేసికొన్నది (ఇనాందారీ)

ఈ మూడింటెని గూర్చిన విచారణ ఈ గ్రంథము రెండవభాగములోని మూడు అధ్యాయములలో వివరముగ చేయబడును.

**కుడివరమ్**

రైతు భాగము
(భూస్వామి, కాణియాచ్చిదార్, మిరాశీదార్, మూల్దార్, జన్మి లనబడువారి భాగము)

- రైతుకు సేద్యగాడిచ్చే రెంటు లేక అద్దె. ఇదే కుడివరంలో అంతర్భాగమైన "తుంబువరము" లేక 'స్వామిభోగము'.
- సేద్యగానికి అనగ "ఉల్ కుడీ," "మూల్ గనీ" "కదీము" లనబడేవారికి మిగిలేది.

# మూడవ అధ్యాయము

## "సాముదాయక స్వాస్థ్యము"
## (ఇదే మన దేశీయ "కమ్యూనిజము")

[భూమిహక్కు చలాయింపు - ఉమ్మడిగ, గ్రామసంఘాలద్వారా —మిరాశీ గ్రామాలు]

భూమికి హక్కుదారుడు రైతు అనియు, భూమిమీద పండిన పంటలో పరిపాలనార్థమై రాజుకు చెందవలసిన "రాజభాగము" పోను, మిగతాది యావత్తు రైతే అనుభవించు హక్కు గలదనియు, మొదటి రెండుఅధ్యాయములలో వివరించి యుంటిమి.

ఈ తనహక్కును రైతు అనాదినుండి ఎట్లు చలాయించుకున్నాడో, ఆ చరిత్రను ఈ అధ్యాయములో కొలదిగ విచారింతము. ఇప్పటివలె ఏ వ్యక్తికా వ్యక్తి, ఇంకొకరితో సంబంధములేకుండ చెలాయించుకున్నాడా? లేక, ఇతరులతో కలసి జాయింటుగ అనగ సమష్టిగ చలాయించుకొన్నాడా? సమష్టిగ చలాయించుకొని యుంటే, ఆ సమష్టి అనే దాని యొక్క స్వభావ మెట్లుండెను? అది అనాదినుండి ఎట్లెట్లు మార్పుచెందుచు వచ్చెను? ఈ ప్రశ్నలకు సమాధానము చెప్పవలెనంటే, మానవసంఘచరిత్రను మరియొకసారి తిరుగ వేయవలెను.

మానవులు మొదట అరణ్యములలో నొంటరిగ తిరుగాడుచు, మృగముల వేటవల్ల జీవించుచున్నట్లును, తరువాత కొన్ని కుటుంబములు గుంపులుగను, తండాలుగను బయలుదేరి అచ్చటచ్చట అడవులను ఛేదించి, తాత్కాలిక వ్యవసాయము చేసుకొంటూ, దేశదిమ్మరులుగా పోతున్నట్లును, దరిమిలా కొన్ని గుంపులుకలసి అనువైనచోట్ల స్థిరముగా యిండ్లు వాకిండ్లు కట్టుకొని నిలచిపోయినట్లును, ఇదివరకే చెప్పియుంటిమి. మానవ సంఘము లిట్లు స్థిరనివాసము లేర్పరచుకొన్న చోట్లకే "గ్రామము" అనియు, "ఊరు" అనియు, అనేకచోట్ల అనేక పేర్లు కలిగెను.

ఈ గ్రామముయొక్క నిర్మాణము దాని ఆంతరంగిక పరిపాలన, కాలక్రమమున దానియందు గలిగిన మార్పులు మొదలగు అంశములను గురించి నాచేరచింపబడిన "గ్రామము" * అను చిన్నపొత్తములో తప్సీలుగా వివరించితిని.

గ్రామనిర్మాణము

ఆదియందు భూమియావత్తు, తుప్పలు, పొదలు, అడవులు, రాళ్లు, రప్పలు మొదలగువానితో నిండియుండెను. రాళ్లు రప్పలను ఏరిపారవేసి పొదలను, అడవులను ఛేదించి, నేలదున్ని శుభ్రముచేసినగాని అది సాగుక్రిందికి రాలేదు. అదిగాక, ఈచెక్కలు అడవుల మధ్య నుండుటవల్ల అడవి మృగముల బాధనుండి కూడ సంరక్షించుకొనవలసియుండెను. పొలములకు, చెఱు

ఉమ్మడి ఆక్రమణ

* ప్రకాశకులు, ఆంధ్రజాతీయకళాశాల, పేజీలు 85, వెల 0-4-0.

వులు, కాలువలు, బోదెలు వగైరా నీటివసరుల నేర్పరుచుకొనుటగూడ అవసరమయ్యెను. ఈ పనులన్నీ ఆదికాలములో (ఇప్పటిమాదిరి రాజ్యాంగనిర్మాణము లేనిరోజులలో) ఏ వ్యక్తి కావ్యక్తి విడివిడిగా చేసుకోడానికి వీలులేని పను లన్నసంగతి స్పష్టమే. ఒక గుంపు ఒకచోట స్థిరనివాస మేర్పర్చుకొన్నప్పుడు చుట్టూఉన్న భూమినంతను అందరుకలసి బాగుచేసుకోవడం, సాగుచేసుకోవడం పండినపంటనంతను అందరూకలిసి పంచుకుతినడం జరుగుతుంది. ఇది సహజము. "మొదట ఆక్రమించుకొన్న వాడిదేభూమి" అను సిద్ధాంతము కలదుగద. మొదట ఆక్రమించుకొన్నది గుంపుకాని, వ్యక్తికాదు. కాబట్టి, ఈ భూమిహక్కు గుంపుదే యగునుగాని, అందలి విడివిడి మనుష్యులది కాదు. అందువల్లనే, ఒక గ్రామ గుడికట్టులోని భూమిహక్కు గ్రామసంఘాని దనేమాట రూఢి యైనది. సాగుబడిక్రిందికి వచ్చిన భూమిగాని, ఇంకను కావలసియున్న బంజరు భూమిగాని, గ్రామసంఘానిదే. ఈ బంజరుభూమిని నేడు గాకున్న, రేపైనను సాగులోనికి తెచ్చుకోడానికిగాని, లేక గ్రామపశువులకు మేతబీళ్లుగా ఉపయోగించుకోడానికి గాని, లేక అందరికి ఉమ్మడిగ కావలసిన మరి ఏ యితరపనులకైనా అట్టేయుంచుకోడానికి గాని, సర్వాధికారము గ్రామసంఘానిదే. ఈరీతిగ జూచినప్పుడు రైతు ఆదికాలమునుండి భూమిపై తనకు గల హక్కును, ఇప్పటివలె ఏ మనిషికి ఆ మనిషి విడివిడిగ, "ఇది నా పొలము" అని చుట్టూ సర్వేరాళ్లు పాతుకొనడం మూలంగా ఫైలా యించలేదనిన్నీ, గ్రామములో ఉండే వారందరూ, ఉమ్మడిగ

చెలాయించుకొన్నారనిన్నీ, స్పష్టమౌగా గన్పట్టుచున్నది. అనగ, భూమిహక్కుయొక్క చలాయింపు సమష్టిగ జరిగింది కాని వ్యష్టిగ జరగలేదు. దీనికే "సాముదాయిక స్వామ్య"మని మన పురాతనగ్రంథములలో పేరుకలదు. ఇదే కమ్యూనిజ మంటే.

గ్రామ అవసరాలు - వానిని తీర్చుకొనే ఉపాయాలు

మానవజీవితానికి ప్రధానమైన వస్తువు అన్నము. దీనిని సంపాదించుటకు మూలాధారము వ్యవసాయము అయినప్పటికి, మనిషి ఒక్క అన్నమువల్లనే బ్రతుకడు. అన్నము తరువాత అతని కింక ఎన్నో అవసరము లున్నవి. వానిలో తప్పనిసరి యైనది బట్ట. ఈ రెండూ ఉంటే, తక్కినవి ఏవి లేకపోయినా, ఏదో విధంగా సరిపెట్టుకోవచ్చును. అందుకనే, పూర్వము ఒక మనిషియొక్క స్థితిగతులు గురించి విచారించేటప్పుడు-ముఖ్యముగ, ఆడపిల్ల నిచ్చేచోట-"ఫరవా లేదు; వారికేమి, వారికి అన్నవస్త్రాలకు లోపం లేదు" అంటూ చెప్పుకొని తృప్తిపడేవారు. తక్కిన అవసరములు గాని, పరికరాలుగాని, అన్నీ ఏదోవిధంగా ఈ రెంటికి సంబంధించినవే. వ్యవసాయం సాగవలెనంటే, నాగలి కావాలి; ఎద్దులుకావాలి. పలుగులు, పారలు, కత్తవలు, ఇంకా ఎన్నెన్నో పనిముట్లు కావాలి. వస్త్రం కావాలంటే ప్రత్తి గింజలు తీసేగిలకలు, ఏకుమబద్దలు, రాట్నాలు, మగ్గాలు, అద్దకముసామాగ్రి ఇంకా ఎన్నెన్నో కావాలి. వ్యవసాయమునకు, నేతకు, సంబంధించిన ఈ యావత్తు పనిముట్లను తయారు చేసేటందుకు తగు మనుష్యులుకావాలి. బట్టలు ఉతికేటందుకు

చాకలులు, క్షౌరం చేసేటందుకు మంగలులు, వంట వండుకోడానికి కావలసిన కుండలు చేసే కుమ్మరులు, లోహపాత్రలు చేసే కమ్మరులు కావాలి. ఇవన్నీ ఉన్న తరువాత షోకు చేసుకోనేటందుకు నగలు కావాలి. అందుకని నగలు చేసే కంసాలులు కావాలి. ఇవన్నీ ఎన్ని ఉన్నా, మనిషికి ఆత్మ అనేది ఒకటి ఉన్నదనిన్నీ ప్రపంచాన్నంతను సృష్టించిన పరమేశ్వరుడొకడున్నాడనిన్నీ, అతనిని గురించి తెలుసుకుంటేనేగాని మనకు ముక్తి లేదనిన్నీ మానవులు – అన్ని దేశాలలో, అన్ని ఖండాలలో – తలంచుచుండిరి. అందువల్ల, భగవంతుణ్ణి గురించి తెలుసుకోవడం అనే అవసరం కూడ – అన్నవస్త్రాల అవసరం మాదిరిగానే – ఆదికాలమందు మానవులకు కలిగెను. అందువల్ల, ఇతర అవసరములతో పాటు, ఈ అవసరం తీర్చుకోడానికి కూడ, ఒక ఏర్పాటును వారు చేసుకోవలసి వచ్చింది. దానికొఱకే – జ్ఞానబోధ చేయించుకొనే నిమిత్తము – 'పురోహితుడు' అనే ఒక 'పోస్టు'ను సృష్టించారు – చాకలి, మంగలి 'పోస్టు'ల వలెనే కంటికి కనబడే బట్టలు ఉతకడానికి "చాకలి" ఎంత అవసరమో, కంటికి కనపడని ఆత్మను జ్ఞానబోధచే పరిశుద్ధము చేసే "పురోహితుడు" కూడ అంత అవసరమే అని ఆనాటి వారికి గట్టిగ తోచిఉండకపోతే, వారిట్టి "పురోహితు" డనే పోస్టును నిర్మించేవారే కాదు. అట్లా తోచడమనేది ఈ నాటి వారి దృష్టిలో కేవలం పిచ్చిగా కనబడవచ్చుగాక. అయితేనేమి, జరిగిన సంగతి అది. ఈ నాటి వారికిది, అవసరంగా తోచకపోతే ఆ 'పోస్టు'ను రద్దుపరచడానికి ఏమీ ఆక్షేపణ లేదు. ఇది భవిష్యత్తుకు సంబంధించిన మాట.

మానవులు హాయిగ ఒకచోట కాపురముండి, అన్ని విధాల సుఖపడాలంటే ఎన్ని యెత్తులు అవసరమో చూడండి. వ్యవసాయ మనేది ఎంత ప్రధానమైనప్పటికి, దానిని నిలబెట్టి సాగించడానికి ఎన్ని ఉపాంగాలు అవసరమో ఆలోచించండి. అందుకోసమే ఆదికాలమున ఒకచోట గ్రామమున స్థిరపడిన మానవసంఘము కేవలం నేల దున్నుకోవడం కోసమే కాకుండా అనేక ఇతరమైన ఏర్పాటులనుకూడ తమలో తాము చేసుకోవలసివచ్చింది. కొందరు నాగలిపట్టి వ్యవసాయం చేస్తుంటే, కొందరు బట్టలు నేసేవారు, కొందరు బట్టలు ఉతికేవారు, కొందరు మంగలిపొది పుచ్చుకొని క్షౌరం చేసేవారు, కొందరు కుండలు చేసేవారు, కొందరు స్త్రీపురుషుల అలంకారములకు నగలు చేసేవారు, కొందరు జ్ఞానబోధ చేసేవారు, ఒకటేమిటి ఒకచోట గ్రామంగా గుంపు కూడిన జనసంఘానికి ఏ యే పనులు అవసరమో ఆ యాపనులన్నింటిని ఆ సంఘములోనివారే తలోకపని పంచుకొని చేసుకుంటూ ఉండేవారు. ఈ పనులన్నీ పరస్పరసహాకారభావముతో జరిగితేగాని, సంఘము చక్కగ నడవదు. అనాదినుండి నిన్నమొన్నటివరకు మన గ్రామసంఘాలు చక్కగ పనిచేసిన వంటే అవి ఎంతటి సహాకారభావముతో పనిచేసినవో. దాని కోసం ఎంతటి గట్టిపునాదిని ఆనాడు మనవారు వేసికో ఇప్పుడు తెలుసుకొంటే మనకు ఎంతో ఆశ్చర్యమవుతుంది. మనకేమిటి రెండుమూడు వందలసంవత్సరాల క్రిందట, మన ఇండియాలో కాలుపెట్టిన ఇంగ్లీషు ఈస్టుఇండియా కంపెనీవారికే ఆశ్చర్యమేసింది.

ఈ గ్రామసంఘాలయొక్క పటిమను, ఘనతను, సౌష్ఠవమును వేయినోళ్ల కొనియాడుచు ఆనాటి ఇంగ్లీషు పరిపాలకులు అక్షరాలా వ్రాసియుంచిన వ్రాతలే మనకు ప్రబల ప్రమాణములు - ఇట్టి వ్రాతలు పార్లమెంటు రికార్డులలో కుప్పతిప్పలుగ గలవు. వాని నన్నిటిని ఇక్కడ ఎత్తివ్రాయడానికి చోటులేదుగనుక కొన్నిటిని మాత్రము మచ్చుకోసము ఉదహరిస్తాము. *

గ్రామసంఘముల పటిమ

---

* **R. C. Dutt : Ecnomic History of India Vol. II Page 196.**

"India had been the earliest home of village Communities and for centuries and thousands of years these self governing Communities had maintained order and peace and settled disputes in villages,. even when there was anarchy in the realm".

"గ్రామసంఘాలకు ఇండియా అనాది పుట్టినిల్లు. రాజ్యాంగములు అల్లకల్లోల స్థితిలో నున్నప్పుడు సైతము. ఈ గ్రామసంఘాలు ఎన్నో శతాబ్దములనుండి- సహస్రాబ్దములనుండికూడ— శాంతిభద్రతలను కాపాడగలిగెను. స్వపరిపాలనాధికారమును వహించిన ఈ సంఘములు గ్రామముల లోని తగాయిదాలను— దేశము సంక్షోభించుచున్న స్థితిలోకూడ చక్కగ పరిష్కరించు చుండెను" [రమేశ చంద్రదత్తుగారి గ్రంథము— హిందూ దేశ ఆర్థిక చరిత్ర— రెండవ సంపుటము, 196. పేజి]

**Fifth Parliamentary Report - 1812 - Page 85 quoted by R. C. Dutt -**

"Under this simple form of municipal government the inhabitants of the Country have lived from time immemorial............The inhabitants give themselves no trouble about the breaking up and divisions of kingdoms ; while the village remains entire, they care not to what power it is transferred, or to what sovereign it devolves ; its internal economy remains unchanged."

"మిగుల సౌలభ్యమైన ఈ గ్రామ పరిపాలనలో హిందూదేశ ప్రజలు అనాదినుండి నివసించియున్నారు. రాజ్యములు పగిలిపోయినను, విభాగములై పోయినను, గ్రామప్రజల కేమీ పట్టదు. తమ గ్రామసంస్థ గట్టిగా నిలిచి

దరిమిలా, అప్పుడప్పుడు సుక్కగోడుగులవలె పొటకరించుచు వచ్చిన రాజ్యాలు, సామ్రాజ్యాలు, "సింహాసనాలు, ఎన్ని తలక్రిందులై పోయినను, ఎన్ని కిరీటాలు, ఎందరు కిరీటాధిపతులు, కొరంకులు దొల్లినట్లు దొర్లినను, ఎన్ని ఘోర యుద్ధాలు, విప్లవాలు, రక్తపాతాలు, తుఫానులుగ దేశమును ముంచి లేవనెత్తినను ఈ గ్రామసంఘాలు మాత్రము చెక్కుచెదరక — నిమ్మకు నీరెత్తినట్లు — సాగిపోతూనే యుండే

---

నాళ్లు, దేశము ఏ రాజు చేతిలోకి బదలాయింపైనా సరే వారికి లెక్కలేదు. గ్రామ ఆంతరంగిక వ్యవహారము మాత్రము చెదరకుండ అట్లేయుండెను."
[1812 నాటి అయిదవ పార్లమెంటరీ రిపోర్టు — 85, వ, పేజీ]

**Elphinston's Report on the territories acquired from the Peshwa.-1819.**

" These communities conta[illegible] miniature all the materials of a state within themselves, and ar[illegible] st sufficient to protect their members if all other governmen[illegible] withdrawn."

"కొద్దిలో ప్రజా పరిపాలనానిర్వహణకు కావలసిన సర్వాంగ లక్షణములు, ఈ గ్రామసంఘాలలో సంపూర్ణముగ ఇమిడి యున్నవి. పైనున్న ఇతర రాజ్యాంగసంస్థలన్ని తుడిచిపెట్టుకొని పోయినప్పటికి ఈ గ్రామ సంఘములే తమ ప్రజలను భద్రముగ కాపాడుటకు దాదాపుగ చాలియున్నవి."

[పీష్వానుండి లాగికొన్న ప్రాంతములను గూర్చి ఎల్ఫిన్‌స్టన్ 1819 సం॥ లో వ్రాసిన రిపోర్టులోనుండి]

**Sir Charles Metcalfe's minute dated 7th November 1830.—**

" The village communities are little republics, having nearly everything they want within themselves. They seem to last where nothing else lasts. Dynasty after dynasty tumbles down—revolution succeeds revolution. Hindu Pathan, Mughul Mahrata, Sikh, English are masters in turn — but the village communities remain the same........The union of the village communities each one forming a separated little state in itself has, I conceive, contributed more than any other cause to the preservation of the people of India through

నన్నచో, వానియందు మన పూర్వీకులు ప్రతిష్ఠించిన ఐకమత్యయంత్రబలిమి ఎట్టిదో ఊహించుకొనండి!

పని పంపిణీ 21 గ్యాంగులు

తమసంఘాన్ని చక్కగ నడుపుకోడానికి గాను, గ్రామస్థులు తమ సమష్టి అవసరములను ఇరవై ఒక్క విధములుగ విభాగించుకొని, ఒక్కొక్క పనికి లేక ఒక్కొక్క అవసరానికి తమలో తామే ఒక్కొక్క గుంపుగ "గ్యాంగు"గ ఏర్పడి, దానిని తమ నెత్తిమీద వేసుకొని, చేసుకొనుచుండిరి. జైలు పరిపాలనలో దీని కొక సాదృశ్యమున్నది. తెల్లవారుజామున 5 గంటలకు 'ఛీఫ్‌వార్డను' అను ఉద్యోగివచ్చి, [illegible] ఖైదీలకు జైలు పనిని పంచి యిచ్చును. "ఇదిగో ఈ నెంబర్లుగల ఖైదీ గ్యాంగులు వంట పనికి పోండి; ఈ గ్యాంగు పాకీపనికి పోండి; ఈ గ్యాంగు

---

all revolutions, and changes which they have suffered and it is in a high degree conducive to their happiness, and to the enjoyment of a great portion of freedom and independence."

"గ్రామసంఘాలంటే, ప్రజాపాలనగల చిన్న స్వతంత్ర రాజ్యాలన్న మాట. వాటికి కావలసిన ఏర్పాట్లన్నీ వాటిలోనే ఇముడ్చుకొని యున్నవి. కాలప్రవాహములోపడి ఏవి కొట్టుకొని పోయినా, ఈ గ్రామ సంఘాలు మాత్రం కొట్టుకొని పోకుండా కనిపిస్తున్నవి. ఒక రాజవంశం తరువాత ఇంకొక రాజవంశం బోర్లపడుచుండగా, విప్లవం మీద విప్లవం వచ్చిపడుచుండగా; హిందువులు, పఠానులు, మొగలులు, మహారాష్ట్రులు, శిక్కులు, ఇంగ్లీషు వారు, ఒకరితర్వాత ఇంకొకరు రాజులైనా — గ్రామసంఘాలు మాత్రము అట్లే నిలిచియుండెను .... ప్రజలు హాయిగా నుండుటకు, స్వాతంత్ర్య సౌఖ్యముల నవ్వారిగ ననుభవించుటకు ఈ గ్రామ సంఘముల ఐక్యతయే ఎంతో ఎక్కువగ తోడ్పడెను."

[1830 సం॥ నవంబరు 7వ తేదీన సర్. చార్లస్ మెట్‌కాఫ్ వ్రాసిన వ్రాతనుండి.]

వీధులు ఊడ్వడానికి పాకీ"—అని ఆ యా పనులకు తగిన త మంది మనుష్యులను బత్తాయించును. అట్లే, పూర్వము గ్రామ సంఘములలో కూడ గ్రామానికి కావలసిన పనులన్ని గ్రామస్థులు తమలో తామే బత్తాయించుకొనేవారు. ఈ విధముగ, బత్తాయింపైన పనులు సాధారణముగ 21 వుండుచుండెను. కొన్ని చోట్ల పూర్తిగా, 21 గాక, 12 మాత్రమే ఉండుచుండెను. ఆ యా పనులకు బత్తాయింపబడిన గ్యాంగులకు "గ్రామ సిబ్బంది" యని పేరుండెను. వారెవరనగా:—

1. గ్రామాధికారి:—ఇతనికి అనేక చోట్ల అనేక పేర్లుండెను. ఉదాహరణ- అంబలకారన్; డోలాబేహారా; గౌడ; పెద్దకాపు; కాపు; మణియగార్; పటేల్; పిళ్లై; రెడ్డి-వగైరా. గ్రామ వ్యవహారాల పర్యవేక్షకుడైన కాపుండి, అజమాయిషీ చేయడం, తగాదాలు తీర్చడం, శాంతి భద్రతలు కాపాడటం, (అనగ ఇప్పటి పోలీసు ఉద్యోగి అన్నమాట) పంటలో రాజభాగం వసూలుచేసి రాజుకు ఇర్సాలుచేయడం, వగైరాలు ఇతని విధులు.

2. కరణం:— ఇతనికి కొన్నిచోట్ల "శానబోగ్", "భూయిమూల్" అనికూడా పేర్లుకలవు. గ్రామసాగుబడి వగైరా లెక్కలన్నిటిని వ్రాయడం ఇతని డ్యూటీ.

3. తలారీ:— జరిగిన నేరాలు రిపోర్టుచేయడం, ఒక గ్రామా న్నుంచి ఇంకో గ్రామానికి ప్రయాణముచేసే ప్రయాణీకులకు అంగరక్ష ఇవ్వడం ఇతనిపని.

4. తోటి:— బారికీ, మాదిగ, వెట్టియన్, వెట్టివాడు, అనే పేర్లుకూడ ఇతనికి గలవు. పొలములలో పంట కాపాడటం, పొలాలు కొలవడంలో సహాయం చేయడం ఇంకా ఇతర పనులెన్నో ఇతనికి పెట్ట బడినవి.

5. నీరంటి:— సాగుబడిపొలాలకు నీటిసప్లయిని రెగ్యులేటు చేయడం ఇతని పని.

6. కావలి:— గ్రామాలమధ్య సరిహద్దులు, పొలిమేరలు చెడి పోకుండా కాపాడడం, తగాదాలువస్తే ఇందును గూర్చి సాక్ష్యం ఇవ్వడం ఇతని పని.

7. పురోహితుడు:- ఇతనికే జ్యోషి, పంచాంగి, అనికూడ పేర్లు. ఏరువాక సాగడానికి, కోతలు, ఊడ్పులు పట్ట డానికి, మంచిరోజులు చూచి చెప్పడం ఇతని పని.

8. బ్రాహ్మణుడు:- దేవాలయములలో అర్చన, గ్రామదేవతల కొలు పులు మొదలైనవిచేయడంచేయించడంఇతనిపని.

9. బడిపంతులు:- ఊళ్ళో పిల్లలకు చదువుచెప్పడం లెక్కలు, వ్రాత, చెప్పడం.

10. కమ్మరి / కంసాలి :— కొల్లన్, లోహాల్, అని కూడ ఇతనికి పేర్లు కలవు. వ్యవసాయానికి కావలసిన కొడవళ్ళు, నాగటి కర్రులు, చక్రపుపట్టాలు వగైరాలు చేయడం. వీరిలోనే కొందరు "కంసాలు" లనియు, "తట్టన్" లనియు పిలువబడుదురు. వీరు సాధారణముగా వెండి బంగారు నగలను చేయుదురు.

11. వడ్రంగి:— రైతులకు కావలసిన నాగళ్ళు, బండ్లువగైరా కొయ్యసామగ్రిని తయారు చేయడం, ఇండ్లకు కావలసిన కలపపని, రాట్నాలు, మగ్గాలు, చేయడం.

12. కుమ్మరి:— కుశవన్, కుంభార్ అనికూడా ఇతనికి పేర్లు. గ్రామస్థులకు కావలసిన యావత్తు మట్టిపాత్రలు చేయడం ఇతనిపని.

13. చాకలి:— "వణ్ణన్", "ధోబీ" అనికూడ పేర్లుకలవు. ఊరి బట్టలు ఉతకడం ఇతనిపని. ఇతడు చేసేపనికి నెల్లూరు జిల్లాలో "ఉద్యోగం" అనేపేరు ఉండడం గమనింప తగియున్నది.

14. మంగలి:— అంబటన్; హజాం; నవిడన్ అని కూడ పేర్లు; కావలసినవారికి క్షౌరము చేయడం ఇతనిపని.

15. చెప్పులు కుట్టువాడు:— చక్కీ; చమార్ — చచ్చిన గొడ్లతోళ్లతో చెప్పులు, మోటబొనలు, ఎడ్ల మెడ పట్టెడలు, వగైరా తోలుసామగ్రి తయారు చేయడం ఈతని పని.

16. గొల్ల (లేక, గోపాలుడు):— గ్రామంలోఉండే పశువులను కాయడం ఈతని పని.

17. వైద్యుడు:— "హకీం", "పరిహారి" అనికూడ ఇతనికి పేర్లు. గ్రామంలో మనుష్యులకు, పశువులకు వచ్చిన రోగాలకు మందిచ్చి కుదర్చడం యితనిపని.

18. దేవదాసి:— "బసివి," "కంచని" - అనికూడ పేర్లుకలవు. దేవుని ఊరేగింపు సమయాలలో, అర్చనా కాలమందు, ఇతర ఊరి వేడుకలలో ఆట పాటలు జరపడం ఈయన పని.

19. గాయకుడు:— ఉత్సవాదులలో పాటకచ్చేరీలు హరికథాకాలక్షేపాలు చేయడం ఈయన పని.

20. కవి:— కవిత్వం చెప్పడం ఈయన పని.

21. షరాబు:— నాణెములు పుట్టిన తరువాత వాటికి మారకం వగైరాలు ఇవ్వడం, నాణెముల మంచిచెడ్డలు పరిశీలనచేయడం ఈయన పని. బహుశః ఇతడే గ్రామస్థులకు కావలసిన అప్పులు కూడ సప్లయి చేయు షాహుకారుగా నుండెనని ఊహించ తగియున్నది.

అప్పిచ్చువాని అవసరము చిరకాలము క్రిందటనే కని పెట్టబడినట్లు సుమతీశతకములోని పద్యమే సాక్ష్యము. ఏ యేర్పాటులు లేకుంటే గ్రామములో కాపురము చేయలేమో, వానిని కూడ యీ పద్యము చెప్పుచున్నది.—

కం॥ అప్పిచ్చువాడు వైద్యుడు
నెప్పుడు నెడతెగక పారు నేరును, ద్విజుడున్
జొప్పడిన యూర నుండుము
జొప్పడ కున్నట్టి యూరు జొరకుర సుమతీ॥ —

అన్ని గ్రామాలలో అన్ని యిరవై ఒక్క సిబ్బంది ఉండ నక్కర లేదు. ఒక్కొక్క చోట, వీలునుబట్టి, రెండేసిడ్యూటీలు ఒకడే చేయటం కద్దు. అవసరంలేనిచోట, కొన్నికొన్ని "పోస్టులు" లేకపోవడం కూడ కద్దు. దగ్గరలో రెండేసి ఊళ్లకు ఒక్కొక్క ఉద్యోగితోనే సరిపుచ్చుకోవడం కూడ కలదు. మొత్తం యిరవైఒక్కటి కాకపోయినా కనీసం ఏ పన్నెండయినా ఈ సిబ్బంది వుంటుంది. దానికే "బారాబులొటీ" అనే పేరు ఇటీవల వచ్చింది.

ఆ యా గ్రామాల సంఖ్య నిర్ణయము ఎవరు ఎట్లు చేసిరి

అప్పటప్పటి అవసరాలనుబట్టి, ఈ సిబ్బందిలో కొన్నింటిని తగ్గించడం, మరికొన్ని కలుపుకోవడం జరుగుతూ వచ్చింది. ఏది ఎట్లున్నను, గ్రామసంఘానికి కావలసిన పనులను గ్రామస్థులే తమలో తాము బతాయించుకొని చేసుకొనుచుండిరనుట స్పష్టము. ఇల్లుచేసికొనుటలో ఏపనికి యెంతమందిఅవసరమో గమనించి

ఆ పనికి అంతమందినే బతాయించు చుండి రనుట నిశ్చయము. ఒకరిద్దరితో కాాల పనికి పదిమందిని బతాయించడం వెర్రి దనము,శుద్ధ దండుగ; పైగా పని చెడుతుంది. ఉదాహరణ:- నూరుమంది గల ఒక సంఘానికి ఒక కంసాలి చాలును; చదువు చెప్పటానికి, ఒకరిద్దరు అయ్యవార్లు చాలుదురు; కాని నూరు మందికి సరిపడు పంట పండించడానికి 70,80 మంది కావలసి వస్తారు. అందుకనే నేడు మన సంఘములో ఆ యా కులస్థుల జనాభా సంఖ్యలు హెచ్చుతగ్గులుగా ఉండడం తటస్థించింది. నేటి జనసంఖ్యలో బ్రాహ్మణులు ఇద్దరు ముగ్గురే ఉన్నారంటే లేక కంసాలులు నూటికి ఒక్కరే ఉన్నారంటే వ్యవసాయ కులు 70, 80 మంది ఉన్నారంటే, దానికి వింత ఏమున్నది? ఈ సంఖ్యానిర్ణయము దేవుడు చేసినదికాదు, దేవుడు నూటికి ఇద్దరు ముగ్గురు బ్రాహ్మణులనే ఏల సృష్టించినాడు? ఇది నిజా నికి దేవుని సృష్టియా? కాదు; మానవుని సృష్టియే. ఆది కాలమందు, భరతఖండములోని మన పూర్వీకులు, సంఘ నిర్మాణమును ఎంతో యోచనాపూర్వకముగ - ఒక చక్కని ప్లాను ప్రకారముచేస్తూ, ఆ యా పనులకు ఎంతమంది అవస రమో అంతమందినే నియమించిరి. హెచ్చుమందినిగాని, తక్కువ మందినిగాని నియమించలేదు. ఈ ఏర్పాటు మంచిదికాదని ఎవ రనగలరు? ఆనాడుచేసిన సంఖ్యానిర్ణయమే ఈ నాటికిని నిలిచి యున్నదంటే, దాని సార్థవ మెట్టిదో తెలుసుకొనండి.

బుర్రల సంఖ్యనుబట్టి, చేతులసంఖ్యను బట్టి, వోట్లు లెక్కపెట్టే రోజు లివి - అంతేకాని, ఆ బుర్రలలో ఏమున్నదో

మెజారిటీ, మైనారిటీ గ్యాంగులు - నేటి వోటింగు పద్ధతివల్ల గలిగినదుర్గ !

ఆ బుర్రలు చేతు ?? ఏమివని చేయ వలెనో, అనేదానితో నిమిత్తం లేకుండ ఇప్పుడు పోయినది. అందు కని, "మాసంఘాలు మైనారిటీ సంఘా లయిపోయిన" వని కంసాలులు, బ్రాహ్మణులు మొద లైనవారు నేడు అఘోరించడం కలుగుతున్నది. ఆదికాల మున ఈ మైనారటీల సమస్య లేదు. ఎవరికి అప్పగించబడిన పనిని వారు చేసుకుంటూ, అందరూ సమంగా భుజిస్తూ, ఎవ రకీ నిరుద్యోగము సేద, పోటీ స్పర్థ అనేది లేని ఆరోజులలో, "మాసంఘుసంఖ్య తక్కువగా ఉన్నదని" అఘోరించేవాడే లేడు - అట్లు అఘోరించవలసిన పనియు లేదు. పైగా, ఒక గ్రామంలో తమ సంఘుసంఖ్య హెచ్చు అయితే, తమ జీవనం పోతుందనే అఘోరింపు ఉండేది. ఉదాహరణ:—ఒక గ్రామంలో ఒక కోమటిదుకాణం ఉంటే, అతనికి సుఖంగా జీవనం జరుగుతుంది. రెండవవాడు వచ్చి దుకాణం పెట్ట గానే మొదటివాడికి కన్నెఱగా ఉంటుంది. ఎందుకంటే, వానిజీవనంలో సగం రెండోవాడు కాజేస్తున్నాడుగా ! కాబట్టి వోట్లు లేని ఆ రోజుల్లో తమ సంఘుము ఒకగ్రామంలో మైనా రిటీగానే ఉండాలని ఆ యా వృత్తులవారు కోరుకుంటూవుండే వారు. ఇప్పుడైనా, వోట్లకోసం వచ్చిన అఘోరింపుగాని, నిజానికి జీవనం గడవడానికి వచ్చిందికాదు. జీవనంకోసమే అయితే, తన సంఘుసంఖ్య హెచ్చు కూడదనే అతడు వాది స్తాడు. అందరికి ఏవోపనులు చెప్పి, అందరికి సంఘుము

· 10

కడుపునిండా అన్నము పెట్టుచున్నప్పుడు, ఎవరికీ ఏ అఘాయిత్యమో రింపూ ఉండదు. అట్టి అత్యుత్తమమైన ఆర్థిక పతకము (Best - Economic plan) చెడిపోవడం, బ్యూరల సంఖ్యను బట్టి అధికారం రావడం తటస్థించిన ఈ రోజులలో మైనారిటీలగోల పుట్టిందంటే పుట్టదూ! ఇది విషయాంతరమైనప్పటికి పూర్వపు గ్రామసంఘనిర్మాణ స్వాభావాన్ని ఉగ్గడించునపుడు నేటి పరిస్థితితో పోల్చిచూపక తప్పదు గాన ఈ మాత్ర మిచ్చుట మైనారిటీలను గూర్చి ప్రసంగించ వలసి వచ్చినది.

సంఘానికి కావలసిన యావత్తుపనులు అందరూ పంచుకొని చేసుకుంటూ, పండినపంటను పాళ్ళవరుసను పంచుకొని అనుభవించుచుండి రని చెప్పియుంటిమి.

పంట పంపిణీ - పండిన పంటలో పాళ్లు ఎట్లు పంచబడెనో 1800 సంవత్సరములో దక్షిణ హిందూస్థానమందు సంచారము చేయుటకై ఈష్టుఇండియాకంపెనీ వారిచే పంపబడిన "డాక్టరు బుచనన్" అను నతని డైరీలో గల ఈ దిగువ అంకెలవలన మనకు కొంత తెలియగలదు. ఒకగ్రామములో రెండువేల నాలుగువందలు గల ధాన్యపురాశిలోనుండి, ఈ దిగువ పంపుళ్లు జరుగుచుండినట్లు ఇతడు చూచెను:—

| | | | |
|---|---|---|---|
| గ్రామపురోహితునకు | ... | 5 | శేర్లు |
| గ్రామధర్మమునకు | ... | 5 | ,, |
| జ్యోతిష్కునకు | ... | 1 | ,, |
| పంచాంగం బ్రాహ్మణునకు | ... | 1 | ,, |
| మంగలికి | ... | 2 | ,, |

| | | | |
|---|---|---|---|
| కుమ్మరికి | ... | 2 | శేర్లు |
| కమ్మరికి, వడ్రంగికి | ... | 2 | ,, |
| చాకలికి | ... | 2 | ,, |
| కొలగారమునకు | ... | 4 | ,, |
| వెట్టికి | ... | 7 | ,, |
| నాయకునకు | ... | 8 | ,, |
| గుమాస్తాకు | ... | 10 | ,, |
| తలారికి | ... | 10 | ,, |
| కరణమునకు | ... | 45 | ,, |
| మునసబునకు | ... | 45 | ,, |
| నీటి సప్లయిదారుకు | ... | 20 | ,, |
| | | 169 | వెరశి. |

గ్రామసిబ్బందికి పంచవలసిన ఈ 169 శేర్లున్నూ సర్కారుకు చెల్లవలసిన రాజభాగమున్నూ పోను మిగతా ధాన్యమును రైతులు తీసుకొనుచుండిరని యూహించవలసి యున్నది. పండినధాన్యమును, రాశిగపోసి, రాశిచుట్టు బంక మట్టితో మందముగ కొంత వెడల్పున పూసి దానిమీద అక్షరములు చెక్కినకొయ్యబల్లతో ముద్రలు వేయుదురు. రాశిలో నుండి ఎవరైనా దొంగిలించినచో ఈ ముద్రలు చెరిగిపోయి దొంగతనము బయటపడును. ధాన్యపురాసులమీద, ఇట్లు కొయ్యబల్లలతో ముద్రలువేయు ఆచారము ఇప్పటికిని కృష్ణా జిల్లా, కైకలూరుతాలూకా గ్రామాలలోనున్న మరి ఇతర జిల్లాలలోకూడ నిలిచియున్నది. సర్కారుకు, రైతుకుమధ్యగాని

రైతుకు, సేద్యగానికి మధ్యగాని పంటపంపిణీ జరుగవలసియున్న ప్రతిచోట ఇదే పద్ధతి. భాగస్థులందరు వచ్చేవరకు ఈ ముద్రలు అట్లే నిలిచియుండును.

గ్రామసహకారపద్ధతి త్రోపుడుపద్ధతి కాదు

గ్రామసంఘ నిర్మాణము పరస్పర పద్ధతి అనే పునాది మీద జరిగినది. సహకార మనగ ఒకని కోసం అందరు పని చెయ్యడం. అందరి కోసం ఒకడు పని చెయ్యడం.

ఉదాహరణ:— గ్రామంలో రైతులందరికోసం సాలె మనిషి బట్టలు నేస్తాడు. సాలెమనిషికోసం రైతులందరు పంట పండించి ఇస్తారు. ఇదేరీతిగా కుమ్మరి రోజంతా కుండలు చెయ్యడంలో నిమగ్నుడై యుంటే, ఆ కుమ్మరికి రైతు ధాన్యం పండించి ఇస్తున్నాడు. సాలె బట్టలు నేసి ఇస్తున్నాడు, చాకలి బట్టలు ఉతికి పెడుతున్నాడు, మంగలవచ్చి క్షౌరము చేస్తున్నాడు. అనగ కుమ్మరి రోజంతా కుండలు చేయుటం అనే తనపని తాను చేసుకుంటూ యుంటే, అన్నం, బట్ట వగైరా తక్కిన వస్తువులన్నీ అతనికి వాటంతట అవి వచ్చిపడుతున్నవి. వానికోసం అతడు ప్రత్యేకంగా కృషి చేయనక్కరలేదు. సంఘంలో మిగతావారంతా ఒక్కొక్కరుగ ఒక్కొక్క వస్తువును తమతమ కృషివల్ల సప్లయి చేస్తున్నారు. ఈ భావములే పార్లమెంటు వారి 5వ రిపోర్టు, 2వ వాల్యూమ్ 49వ పేజీలో కన్పించుట ఆశ్చర్యం. చూడండి! *

" At present, every village considers itself as distinct society, and its general concerns, the sole object of the inhabitants at large; a practice, surely which redounds as much to the public good as to theirs; each having, in some way or other, the assistance of the rest;

ఈరీతిగా తనకృషి ఇతరులకు, ఇతరులకృషి తనకు ఉపయోగబడుచున్నది. ఇదే పరస్పర సహకార ముక్త పద్ధతి. కుమ్మరి తనపని తాను చేసుకుంటూవుంటే, ఇంకొకడు వచ్చి

---

the labours of all yield the rent; they enjoy the profit proportionate to their original interest, and the loss falls light. It consists exactly of the principles upon which the advantages are divided by a division of labour; one man goes to market, whilst the rest attend to the cultivation and harvest. *Each has his particular occupation assigned to him, and insensibly labours for all*; but if each had these several duties to attend to, it is obvious that all the inhabitants must be absent together at those times that are most critical, both to them and to the state; and that they must want those abilities necessary to the performance of the various employments that would arise''.

[Fifth Report: Vol. II - para 349, Quoted from Prakasam's Committee Report, pages 26 & 27].

* "ప్రతిగ్రామము ఒక్కొక విలక్షణమైన సంస్థ. ఆగ్రామ వ్యవహారాలను చక్కగా దిద్దుకోవడం ఆగ్రామస్థుల పని. ఈ పద్ధతివల్ల గ్రామములో వుండే ఆయా వ్యక్తులకేగాక, మొత్తముమీద సమిష్టి సంఘానికి కూడ క్షేమకరము. ప్రతి మనిషికి, తక్కినవారందరియొక్క తోడ్పాటు కూడ ఏదో విధంగా కలుగుతునే వుంటుంది. అందరు కలసి కృషిచేస్తారు. దానివల్లవచ్చిన లాభాన్ని అందరు పాళ్లవరుసను పంచుకుంటారు. నష్టం కూడ ఒక్కడి నెత్తినే పడకుండా, అందరూ తేలికగ పంచుకుంటారు. పని పంపిణీద్వారా లాభనష్టాల పంపిణీకూడ చక్కగ జరిగేసూత్రం ఇందులో వుంది. ఒకడు బజారుకు వెళ్లి పనిచూచుకొని వచ్చేలోగా, ఇంకొకడు వ్యవసాయపు పని చూచుకుంటూ వుంటాడు.

ప్రతివానికి ఒక్కొక్కపని బతాయించబడుతుంది; తాను చేస్తున్న ఈ పనిద్వారా యితడు, తనకు తెలియకుండగనే, మిగతా వారందరికోసం పనిచేస్తున్నట్లు అవుతుంది.

ఈ విధంగా కాకుండా, అందరూ అన్నిపనులు చూసుకోవాలంటే నష్టము వస్తుంది. అందరి తరఫున ఒకడు బజారువెళ్లి సరకులు తెస్తూ ఉంటే తక్కినవారంతా ఇతరపనులు చూచుకుంటూ వుండే సదుపాయం; లేక, అందరూ

తనపనిలో దూరి తనకు పోటీ చెయ్యడం లేదు. తనపనిలో తనకు పోరు, పొక్కు రొష్టు లేదు. అందువల్ల అతనిజీవనానికి ఏమీ లోటుండదు. అతనిజీవనం అతనికి గ్యారంటీ చేయబడినది. అట్లుగాక ఇంకొకడువచ్చి తనపనిలో ప్రవేశిస్తే, అతనికి జీవనం పోతుంది. అప్పుడతడు తన జీవనంకోసం, రెండోవాడితో డీకొన వలసివస్తుంది. ఈ దెబ్బలాటలో ఎవడు బలవంతుడైతే వాడు గెలవడం, రెండవవాడు తిండిలేక మాడడం ఇదీ యూరోపియన్ దేశాలలోని స్థితి. ఇట్టి దెబ్బలాటలు, త్రోపులాటలు మనసంఘనిర్మాణపద్ధతిలో లేవు. ఇట్టి దెబ్బలాటలు వస్తవను భయంచేతనే "ఒకడిపనిలో ఇంకొకరు ప్రవేశించరాదు" అనే నిషేధాన్ని మనవారు ఏర్పరిచారు. స్పర్థను తొలగించడానికి, ఎవడి అన్నము వాడికి గ్యారంటీచెయ్యడానికి ఇంతకంటె మంచిపద్ధతి లేదు.

## ఊరు కట్టబడిన పద్ధతి

మానవసంఘములు అడవులను ఛేదించి గ్రామములను మొట్టమొదటగా నిర్మించుకొన్నప్పుడు మధ్య ఎత్తైన సమ

---

ఒక్కసారే బజారు పనికిపోతే, ఇంటివద్ద వ్యవసాయం వగైరా ఇతర పనులన్నీ మూలపడడం నిజముకాదా? అదిగాక, ఒక్కొక్కనికి ఒక్కొక్క పనిలోనే తెలివితేటలుంటవి. అట్టివానిని ఇతరపనుల కన్నిటికి బనాయిస్తే, అవన్నీ చెడిపోవడంకూడ ఉంటుంది."

[పార్లమెంటువారి 5— వ. రిపోర్టు - రెండవ సంపుటము, 349 పేరా—ప్రకాశంకమిటీ రిపోర్టు 26, 27, వ. పేజీలోనుండి ఎత్తి వ్రాయబడినది]

ఊరినడిబొడ్డు, గ్రామనత్తము లేక గ్రామకంఠము

తలముగనున్న ప్రదేశములో ఇండ్లను కట్టుకొనిరి. చుట్టూ కొంతప్రదేశము పశువులు తిరుగుటకును, ఇంకా క్రొత్తయిండ్లను కట్టుకొనుటకును ఇతరపనులకును ఖాళీగా ఉంచుకొనిరి. ఇండ్లు, వాకిండ్లు, దొడ్లు పాటిపెరడులుగల ఈ నడిబొడ్డు ప్రదేశానికే "నత్తము" లేక "గ్రామనత్త" మనియు "గ్రామకంఠ"మనియు పేర్లుండెను. గ్రామకంఠమును ఆనుకొని చుట్టూ సాగుబడిభూములున్నూ, దానికి ఆవల బంజరుభూములున్నూ, ఉండెను. సాగుబడి భూములలో కొన్ని పల్లపు పంటవి. కొన్ని మెట్టపంటవి. మాగాని (అనగ పల్లపు)పంటలో సర్కారు సాధారణముగ పంటభాగమును తీసుకొనుచుండెను. ఈ పంటలో సర్కారువంతునకు "కోరు" అనియు, రైతువంతునకు "మేడెపాలు" అనియు పేర్లుండెను. మెట్టపంటమీద నాణెరూపముగ కొన్నిచోట్ల శిస్తు విధింపబడుచుండెను. అందువల్ల దక్షిణదేశములో సర్కారుకు పంటభాగ మిచ్చే మాగాని ప్రదేశమునకు "వరపట్టు" అనియు, నాణెరూపముగా శిస్తు చెల్లించే మెట్టభాగమునకు "తీర్వపట్టు" అనియు పేర్లు వచ్చెను. సాగుబడిభూమిని దాటి, ఇంకాదూరముగ పోతే బంజరుభూములుండును. దీనికే "తరిసు" అని అరవదేశములో పేరు. దీనిలో రెండురకములు. కొంతకాలము సాగుబడి అయి, ఇప్పుడు బంజరుగ వదలిపెట్టబడిన దానికి "పెయికల్ కరంబు" అనియు, ఆదినుండి బంజరుగానే

మాగాని, మెట్ట

కోరు, మేడెపాలు

వరపట్టు, తీర్వపట్టు

తరిసు; లేక బంజరు

ఉన్నదానికి "అనాదికరంబు" లేక, "అనాదిబంజరు" అనియు పేర్లు.

బంజర్లు - వాని తరగతులు

బంజరు భూములమీద హక్కు అనాదినుండి గ్రామ సంఘానిదే అయినప్పటికి, ఇటీవల బ్రిటీషు గవర్నమెంటు వచ్చిన తరువాత, ఆ హక్కు (మలబారు జిల్లాలో తప్ప మిగత అన్నిప్రదేశాలలో) మాదే నని గవర్నమెంటువారు అనజొచ్చిరి. ఈ సంగతి మొదటి అధ్యాయములో చెప్పియే యున్నాము. బంజర్లను ఇంగ్లీషు గవర్నమెంటువారు ముఖ్యముగ మూడు రకాలుగ విభాగించిరి: (1) శిస్తు కట్టబడినది (assessed waste) (2) శిస్తు కట్టబడనిది (Unassessed waste) (3) పోరంబోకలు.

శిస్తు కట్టబడిన బంజర్లు Assessed waste

1. శిస్తు కట్టబడిన బంజరు :— దీనిలో తిరిగి మూడురకాలున్నవి:-

(a) సాగుకు పనికివచ్చు నను నిశ్చయములో తరం శేటు నిర్ణయింపబడిన భూమి అయినను దాని నింకను ఎవరు సాగు క్రిందికి తేలేదు.

(b) సాగు చేస్తూ చేస్తూవున్న దానిని రైతులు ఏకారణము చేతనో వదలివేసిన భూమి.

(c) శిస్తు బకాయిల క్రింద సర్కారువారే వేలంలో కొనివేసిన భూమి.

శిస్తు కట్టబడని బంజరు

2. శిస్తు కట్టబడని బంజరు :— Unassessed waste సాగుకు అప్పటికి పనికి రాదనే ఉద్దేశ్యంతో శిస్తు (తరం) నిర్ణయించకుండ వదలివేయబడిన భూమి.

పోరంబోకలు

3. పోరంబోకలు :—పబ్లిక్ పనులకు పనికి వచ్చే భూములున్నా అసలే సాగుకు పనికిరావనే భూములున్నా, ఈ బాబతు క్రింద చేర్చబడినవి. వీనికి శిస్తు (తరం) కట్టబడ లేదు.

దక్షిణకన్నడ, మలబారు జిల్లాలలో ఊరు కట్ట బడిన పద్ధతి వేరు

దక్షిణకన్నడజిల్లా యావత్తు కొండలు అడవులతో నిండియుండుటవల్ల తక్కిన సమతల ప్రదేశములో నున్న మాదిరిగా గ్రామాలు కట్టబడ లేకని లోగడనే చెప్పియుంటిమి. ఇండ్లన్నీ ఒకచోట వుండవు - అందువల్ల, గ్రామకంఠ మనేది అచ్చట లేదు. ఎవరి "వర్గ"లో పొలములో వారు దూరదూరముగా ఇండ్లు కట్టుకొని కాపురముందురు. ఇక మలబారుజిల్లాలో కూడ దాదాపు అట్లే, ఒక్కొక్క "జన్మి" క్రింద వందలకొలది ఎకరాల పొలాలు, తోటలు వుంటవి. అవి పెద్ద ఎస్టేట్లుగ వుంటవి, వారి కుటుంబానికి 'తరవాడ్'

"మలబారు తరవాడ్"

అనిపేరు. అది పెద్దజాయింటు కుటుంబము, ఒక్కొక్క తరవాడ్లో, 20, 30, మంది స్త్రీలు పురుషులు జాయింటుగ ఒకకుండలో కూడు తింటూవుంటారు. భూమిహక్కు స్త్రీద్వారా (ఆడపడచు ద్వారా) సంక్రమిస్తూ ఉంటుంది, తక్కిన వారందరు మనోవర్తిదార్లే! ఇట్లోవున్నవాళ్లు కుండలోకూడు తినిపోవడానికే

తప్ప ఇతర హక్కులేమీ తక్కిన వారికి లేవు. ఇది మలబారు జిల్లాలోని విచిత్రపు సాంప్రదాయము. రివిన్యూపరిపాలనా సౌకర్యం కోసం కొన్ని ఎస్టేట్లు కలిసి ఒకగ్రామం క్రింద లెక్కపెట్టబడుచున్నది. దీనికే "దేశమ్". అనియు "అంశం" అనియు పేర్లు.

మలబారులోని "దేశం", "అంశం"

మానవుడు ఒంటరిగ అరణ్యములలో మృగములను వేటాడు దశ నుండి, దేశద్రిమ్మరిగుంపుదశలోనికిని అచ్చట నుండి సుస్థిరగ్రామవాసములోనికిని ఎక్కి వచ్చినట్లే కాలక్రమమున గ్రామములనుండి ఖండములు, మండలములు, రాష్ట్రములు, సామ్రాజ్యములు, వెల్లివిరిసినవి. ఇట్టి సామ్రాజ్యము లేర్పడుట నాగరక లక్షణ మని చెప్పుకొందురు. ఇట్టి సామ్రాజ్యము లేర్పడినను వానికి పునాది గ్రామమే. రాజ్యాంగమునకు కావలసిన ధన ధాన్యసంపత్తి అట్టడుగున నున్న గ్రామమునుండి రావలసినదే! మన రాజ్యాంగనిర్మాణపద్ధతులు మనుధర్మశాస్త్రమునందును ఇటీవల మౌర్యసామ్రాజ్యములో వెలసిన చాణక్యుని అర్థశాస్త్రమందును వివరింపబడియున్నవి. అవి అప్పటికాలము నాటి పరిస్థితులను తెలుపుచున్నవి.

గ్రామము అనే పునాదినుండి పైకి అంతస్తులుగ లేచిన రాజ్యాంగముల నిర్మాణము

గ్రామము అనునది సంస్కృతపదము. సైజునుబట్టి చిన్నవానికిన్ని శివార్లకున్నూ "ఉపగ్రామము"లని పేర్లు ఉండెను. తెలుగు

గ్రామము వేర్వేరు పేర్లు

శివారు ఉపగ్రామము "ఊరు"

"పట్టీ" "కురిచి"

కోట

"అగ్రహారము" "మంగలము"

అరవము కన్నడము జిల్లాలలో దీనికే "ఊరు" అనిపేరు. అరవదేశములో 'కళ్లరు' లనబడు ఒకజాతి శూద్రులు నివసించు గ్రామమునకు "పట్టీ" లేక "కురిచి" అని పేరు. ఉదాహరణ:- చోకంపట్టి, కల్లడై కురిచి. కోటవున్న గ్రామానికి "కోట" అని పేరు. ఉదాహారణ:- విన్నకోట, చిగురు కోట ఇత్యాదులు. బ్రాహ్మణులు నివసించే గ్రామానికి "అగ్రహార"మనియు, "మంగలమ్" అనియు పేర్లు. ఉదాహారణము:- "కుమారమంగలమ్" అనే ఊరు దక్షిణాదిని కలదు. చంగల్పటు జిల్లాలో గ్రామములకు "నత్తము" లనిపేరు. ఇటీవల ఈ మాట శూద్రులు నివసించే గ్రామాలకు వాడబడుచున్నది.

నత్తము

శుక్రనీతిసారమనే పురాతన గ్రంథాన్ని పట్టి చూడగా ఒకకోసు (అనగ రెండుమైళ్లు) విస్తీర్ణము, గలిగి, ఒకవెయ్యి వెండి, "కర్షము".రాబడి గల ప్రదేశానికి "గ్రామము" అనే నిర్వచనము కనబడుచున్నది. దీనిలో సగంవిస్తీర్ణము సగంరాబడి గలదానికి "పల్లీ" అని పేరు. పల్లీలో సగానికి "కుంభ" అనిపేరు.

"పల్లీ" "కుంభ"

## రా జో ద్యో గు లు

మనుధర్మశాస్త్రప్రకారం గ్రామమునుండి పైవరకు ప్రభుత్వోద్యోగులద్వారా పరిపాలన సాగుచుండెను. అట్టిదుగున

నున్న గ్రామానికి ఒక అధికారి. ఇతడు ఒక గ్రామానికి ప్రభు వట. రాజ భాగములో అన్నానికి, వస్త్రానికి, ఇతర అవస రాలకు సరిపడ ఇతడు తీసుకొంటాడట. ఇది అతనికివ్వబడే ప్రతిఫలము. ఇతనిపైన పదిగ్రామాలకు ఒక అధికారి ఉండును. ఇతనికి "రెండు అరకల" పంట ప్రతిఫలముగా ఇవ్వబడునట. రెండు అరకలనగ, మూడుజతల ఎడ్లచే లాగబడే రెండునాగళ్లు దున్నే ప్రదేశములో పండే పంట. ఇతనిపైన, ఇరవైగ్రామా లకు ఒక అధికారి. ఇతనికి పది అరకలపంట ఇవ్వబడును. ఇతని పైన, నూరుగ్రామాల కొక అధికారి. ఒక పట్టణముమీదవచ్చే రాబడి ఈతనికి జీతం. వీరందరిపైన, వెయ్యిగ్రామాలకు ఒక అధికారి. బహుశః ఇత డొక మండలాధిపతి కానోపు. ఇతడు సరాసరి పైనున్న రాజుకే బాధ్యుడు. ఒక పెద్ద నగరంమీద వచ్చేరాబడి ఇతనికి జీతం.

చంద్రగుప్త మౌర్యుని కాలములోకూడ ఇట్టి ఏర్పాటే యుండెను. ఒక గ్రామానికి అధికారిగా నున్న వానిపైన,

"గోప" "గోప" అనే ఉద్యోగి యుండెను. బహుశః ఇతని క్రింద 5 మొదలు 10 గ్రామముల వరకు ఉండేవి.

"స్థానిక" ఇట్టి గోపులపైన "స్థానికు" డనే అధికారి యుండెను. ఇత డొక జిల్లాఅధికారి అని చెప్పవచ్చును. ఇతనిపైన గవర్నరు, గవర్నరుపైన రాజు ఉండెను.

ఈ మౌర్య సామ్రాజ్యములో రాజధానిని ఆనుకొని యున్న రాష్ట్రము, కేంద్ర ప్రభుత్వ యాజమాన్యమున నే

ప్రాదేశికులు; మహామాత్రులు; మండలేశ్వరులు; రాజస్థానీయులు; విషయపతులు;

యుండెను. దూరప్రదేశములందున్న రాష్ట్రాల పరిపాలన నిమిత్తం రాజధానినుండి గవర్నర్లు లేక వైస్రాయిలు పంపబడుచుండిరి. అశోక చక్రవర్తి కాలములో మగధరాష్ట్రము కేంద్ర రాష్ట్రముగ నుండెను. ఇదిగాక, దూరముగ ఇంకను నాలుగైదు రాష్ట్రములు ఉండెను. వీటిని పాలించు వారికి "ప్రాదేశకులు" "మహామాత్రులు" "మండలేశ్వరులు" "రాజస్థానీయులు" "విషయపతులు" అనుపేర్లు అశోకుని శిలాశాసనములోను, ఇతరశాసనములలోను

"అంతఃఫలలు"

గనపించుచున్నవి. రాజ్యపు పొలిమేరలను కాపాడుటకు, "అంతఃఫలలు" అనే ఉద్యోగు లుండిరి.

ఈ ఏర్పాట్లు ఎప్పుడెట్లు మార్పుచెందుచు వచ్చెనో తప్సీలుగ తెలుసుకోడానికి ఆధారములు లేవు. అయినా ఇటీవల ప్రచురమైన పూర్వశాసనములను బట్టి చూడగ, దక్షిణ హిందూస్థానములో ఈ దిగువ ఏర్పాట్లు ప్రబలినట్లు తెలియ గలదు.

ఒక గ్రామములో ఇరువురు ఉద్యోగు లుండిరి. ఒకని పేరు గ్రామపెద్ద, లేక గ్రామాధికారి. ఇతడు ఈనాటి గ్రామమున సబును పోలియున్నాడు. రెండవ యతని పేరు కరణము. లెక్కలు వ్రాయుట ఇతని పని. కొన్ని గ్రామములు కలసి, "నాడు;" "ఖండము," "మాహాణం;" "విషయం" అనే పేర్లతో పిల్వబడుచుండెను. దీనికి అధికార్లు "దేశముఖ్;" "దేశపాండ్యా" అనువారు. ఒక గ్రామమునకు మునసబు కరణములెట్లో, ఒక "నాడు"కు "దేశముఖ్," 'దేశపాండ్యా'

లట్లు. "దేశపాండ్యాకు" "కనుంగో" అని కూడ పేరు. కొన్ని నాడులు కలసి, "మండలం," "వలనాడు;" "ప్రాంతము" "రాష్ట్రము" అనబడుచుండెను. దీనికి అధికారియగు వానికి అరసు; పెరుమాళ్; రాజా; నాయక్; సర్ దేశముఖ్; అను నామాంతరము లుండెను. "నాడు"కు దేశపాండ్యా ఎట్లో, మండలమునకు "సర్ దేశపాండ్యా" లేక "దేశకుల్ కారిణీ" యను అధికారి అట్లు. వీరందరిపైన రాజుండెను. పైన పేర్కొన బడిన వారందరు, రాజుకు లోబడిన ఉద్యోగస్థులే గాని, భూమికి హక్కుదారులు కారు.

హిందూరాజుల కాలములో గల ఈ యుద్యోగుల ఏర్పాట్లు కంటికి సులభముగ కనబడుటకై ఈ దిగువ పట్టికలో కనపరచెదము.

| | | |
|---|---|---|
| 1. గ్రామము | గ్రామాధికారి (ఇప్పటి విలేజి మునసబు) | గ్రామకరణము |
| 2. నాడు, ఖండము, మాహాణం విషయము "హోబిలి" (కన్నడం) "బిసి" (ఓఢ్రము) | దేశముఖ్ | దేశపాండ్యా (లేక కనుంగో) |
| 3. మండలము, వలనాడు ప్రాంతము, రాష్ట్రము | అరసు; పెరుమాళ్ రాజా నాయక్ సర్ దేశముఖ్ | సర్ దేశపాండ్యా దేశకుల్ కారిణీ |

రాజు

మహమ్మదీయ పరిపాలనలో సామ్రాజ్యము యావత్తు సుభాలుగను, సుభాలు సర్కారులుగను, పరగణాలు వగైరాలుగను విభజింపబడెను. ఆ ఏర్పాట్లను ఈ దిగువ పట్టీలో చూపెదము:—

సుభా. [దీనికి సుబేదార్, నాజిమ్ అను పేర్లు గలవారు అధికారులు, వీరి హోదా ఇప్పటి వైస్రాయి హోదాను పోలియున్నది.]

|

సర్కారులు (ఉదాహరణ:- దక్కన్ సుభాలో గల ఉత్తర సర్కారులు)

|

పరగణా (లేక మహల్)

|

తరఫ్ (తాలూకా)

|

కిస్మత్

|

మౌజా (అనగ, గ్రామము)

అక్బరు బాదుషా కాలములో మొగలు సామ్రాజ్యమంతయు మొదట 15 సుభాలుగ విభజింపబడెను. బీజపూరు, గోల్కొండ, రాజ్యాలను జయించిన పిమ్మట, ఈ సంఖ్య 18 కి హెచ్చింపబడెను. ఒక్కొక్క సుభాకు "సుబేదారు"డను అధికారి నియమింపబడెను. ఇతడు సాధారణముగ రాజకుటుంబములోని వాడై యుండెను. బాదుషాకు తమ్ముడో, బావమరదియో లేక అత్యంత ఆప్తుడో సుబేదారుగ నుండెను.

## రాజోద్యోగులకు మాన్యములు లేక జీవిత భృతులు

ఈ యుద్యోగుల కందరకును చక్రవర్తి చేత మాన్యములో, రివిన్యూలో భాగములో జీవితమునకు ఇవ్వబడుచుండెను. కరణం మునసబులకును, ఇతర గ్రామ

మాన్యములు

సిబ్బందికిని, తరుచు మాన్యములు ఇవ్వబడుచుండెను. ఈ మాన్యములు ఒక్కొక్కప్పుడు కేవలము భూమి రూపముగను, ఇంకొక్కప్పుడు శిస్తురూపముగను ఇవ్వబడుచుండెను. వీనిలో మొదటిరకమునకు, "నిలమాన్యము" లేక, "సర్వమాన్యము" అనియు, రెండవరకమునకు, "తీర్వమాన్య" మనియు పేర్లు. ప్రప్రథమమున, గ్రామము నిర్మాణమైనప్పుడే, ఇవ్వబడిన మాన్యములకు "తరపడి మాన్యము"లని పేరు. గ్రామానికి నౌకరీ చేసినందుకు ప్రతిఫలముగా, ఈ మాన్యము లివ్వబడినవి గావున, ఆయావ్యక్తులు ఆనౌకరీ చేసినంతకాలమే ఈ మాన్యములు చెల్లుచుండెను. భూములు ఇనాములుగ ఇవ్వబడిన గ్రామ నౌకర్లు, "మిన్నకొపా"లని కడప జిల్లాలో పిల్వబడుదురు. ప్రభువుచే ఇవ్వబడిన ఈ మాన్యములుగాక, గ్రామస్థులచే కూడ తమ పంటలో కొలది భాగములు గ్రామ

సిబ్బందికి ఇవ్వబడుచుండెను. వీనికే "మేర"

మేరలు, రుసుములు "వర్తన" "స్వతంత్రం"

లనియు; "రుసుము" లనియు, దక్షిణాదిని; "వర్తన" "స్వతంత్రం" అనియు పేర్లు. ఇవి గ్రామస్థులు ఇచ్చేవి గనుక, గ్రామసిబ్బంది గ్రామస్థుల మంచి తనమును సంపాదించుకొనునట్లు చేయుటను తోడ్పడుచుండెను. ఈ సుగుణమును గ్రహించియే,

ఇంగ్లీషు గవర్నమెంటువారుకూడ చాలకాలము ఈ 'మేరలను' "రివిన్యూ రికవరీ ఆక్టు" 52వ శెక్షనులో స్పష్టముగ అంగీకరించిరి. కాని రైతువారీపద్ధతిని ఏర్పరచిన తరువాత "మేర" లను రద్దుపరుస్తూ, వాటి స్థానే "విలేజిసెస్సు" అనబడుదానిని గ్రామసిబ్బంది పోషణార్థై గ్రామస్థులనుండి వసూలుచేయసాగిరి. అప్పటినుండి గ్రామాధికార్లు గ్రామస్థులనుండి "మేర"లు వసూలుచేయరాదని నిషేధించిరి. అట్లు వసూలుచేసికొన్న గ్రామాధికార్లు శిక్షకు పాత్రులుగ నెంచబడిరి.

"విలేజి సెస్సు"

హిందూదేశములోని గ్రామసంస్థల నిర్మాణము ఇంగ్లాండుదేశముకంటె అత్యుత్తమముగా నుండెనని డాక్టరు "కాల్డువెల్" అను ఒక ఇంగ్లీషు బిషప్పు చెప్పుచున్నాడు. అతని మాటలు వినుడు. *

ఇండియా గ్రామానికీ ఇంగ్లాండు గ్రామానికీ తేడా

* "........The greater number of English towns and *all English villages are mere collection of houses*, without any bond of connection or corporate life, without rules, without office bearers, and without any organisation, for the preservation or advancement of the common interests. *In India on the contrary, every village of any respectability is an incorporation.* It has its council of headman, its rights of jurisdiction, its revenues, and its meetings for the transaction of its public business"............the organisation is so ancient and firmly established that it may be regarded as the most permanent institution in India........".

"ఇంగ్లాండు పట్టణాలలో చాలవరకున్నూ, ఇంగ్లాండు గ్రామాలన్నిన్నీ వట్టి ఇండ్లగుంపులేగాని వేరుకాదు. ఒక ఇంటికి ఇంకొక ఇంటికి సంబంధము లేదు. సమష్టిభావములేదు. సమష్టి ప్రయోజనములను పాలించుటకు, కాపాడుటకు, పెంపొందించుటకు ఏ విధమగు కట్టుబాట్లుగాని, సంఘనిర్మాణము

## పురాతన గ్రామపాలనా విధానము – అప్పటి ఎన్నిక పద్ధతి

పూర్వము గ్రామపరిపాలన ఎట్లు జరుగుచుండెనో ఇటీవల ప్రచురమైన కొన్ని తమిళశాసనములను బట్టి స్పష్టముగ తెలుసుకొనవచ్చును. ప్రతిగ్రామానికి ఒక "పెద్దల సభ" ఉండేది. దీనికి "గ్రామపరివర్తకము" అనిపేరు. బ్రహ్మదాయ, దేవాదాయ గ్రామాలలో దీనికే "సభ" లేక "మహాసభ" అనిన్ని, ఇతర గ్రామాలలో "కూటమ్" "ఊరుకూటమ్" అనిన్నీ పేర్లు ఉండెను. గ్రామములో భాగముగల ప్రతిభాగస్వామికి, ఈసభలో సీటుఉండెను. అతడు బ్రాహ్మడైనట్లయితే, కనీసము ఒకధర్మశాస్త్రములోనైనా ప్రవీణుడై యుండవలె ననే నియమముకూడ ఉండెను.

"గ్రామపెద్దలసభ"
'గ్రామపరివర్తకము'
"ఊరుకూటమ్"

పనులు ఎక్కువబాగా జరిగేనిమిత్తం ఈ సభలోనుండి అనేక చిన్న కమిటీలుగూడ ఏర్పాటు చేయబడెను. చెరువుల కొకకమిటీ, సత్రాల కొకకమిటీ, పైఅజమాయిషీ కొకకమిటీ,

---

గాని, లేదు. గ్రామ సిబ్బంది అంటూలేదు. గ్రామపాలకులులేరు. ఇండియా యందన్ననో అట్లుగాదు- "గ్రామ"మని యేమాత్రము చెప్పకోతగ్గదైనను, చక్కని సమష్టి సంఘనిర్మాణముతోకూడియున్నది. దానికొక "పెద్దలసభ" అంటూవున్నది. దానికి ప్రత్యేకపు ఆదాయము, ప్రత్యేకపు సిబ్బంది, ప్రత్యేకపు అధికారాలు వున్నవి. గ్రామ వ్యవహారాలను నడపడానికి గ్రామపెద్దలు సభ చేసి తీర్మానాలు చేస్తూవుంటారు............ఈ గ్రామసంఘము అనాదినుండి ఇండియాలో సుస్థిరమును, శాశ్వతము అగు సంస్థగ ఎన్నదగి యున్నది."

తోటల కొకకమిటీ—ఇట్లే అనేక కమిటీలు ఉండెను. ఈ కమిటీలకు మెంబర్లను ఎన్నుకోడానికి ఏర్పడినరూల్సు పరాంతకుని ఉత్తరమల్లూరు శాసనములో తప్సీలుగా కనుపించుచున్నవి. ఓటర్ల అర్హతలు, ఎన్నికపద్ధతులుకూడ ఈ శాసనమునందు వివరించబడినవి. ఉత్తరమల్లూరుగ్రామము ముప్ఫై వార్డులుగ విభజింపబడెను. ప్రతి వార్డులోను అర్హతగల వోటర్ల పేర్లు వేరు వేరు చీట్లమీద వ్రాయబడును. ఏవార్డు చీట్లు ఆ వార్డుకు వేర్వేరు కట్టలుగ కట్టబడును. ఈముప్ఫైకట్టలు ఒకకుండలో పెట్టుదురు. అప్పుడు గ్రామస్థు లందరు పెద్దసభగ కూడుదురు. పురోహితుడు కుండను అందరికి కనపడునట్లు చేతులతో పైకెత్తి పట్టియుండును. ఒక చిన్న కుర్రవాణ్ణి సభనుండి పిలిచి, కుండలోనుండి ఒకకట్ట తీయుమందురు. ఈ కట్టను వేరే ఖాళీకుండలో పెట్టి కట్ట ఊడదీసి, కుండ కుదిలించి, దానిలోనుండి ఒక చీటిని కుర్ర వానిచే తీయించి, ఒక మధ్యస్థుని చేతిలో నుంచమందురు. మధ్యస్థు డీ చీటిని తన అరచేతిలో వ్రేళ్లు విడమరచి యుంచి తీసికొని దానిమీద పేరును బహిరంగముగ చదువును. ఇట్లే అన్ని వార్డులకు చీట్లద్వారా పేర్లు దీయబడును. ఇదే ఎన్నిక. ఈ ఎన్నిక సాధారణముగ సంవత్సరమున కొకసారి జరుగును.

**చిన్న కమిటీలు - పరాంతకుని ఉత్తర మల్లూరు శాసనము— గ్రామ ఎన్నికలు**

**వార్డులవిభజన - ఓటర్ల అర్హతలు—ఎన్నికపద్ధతి**

టమటమా మూలముగ సభికులందరు గ్రామములో

ఏ చెట్టుక్రిందనో, దేవాలయములోనో సమావేశమై చర్చించి తీర్మానములు చేయుచురు. అవసరము వచ్చినపుడు వోటింగు తీసికోబడును. అనుకూలురు "అనుకూల" మనియు, ప్రతికూలురు "ప్రతికూల" మనియు నోటితో చెప్పుదురు. నిజమగు అభిప్రాయభేదము సహించబడును కాని మొండితనముగ పనిసాగకుండ అడ్డుతగిలే మెంబరుకు జరిమానా విధించుటకు సభవారికి అధికారముండెను. సభలో జరిగిన తీర్మానాలు, ఇతర సంగతులు ఒక మధ్యస్థునిచేత గ్రంథస్థము చేయించేవారు. సాధారణముగ కరణమే మధ్యస్థుడుగ వుండేవాడు. ఒక్కొక్కప్పుడు సభ జరుగుచుండగ ఎవరైన రాజోద్యోగికూడ రావడంకద్దు.

గ్రామసభ మీటింగు-తీర్మానాలు

గ్రామవ్యవహారాలన్నిటిపైన గ్రామ ఆస్తిపైన అధికారం ఈ గ్రామసభదే. భూములు అమ్మడం, మార్చడం, దానం ఇవ్వడం, ధర్మాదాయ దేవాదాయములను పాలించడం, ఇతరగ్రామ సంఘాలనుండి సొమ్ము అప్పు తేవడం; వారికి అప్పుఇవ్వడం శిస్తులేకుండ భూములివ్వడం, మొదలైన మెన్నో అధికారాలను ఈ సభ చెలాయించేది. గ్రామసభలే కాకుండ జిల్లాకంతకుకూడ ఒకసభ లేక ఒక సంఘ ముండేది. దానికే "నాడుకూటమ్" అనిపేరుండెను. జిల్లాకంతకు సంబంధించిన విషయాలను ఈ సభ చూచుచుండెను.

గ్రామసంఘానికున్న అధికారాలు

నాడు కూటమ్

రాజులు గ్రామముమీద రావలసిన రివిన్యూను మొత్తముగ గ్రామసంఘమునుండియే రాబట్టుకొనుచుండిరిగాని విడివిడిగా ప్రతిరైతునుండికాదు. వ్యక్తులు విడివిడిగ గ్రామసంఘానికి చెల్లించడమున్నూ, గ్రామసంఘము రాజుకు చెల్లించడమున్నూ జరుగుచుండెను.

రాజభాగానికి, అనగ శిస్తుకు, గ్రామసంఘమంతా జాయింటుబాధ్యత

రాజుకు సంబంధించినంతవరకు అందరికీ జాయింటు బాధ్యతయే యుండెను. గ్రామసంఘమే పోయి రాజుతో "మావూరిమీద ఇంతశిస్తు చెల్లిస్తామని" ఒప్పుకొనివచ్చును. ఈ శిస్తును గ్రామస్థులు తమలో తాము దామాషాను పంచుకొని సదరు సంఘమునకు చెల్లించుచుందురు. అక్బరు పాదుషాకాలములోను; దరిమిలా ఇంగ్లీషు ప్రభుత్వపు మొదటిరాజుల కాలములోను కూడ శిస్తుకు గ్రామమంతా ఒకటే జాయంటుజబాబు దారీగ నుండెను. రైతులు భూములను ఉమ్మడిగ సాగుచేసుకొనుచు; మెరుగు తరుగు భూములను అప్పుడప్పుడు మార్చుకొనుచు; పంటలు పంచుకొనుచు; శిస్తును గ్రామసంఘానికి చెల్లిస్తూ వుండేవారు.

## గ్రామసంఘాలు నశించుటకు కారణములు

ఇట్టి గ్రామసంఘములు కాలక్రమమున ఇంగ్లీషు రాజ్యములో నశింపైపోయెను. దానికి మూడునాలుగు కారణములు ఏర్పడెను. దానిలో ముఖ్యమైనది; ఇంగ్లీషు గవర్నమెంటువారు ఏర్పరచిన; "రైతువారీపద్ధతి". దీనిలో జాయింటు బాధ్యతలేదు. ప్రతిరైతుతోను విడివిడిగా గవర్నమెంటు

నేరుగ సంబంధము పెట్టుకొని; శిస్తు వసూలు చేయసాగినందున గ్రామసంఘము ఉండవలసిన పని లేకపోయెను. గ్రామస్థులు గ్రామనౌకర్లకు మేరలు తామే యిచ్చుచున్నంతకాలము గ్రామస్థులు అధికార్లుగ నుండిరి. వారి మంచితనము సంపాదించుకోవలసిన బాధ్యత గ్రామనౌకర్ల కుండెను. ఎప్పుడైతే మేరల పద్ధతి తొలగింపబడెనో; అప్పుడు "గ్రామనౌకర్లు" స్వతంత్రులై "గ్రామాధికార్లు" అయిరి. గ్రామసంఘమును వారు లక్ష్య పెట్టవలసిన పనిపోయెను. గ్రామసంఘము విచ్ఛిన్నమగుటకు ఇది రెండవకారణ మయ్యెను.

పూర్వపు గ్రామాలను విడగొట్టడము; ఒకటి రెండు గ్రామాలను కలిపి గ్రూపుచేయడం మొదలైన పనులు గవర్నమెంటువారే చేస్తూ రావడంవల్ల; గ్రామసంఘము ఉండవలసిన పని పోయెను. లా దృష్టిలో గ్రామసంఘ మనేదే మాయమైపోయెను.

సివిల్ క్రిమినల్ కోర్టులు ఏర్పడుటవల్ల కూడ గ్రామ స్వపరిపాలన చెడెను.

"డిసెంట్రలైజేషన్" వికేంద్రీకరణము- అనగ, రాజ్యాధికారాన్ని ఒక్కచోటనే గుప్పెటలో బిగబట్టి కూర్చున్నట్లు గాక, సర్వత్ర వ్యాపింప చేయాలనే విషయాన్ని గురించి విచారించుట కేర్పడిన రాయల్ కమిషన్ వారు రిపోర్టు 1వ వాల్యూమ్. 237 పేజీ; 696 పేరాలో ఇట్లని వ్రాసిరి. ఈ

యంశమును ప్రకాశంకమిటీ రిపోర్టు 22 వ పేజీనుండి ఎత్తి ఈ దిగువ వ్రాయుచున్నాము. *

గ్రామసంఘముల విచ్ఛిన్నత అమితపన్నులు కారణము చేత మహమ్మదీయ పరిపాలన అంత్యదశలోనే కొద్ది కొద్దిగ సాగెను. ఉత్తరసర్కారులలో; (తెలుగు కోస్తావెంట) మహమ్మదీయ పరిపాలన చాలాకాలము క్రిందటనే ఏర్పడియుండుట వల్ల ఈ ప్రాంతములో గ్రామసంఘములు చాలకాలము క్రిందటనే సడలిపోయెను. కాని; దక్షిణాదిని మహమ్మదీయుల తాకిడి హెచ్చుగా లేనందున; అక్కడ గ్రామసంఘములు మొన్న మొన్నటివరకు నిలిచియుండెను. చంగల్పట్టు వగైరా జిల్లాలలో ఈ సంఘములు "మిరాశీగ్రామములు" అను పేరుతో నిలిచియున్నవి.

* "The Indian villages formerly possessed a large degree of local autonomy since native dynasties did not, as a rule, concern themselves with the individual cultivators, but regarded the village as a whole . . . . . as responsible for the payment of the Government revenues and the maintenance of local order. *This autonomy has now disappeared owing to the establishment of local, civil and criminal Courts*, the present revenue and police organisation, increase of communications"

"పూర్వము హిందూదేశములో గ్రామములకు చాల స్వతంత్రాధికారము ఉండేది. ఎందువల్ల నంటే, గవర్నమెంటు రివిన్యూకుగాని, గ్రామాలలో శాంతి భద్రతలు కాపాడడానికిగాని, గ్రామాలలో ప్రతివ్యక్తితోను గవర్నమెంటు జోక్యం పెట్టుకొనేదికాదు. గ్రామమంతా జవాబుదారీగా చూచుకునేది. అయితే లోకల్, సివిల్, క్రిమినల్ కోర్టులు పెట్టడంవల్ల, ఇప్పుడు ఈ స్వాతంత్ర్యం మాయమై పోయింది. ఇప్పుడు రివిన్యూ, పోలీస్, ఏర్పాట్లు ళ్లనున్నూ రైళ్లువగైరా శీఘ్రయాన సౌకర్యాలవల్లనున్ను కూడ, ఈ గ్రామ స్వాతంత్ర్యము మాయమైపోయింది.

## ఇప్పటికిని కొద్దిగ నిలిచియున్న "మిరాశీ"గ్రామములు

గ్రామమంతయు మిరాశీదార్లనబడు భాగస్వాములకు జాయింటు హక్కు భుక్తములు కలిగియుండును. భూముల మెరుగు తరుగుల బట్టి: మెట్ట పల్లపు భూములు సమాన వాటాలుగ విభజింపబడును. ఒక్కొక్క వాటాకు "పంగు" అని పేరు. ఒక్కొక్క వాటాదారునకు ఈ భూములలోనేగాక, ఉమ్మడిగ ఉంచుకోబడిన భూములలో గల సౌకర్యములను అనుభవించుటకు హక్కు ఉండును. ఒక వాటాలో గల భూమి అంతా ఒకేచోట ఉండవలసిన పని లేదు. మెరుగు తరుగులను బట్టి, అక్కడక్కడ చెదిరి యుండ వచ్చును. ఆదికాలమందు ఊరు పుట్టినప్పుడు, ఎన్నికుటుంబ ములు అచ్చట దిగెనో, అన్నిభాగములుగ (పంగులుగ) ఊరు జాయింటు బాధ్యత వద్ధతిని, విభాగము చేసుకోబడినట్లు తెలియుచున్నది. కొన్నికొన్ని గ్రామాలలో 4, 30, 160, వాటాలు కూడ కలవు. ఊరు పుట్టినప్పు డేర్పరచుకొన్న వాటాల సంఖ్య ఎవరూ మరిచిపోరు. వానిలో ఒక వాటాలో కొంత భాగము దరిమిలా అన్యాక్రాంతమై పోయినప్పటికి కొత్తవాటాకు వేరే సంఖ్య నివ్వరు. పాతవాటాలో అంతర్భాగముగానే దానిని లెక్కింతురు. అట్లే రెండు మూడు వాటాలు కలిసిపోయినప్పుడు కూడ, మొదటి భాగ సంఖ్య నట్లే నిలుపుదురు.

"పంగు"

మధుర, రామనాధపురం, తిరునల్వేలి జిల్లాలలో రెండు రకాల మిరాశీ గ్రామాలు కలవు. బ్రాహ్మణ భాగస్వాములు

"అగ్రహారవాడ" "పండారవాడ" కల గ్రామాలకు "అగ్రహారవాడ" యనియు, శూద్ర భాగస్వాములు గల గ్రామాలకు, "పండారవాడ" యనియు పేర్లు.

మిరాశీ గ్రామములలో జాయింటుఅనుభవము జాయింటు

రకరకముల జాయింటు పద్ధతులు బాధ్యత మూడునాలుగు రకములుగ నుండెను. వానిని ఈ వెనుక పట్టికలో చూపెదము:—

# మిరాశీ గ్రామములు (అనుభవ పద్ధతులు)

## "సాముదాయకమ్," లేక, "సమోహీ" "పళంకరై" (అరవము)

ఈ పద్ధతిలో భాగస్వాములందరు సర్కారు శివిస్తుకు జాయింటుగ బాధ్యులు.

### "సంపూర్ణ సాముదాయం"

అనగ గ్రామంలో ఉండే యావత్తు భూమి, యావన్మందిభూస్వాములు ఉమ్మడిగసాగు చేయడం, ఉమ్మడిగ పంచుకోడం-హద్దులు కాడిగట్లు,సర్వేరాళ్లు లేవు.

### "కరై యెడు"

భాగస్వాములు భూమిని సాగు సౌకర్యనిమిత్తం తాత్కాలికముగ విభజించుకొని హద్దులు (కరలు) పెట్టుకొని సాగుచేసుకోవడం. 20, 30 సంవత్సరా లయిన తర్వాత తిరిగి మెరుగు తరుగులు వాటాలువేసుకోడం. సాగు సౌకర్యం నిమిత్తం ఇట్లు భాగాలు వేసుకొన్నప్పటికి, సర్కారు శిస్తుకుమాత్రం, అందరు జాయింటుగ

## "ఫలభోగం" లేక "అచంద్రాగ్రం" లేక "అరూఢవరై"

సాగుబడి భూమిని ఖాయంగా పంచుకోడం, ఎవరివంతుకు వారు మాత్రమే సర్కారు శివిస్తుకు బాధ్యులు. ఇందులో జాయింటు బాధ్యతలేదు. అయితే ఏ భాగస్వామియైన తనవాటాను అమ్మదలచినపుడు ముందుగ ఇతర వాటాదార్లకు విధిగఅమ్మజూపవలెను. వారు వద్దంటేనే ఇతరులకు అమ్మవలెను గాని ఇంకో విధంగా స్వతంత్రించి అమ్ముకోడానికి వీలులేదు. దీనినే ఇంగ్లీషులో, "Right of pre-amption" (ప్రీఎంప్షన్ హక్కు) అంటారు. సాగుబడి భూములు గాక, బంజర్లు, అడవులు, వగైరాలు అందరికి ఉమ్మడిగానే ఉన్న

## "ఏకభోగం" లేక "యజమాని" గ్రామం

ఊరంతా ఒక్క ఆసామికే చెందినప్పుడు ఆ గ్రామానికి "ఏకభోగగ్రామ" మనియు యజమాని గ్రామమనియు పేరు. ఇచట పెక్కుమంది భాగస్వాములు ఉండుటకు బదులుగా ఒక్కడే భాగస్వామి ఉండును. అనగ ఊరంతా ఒక్కనిదే. ఇట్టి గ్రామాలు నేటికిని తంజావూరు జిల్లాలో గలవు. తక్కువ వాటాదార్లందరూ తమ వాటాలన్నియుఒక్కనికే అమ్మివేసుకొన్నప్పుడుగాని, లేక మొట్టమొదట ఒక్కడే ఆక్రమించుకొన్నప్పుడుగాని, ఇట్టిస్థితి ఏర్పడును. అప్పుడు గ్రామములోనిబంజర్లుకూడ ఇతనివే అగును. ఈ ప్రదేశమును ఇతరులకు సాగుబడికిచ్చుటకున్నూ, నివేశనాలకిచ్చుటకున్నూ, ఈ యజమానికే హక్కు. ఒకొక్కప్పుడు ఏభాగస్వామియైన తనభాగమును విడగొట్టుకొని దానికి తనపేరు పెట్టుకొని, ఏకభోగముగ అనుభవించుచుండేవచ్చును.

మిరాశీగ్రామములలోగల బంజరుభూములు ఎవరివి అనే ప్రశ్న ఇంగ్లీషు గవర్నమెంటువారు వచ్చినతరువాత బయలు దేరెను. అంతకుపూర్వము ఈ హక్కు మిరాశీదార్లదే యనుట స్పష్టము. దీనికి మొదటి రెండుఅధ్యాయములలో చెప్పిన చరిత్రమే సాక్ష్యము అయినప్పటికి, బ్రిటిష్ గవర్నమెంటువారు మిరాశీ దార్లకుగల ఈ హక్కును అంగీకరింప దలపలేదు. మొదటిరోజులలో కొందలు ఉద్యోగస్థులున్నూ, కోర్టులున్నూ కూడ మిరాసీదార్లకు అనుకూలముగ నున్నప్పటికి, రానురాను ఈ అనుకూలము తగ్గిపోయి, మిరాశీదార్లకు బంజర్లలో హక్కులేదనియే చెప్పజొచ్చిరి. ఎవరైనా అట్టిహక్కు "మాకు ఉన్నదంటే" దానిని ఋజువుచేసుకోవలసిన బాధ్యత ఆ మిరాశీ దార్లమీదనే పెట్టబడినది.

మిరాశీగ్రామములలోని బంజర్లెవరివి ?

భవిష్యత్తు—"గ్రామస్వరాజ్యస్కీము"

గ్రామమంటే ఒకటికొకటికి సంబంధములేని నట్టి ఇండ్ల గుంపు కాదనిన్నీ, అది ఒకకట్టుదిట్టమైన సంఘమనిన్నీ గ్రామ గుడికట్టులోని భూమియావత్తు ఏ రైతుకు ఆ రైతుకు విడివిడి హక్కుగల చెక్కలుగగాక గ్రామస్థులందరికి ఉమ్మడిహక్కుగ నుండె ననిన్నీ పైన వ్రాసిన చరిత్రాంశములవల్ల మనకు తెలియు చున్నది. అనేకవేల సంవత్సరములుగ నడిచిన ఈ కాల ప్రవాహములో ఈ గ్రామ సమష్టిభావము అనేక కారణముల చేత నశించి ముఖ్యముగ నూరేండ్లక్రితము ఇంగ్లీషు ఈస్టిండియా కంపెనీవారు ఏర్పరచిన రైతువారీ సెంటిల్

మెంటువల్లనున్ను దానిద్వారా ప్రతిరైతుకు వేర్వేరుపట్టాలు, సర్వేరాళ్లు సబ్‌డివిజనులు, లెటర్లు ఏర్పడడంవల్లనున్ను సాముదాయిక మనేభావము సంపూర్తిగ విచ్ఛిన్నమైపోయినది.

భవిష్యత్తులోతిరిగి మన గ్రామములను పునర్నిర్మాణము చేసికొనవలెనంటే మనము ఇటీవల కోల్పోయిన ఈ సమష్టి భావమును గ్రామగుడికట్టులోని భూమియావత్తు ఎవరికివారికి విడివిడిగా హక్కుగాక అందరికి సాముదాయిక స్వాస్థ్యముగ ఉండవలెననే భావమును పునాదిగ పెట్టుకొని మరి గ్రామ పునర్నిర్మాణమునకు పూనుకొనవలెను. *

వ్యక్తులకు ప్రయివేటు ఆస్తిలేకుండా యావత్తు గ్రామ సంఘానికి చెందేయేర్పాటు ఇటీవల రష్యాదేశములో అవలంబింపబడుచున్నట్లు వినుచున్నాము. ఈ భావము రష్యాదేశములో నిన్ననేడు కలిగియుండవచ్చును. కాని మన హిందూదేశములో ఎన్నియుగాల నుండియో ఇది అమలులోనున్నట్లు యీ పై వ్రాతలవలన తెలియగలదు. ఇటీవల నూరేండ్ల క్రితంవరకుకూడ ఏదోరూపంగా ఉండనే ఉన్నది. దాని నిప్పుడు మనము పునరుద్ధరింపవలసియున్నది. మన మిప్పుడు ఈ పనికి పూనుకుంటున్నామంటే, రష్యానుచూచి అనుకరిస్తున్నామని ఎవరూ పొరపడకూడదు. మనదేశములో అనాదినుండి యున్న మన సిద్ధాంతమునే ఇప్పుడు తిరిగి ఈ కాలపరిస్థితుల కనుగుణముగ పైకి తీసికొని అమలులో పెట్టుకుంటున్నా మన్నమాట.

* తమ్కావ వివరం గోరువారు ఈ గ్రంథకర్త ప్రకటించిన గ్రామ స్వరాజ్యస్కీము అనే గ్రంథమును చూడుడు.

# భూమి, రైతు, రాజు

## రెండవ భాగము

### — ఉపోద్ఘాతము —

ఈ గ్రంథముయొక్క మొదటిభాగములోగల మూడు అధ్యాయములలో, భూమికిని రైతుకును గల సంబంధమును గూర్చి చెప్పితిమి. భూమిమీద పండిన పంటలో రైతు తన వంతు భాగమును – కుడివరమును – ఎట్లు అనుభవించినది, దానియందు తనకుగల హక్కును ఆతడెట్లు చెలాయించుకొన్నది వివరించితిమి. ఇక ఈ రెండవ భాగములో, రాజు తనవంతు పంటను, రాజభాగమును – (అనగ మేల్ వరమును) ఎట్లు వసూలు పరచుకొన్నది, ఎట్లు వినియోగించినది వివరింతుము.

రాజభాగము మూడురకములుగ వసూలు పరుపబడు చున్నది. నేరుగ రాజు తన ఆఫీసర్లద్వారా ప్రతిరైతునుండి వసూలు పరచుకొనుట ఒకపద్ధతి. దీనికి "రైతువారీ పద్ధతి" అనిపేరు. మధ్యదళారులు, కమీషన్ ఏజంట్లు మున్నగువారి ద్వారా వసూలు పరుచుకొనుట రెండవపద్ధతి – దీనికే మన రాజధానిలో "జమీందారీ పద్ధతి" అని పేరు. ఇక మూడవ

పద్ధతిలో రాజు తన భాగమును - అంతాగాని - కొంతగాని - తాను తీసికొనకుండ ఇంకొకరికి (అనగ, ఇనాందారు లనబడు వారికి) దానముచేసివేసి వారినే రైతునుండి నేరుగ వసూలు పరుచుకొనవలసిన దని చెప్పి, అనుజ్ఞ యిచ్చుట. ఇది* ఇనాందారీ పద్ధతి."

ఇంతవరకు వివరించిన చరిత్రను బట్టి, ఏమి తెలియు చున్నదనగా, రాజు ప్రతిరైతునుండి నేరుగ తనరాజభాగమును వసూలుచేసుకొనుపద్ధతి (రైతువారీపద్ధతి)అనాదినుండి ఎక్కువ ప్రచారములోలేదు. ఇది ఇటీవల ఇంగ్లీషువారి రాజ్యములో 1816-17 సంవత్సర ప్రాంతములనుండి ఎక్కువగ అమలులోనికి వచ్చెను. అంతకు పూర్వము రాజు తన రాజభాగమును, ధాన్యరూపముగ గాని, రొఖ్ఖరూపముగ గాని, గ్రామ సంఘాలద్వారానే వసూలు పరుచుకొనుచుండెను. గ్రామ సంఘాలనుండి వసూలు పరచుటకు, హిందూరాజులకాలములో దేశముఖ్‌లు, దేశపాండ్యాలు, మండలేశ్వరులు, మొదలగు రాజోద్యోగు లెంతమందియో యుండిరి. హిందూరాజ్యము పోయి, మహమ్మదీయ రాజ్యము వచ్చిన తరువాత ఈ ఉద్యోగులు క్రమముగ, స్వతంత్రాధికారముల చలాయింప సాగి, మహమ్మదీయ రాజ్యపు అవసానదశయందు, ఆ యా ప్రాంతములకు తామే సర్వాధికారుల మనియు, అచ్చటి భూమి

* ఈనాములలో గల యితర రకపు ఇనాములను గురించి - అనగ శిస్తుహక్కు, భూమిహక్కు రెండున్నూ గలవానిని గురించి ఇనాముల అధ్యాయములలో తప్సీలుగా వివరించబడును. ఈ మూడు పద్ధతులనుగురించి రాబోవు మూడు అధ్యాయములలో వివరించెదను.

కంతకు తామే హక్కుదారుల మనియు, భూపతుల మనియు, చెప్పుకొనసాగిరి. ఇది తొండముదిరి ఊసరవిల్లి అయిన చంద ముగా నున్నది. ఈ రీతిగా రైతుకు రాజుకు మధ్య ఇంకొక వర్గము ఏర్పడుట తటస్థించెను. వీరు నోరుగలవారు; లోగడ పలుకుబడిగల రాజోద్యోగులు నగుటచేత; ఇంగ్లీషువారు వచ్చి చూచునప్పటికి; నిజముగ వీరే భూమికి హక్కుగల భూస్వాములుగను; భూపతులుగను; కంపెనీవారి కండ్లకు కన్పట్టసాగిరి. నిజముగ సేద్యము చేయు రైతులున్నూ లోగడ భూమికి హక్కుగల వారందరున్నూ ఈమధ్యవర్గము వారి క్రింద కౌలుదార్లుగ గన్పించిరి. ఇంగ్లండు దేశములో గల "ఫ్యూడల్ టెన్యూర్" పద్ధతియందు పుట్టి పెరిగిన వారగుటచే మొట్టమొదటగ వచ్చిన ఈ కంపెనీ ఉద్యోగస్థులు పైన వివ రించిన తప్పు అభిప్రాయములో అతి సులభముగ పడుటకు వీలేర్పడెను. అందుచేత చాలాకాలమువరకు ఈ తప్పు అభి ప్రాయప్రకారమే; అనగ మధ్యవర్గము వారగు జమిందార్లు మున్నగువారే నిజమగు భూస్వాములను ధోరణిలో – కథ నడిచెను. 1802 సం॥లో పర్మనెంటు సెటిల్‌మెంటు జరిగి నప్పుడున్నూ; 1908 సం॥లో "మద్రాసు ఎస్టేటు ల్యాండు ఆక్టు" చేయబడినప్పుడున్నూ; ఇంక అనేక సందర్భములలో నున్నూ; భూమికి హక్కుదార్లు రైతులేగాని; జమిందార్లు కారని నిర్వచింపబడినప్పటికి; అప్పుడప్పుడు ప్రీవీకౌన్సిలువంటి గొప్పగొప్ప కోర్టులు సైతము తద్వ్యతిరిక్తమగు అభిప్రాయ మును వెల్లడించుచు రావడమున్నూ; తన్మూలమున నిజస్థితి మరుగున పడిపోయి; 1938 సం॥లో ప్రకాశం కమిటీ నాటికి

కూడ; భూమికి హక్కుదారు డెవ డను ప్రశ్న తిరిగి లేవదీయ బడడమున్ను; చూస్తే మిక్కిలి ఆశ్చర్యముగ గన్పడకమానదు. భాగ్యము; పలుకుబడి; గల మనుష్యులు నిజస్థితిని ఎట్లు మరుగున బడవేయగలరో;—తమకు లేని హక్కులు వున్నట్లు ఎట్లు లోకములో ప్రచారము చేయగలరో—ఈ ఒక్క అంశము వల్ల తెలియగలదు. ఇంతగ్రంథము ఇన్ని ప్రమాణములు అద్దములో కట్టినట్లు ఉన్నప్పటికి "భూమికి హక్కుదారు రైతే" అని ఎంతో శ్రమపడి తిరిగి 1937–38 సం॥లో ఋజువు పరుచుకొనవలసిన అవస్థ ప్రకాశం కమిటీ వారికి పట్టినదంటే; కాల వైపరీత్యము నేమనవలెను?

చారిత్రక దృష్టిలో చూచినప్పుడు రాజభాగపువసూలు ఆదికాలమందు ప్రతిరైతునుండి నేరుగ గాక; గ్రామసంఘాల నుంచి దేశముఖులు; జమిందార్లు మొదలగు రాజోద్యోగుల ద్వారా జరుగుచుండెను. గనుక పైన వివరించిన మూడురకములలో మొట్టమొదటగ జమిందారీ పద్ధతిని గురించి చెప్పెదము. అటు పిమ్మట, రాజభాగదానపద్ధతి యగు ఇనాందారీ పద్ధతిని గురించిన్ని తరువాత దరిమిలా ఏర్పడిన రైతువారీ పద్ధతిని గురించిన్ని క్రమముగ విశదీకరించెదము.



103

# భూమి, రైతు, రాజు

## రెండవ భాగము

### మొదటి అధ్యాయము

### జమీందారీ పద్ధతి

ఆదికాలమందు హిందూరాజుల పాలనలో గ్రామ సంఘాలనుండి రాజభాగపు వసూళ్ళనిమిత్తమై దేశముఖ్, దేశపాండ్యాలు మున్నగు పెక్కండు రాజోద్యోగు లుండి రని లోగడ చెప్పియుంటిమి. వీరు కేవలము వేతనము తీసికొను ఉద్యోగులేకాని భూమికి హక్కుదార్లు కారనియు చెప్పి యుంటిమి.

కాని మహమ్మదీయుల పరిపాలనలో వీరిస్థితి మార్పు చెందసాగెను. మహమ్మదీయులు దేశమునకు క్రొత్త యగుట చేతను, ఇచ్చటి రివిన్యూపద్ధతులు వారికి తెలియకపోవుట చేతను, నిరంతరయుద్ధములలో మగ్నులై రివిన్యూవగైరా మామూలు పరిపాలనా కార్యములందు వారు శ్రద్ధ వహించు టకు అవకాశము లేకపోవుట చేతనున్నూ, అదివరకు పబ్లిక్ నౌకర్లుగా నున్నవారు తోక ఝాడించి స్వతంత్రాధికారము

లను చలాయింపసాగిరి. మహమ్మదీయ ప్రభువులు శిస్తు వసూళ్ళకై వీరిమీదనే ఎక్కువగ ఆధారపడవలసి వచ్చెను. కొన్నికొన్నిచోట్ల తాము వసూలు చేసుకొనుట చేతగాక, పరగణాలకు పరగణాలను ఏ షాహుకారుకో కంట్రాక్టు ఇచ్చివేయసాగిరి. ఈ కంట్రాక్టర్లు, ఇజారీదార్లు, పూర్వపురివిన్యూ ఉద్యోగులు దేశములో ఆడినదే ఆట, పాడినదే పాటయై రైతులయు గ్రామసంఘాలయు, హక్కులు భంగపరుపబడెను. ఉద్యోగులుగను, దళారులుగను వున్నవారు, భూస్వాములుగను, భూపతులుగను, భూమికి హక్కుదారులుగను క్రమముగ పరిగణింపబడజొచ్చిరి. వీరే నేటి జమిందార్లు. ఈ పరిణామమెట్లు జరిగెనో చూచెదము.

"చౌదరి"

"జమిందారు" అను పదముయొక్క మూలమును పట్టుకొనుటకై ప్లాట్ఫెంటు కమిటీవారి అయిదవ రిపోర్టులో కొంతయత్నము జరిగెను. హిందూరాజుల కాలములో ఈ పద్ధతికి "చౌదరి" యను పేరుండెనట. మహమ్మదీయుల కాలములో ఇది "క్రోరీ"గ మారెను - అనగ "క్రోర్" లేక "కోటి" "దాములు" - అనగ సుమారు రెండులక్షల ముప్పై వేలరూపాయలు - రివిన్యూ వసూలు చేసే అధికారి యని అర్థము. ఇంత మొత్తము వసూలయ్యే భూములను ఒక ఖాండముగ ఏర్పరచి, ఆ ఖండముమీద ఈ యీ "క్రోరీ"ని ఉద్యోగిగ నియమించుచుండిరట. దరిమిలా చాలా కాలమునకుగాని "క్రోరీ" అనే పేరు, "జమీందార్" అనే పేరులోనికి మారలేదని తెలియుచున్నది.

హిందూరాజుల కాలమునాటి రాజోద్యోగులనుండి పుట్టిన వారుగాక, దరిమిలా ఇంకా అనేక కారణములచేత అనేకరకము జమీందార్లు ఉద్భవించిరి. 1802 సంవత్సరమునాడు, ఇంగ్లీషు గవర్నమెంటు వారు పర్మనెంటు సెటిల్‌మెంటు చేసుకొన్ననాటికి, మదరాసు రాజధానిలో ఆ యా ప్రాంతములలో 4, 5, రకముల జమిందార్లుండిరి. వీరితోపాటు గవర్నమెంటువారు అప్పుడు ఇంకొక రకము జమిందార్లనుకూడ సృష్టించిరి. మొత్తము వీరందరెవ రనగా:—

జమీలరకములు

I ఉత్తర సర్కారులలోని పురాతన జమీందారులు:—

(1) కొండ జమీందార్లు

(2) సమతల ప్రదేశమునందలి జమీందార్లు

II పురాతన పాలెగాండ్రు; —

(1) వెంకటగిరి, కాళహస్తి, కార్వేటినగరంవగైరా* పడమటిపాలెగాండ్రు.

(2) రామనాథపురం వగైరా † దక్షిణాది పాలెగాండ్రు.

---

*పశ్చిమపాలెములు:— వెంకటగిరి, కాళహస్తి, కార్వేటినగరం, బొమ్మరాజులపల్లి, సైదాపూరు వగైరా.

† దక్షిణాదిపాలెములు:—(1) కన్నివాడి, (2) బోడినాయకనూరు, (3) ఇదయకోట, (4) పావలి, (5) తొవారమ్, (6) అయ్యకుడి, (7) ఏలుమలై, (8) అమ్మయ్యనాయకనూర్, (9) ఎర్రసక్కనాయకనూర్, (10) ఎట్టియాపురం, (11) సప్తూరు, (12) రామనాథపురం (13) శివగంగ.

III హావేలీ ఎస్టేట్లను కంపెనీవారివల్ల 1802 సం॥ ప్రాంతమున కొనుక్కొన్నవారు. వీరు క్రొత్తగ కంపెనీచే సృష్టింపబడిన జమీందార్లు.

వీనిలో కొన్ని పెద్దవి, కొన్ని చిన్నవి, కొన్ని కేవలము శిస్తువసూలునకై ఇవ్వబడినవి, కొన్ని మిలిటరీ సర్వీస్ కోసం పుట్టబడినవి. పూర్వము స్వతంత్రరాజులుగ నన్నవారు ఓడిపోయి, నవాబుల క్రింద సామంతులుగనో, దివిన్యూ లేక మిలిటరీ ఉద్యోగులుగనో కుదిరి, నేటికి నిలిచియున్నవారు కొందరు - మరికొందరు ఇంగ్లీషువారి క్రింద మధ్యకాలములో శిస్తు ఇజారాదార్లుగనో, లేక హవేలీభూములను కొనుక్కొన్నవారుగనో, తయారైన జమిందార్లు. పూర్వము రాజోద్యోగులుగనుండి, దరిమిలా జమిందారీలుగ మారినవి మరికొన్ని. నేటికి మద్రాసు రాజధానిలో నిలిచియున్న సుమారు 1600 జమీల చరిత్రలను పరిశీలించి చూచినట్లయితే, ఇన్నిరకములు బయలుదేరును. ఇక వీరు చెల్లించే పేష్కస్ చూచినట్లయితే, లక్షలు చెల్లించే విజయనగరం, బొబ్బిలి, వెంకటగిరి, రామనాథపురం మొదలుకొని, పావులా పేష్కస్ చెల్లించే భద్రాద్రిప్రాంతపు జమీలవరకు గలవు. వీటి నన్నిటిని కొన్ని ప్రధానభాగములుగ విడదీసి, వీటిచరిత్రను కొంత తెలిసికొందము.

[I ఉత్తర సర్కారులలోని పురాతనజమీలు]

ఉత్తరసర్కారులలో - అనగ గుంటూరు మొదలు గంజాంవరకు గల తెలుగు కోస్తాలో మహమ్మదీయ రాజ్యము

కొండ జమీలు
సమతల జమీలు

చిరకాలమునుండి స్థాపనమై యుండుటచేత; ఈ ప్రాంతములో జమిందారీపద్ధతి ఎక్కువగ నాటుకొనెను. (1) కొండజమీలు (2) సమతల ప్రాంతపు జమీలు. కొండజమీలు పూర్వపు కొండరాజుల నుండి పుట్టినవి. జయపురం వగైరా ప్రాంతములు పర్వతారణ్యములతోను, మన్యజ్వరములతోడను ఎవరికిగాని జొరనశక్యమగుటచే, తురకలు ఈ ప్రాంతపు కొండరాజులను సంపూర్తిగ జయించలేకపోయిరి. ఈ కొండరాజులలో కొందరు వెలమలు, కొందరు "రాచవారు" అనగ క్షత్రియులు, మరికొందరు "ఉరియాలు" లేక ఓఢ్రులు. వీరిని సంపూర్తిగ లొంగదీయుటకు అసాధ్యమగుటచే, మహమ్మదీయులు వీరివల్ల కొంత కప్పము మాత్రము పుచ్చుకొని, వదలివేసిరి. కప్పము పోను మిగతా రివిన్యూమాత్రమే, ఈ రాజులకు ప్రతిఫలముగ దక్కుచుండెను. కప్పము చెల్లించే ఒకవిషయంలో తప్ప, మిగతా అన్నివిషయములలోను ఈ కొండరాజులు దాదాపు స్వతంత్ర రాజులుగనే యుండిరి. దేశములో దొంగలవల్లను; దోపిడిగాండ్రవల్లను, క్రూరమృగములవల్లను, ప్రజలకు పంటలకు ఆస్తులకు ఉపద్రవములు రాకుండ కాపాడడం; సైన్యాలను పెట్టుకొని దేశంలో కలిగే అల్లకల్లోలములను అణచడం, సివిల్ తగాదాలు; వ్యాజ్యాలు తీర్చి తీర్పులు చెప్పడం; వానిని అమలు జరిపించడం; నేరస్థులను దండించడం; అవసరమైతే ఉరిశిక్షకూడ వేయడం; మొదలగు స్వతంత్రరాజ చిహ్నములు వీరికి మిగుల్చబడెను.

ఇక సమతల ప్రదేశమందుండే జమిందార్లు చాలవరకు లోగడ హిందూరాజులనాటి రివిన్యూ ఉద్యోగులే అగుటచేత మహమ్మదీయులకు పూర్తిగ లొంగిపోయిరి. వీరికి కొండరాజులవలె స్వతంత్రాధికారములు అంగీకరింపబడలేదు. భూమిహక్కు అంతకు మునుపే అంగీకరింపబడలేదు. అందువల్ల వీరు మహమ్మదీయుల కాలములోకూడ కేవలము శిస్తువసూలుచేయు ఉద్యోగులుగనే ఉండిపోయిరి. సేనలు నిలిపి దేశరక్షణ చేయడంగాని సివిల్ క్రిమినల్ అధికారాలుగాని, వీరికి (కొండరాజులవలె) అంగీకరింపబడలేదు. వీరు తమ ఎస్టేట్లలోనున్న రైతులనుండి శిస్తు వసూలువరచి, పైనున్న సర్కారుకు ఇర్సాలుచేయుచుండిరి. ఈ రీతిగ వీరు సర్కారుకు చెల్లించునది "జుమ్మా" లేక "శిస్తు" మాత్రమేగాని "కప్పము"కాదు. "కప్పము" అను పదము ఒకరాజు ఇంకొకరాజునకు చెల్లించే సొమ్మునకే అన్వయించునుగాని, దిగువ ఉద్యోగులు వసూలుపరచి పైనున్న సర్కారుకు ఇర్సాలుచేసేదానికి వర్తించదు. ఈ చాకిరీచేసినందుకుగాను జమిందారుకు తాను వసూలు పరచిన దానిలో నూటికి పదవవంతుచొప్పున కమిషన్ ఇవ్వబడుచుండెను. ఈ కమిషన్ కే "మాలికానా" అనిపేరు. ఈ కమిషన్ తరుచు రొఖ్ఖరూపముగ గాక శిస్తులేని భూములరూపముగ ఇవ్వబడుచుండెను. ఇట్టి భూములకే "సావరం" భూములనిపేరు. ఈ భూములు ఒక్కచోటగాక ఎస్టేటుకు నాలుగుమూలలా ఇవ్వబడుచుండెను. ఎందు కనగ, జమిందారుడు నాలుగువైపులకుపోయి,

సమతలప్రాంతపు జమిందార్లు

"మాలికానా"

సావరం భూములు

అజమాయిషీ చేయుటకు వీలుగ ఉండడానికి ఈ ఏర్పాటు చేయబడెను. ఇట్టి శిస్తు మాఫీ భూములేగాక ఎస్టేటులో పండిన పంటలలోనుండి "రుసుము" లనబడు కొలది భాగములుకూడ జమిందార్లకు ప్రతిఫలముగ ముట్టజెప్ప బడుచుండెను. ఇవిగాక ఇంకా దేశాంతర్భాగములో జరుగు సరుకుల రవాణాలమీాద విధింపబడు శాయిరీపన్నులలోనుండియు, ఇండ్ల పన్నులలోనుండియుకూడ జమిందార్లకు కొంత ముట్టుచుండెను.

"రుసుములు"

"శాయిరీ" పన్నులు
ఇండ్ల పన్నులు

మహమ్మదీయపాలన మొదటిరోజులలో జమీాందార్లకు పైన పేర్కొన్న సావరం భూములు, రుసుములు, శాయిరీ వగైరా ప్రతిఫలాలు అనేక రకములుగ ముట్టచెప్పబడినప్పటికి రానురాను ఈ పద్ధతి మార్పుచెంది, వీటి అన్నిటిక్రింద కలిపి సాలు కింత మొత్తమని బిల్ మక్తాగా జమీాందార్లకు ప్రతిఫలము ఏర్పాటు చేయబడెను. ఈ ఏర్పాటు తరుచు ప్రతిసాలున మార్పు చెందుచుండెను. ఒకొక్కప్పుడు రెండుమూడేండ్ల వరకు ఒకటే ఒడంబడిక ఉండెను. ఈ రీతిగా, సర్కారుకు, జమీాందారుకు మధ్య ఏక్ సాలా, తీన్ సాలా, పాంచ్ సాలా, ఒడంబడిక లుండుచుండెను. ఒడంబడిక కాలము పూర్తియైనపు డెల్ల తిరిగి ఎస్టేట్లమీాద వచ్చే శిస్తు లెక్కకట్టి అవసరమైతే జమిందారుమీాద హెచ్చు "జుమ్మా" విధించి కొత్త ఒడంబడికలు వ్రాయించుకొనుచుండిరి. ఈ రీతిగ జమిందారుడు కేవలము శిస్తుకంట్రాక్టుదారుడుగనే పరిగణింపబడెనుగాని భూమికి హక్కుదారుడుగ ఎన్నడు ఎన్నబడలేదు.

పైగా జమిందార్లచేత వ్రాయించిపుచ్చుకొన్న శిస్తు కంట్రాక్టు దస్తావేజులలో రైతులకు భూములయందుగల హక్కులు మరచిపోకుండ స్పష్టముగ వ్రాయబడి ఉండేవి. ఈ రైతుహక్కులను ("హక్-ఇ-రయాయీ") జమీందారు భంగపరుపరాదని, వాటిని ఖచ్చితముగ మన్నింపవలెనని సదరు కంట్రాక్టు దస్తావేజులలో ఉదహరింపబడుచుండెను.

హక్-ఇ-రయాయీ రైతుహక్కు

జమిందారీ ఉద్యోగము మొదట వంశపారంపర్యపు హక్కుగలదికాదు. కాని కాలక్రమేణ అది వంశపారంపర్యమును కాజొచ్చెను. అయినప్పటికి జమిందారు సర్కారుకు చెల్లించవలసిన "జుమ్మా" స్థిరమైనదిగాక ఎప్పటికప్పుడు మార్పు చెందునదిగ వుండెను.

వంశపారంపర్యహక్కు

జమీలు మహమ్మదీయ రాజ్యములో కొంతకాలానికి ఒక వంశమందే పారంపర్యముగారావడం సాగిన తరువాత అవి పరిపాలనాసౌకర్యంకోసం అవిభక్తముగ ఎంచబడెను. అట్లు కానిచో జమీలు చిన్నచిన్నముక్కలుగా విభాగములై సర్కారుజుమ్మా చిల్లర భాగస్వాములవల్ల వసూలగుట కష్టతర మయ్యేడిది. అందుకనియే అవి అవిభక్తములుగ మహమ్మదీయ రాజ్యకాలములో భావించబడెను. సర్కారు తలచుకొన్నపుడు జమిందారుని ఆ ఉద్యోగమునుండి తొలగించడానికిన్ని అవిధేయత పనులు చేసినప్పుడుగాని, జుమ్మా సకాలంలో చెల్లించనప్పుడుగాని, అతనిని ఇతర విధములుగ శిక్షించడానికిన్ని, సర్కారుకు అధికారముండెను.

అవిభక్తత

కేంద్ర ప్రభుత్వము బలిష్ఠముగ నున్నన్నాళ్లు ఔరంగ జేబు చక్రవర్తి బ్రతికి ఉన్నన్నాళ్లు, జమీందార్లు కేవలము సర్కారు ఉద్యోగులుగ మాత్రము ఉండిరి. కాని, ఔరంగజేబు మరణానంతరము కేంద్ర ప్రభుత్వపటిమ తగ్గుటచే, వీరు స్వతంత్రాధి కారులై, భూమికి తామే హక్కుదార్ల మను వాదనను లేవదీసిరి. సివిల్ క్రిమినల్ పరిపాలనాధికారము నబాబుల కాలములో "కాజీ" లనబడు వారి చేతులలో నుండెను. కేంద్రప్రభుత్వబలము తగ్గగానే, ఈ న్యాయ పరిపాలనాధి కారము కూడ తమదే యని జమీందార్లు తల ఎగగట్టి, చెప్ప సాగిరి. ఈ రీతిగ, కాలక్రమేణ, భూమిహక్కున్ను, సివిల్ క్రిమినల్ అధికారాలున్ను, తమవే యనియు, తామే భూస్వా ములనియు, భూపతుల మనియు, వీరు చెప్పుకొనసాగిరి. తదనుగుణముగ, లోగడ "క్రోరీ" లనబడు పేరుతో శిస్తు వసూలుదార్లుగ నున్నవారు, తమ పేర్లను, "జమీందార్లు" అను గొప్ప పేరుగ మార్చుకొనిరి. "జమీన్" అనగా "భూమి" అని హిందూస్థానీభాషలో అర్థము. "జమీందార్" అనగ భూమి గలవాడు. లేక భూమికి హక్కు గలవాడు, భూస్వామి అని అర్థము చెప్పుకోడానికి వీలు ఏర్పడెను. "భూస్వామి" నుండి ఎగిరి, "భూపతి" కావడం కూడ భావకవిత్వంలో తేలి కయేకదా !

కేంద్ర ప్రభుత్వపు క్షీణత, ఉద్యోగులు స్వతంత్రులగుట

## II పురాతన పాలెగాండ్రు

ఇంతవరకు తూర్పు కోస్తా వెంబడిగల ఉత్తర సర్కారుల లోని పురాతన జమీందారీలను గురించి చెప్పితిమి. ఇక ఈ

రాజధానిలో పశ్చిమప్రాంతమునను, దక్షిణాదినిన్నీ గల జమీాలను గురించి తెలిసికొందము. వీరికి ఈ ప్రాంతములలో, "జమీాందారు" లని గాక, "పాలెగాండ్ర"ని పేరు. వీరు ఉత్తర సర్కారులలోని "కొండ జమిందార్ల"ను చాల వరకు పోలి యున్నారు. వీరు పూర్వపురాజులయు, నబాబులయు కాల ములో, సైన్యములో పనిచేసినవారు. కొందరు పెద్ద అధి కారములను, మరికొందరు చిన్న అధికారములను చలాయిం చినవారు. 1802 సం॥లో పర్మనెంటు సెటిల్‌మెంటు జరిగిన నాటికి, వీరు మూడు తరగతులుగ నుండిరి.

(1) పూర్వము విజయనగర సామ్రాజ్యమును, మధుర, కాంచీపురం రాజ్యములను, పాలించిన రాజవంశీకుల సంతతి వారు.

(2) పై రాజవంశీకుల వద్ద సైన్యాధ్యక్షులుగ, నుండి మహమ్మదీయ దండయాత్రల నెదిరించి, తమపూర్వపు ఎస్టేట్లను జాగీర్లను ఎట్లో తంటాలుపడి నిలుపుకొన్నవారు.

(3) లంగడ శిస్తు వసూలుదార్లుగ మాత్రము వుండి, మహమ్మదీయ ప్రభువుల దృష్టినుండి ఎట్లో తప్పించుకొని, తమతమ ప్రాంతములకు తామే ప్రభువుల మని తల ఎగబట్టిన రివిన్యూ ఉద్యోగులు. ఒక్కొక్కప్పుడు గ్రామమునసబులు, గ్రామపటేళ్లుకూడ, తమతమ గ్రామాలకు స్వతంత్రాధికారులై పోయిరి. ఈ రీతిగ, ఒకఊరికి, రెండు మూడేసి వుళ్లకుకూడ, స్వతంత్రాధికారులై వెలసిన పాలెగాండ్రు కలరు. ఇట్టి వారిని గురించేకాబోలు, "పంచషట్పట్టణేశుల కపారమదజ్వర మింత యేటికిన్" అని భర్తృహరి, ఈసడింపుగ పలికినాడు.

ఈ పాలెగాండ్రలో కొందరు తమ ఎస్టేట్లలో వసూలయ్యే రివిన్యూను సర్కారుకు ఇర్సాలు చేయడానికి బదులుగా, ఆ పన్నుతో కొంత సైన్యమును పోషించుచుండిరి. అందునిమిత్తమే వారికి ఈ ఎస్టేట్లు ఇవ్వబడినవి. పైనున్న సర్కారుకు యుద్ధ అవసరములు వచ్చినపుడు ఈ సైన్యమును పాలెగాండ్రు సర్కారుకు సప్లయిచేయవలసిన షరతుండెను. సైన్యముగాక పోలీసు సిబ్బందినికూడ ఏర్పరచి పోషించే షరతు కొందరు పాలెగాండ్రకుండెను. బీజపూరు, గోల్కొండ నబాబులకు సైన్యము అవసరములేదని తోచినప్పుడు పాలెగాండ్రపై పూరా "జుమ్మా" విధించి, వసూలు పరచుచుండి నట్లు చరిత్రనిదర్శనములు కలవు.

విజయనగర చక్రవర్తులు కొత్త దేశములను జయించి నప్పుడు, అచ్చటి ప్రజలను అదుపులోనుంచి పాలించు నిమిత్తమై తమ తరఫున కొందరు ప్రముఖులను అచ్చట పెట్టివచ్చుచుండిరి. వీరికి "పాలిగార్లు" అనియు, "పాలెగాండ్ర"నియు పేర్లు, పాలెగాండ్రు అనుపదము "పాలెము" లేక "పాళెము" అను తెలుగు పదములోనుండి పుట్టినది. "పాళెము" అనగ, "యుద్ధరంగము" లేక "యుద్ధశిబిరము" అని అర్థము. ఉదాహారణము—భారతము

పాలెగాండ్రు - శబ్దోత్పత్తి -

కం॥ ......... సాధు రేఁగెనేనిఁ
విను తల"పాళెమున"న కాసి నిలువదు సుమ్మా.

[భారతం, ఉద్యోగపర్వం, ద్వితీయాశ్వాసం 23వ, పద్యము.]

ఇచ్చట "ప్రాళెము" అనగ యుద్ధరంగము అని అర్థము.

పాలెము, పాలెగాడు అను తెలుగు మాటలకు అరవములో పాలయం "పాలయకారన్" అనునవి పర్యాయపదములు.

గ్రామపెద్దయొకడు గ్రామానికి స్వతంత్రప్రభువు వని తల ఎగబెట్టి గ్రామానికి చుట్టూ కోటగోడ కట్టుకొని కూర్చున్నప్పుడు ఆ గ్రామానికికూడ "పాలెము" అనిపేరు వచ్చుచుండెను. పాలెగాండ్రు మిలిటరీ సర్వీసుకోసం పుట్టబడినవారు. వారు నిర్ణయమైన కప్పము కట్టుచు, అడిగినప్పుడు సేనను పంపుచు ఉన్నంతకాలము వారిజోలికి ఏ ప్రభువుగాని పోయెడివాడుకాడు. తన ఎస్టేటులో శాంతిభద్రతలు కాపాడడము, దొంగలు దోపిడిగాండ్రను అణచి శిక్షించడము, చోరీఆస్తిని కనుగొనలేనియెడల దాని ఖరీదును యజమానికి ఇచ్చివేయడం ప్రతి పాలెగాని విధి. తన ఎస్టేటులో సివిల్, క్రిమినల్ అధికారాలు ఇతనివే. క్రిమినల్ కేసులలో అవసరమైతే ఉరిశిక్ష వరకు విధించుటకుకూడ ఇతనికి అధికారముండెను. దీనినిబట్టి చూడగ ఉత్తరసర్కారులలోని సమతలప్రాంతపు జమిందార్లకంటె ఇతని కెక్కువ అధికారాలున్నట్లు తెలియుచున్నది. ఇతడు కేవలం ఉద్యోగస్థుడుకాడు. దాదాపు స్వతంత్రప్రభువే. ఉత్తర సర్కారులలోని కొండరాజులకును ఈ పాలెగాండ్రకును చాల పోలికలుగలవు.

"కావలి" హక్కు

స్వతంత్రులగు ఈ పాలెగాండ్రక్రింద కొంతమంది జనము ఉండుచుండిరి. పాలెగాని ఆజ్ఞకు లోబడి వీరు గ్రామాలలో నివసించుచు వాటిని కావలి గాయుచుండిరి. వీరికే "కావలి"వారనిపేరు. పాలెగాండ్రు స్వతంత్రులైనపిమ్మట లోగడ గ్రామాలలో

మండిన అనాది కావలివారలను తీసివేసి పాలెగాండ్రు తమ తాలూకు మనుష్యులను కావలిపెట్టిరి. ప్రాతవారిని తొలగించుటకు సాధ్యముకానిచోట్ల అందుకు ప్రతిఫలముగ వారినుండి కొంత ఫీజును (కావలిఫీజును) వసూలుచేయుచుండిరి. ఇదియు వీలుకానిచోట్ల వారిని దోచుకొనుచుండిరి! ఈ రీతిగ పాలెగాండ్రచేతను, వారి బంధుమిత్రులచేతను, హక్కుగ కోరబడిన "కావలిహక్కు" మన కిప్పుడు మిక్కిలి విచిత్రముగ దోచుచున్నది. దీనికి ప్రతిఫలము వచ్చుచుండుటవల్ల నిజానికి విధిగ ఎంచబడవలసినది హక్కుగ కోరబడుట తటస్థించినది. ఊళ్లను కావలికాచే హక్కుకు; "స్థలకావలిహక్కు" అని పేరు. ఊళ్లకు, ఊళ్లకు మధ్యవుండే ఖాళీప్రదేశములను మధ్యనున్న అడవిదోవలు మొదలైన వాటిని కావలికాచే హక్కుకు, "దేశకావలిహక్కు" అని పేరు.

1560 సంవత్సరములో విశ్వనాథనాయకుడు మధుర ప్రాంతమును జయించి, అచ్చట నాయుక వంశరాజ్యమును స్థాపించెను. అతడు 72 బురుజులతో మధురలో ఒక కోటకట్టి దానిని తన ప్రధానులలో ఒకనికి అప్పగించి, దానిని సంరక్షించు భారమును, అతని యందుంచెను. అతనికి, "పాలయకారన్" అని పేరు పెట్టబడెను, ఇట్లే, రాజ్యము యావత్తు అనేక ఖండములుగ విభజించి, ఒక్కొక్క ఖండమును ఒక్కొక్క "పాలయకారన్"కు అప్పగించెను. ఈ "పాలయకారన్"లకు మూడు డ్యూటీలు విధింపబడెను: (1) తన "పాళయపట్టు"లో అనగ తనకు అప్పగించబడిన ఖండములో శాంతిభద్రతలు కాపాడడం; (2) రాజు కోరినప్పుడు కొంత

సైన్యాన్ని సప్లయి చేయడం; (3) ప్రతిసాలున రాజ కోశమునకు కొంత ద్రవ్యము చెల్లించడము. ప్రస్తుతము మధుర, తిరునల్వేలి జిల్లాలలోనుండే పాలెగాండ్రు అందరు చాల వరకు ఈ నాయక రాజ్యమునుండి పుట్టినవారే అని చెప్పవచ్చును. అంతకు పూర్వమే ప్రబలిన పాండ్యరాజ్యమునుండి పుట్టిన వారును మరికొందరు కలరు.

పాలెగాండ్రకు భూమిహక్కు లేదు.

ఈ పాలెగాండ్రకు ఎన్ని అధికారా లున్నప్పటికి, తాము భూమికి హక్కుదార్లమని వా రెన్నడూ చెప్పలేదు. రైతులు తమ క్రింద కౌలుదార్లని వా రెన్నడూ అనలేదు. సేద్యము చేసినవానిదే భూమిహక్కు అని ఎల్లప్పుడు అంగీకరింపబడెను. ఇదే యూరపుఖండములోని, "బారన్సు" (Barons) అనబడువారికిని, మన హిందూదేశములోని ఈ పాలెగాండ్రకును ఉన్న గొప్ప తేడా.

పాలెగాండ్రకు గల ఈ లక్షణములను, నిర్వచనములను ఇటీవల ప్రీవీకౌన్సిలు వారు కూడ అంగీకరించియుండిరి.

## III హవేలీక్రయదార్లు - కంపెనీచే నూతనముగ సృష్టింపబడిన జమీందార్లు

హవేలీ భూములు

దూరప్రాంతములలో తమ ఉద్యోగుల క్రిందనున్న భూములుగాక, రాజులు తమ రాజధాని చుట్టూ, తమ సొంత ఉపయోగము నిమిత్తమై కొంతభూమిని అట్టే వుంచుకొనేవారు. తమ దివాణపు ఖర్చులకు, సొంత సిబ్బందులకు, సైన్యపు సప్లయిలకు

కావలసిన యావత్తు ధాన్యాదులు, ఈ భూముల నుండియే తీసికొను చుండెడివారు. ఇట్టి భూములకు "హవేలీ భూములు" లేక "కోరు భూములు" అని పేరు. ఇంగ్లీషు కంపెనీవారు దేశమును జయించి, పూర్వపురాజుల రాజ్యములను లాగికొన్నప్పుడు, ఈ హవేలీ భూములను ఏక్‌సాలా, తీన్‌సాలా కౌళ్లకు తమ ఇష్టము వచ్చినవారికి అద్దె కిచ్చుచుండిరి. దరిమిలా, 1802 సం॥లో పర్మనెంటు సెటిల్ మెంటు జరిగినప్పుడు, హవేలీ భూములను వెయ్యి మొదలు పది వేల వరహాలవరకు శిస్తువసూలయ్యే ముఠాలుగా విడగొట్టి ఎక్కువ మొత్తము ఇస్తా నన్నవారికి, వేలములో అమ్మివేయు చుండిరి. ఇట్లు వేలములో ఈ హవేలీ భూములను కొనుక్కున్న వారికికూడ, పర్మనెంటు సెటిల్‌మెంటు కాలమందు ఇతర జమీందార్లతోపాటు సన్నదుల నిచ్చిరి. ఈ రీతిగ వీరును పురాతన జమీందార్లతోపాటు, క్రొత్తరకపు జమీందార్లుగా వెలసిరి. అనగ వీరు ఇంగ్లీషు కంపెనీవారిచే 1802 సం॥లో సృష్టింపబడిన క్రొత్త జమీందారీవర్గ మని చెప్పవలసియున్నది.

దక్షిణాదిని మిట్టాదార్లు, హుండాదార్లు వగైరా

ఉత్తరసర్కారులలో "హవేలీభూములు", "కోరు" భూములు" అనబడు వాటికే దక్షిణాదిని "సర్కారు" లేక "అయన్" భూము లని పేర్లుండెను. ఇవి కూడ వేలములలో అమ్మివేయబడెను. వీటిని కొనుక్కొన్న వారికి, "మిట్టాదారులు" "ముఠాదార్లు", "హుండాదార్లు", "జమీందార్లు" "ప్రొప్రయిటరీ ఎస్టేటుదార్లు" అని పేర్లు పెట్టబడెను.

## — కంపెనీ హయాము —

ఈస్టుఇండియా కంపెనీవారు ఇండియాలో అడుగిడు నాటికి వున్న రివిన్యూ వసూలు పద్ధతులను గురించి స్థూలముగ ఇంతవరకు వర్ణించినాము. హిందూరాజుల కాలములో రివిన్యూ ఉద్యోగులుగనో, సైన్యాధ్యక్షులుగనో, సైనికోద్యోగులుగనో వున్నవారు. మహమ్మదీయ రాజ్యావసాన కాలమందు స్వతంత్రులై "భూమిహక్కు మాదే" నని చెప్ప సాగించిన రాజాలు, జమీందార్లు, పాలెగాండ్రు మిట్టాదార్లు, ప్రొప్రయిటర్లు, మొదలగు వారితో దేశమంతయు, నిండియుండెను. ఇట్లుండగ, 1760 సం॥ లో ఇంగ్లీషుకంపెనీ వారికి, దైవవశాత్తు, బంగాళాదేశములో సిరి యెత్తుకొని, అక్కడ బర్ద్వాన్, మిడ్నపూర్; చిటగాంగ్ అను మూడుజిల్లాల తాలూకు భూమిశిస్తును వసూలుపరచే హక్కు సంప్రాప్తించెను. ఇది అప్పుడక్కడ ఏర్పడిన విషమ రాచకీయ పరిస్థితులవల్ల నవాబు మీర్కాసీమ్‌చే ఒసంగబడిన అధికారము. ఈ విషమరాచకీయపరిస్థితు లెట్టివో, ఇట వివరించుట అనవసరము. *

1760 సం॥లో మీర్కాసీమ్‌తో ఒడింబడిక— బర్ద్వాన్, మిడ్నపూర్, చిటగాంగ్ జిల్లాలపై కంపెనీకి, రివిన్యూవసూలు అధికారము

దరిమిలా, అయిదేండ్లకు, మరికొన్ని రాజకీయ కారణములచే; 1765 సం॥లో ప్రయాగ మకాములో ఢిల్లీపాదుషా,

* వివరములు తెలిసికొనగోరువారు ఈ గ్రంథకర్త రచించిన బ్రిటిషుమహాయుగము చూడ నగును.

1765 సం॥లో మూడు రాష్ట్రాలపై రివిన్యూ వసూలు అధికారము

(గ్రుడ్డి) షాఆలం చక్రవర్తివల్ల బెంగాల్, బీహార్; ఒరిస్సా అనబడు మూడు పెద్ద రాష్ట్రములపై రివిన్యూవసూలు అధికారమున్నూ, దానితోపాటు సైన్యముల నిలిపి దేశరక్షణ చేయు అధికారమున్నూ, కంపెనీవారికి ధారాదత్తము చేయబడెను. ఇదియే "దివానీ" అధికార ప్రదాన మని చరిత్రలో ప్రసిద్ధ మయ్యెను.

1760, 1765 సం॥లో లభించిన అధికారములను పురస్కరించుకొని, కంపెనీవారు రివిన్యూవసూళ్ల నెట్లు చేసిరో, వసూలుచేసిన రివిన్యూను ఎట్లు వినియోగించిరో, తప్సీలుగ వివరించుట ఇటు అనవసరము కాని ఈ పద్ధతుల ఫలితముగ – కంపెనీవారు పాదముపెట్టిన పదేండ్లలోపలనే – 1769 సం॥లో బంగాళాదేశ మందంతటను గొప్ప కాటకము సంభవించి, బంగాళాదేశ జనసంఖ్య మూడుకోట్లలో ఒకకోటి జనము నశింపై రని మాత్రము చెప్పిన చాలును.

కంపెనీవారి రివిన్యూ పద్ధతిలో రెండు గొప్ప లోపములు

కంపెనీవారు అవలంబించిన రివిన్యూపద్ధతిలో రెండు గొప్ప లోపము లుండెను. (1) భూమిశిస్తును వారు "పన్ను"గ గాక; "అద్దె"గ వసూలు పరచిరి. అనగ ఇంగ్లాండులోనివారి "ఫ్యూడల్ పద్ధతి" ననుసరించి ఇచ్చుటను ప్రవర్తించిరి. దీనిని గురించి ఈ గ్రంథము మొదటిభాగము, రెండవ అధ్యాయములో వివరించియే యున్నాము. రైతుకుగాని, జమిందారుకుగాని భూమిహక్కు లేదనిన్ని, అంతా తమదేననిన్ని తమ ఇష్టం వచ్చినప్పుడు, ఇష్టమువచినంత శిస్తు

విధించుచు, రైతులను, జమీందార్లను, తమకిష్టము వచ్చినప్పుడు భూమినుండి లేవగొట్టుచు నుండవచ్చు ననియు, వారు తలచి ఆ ప్రకారమే చేయసాగిరి. పరగణాలకు పరగణాలు ఏక్‌సాలా తీన్‌సాలాలకు వేలం వేసి ఎవడెక్కువశిస్తు ఇస్తానంటే, వాడి కల్లా ఇచ్చివేయుచుండిరి. ఇందువల్ల దినాజ్‌పూర్, బర్ద్వాన్, రాజషాహీ వగైరా సుప్రసిద్ధపురాతనజమీాలు * నశింపై అడ్డమైనవాళ్లు శిస్తుకంట్రాక్టుదారులై రైతులు దిక్కులేనివారై అడవులపట్టియు, కాటకములను లోనయియు చెప్పరాని ఇడుముల గుడిచిరి. ఇది ఒక గొప్పలోపము.

(2) ఇక రెండవ లోప మేమనగ:—వసూలైనశిస్తును దేశములోనే ప్రజల నిమిత్తం ఖర్చుపెట్టుటకు మారుగ కంపెనీ వారు దానిని తమ వర్తకపు దస్త్రములలో వచ్చిన లాభముగ ఎంచుకొని, సీమకు తీసికొనిపోయి భాగస్వాములందరు కూడి అక్కడ పంచుకొని తినుచుండిరి. కొంతసొమ్ముతో ఇక్కడి సరకులు కొని సీమకు పంపుకొని అక్కడ అధికలాభములకు అమ్ముకొని తినుచుండిరి. రాజ్యపరిపాలనాధర్మమున కిది కేవలము తల్లక్రిందులు. ఈ పని కోమటి చెయ్యవలసినదిగాని రాజు చేయవలసినదికాదు! కాని వర్తకులగు కంపెనీవారు తమ వెనుకటిగుణ మెట్లు మానగలరు? వారిచేతికి రాజ్యము వస్తే, వారిట్లుగాక ఇంకెట్లుచేయగలరు? తాము ప్రజాపాలనచేస్తున్నా మన్నమాట మరచిపోయి తా మింకా లాభసాటి బేరము చేసే కోమట్ల మనే వారు అనుకొనిరి. అందువల్ల ఇట్టి ప్రమాదము

* దీనినిగురించిన తప్పిదాలు ఈ గ్రంథకర్త రచించిన "భూమితరముల చరిత్ర"లో గలవు.

జరిగెను. క్షాత్రధర్మము ఎక్కవలసిన సింహాసనముమీద వైశ్యధర్మము వచ్చి కూర్చుంటే, ఇట్లుగాక ఇంకెట్లగును? బ్రిటీష్ పరిపాలనలో ఇండియాలో జరిగిన గొప్ప ధర్మసాంకర్య మిదే. దీని దుష్ఫలితమును మనము 1760 సం॥ నుండి నేటి వరకు ఈ 180 ఏండ్లనుండి – అనుభవించుచునే యున్నాము! ఈ దుష్ఫలితము కంపెనీవారు కాలుపెట్టిన పదేండ్లలోపలనే బంగాళా దేశపు * కాటకముగ ప్రప్రథమమున పొడసూపె నని పైన చెప్పియే యుంటిమి.

1760 మొదలు 1793 సంవత్సరం వరకు–అనగ 33 ఏండ్లు- కంపెనీ ఉద్యోగుల అజ్ఞానము చేతను, రివిన్యూ వగైరా. రాజ్యపాలనావ్యవహారములలో వారికి అనుభవము లేమి చేతను, వారిలో కొందఱి దురాశాదుర్మార్గ ప్రవృత్తుల చేతను, బంగాళా ప్రజలు చచ్చి సున్నమైన పిమ్మట ఈ దుస్థితిని చక్కచేయు తలంపుతోనున్ను, ఇంకా మరికొన్ని కారణాంతరములచేతనున్ను, 1793 సం॥లో గవర్నర్ జనరల్ కార్న్‌వాలీస్ హయాములో బంగాళా దేశములో "పర్మనెంటు సెటిల్‌మెంటు" అను పేరుతో చరిత్ర ప్రసిద్ధమైన ఒక రివిన్యూ పద్ధతి ఏర్పాటు చేయబడెను. దీని ననుసరించియే, దరిమిలా సుమారు పదేండ్లకు–అనగ 1802—1807 సం॥ల మధ్య మదరాసు రాజధానిలో కూడ, కొన్నికొన్ని ప్రాంతములలో మాత్రము–అనగ, మద్రాస్ చుట్టునున్న జాగీర్, ఉత్తర సర్కారులున్నూ పశ్చిమ, దక్షిణ, చిత్తూరు, పాలెములు, సేలంజిల్లా, రామ

* ఇదియు నేటి 1943-45 సం॥ కాటకమువలెనే మనుష్యనిర్మితమైనదే గాని దైవనిర్మిత మైనది కాదు.

నాథపురం, కృష్ణగిరి, దిండిగల్, తిరువనంతపురం ప్రాంతము లలో- పర్మనెంటు సెటిల్‌మెంటు ఏర్పాటు చేయబడెను. అంతవరకు, బంగాళా దేశములో జరిగిన అవకతవక రివిన్యూ పరిపాలనయే మద్రాస్ రాజధానిలో కూడ జరిగెను.

పర్మనెంటు సెటిల్‌మెంటుకు పూర్వము బంగాళా మద్రాస్ రాజధానులలో జరిగిన అవకతవక రివిన్యూ పరిపాలన ఎట్టిదో, దీనిని చక్కజేయు తలంపుతో ప్రవేశపెట్టబడిన పర్మనెంటు సెటిల్‌మెంటు యొక్క స్వరూపస్వభావము లెట్టివో, దానిని ప్రవేశపెట్టుటకు అప్పుడు కంపెనీని ప్రేరేపించిన పూరా కారణము లేవియో ఇప్పుడు తెలిసికొందము.

## బెంగాల్‌లో పర్మనెంటు సెటిల్‌మెంటుకు పూర్వము కంపెనీవా రవలంబించిన రివిన్యూ వసూలు పద్ధతులు

1760 సం॥లో మీర్కాసీము తమ కిచ్చిన మూడు జిల్లాలలోను బర్ద్వాన్, మిడ్నపూర్ జమీల రెంటినిన్నీ కంపెనీవారు తమ చేతికి వచ్చినదే తడవుగ, పవరు జమీందారులనుండి ఊడబెరికి, ఎక్కువ శిస్తు నిచ్చెద నన్న వారికి వేలములో అమ్మివేసిరి. 1762 సం॥ నుండి భూములనే విడివిడిగ పబ్లిక్ వేలములలో తీకానాలా కౌళ్ల కిచ్చుచుండిరి. అనాడునుండి భూమిలో నన్నరైతు దానిని వదిలిపెట్టలేక, ఎక్కువ మొత్తమునకు పాడి, నష్టపడుచుండెను; లేదా, ఇది వరకు భూమిలేనివాళ్లు పాటలను విపరీతముగ పెంచి, పాతరైతు లను తొలగించి, తాము ప్రవేశింపగలుగుచుండిరేగాని, సకాల

మున పాటమొత్తమును చెల్లించలేకపోవుచుండిరి. తాల్లుడు బొంగరములేని ఈ రకంమనుష్యులవల్ల ఇటు సర్కారుకు శిస్తు సరిగ్గా చెల్లక పోవడమున్ను, అనాదిరైతులకు భూములు పోవడమున్ను జరుగజొచ్చెను. తుదకు 1769 నాటికి గలిగిన ఫలిత మేమిటంటే, దేశములో గొప్పకాటకము!! కాటకముచే జనము చచ్చినను, శిస్తువసూళ్ల కాఠిన్యత ఎంత మాత్రము తగ్గలేదు. మామూలు సంవత్సరాలలో కంటే, ఈకరువు సంవత్సరాలలోనే, ఎక్కువశిస్తు వసూలు చేసినామని చెప్పి ఇక్కడి కంపెనీనౌకర్లు తమ సీమ యజమానులకు మెహార్బానిగా వ్రాసుకొని సంతోషించుకొనిరి. అంతేగాని, కరువుబాధ నివారణకు వారెట్టిపనియు చేయరైరి. అది తమ పనికాదని ఈ వర్తకపు కంపెనీ నౌకర్లు అనుకొనిరి కాబోలు!

1765 సం॥లో బెంగాల్ బీహార్ ఒరిస్సా రాష్ట్రములపై శిస్తువసూలు అధికారం రాగానే, కంపెనీవారు వెంటనే సొంతఏర్పాటులను చేసికోలేదు. పాతవానినే కొంతకాలము సాగించిరి. అనగా, నవాబు రాజధానియగు మూర్షిదాబాదు దర్బారులో ఇంతవరకున్న మహమ్మదీయోద్యోగిద్వారా నున్ను పాట్నాలోనున్న "సితాజ్ రాయ్" యను హిందూ ఉద్యోగిద్వారానున్ను వారు ఈపనిని కొంతకాలము సాగించుకొనిరి. 1769 సం॥లో

1769 సూపర్ వైజర్లు

ఈ ఉద్యోగులపై సూపర్‌వైజర్లను కంపెనీవారు నియమించుకొనిరి. రివిన్యూపరిపాలన ఏమీ బాగుండలేదనిన్ని, జమీలను వేలములో కొనుక్కొన్న పాటదార్లు రైతులనున్ను, తిరిగి, ఈ పాటదార్లను రివిన్యూ ఉద్యోగస్థులున్ను పీడించి

దోచుకొనుచున్నారనిన్నీ, అంతా అధ్వాన్నముగ నున్నదనిన్నీ, ఈ సూపర్వైజర్లు కంపెనీకి రిపోర్టు చేసిరి.

ఈ దుస్థితిని చక్కబెట్టడానికిగాను, యూరపియన్ ఆఫీసర్లతో గూడిన రివిన్యూ బోర్డును, రివిన్యూ కమిటీలను కంపెనీవారు 1772 సం॥లో నియమించిరి. యూరపియన్ల ఖజానాను మూర్షిదాబాదునుంచి కలకత్తా కోటలోనికి మార్చుకొనిరి. జిల్లాలలో ఆయా చోట్ల యూరపియన్ సూపర్వైజర్ల నేర్పరచిరి. వారే ఇప్పటి జిల్లాకలెక్టర్లుగ మారిరి. ఈ రివిన్యూ బోర్డువారు భూములను పంచసాలా కౌళ్లకు అమ్మివేసిరి. కమిటీల మెంబర్లు ఊళ్ల వెంట సర్కీటు బయలుదేరి, ఈ కౌళ్లను వ్రాయించుకొనిరి. ఈ అయిదేండ్లకౌళ్లుకూడ సరిగ పనిచేయలేదని రెండేండ్లకే 1774 సం॥కే తెలిసిపోయెను. పాటదార్లు త్రాడు బొంగరము లేనివాళ్లవుటచేత, కౌళ్లడబ్బు కంపెనీకి సరిగ వసూలు కాలేదు. ఇక, రైతులగతి ఈ పాటదార్ల చేతులలో దైవమునకే ఎఱుక.

1772 యూరపియన్ల రివిన్యూబోర్డు కమిటీలు

అందుచే, 1774 సం లో ఇంకోపద్ధతి నవలంబించిరి. యూరపియన్ కలెక్టర్లను తీసివేసి, అచ్చటచ్చట వసూలుకోసమై ఇదివరకే ఏర్పడియుండిన కంపెనీ కౌన్సిళ్లకే వసూలు అధికారాలిచ్చి, వీటికి సహాయంగా నేటివు అమీనాలను పెట్టిరి.

1774 నేటివు అమీనాలు

పంచసాలా కౌళ్లు ఇంకొక సంవత్సరమునకు ముగియుననగ, అనగ, 1776 సం॥లోనే- ఇకముందేమి చేయుదమూ అను

1776 శాశ్వతపు శిస్తు పైసలా పద్ధతికి సీమ యజమానులు అంగీకరించక పోవుట

ఆలోచనలు కంపెనీవారి బుర్రలలో దూరెను. "అయిదేండ్ల కౌళ్లేమిటి? శాశ్వత కౌళ్లుగ వేలాలు వేద్దా"మని వారన్‌ హేస్టింగ్సు, బార్వెల్, అను మెంబర్లున్ను, "అట్లాకాదు, భూమి ఎవరి స్వాధీనములో నున్నా సరే, యకరానికి 'ఇంత శిస్తు' అని ఒకేసారి, శాశ్వతముగ, నిర్ధారణ పరుద్దామ"ని ఫ్రాన్సిస్ అను మెంబరున్ను, వాదించుకొనిరి. ఈ రెండు వాదనలు సీమకు పంపబడగ, "ఈ రెండూ పనికి రావు, ఇదివరకు సాగుచున్న స్వల్ప కాలపు కౌళ్లే ఉండనీయండి" అని సీమయజమానులు ఆజ్ఞాపించిరి.

కాబట్టి, ఇంకొక 15, 16 ఏండ్లవరకు ఈ స్వల్పకాలపు కౌళ్ల వేలాలే సాగుచు, ప్రజలను మంగలములో పెట్టి, వేలాలుగ మాడ్చివేసినవి. కంపెనీ సర్కారుకు రివిన్యూ చెల్లక పోవడం, రైతులను జమీాందారులను వేలంపాటగాళ్లను జైళ్లలోపెట్టి బాధించడం, యథారీతిగ సాగిపోవుచుండెను.

1778 నుండి తిరిగి, ఏక్‌సాలా కౌళ్లు!!

1778 నుండి స్థితి మరింత అధ్వాన్నమయ్యెను. ఏలననగ, పంచసాలా కౌళ్లకు బదులు ఏక్‌సాలా కౌళ్లకే వారు భూములను వేలము వేయసాగిరి. దీనితో ప్రజాఘోష మరింత హెచ్చెను.

ఈ ఘోష ప్రతిఏడూ సీమకు పోగా పోగా, శిస్తు డబ్బులు కంపెనీ ఖజానాకు సరిగ రాకపోగా, 1786 సంవత్సరము నాటికి సీమయజమానుల బుద్ధి కొద్దిగ మగల జొచ్చెను. పర్మినెంటు సెటిల్‌మెంటు చేయడానికిగల సావకాశములను

విచారించి మాకు తెలుపవలసిన దని వారు అప్పుడు గవర్నర్ జనరల్‌గ నున్న కారన్‌వాలీసును కోరిరి. అతడును, అతనితోడి మెంబరుగనున్న "సర్ జాన్ షోర్"న్ను కలిసి, మూడేండ్లు తంటాలు పడి, 70 అచ్చుపేజీల గ్రంథము నొకదానిని వ్రాసి, 1789 సం॥లో సీమకు పంపించిరి. అందులో జమీందార్ల ద్వారా పర్మనెంటు సెటిల్‌మెంటు చేసుకోవడం మంచి పద్ధతియని శిఫార్సు చేయబడెను. ఈ రిపోర్టు "సర్ జాన్ షోర్ రిపోర్టు" అని చరిత్రప్రసిద్ధి వడసినది.

1789 సర్ జాన్ షోర్ రిపోర్టు- పర్మనెంటు సెటిల్‌మెంటును గురించి

సర్ జాన్ షోర్ రిపోర్టులో చెప్పబడిన పర్మినెంటు సెటిల్ మెంటు రెండు గట్టిపునాదులపై నిలుపబడెను. గవర్నమెంటుకు రివిన్యూ నిక్కచ్చిగ రాగలదను నిశ్చయమొకటి. ప్రజల రక్షణ. భద్రత, ఇంకొకటి. మొదటిది స్పష్టమే. ఇక రెండవది ఎట్లేర్పడు ననగ, ఇదిగో, సర్ జాన్ షోర్ చెప్పినమాటలు వినండి:—"ప్రతిరైతు చెల్లించవలసిన పన్ను ఒకేసారి ఖచితముగ నిర్ణయింపబడవలెనుగాని, ఎవరి ఇష్టమువచ్చినట్లు వారు ఎప్పుడు పడితే అప్పుడు, మార్చుచుండరాదు." ఇందుకు ప్రమాణము. ఇండియా గవర్నర్ జనరల్‌గారి "స్టేట్ పేపర్సు" ఒకటవ వాల్యూము, ఉపోద్ఘాతము 198 పేజీలో ఇట్లు కలదు.*

"........At the close of the minute, he (Sir John Shore) states the main priniciples on which it is based. (1) The security of Government with respect to its revenue, and (2) the security and protection of its subjects. The former will be best established by concluding a permanent settlement with Zamindars, or proprietors of the soil, the land, their property is the security to the Government. The second

must be ensured by carrying into practice as far as possible, *an acknowledged maximum of taxation.* The tax which each individual is bound to pay ought to be certain, not arbitrary........"

మద్రాసు ఎస్టేట్సు ల్యాండు అక్టు కమిటీ నివేదిక, మొదటిభాగము నుండి ఈ మాటలు వ్రాయబడినవి.

"(సర్ జాన్ షోరు) తమ నివేదిక యే మూలసూత్రాలపై ఆధారపడియున్నదో నివేదికలో చిట్టచివర వివరించిరి. ఆ సూత్రము లెవ్వి యనగా.— (1) గవర్నమెంటుకు రావలసిన రెవిన్యూ విషయములో స్థిరమైన హామీ. (2) ప్రజలకు రక్షణవిషయములో స్థిరమైన హామీ ఏర్పడవలయునంటే జమీాందారులతోను భూముల ప్రొప్రయిటరుల తోను పర్మనెంటు సెటిల్ మెంటు (శాశ్వతమైన ఏర్పాటు) చేసు కోవలెను. వారి సొత్తుఅయినభూమి గవర్నమెంటుకు హామీగా ఉండగలదు. ప్రజలకు ఉండవలసిన రక్షణ కలుగవలెనంటే వీలైనంతవరకు నిత్యాచరణలో అందరిచే ఒప్పుకోబడిన ఒక గరిష్ఠప్రమాణమైన పన్నును అమలుపరచవలెను. ప్రతివారును విధిగా చెల్లింపవలసిన పన్ను స్థిరముగా నిశ్చయముగా ఉండ వలెను. యథోచితముగా నుండకూడదు.

## సదరు ఉపోద్ఘాతము 207 పేజీలో ఇట్లు కలదు.

"........but the regulation of 1793, establishing [that measure (i. e., Permanent Settlement) and the Code of Law that accompanied it, had provisions *incompatible with their (i.e., Zamindars') being absolute proprietors.* The rights of the Taluqdars and others who held lands under the Zamindars were recognised and protected as long as they paid *the established assessment.* The occupying tenant or ryot had had bestowed on him *fixity of tenure, and the fixity of rent.*"

"............1793వ సం॥పు రెగ్యులేషను సదరు ఏర్పాటు నున్ను దాని ననుసరించి న్యాయచట్టమునున్ను స్థిరపఱచెను. కాని వారి సర్వస్వతంత్రమైన ప్రొప్రయిటరీ హక్కులకు అసంబద్ధముగా దానిలో కొన్ని నిబంధనలు కలవు. జమీాందారులక్రింద భూములను పొందియున్న తాలూకుదారులు ఖాయమైన పన్నును చెల్లించినంతకాలము సదరు తాలూకుదారులు వగైరాల హక్కులు గౌరవింపబడి కాపాడబడుచున్నవి. భూమిని ఆక్రమించి యున్న కవులుదారుకు లేదా రయితుకు స్థిరమైన సాగుబడి హక్కున్ను స్థిరమైన శిస్తురేటున్ను ఏర్పాటుచేయబడియున్నవి.

సర్ జాన్ షోర్ చెప్పిన ఈ మాటలను పాఠకులు మరచి పోకుండ గట్టిగ ముడివేసుకొందురుగాక. ఏలననగ ముందు ముందు దీని ప్రాముఖ్యము పైకి రావలసియున్నది. పర్మనెంటు సెటిల్ మెంటు కాలముందు స్థిరపరుపబడినది, జమీందార్లు సర్కారుకు చెల్లించే "పేష్కస్" ఒక్కటేగాని జమీందార్లకు రైతులు చెల్లించే శిస్తు కాదని ఇటీవల విపరీతవాద మొకటి జమీందారీవర్గముచే లేవదీయబడినది. ఈ విపరీతవాద ఘోషలో పైన ఉదహరించిన ఆ నాటి సర్ జాన్ షోర్ వాక్యములు మునిగిపోయినవి. వాటిని నేటికి 150 ఏండ్ల అనంతరం కాంగ్రెస్ హయాములో ప్రకాశంకమిటీవారు 1938 సం॥లో త్రవ్వి పైకితీయవలసి వచ్చినది. అందుకని ఈ మాటలను గట్టిగ ముడి వేసికొనవలసిన దని పాఠకులను హెచ్చరించుచున్నాము.

[బెంగాల్ పర్మనెంటు సెంటిల్ మెంటు ప్రకటన]
—1793 సం॥ మార్చి 22 తేదీ

మనస్సులో పర్మనెంటు సెంటిల్ మెంటు సంకల్పమును పూర్తిగ ఆమోదించినను, పైకి జమీందార్లతో మాత్రము మొట్టమొదటగ పదేండ్ల సెటిల్ మెంటే చేసుకుంటా మని చెప్పవలసినదని సర్ జాన్ షోర్ సిఫార్సుచేసెను. కాని, దీనికి కారన్ వాలీస్ అంగీకరించలేదు. పదేండ్ల సెటిల్ మెంటునకు అనుకూలమగు రీతిగ 1791 సం॥లో బెంగాల్ కంపెనీవారొక "కోడ్"ను తయారుచేసిరి. 1793 సం॥నాటికి బంగాళాలోని ప్రతిజిల్లాలోను ఈ కోడ్ ప్రకారము లెక్కలు తయారై యుండెను. అంతకు పూర్వమే, 1792 సం॥ సెప్టెంబరు 29 వ తేదీన పర్మనెంటు సెటిల్ మెంటును ఆమోదించుచు సీమనుండి

ఉత్తరువులు వచ్చియుండెను. ఈ ఉత్తరువులను పురస్కరించుకొని, అప్పటికి తయారై యున్న లెక్కల ప్రకారము, బంగాళా దేశములో పర్మనెంటు సెటిల్‌మెంటు చేసివేసినామని చెప్పి 1793 సం॥ మార్చి 22 వ తేదీన కారన్‌వాలీస్ చరిత్ర ప్రసిద్ధమగు గొప్ప ప్రకటన నొకదానిని గావించెను.

## పర్మనెంటు సెటిల్‌మెంటుకు ఆరు కారణములు

జమీందార్ల ద్వారా, ఈ రీతిగా, పర్మనెంటు సెటిల్‌మెంటును చేసికొనుటకు కంపెనీని ఆనాడు ప్రేరేపించిన కారణములలో కొన్నిటిని మాత్రము పైన చెప్పియుంటిమి. అసలు పూరా కారణములేమియో ఇట తెలిసికొనుట అవసరము గాన, ముందు ఆ సంగతులు తెలుసుకుందము. తరువాత, మదరాస్ కథలోనికి పోయినప్పుడు ఈ సెటిల్‌మెంటు యొక్క తప్పులు విచారణ అక్కడ చేసెదముగాక.

పర్మనెంటు సెటిల్‌మెంటును ప్రేరేపించిన కారణములు అనేకములు. వానిలో ముఖ్యముగ ఆరింటిని పేర్కొందుము.

(1) ఆ కాలములో ఇంగ్లండులో భూమి శిస్తు శాశ్వతముగ స్థిరపరుపబడెను. మరియు ఎకరమున కింత యని ప్రతి ఏటా చెల్లింపకుండ, ఒకే పర్యాయ మొక పెద్ద మొత్తమును నజరానాగా సర్కారుకు ఇచ్చివేసిన యెడల, సదరు భూమిపై ఎప్పటికిని పన్ను లేకుండ శాశ్వతముగ, సర్వదుంబాలా ఇనాముగ, అనుభవించవచ్చు నను నియమము కూడ ఏర్పరుపబడెను. (మరా:— ఈ చివరి ఏర్పాటు కారన్‌వాలీస్ పర్పార

చిన పర్మనెంటు సెటిల్‌మెంటులో లేదు). ఇంగ్లండులో వన్ను శాశ్వతముగ సెటిల్ చేశారు. కాబట్టి, ఆ గాలియే ఇండియాలో కూడ సోకెను.

(2) కంపెనీవారు పూర్వపు జమీందార్ల హక్కులను తుంగలో త్రొక్కివేసి, వారి జమీలను ఊడబెరికి, పబ్లిక్ వేలములో ఎక్కువ శిస్తులకు ఏక్‌సాలా, తీన్‌సాలా కౌళ్లకు అమ్మించుచుండిరని చెప్పియుంటిమి. ఈ రీతిగ పదభ్రష్టులుగావింపబడిన జమీందార్లు చాలమంది సీమలో పార్లమెంటువారితో పోయి మొఱపెట్టుకొనిరి. ఈ మొఱలేమిటో విచారించి జమీందార్లకిట్టి అన్యాయము జరుగకుండ మితమును స్థిరమును నగు భూమిపన్నును నిర్ణయించుచు, వారికిదివర కున్న హక్కులను నిలుపవలసినదని చెప్పి, పార్లమెంటువారు కంపెనీవారిని గట్టిగ మందలించిరి. అందుచే వారీ పనికి పూనుకొనక తప్పినదికాదు.

(3) ఇండియాప్రజలు, జమీందార్లు ఇట్లు దోచుకోబడినను, అసలు కంపెనీ బొక్కసముమాత్రము నిండడంలేదు. ఈ సొమ్మంతా కంపెనీ సర్కారు ఖజానాకు చేరుటకు మారుగ మధ్యనున్న దళారులయు, కంపెనీ నౌకర్లయు జేబులలోనికి పోవుచుండెను. కంపెనీ ఏజెంట్లు, గుమాస్తాలు, మోయలేని బరువుల జేబులను రెండుచేతులతో ఎగబట్టుకొని సీమ రేవులలో ఓడలనుండి దిగుచుండగ అసలు కంపెనీ ఖజానా మాత్రము ఖాళియై ఓటిమోత మోగుచుండెను. "మాకు వచ్చే రివిన్యూ ఖర్చుకు సరిపోవడంలేదు, కాబట్టి మాకు 14 లక్షల పౌన్లు అప్పు ఇప్పించవలసిన"దని చెప్పి, 1772 సం॥లో కంపెనీ వారు సీమ పార్లమెంటువారిని కోరిరి. ఇదేమిటని పార్లమెంటు

వారు ఉలికిపడి అప్పుడు కన్నులు తెరచిరి. తాడు బొంగరము లేనివాళ్లు శిస్తుపాటలను హెచ్చించడమేగాని క్రియవచ్చేసరికి సొమ్ము చెల్లించలేకపోయేవారు. అందువల్ల కంపెనీ ఖజానాకు ఏ సంవత్సరములోగాని పూరా మొత్తములు రాలేదు. ఈ తికమకలన్నీ ఏమిటి? ఎంతోకొంత మొత్తము కంపెనీకి ప్రతి సాలునా గ్యారంటీగా వచ్చే ఏర్పాటుచేసుకోడం అవసరం; కాబట్టి, ఏదో విధంగా పర్మనెంటు సెటిల్‌మెంటు చేసుకుంటే గాని, గత్యంతరం లే"దని పార్లమెంటు వారికిన్నీ, కంపెనీవారికిన్నీ కూడ తోచెను. ప్రజలమీద, జమీందార్లమీద ప్రేమచేత కాకపోయినా, తమ ఖజానా మీద ప్రేమచేతనైనా కంపెనీ వారిప్పుడు మితమును శాశ్వతమును నగు పద్ధతి నొకదానిని కనిపెట్టవలసిన అగత్యము వచ్చెను.

(4) బలిష్ఠమగు కేంద్ర మొగల్ ప్రభుత్వము విచ్ఛిన్నము కాగానే, దేశమం దెక్కడ జూచినను స్వతంత్రులమని తల విరియబోసుకొని, తిరిగే గవర్నర్లు, సేనానాయకులు, రివిన్యూ ఆఫీసర్లు, లక్షోపలక్షలు కంపెనీవారి కండ్లకు కనిపించిరి. వీరందరూ "భూమిహక్కు మాదే" నంటూ వాదింపసాగిరి. ఈ గందరగోళ మేమియు తమకు బోధపడక కంపెనీవారు బెంబేరు పడసాగిరి. నిజముగ భూమికి హక్కుదారుడెవడో, కానివా డెవడో తెలిసికోడానికి కంపెనీవారి తరము కాలేదు. అందువల్ల, ఏదోవిధంగా తట్ట తగలేసుకుంటేగాని బండిసాగదని వారికి తోచెను. చిరకాలంనుంచి రివిన్యూ అనుభవం ఉన్న ఈ జమీందారీ ముఠా వారి ద్వారానే సెటిల్

మెంటు చేసుకోవడం తమకు శ్రేష్ఠ లేని పని యని కంపెనీవారికి తోచెను.

(5) కంపెనీవారి రాజ్యము అప్పటికి ఇంకా గట్టి పడలేదు. దేశములోని అంతఃకల్లోలములనుండి గాని, పర దేశస్థుల దండయాత్రలనుండి గాని, తప్పించుకొని, తట్టు కోవలెనంటే, దేశములో ఎవరినో ఒకరిని తమ చంకలో ఇరికించుకోక తప్పదని కారన్‌వాలీస్ ఆలోచించెను. "ఎవ రికో ఒకరికి మంచి ఎరవేసి, వారు సదా దానినే నాకుచూ కూర్చుండేటట్లు చేస్తే— "ఇంగ్లీషు గవర్నమెంటు పోతే మనకీ ఎరరుచి పోతుంద"నే భయోత్పాత మొకటి వారికి కలిగేటట్లు చేస్తే - వారు మనకోసం కాకపోయినా, తమ స్వలాభం నిమిత్తమైనా, మన ఇంగ్లీషు రాజ్యానికి శాశ్వతమైన అండగా అంటిపెట్టుకొని ఉంటారని కారన్‌ వాలీస్ మిక్కిలి దూరదృష్టితో ఆలోచించెను. ఈ ఆలోచన ప్రకారమే, కారన్‌వాలీస్ జమీందార్లను బుజాలు తట్టి, వారితో పర్మనెంటు సెటిల్‌మెంటు చేసుకొనెను. వారివ్వవల సిన పేష్కస్ ఎప్పటికీ హెచ్చకుండ ఉండేటట్లున్నూ, బంజరు భూముల నికముందు సాగులోకి తెస్తే, దానిమీద వచ్చే రివిన్యూలో కంపెనీకి భాగంపెట్ట నవసరములేకుండ అంతా జమీందార్లే తీసుకునేటట్లున్నూ, ఇంకా ఎన్నెన్నో లాభాలను కారన్‌వాలీస్ జమీందార్లకు ఈ పర్మనెంటు సెటిల్‌మెంటులో చూపించెను. ఇన్ని లాభాలను వారికి చూపడములో కారన్‌ వాలీస్ ఉద్దేశ మేమనగ:—ఈ జమీందార్లందరు ఇంగ్లీషు గవర్నమెంటువారి వాకిటిముందర నమ్మినబంటులై శాశ్వత

ముగ పడి ఉంటారని ఆతని సంకల్పము. ఇది అక్షరాలా నెర వేరిన దనుటకు నేటికిని జమీందార్లు బ్రిటిష్‌గవర్నమెంటు పక్షముననే అంటిపెట్టుకొని యున్న చరిత్ర చెప్పక చెప్పు చున్నది. ఇది కారన్‌వాలీస్ ఆనాడు వేసిన గొప్ప రాచ కీయపు ఎత్తు!

(6) సర్కారుకు జమీందార్లివ్వవలసిన పేష్కస్ హెచ్చించకుండ ఒకేసారి స్థిరముగ నిర్ణయించిన యెడల వారు తమక్రింది రైతులను పీడించవలసిన అవసరము ఉండదనియు, అందువల్ల, రైతులు అప్పుడు అనుభవించుచుండిన బాధ లన్నియు తొలగుననియు కారన్‌వాలీస్ ఆశించెను.

[ప్రరా:—కాని, ఈ ఆశ క్రియలో ఎట్లు అడియాస ఐయ్యెనో మున్ముందు చూచెదము గాక.]

## పర్మనెంటు సెటిల్‌మెంటు మంచిదా, చెడ్డదా?

ఈ ఆరుకారణముల ప్రేరణచే 1793 సం॥లో బెంగా లులో గావింపబడిన పర్మనెంటు సెటిల్‌మెంటుయొక్క మెరుగు తరుగులను గూర్చి దరిమిలా చాలకాలము ఇచ్చటను ఇంగ్లండు లోను కూడ తీవ్రవాదోపవాదములు జరిగెను. ఏది ఎట్లున్నను ఒక్కమాటమాత్రము చెప్పకతప్పదు. మెరుగుతరుగు లనేవి తాత్కాలికములు. నేడు మెరుగుగ కన్పించిన రేపు తరుగుగ గన్పట్టవచ్చును. అంతకుపూర్వము ఘోరబాధ లనుభవించు చుండిన ప్రజలకు జమీందార్లకు కూడ పర్మనెంటు సెటిల్ మెంటువల్ల కొంతబాధ నివారణ అయినట్లు అప్పటి ప్రజలు అనుకొనిరనుటలో సందేహములేదు. అదే మనము గమనించ

వలసిన విషయము. పర్మనెంటు సెటిల్‌మెంటును గూర్చి ఈనాడు మన మిప్పు డేమని అనుకొనుచున్నామని కాదు. ఆనాటి ప్రజలు ఏమనుకొన్నా రనునదియే ప్రధానవిషయము. ఆనాటి ప్రజలకు, అనగ, అంతకుపూర్వము ఏ కోటా శిస్తువేలాలవల్ల బాధలు పడుచుండిన ప్రజలకు – జమీందార్లకుకూడ – ఈ పర్మనెంటు సెటిల్‌మెంటు ఏర్పాటు వరప్రసాదముగా ఉండదా మరి !

## మదరాసు రాజధానిలో పర్మనెంటుసెటిల్‌మెంటు ప్రవేశము

1793 సం॥లో బెంగాలులో ఈరీతిగ ప్రవేశపెట్టబడిన పర్మనెంటుసెటిల్‌మెంటు చాలప్రశస్తమైన పద్ధతి యని అప్పటి కంపెనీ యజమానులు ఎంతో సంబరపడి, లొట్టలు వేసుకొనుచు పొగడుకొనసాగిరి. తమ పూర్వతపఃఫలమువల్ల, ఇంతటి మంచి వస్తువు దొరికినప్పుడు, దానిని ఊరకపోనివ్వడమా ? ఇండియాలో తమకున్న యావత్తు రాష్ట్రములలోకూడ ఈపద్ధతిని వెంటనే ప్రవేశపెట్టవలసిన దని కంపెనీ డైరెక్టర్లు ఇండియాకు హుకుముల ఉరికించిరి. "ఈ హుకుములను మీా రెంతవరకు అమలుజరిపారో వెంటనే తెలియపరచ వలసినదని చెప్పి కలకత్తాలో నున్న గవర్నర్ జనరల్‌గారు 1796 సం॥లో మన మద్రాస్ కంపెనీవారి నడిగిరి. చిరకాలము జమీందార్ల ఏలుబడిలో నున్న ఉత్తరసర్కారులలో తప్ప, మిగతా ప్రాంతాలలో ఈ పద్ధతిని ప్రవేశపెట్టడానికి మద్రాసులో నున్న కంపెనీఉద్యోగస్థు లంతగ ఇష్టపడలేదు. అందు మీాద, సీమయజమానులకు పీరిమీాద పట్టరాని ఆగ్రహము

వచ్చినది. "ఈపద్ధతిని మదరాస్ రాజధానిని యావత్తులో ప్రవేశపెట్టవలసినది. అట్లు ప్రవేశపెట్టడానికి ఇష్టముగాని, సామర్థ్యంగాని, లేని ఉద్యోగస్థులను ఉద్యోగమునుండి ఊడబెరుకుతామని తెలుసుకునేది" అని సీమడైరెక్టర్లున్ను కలకత్తా గవర్నర్ జనరలున్నుకూడ 1799 సం॥లో ఉరుములు ఉరిమిరి. ఇక పాపము మదరాస్ గవర్నమెంటు నౌకరేమి చేయగలరు? "ఆ ప్రకారమే మదరాసు రాజధానిలోకూడ పర్మనెంటు సెటిల్ మెంటుచేస్తాము. ప్రస్తుతం ఉత్తరసర్కారులలో ఈపనిని ప్రారంభించవచ్చు"ననిరి. అట్లయినయెడల వెంటనే ఈ పనికి పూనుకోవలసినదని చెప్పి అప్పుడు గవర్నర్ జనరల్గ నున్న వెలస్లీ ప్రభువు ఉత్తరువుల బంపెను. ఆ ఉత్తరువుల ప్రకారం తూర్పుకోస్తావెంబడి ఎస్టేట్లను విడదీసి, లెక్కలు తయారుచేసి పేష్కస్ తేల్చవలసినదిగ మదరాస్ రివిన్యూబోర్డువారు 1799 సం॥ అక్టోబరు 15వ తేదీన కలెక్టరకు సర్క్యులర్లను బంపిరి ఎస్టేట్లవెంబడి సంచారముచేసి, కలెక్టర్లు తయారుచేసిన లెక్కలను పరిశీలించి, పేష్కస్ వగైరాలను గూర్చి గవర్నమెంటుకు సిఫారసు చేసే నిమిత్తము 1802 సం॥ ఫిబ్రవరి 9వ తేదీన "స్పెషల్ కమిషన్" ఒకటి ఏర్పాటుచేయబడెను. పర్మనెంటు సెటిల్ మెంటును మద్రాస్ రాజధానిలో చట్టరీత్యా అమలు జరుపు నిమిత్తమై ఆ సంవత్సరమే అనగ 1802 సం॥లో జులై 13వ తేదీన "మద్రాస్ పర్మనెంటు సెటిల్

కలెక్టరకు సలహాలు
15-10-1799

[స్పె]షల్ కమీషన్
9-..-1802

[పర్మ]నెంటు సెటిల్ మెంటు
[రెగ్యు]లేషన్ 13-7-1802

మెంటు రెగ్యులేషన్" అని ప్రసిద్ధి జెందిన 1802 సం॥పు 24వ రెగ్యులేషన్ మదరాసుకంపెనీ ప్రభుత్వముచే ప్యాస్ చేయబడెను. పని చాలావరకు పూర్తియైనతరువాత ఈ స్పెషల్ కమిషన్ 1803 సం॥ మేనెల 7వ తేదీన రద్దు చేయబడి దాని విధులు దరిమిలా రివిన్యూబోర్డుకు అప్పగించబడెను.

**పర్మనెంటు సెటిల్ మెంటుకు పూర్వము మదరాసురాజధాని రివిన్యూ పరిపాలన ఎట్లున్నది?**

1802 సం॥లో మదరాసురాజధానిలో ప్రవేశపెట్టబడిన పర్మినెంటు సెటిల్ మెంటును గురించి తప్సీలుగ విమర్శించుటకు ముందుగ అంతకుపూర్వము ఈ రాజధానిలో కంపెనీ వా రవలంబించుచు వచ్చిన రివిన్యూ పరిపాలనా విధానముల గురించి కొద్దిగ తెలిసికొనుట అవసరము.

ఇప్పటి మదరాసు రాజధానిలో చాల భాగము పూర్వము కర్ణాటక నవాబు చేతులలో నుండెను. శ్రీకాకుళము రాజమహేంద్రవరము, ఏలూరు, కొండపల్లి సర్కారులనబడు నాలుగు "ఉత్తర సర్కారులు"న్ను ఢిల్లీ బాదుషాకు సామంతుడగు నైజాము చేతులలో నుండెను. బంగాళా దేశములో 1760—65 సంవత్సరముల మధ్య కంపెనీవారికి రివిన్యూ వసూలు అధికారము సంక్రమించినట్లే, ఇక్కడ మద్రాస్ రాజధానిలో కూడ అదే సమయమందు, 1763, 1765 సంవత్సరములలో కర్ణాటకములోను ఉత్తర సర్కారుల పైనను కంపెనీకి రివిన్యూ వసూలు అధికారము లభించెను. కర్ణాటకముపై నవాబగు మహమ్మదాలీ అవివేకము వల్లనున్ను, ఉత్తర సర్కారులపై బాదుషా యొసంగిన దివానీ అధికార ప్రదానము వల్లనున్ను, కంపెనీ వారికీ అవకాశము చిక్కెను.

## కర్ణాటక నవాబు శిస్తు తాకట్లు కథ

భారతవర్ష దక్షిణాపథ ద్వీపకల్ప రాజ్యాధిపత్యమునకై అందలి దేశీయ రాజులను పాచికలుగ జేసి, ఆంగ్లపరాసు కంపెనీలవారు 1743 మొదలు 1763 వరకు ఇరువది సంవత్సరములు ఏకరీతిగ చదరంగపాళుల నాడిరి. తుదకు, పరాసువారి యాట కట్టి, ఇంగ్లీషువారి యాట గెలిచెను. వీరు మహమ్మదాలీ యను రాచపాచికను చేత నిరికించుకొని, అతనిని "కర్ణాటక నవాబు" అనే ఒక పిండిబొమ్మనుగజేసి, దేశమందంతటను తా మాడినదే ఆటగ సాగించుకొనుచుండిరి. మహమ్మదాలీ దుర్బలుడును, ఇంద్రియలోలుడునునై, దేశముయొక్క సివిల్ మిలిటరీ రివిన్యూ వసూలు వ్యవహారములు యావత్తు మదరాస్ కంపెనీవారికి గుత్తకిచ్చివేసి, అందుకగు ఖర్చుకుగాను రాజ్యాదాయము నంతను కంపెనీకి తాకట్టు పెట్టివేసెను! యుద్ధము లెక్కువైన కొద్దీ, "నీకోసం చేసిన యుద్ధాలకు బోలెడు ఖర్చయినది, ఇంకా సొమ్ము తే తెమ్మ"ని కంపెనీవారు మహమ్మదాలీని ఒత్తిడి చేయసాగిరి. ఈ బాధపడలేక, అతడు తన రాజ్యాదాయము నంతను నౌకర్లకు రెండో తాకట్టు పెట్టి, వారివద్దనుండి సొమ్ము తెచ్చి కంపెనీకి కట్టుచుండెను.

ఈ రీతిగ కర్ణాటరాజ్యాదాయ మంతయు కంపెనీకి మొదటితాకట్టున్ను, కంపెనీనౌకర్లకు రెండవ తాకట్టున్నూ !! దీని పర్యవసాన మేమిటంటే, కర్ణాటకరాజ్యములోని రైతులందరు నవాబుగారి ఋణదాతలగు కంపెనీగుమాస్తాల చేతులలోనికి పోయిరి. ఈ గుమాస్తాలకు ప్రజాపరిపాలనా బాధ్యత

లేకపోవడంవల్ల, వీరు రైతులమీద వచ్చిపడి, కొరడాలతో బాది సొమ్ము వసూలుపరుచుకొని, ముందుగ తమ బాకీల క్రింద జమకట్టుకొనుచుండిరి. ఇటు నవాబుకూ సున్నా, అటు కంపెనీకీ సున్నా!! ఈ రీతిగ, 5,6 ఏండ్లు సాగేవరకు, అప్పుడు, 1769 సం॥లో సీమలో నున్న కంపెనీ యజమానులు కండ్లు తెరచిరి. తమ నౌకర్లు నవాబు కింతటి అప్పుపెట్టి రను సంగతి, పాపము! అయిదారు వేలమైళ్లదూరములో నున్న సీమడైరెక్టర్ల కేమి తెలియును? ఆ రోజులలో రైళ్లా; టెల్లిగ్రాములా? నవాబుకోసం కంపెనీవారేమో సొమ్ము ఖర్చుపెట్టి యుద్ధాలు చేయడమున్నూ, అతని రాజ్యాదాయాన్ని మాత్రము కంపెనీ నౌకర్లు వసూలుచేసి, కంపెని ఖజానాకు జమకట్టకుండ, తమ ప్రయివేటు అప్పులక్రింద వసూలు వేసుకోవడమున్నూ చూస్తే, సీమయజమానులకు ఒళ్లు మండెను. తమ నౌకర్లే తమ్ము నిట్లు మోసము చేస్తున్నారని వారు గ్రహించిరి. తాము యజమానులగుటచే తమ నౌకర్లను దబాయించి, వారు తాకట్టు వదలుకొనునట్లు చేయవలెనని డైరెక్టర్లు చూచిరి. కాని, వారి యాటలు పూర్తిగ సాగినవికావు. ఇక్కడి యూరోపియన్ నౌకర్లెవరును సీమడైరెక్టర్ల దబాయింపులకు జడియలేదు. ఏలనగ, వీరికి పార్లమెంటు మెంబర్లలో చాల పలుకుబడి యుండెను. వారికి బోలెడు లంచములు పోసి, ఈ నౌకర్లు తుదకు తమ మాటయే నెగ్గించుకొన్నట్లు చరిత్రవల్ల మనకు తెలియుచున్నది.

కర్ణాటకనవాబు అప్పులగోలయు, ఋణదాతల దుండగములును మితిమీరిపోయెను. వారిలో "బెన్‌ఫీల్డు" అను ఒక దుండగీని కథ మాత్రము మచ్చుకు చెప్పి, అత డెంత వరకు పోయెనో చూపెదము.

నవాబు ఋణదాతల దుండగములు
గవర్నర్ శైలుమరణము

ఈ "బెన్‌ఫీల్డు" అనువాడు 1763 సం॥లో మదరాస్ కంపెనీ కొలువులోనికి ఇంజనీరుగా వచ్చెను. ఇతడు ఇంజనీరు పనిలోకంటె డబ్బు దోచుకోవడములో ఎక్కువ ప్రవీణు డయ్యెను. ఇతనికి సాలుకు కొన్నివందలపౌన్ల జీతముమాత్రమే అయి నప్పటికి, కర్ణాటక నవాబు తనకు పదహారు, పదిహేడు లక్షల రూపాయలు బాకీయున్నాడనియు, తంజావూరులో ఇంకాకొందరు వ్యక్తులవల్ల తనకు ఏడెనిమిది లక్షలు రావలె ననియు, ఇతడు వాదింపజొచ్చెను. ఇందుకుగాను నవాబు రాజ్యములో తంజావూరు ప్రాంతమంతయు తనకు తాకట్టు వున్నదనికూడ ఇతని వాదన! ఈ చిన్నజీతగానికి ఇంత డబ్బె క్కడిది ? "దీనికి వోచర్లు లేవు. అయినా, నవాబు నడిగితే ఒప్పుకుంటాడ"ని ఇతడి వాదన! ఈరీతిగ, నవాబుకు స్పృహ ఉన్నప్పుడో లేనప్పుడో, అనేకమంది నవాబులవల్ల పత్రాలు వ్రాయించుకొనియో, వ్రాయించుకొనకనో అతనిమీద ఊరక అప్పులనువేసి కట్టసాగిరి! ఈ అప్పులకు తగిన ఋజువు లేద నియు, తంజావూరు రాజ్యంమీద బెన్‌ఫీల్డుకు ఉన్నదన్న తాకట్టు అంగీకరించవీలు లేదనియు, రివిన్యూబోర్డువారు కొట్టి వేసిరి. అయితే నేమి? బెన్‌ఫీల్డు అంతటితో ఊరుకున్నాడా?

తన కేసును కంపెనీ కౌన్సిలు ముందు పునర్విచారణకు పెట్టించి కౌన్సిల్ మెంబర్లకు డబ్బు పుష్కలంగా విరజిమ్మి, తన పక్షమును నెగ్గించుకొనెను. బెన్‌ఫీల్డుకు రావలసిన తంజావూరు తాకట్టు బాకీని వసూలుచేసిపెట్టేనిమిత్తము, అక్కడికొక ఏజెంటును పంపుటకు మద్రాసు కంపెనీ కౌన్సిలువారు తీర్మానించిరి. ఎవరిని పంపవలెనను మీమాంస వచ్చెను. "రసెల్" అనే సౌమ్యుని పంపించవలెనని గవర్నర్ "పిగట్" ప్రభువున్ను, "కాదు, బెన్‌ఫీల్డుకు అనుకూలుడగు "స్టూవార్టు అనేవానిని పంపించవలె"నని ఇతర మెంబర్లున్నూ పట్టుబట్టుకొని కూర్చుండిరి. గవర్నర్ "పిగట్టు" తనపట్టును వదలేటట్లు కనిపించలేదు. అందుమీదట, 1776 సం॥ అగస్టు 24 వ తేదీని మిగతా మెంబర్లందరు కలిసి కుట్రజేసి, గవర్నను తోటవిందు కని చెప్పి ఒక రాత్రి వేళ "కూవమ్" ఏటిమధ్య లంకలోనున్న కంపెనీ తోటలోని బంగాళాకు తీసికొనిపోయి, అతని గుండెలకు ఎదురుగ పిస్తోలు బారుచేసి చూపిస్తూ అందరూ ఒక్కుమ్మడి అతనిని పొదివిపట్టి బంధించి, చెరసాలలో త్రోసివేసిరి! ఈ సమాచారం సీమ యజమానులకు కొన్ని నెలలకుగాని తెలియలేదు. అంతట వారు నెత్తినోరుకొట్టుకొని గవర్నరును వెంటనే విడిపించి ఇంటికి పంపించవలసినదని చెప్పి మద్రాసుకు హుకుములను బంపిరి. కాని ఈ హుకుము లిక్కడికి చేరేటప్పటికే గవర్నర్ పిగట్టు ప్రభువు ఖైదుఖానాలో చచ్చిపడియుండెను! మద్రాస్ కోటకు ఉత్తరద్వారముగ నున్న "సెంటుజార్జిగేటు"లోనుండి బయటికివస్తూ సెంట్రల్ స్టేషనుకు సరాసరి దోవదీసే

ఎలెక్ట్రిక్ రైలు ఓవర్ బ్రిడ్జి వైపుకు మళ్లుతూవుంటే, కుడివైపున "బెక్‌ఫీల్డురోడ్డు" అను బల్ల ఒకటి నేను కనబడుతూవుంటుంది. ఆనాడు గవర్నర్ పిగట్టు ప్రభువుయొక్క జైలు మరణానికి కారకుడైన ఈ "బెక్‌ఫీల్డు" గౌరవార్థముయేనా ఈ రోడ్డుకీ పేరు పెట్టబడినది ?

కర్ణాటక నవాబు అప్పులగోల చాలకాలము సీమ పార్లమెంటులోకూడ మ్రోగి మ్రోగి తుదకు 1801సం॥లో అతని రాజ్యాన్ని కంపెనీవారు పూరాగా కలుపుకొని, ఈ బాకీలలో చాలభాగం దొంగఅప్పులని పార్లమెంటువారు నిక్కచ్చిగ కొట్టిపారవేసే పర్యంతము దేశములో మార్మ్రోగుచునే యుండెను. కంపెనీ క్రిందికి పూరాగావచ్చివేసిన తరువాత కర్ణాటకరాజ్యములో అదివర కున్న పాలెగాండ్రతో కంపెనీ వారు కొన్నిచోట్ల పర్మనెంటు సెటిల్‌మెంటు చేసికొనిరి. ఆ చరిత్రకు తరువాత వద్దాము.

—: ఉత్తరసర్కారులకథ :—

ఇక ఉత్తరసర్కారులకథ ఎట్లున్నదో చూద్దాము. 1765 సం॥లో ఢిల్లీపాదుషా కంపెనీవారికి బెంగాల్, బీహార్ ఒరిస్సా రాష్ట్రములపై దివానీగిరీ ఇచ్చిన నాడే శ్రీకాకుళం, రాజమహేంద్రవరం, ఏలూరు, కొండపల్లి అనబడు నాలుగు సర్కారులనుకూడ ఆ షరతులమీదనే యిచ్చెను. ఈ ప్రాంతములు బెంగాలులోవలెనే చిరకాలమునుండి జమీందార్ల ఏలుబడిలోనుండెను. అయినా వీరిహక్కులను. సాంప్రదాయములను కంపెనీవారు మన్నించకుండ, జమీలను, ఇతరభూము

గవర్నర్ రంబోల్డు లంచాలు డిస్మిసల్

లను బెంగాలులో చేసినట్లుగానే, 1778 సం।వరకు ఏక్సాలా కౌళ్లకు వేలములలో అమ్మివేయుచుండిరి. జమీల స్థితి గతులను విచారించి, వారివ్వవలసిన "జుమ్మా" నిర్ణయించే నిమిత్తమై ఒక సంచారపు కమిటీ మొదట ఏర్పాటు చేయబడెను. కాని, ఏలనో అప్పుడు గవర్నర్‌గ నున్న "రంబోల్డు" అను నతను ఈ కమిటీని రద్దుపరచి, జమీందార్ల నందరిని తన వద్దకే మదరాస్. మకాంకువచ్చి, తనతోనే మాట్లాడి శిస్తు ఫైసల్ చేసుకొని పోవలసినదిగ ఆజ్ఞాపించెను. ఇందుపై జమీందార్లకు కంపము పుట్టెను. సర్కారులలోగల 31 మంది జమీందార్లలో 18 మందిమాత్రము మద్రాస్ వెళ్లి గవర్నర్‌తో స్వయముగ మాట్లాడుకొని, 'పంచసాలా' సెటిల్‌మెంటులను చేసుకొనిరి.

కమిటీని రద్దుపరచి, గవర్నరే స్వయముగ జమీందార్లతో శిస్తు ఫైసలా చేసుకోవడంలో, అతడీ జమీందార్ల వల్ల లంచాలు మేశాడనే పెద్ద పుకారు పుట్టెను. ఈ లంచాల బాపతు 16 లక్షల 40 వేల రూపాయలు ఈ "రంబోల్డు" సీమకు రహస్యముగ పంపుకొన్నాడని చెప్పి అతనిమీద నేరము మోపి, 1781 సం॥ జనవరిలో కంపెనీ డైరెక్టర్లతనిని డిస్మిస్ చేసివేసి, ఇంటికి రమ్మనిరి !

"రంబోల్డు" ఇచ్చిన పంచసాలా కౌళ్లు 1783 సం॥తో తీరిపోయెను. 1783 మొదలు 1786 వరకు ఏక్సాలా కౌళ్లు జరిగెను. మరల, శిస్తు హెచ్చించి, 1789 వరకు రివిన్యూ బోర్డువారు తీన్‌సాలా కౌళ్లకిచ్చిరి. మరల, తీన్‌సాలా, పాంచ్‌సాలా, కౌళ్ల నిచ్చు

టెంపరరీకౌళ్లు-పర్మనెంటు సెటిల్‌మెంటు

చుండిరి. ఈ విధముగ ఎప్పటికప్పుడు టెంపరరీకౌల్లతో సెట్లు కొనివస్తూ, వస్తూ, ఆఖరుకు 1802 సం. నుండి, బెంగాలులో మాదిరి, పర్మనెంటు సెటిల్‌మెంటును జమీందార్ల ద్వారా చేసికొనిరి. జమీందార్ల క్రింద లేని హావేలీ భూములను కూడ ముఠాలుగ విడగొట్టి, వేలంవేసి, వేలంలో కొనుక్కొన్నవారి ద్వారా పర్మనెంటు సెటిల్‌మెంటు చేసుకొనిరి. ఈ రీతిగ, అప్పుడప్పుడు, తమ చేతిక్రిందికి వచ్చుచున్న కొత్త రాజ్యాలలో కూడ జమీందార్ల ద్వారా పర్మనెంటు సెటిల్‌మెంటు చేసుకోవాలనే కుతూహలము కంపెనీవారికి, 1806 సం॥ వరకు ఉండుచు వచ్చెను.

1806 నుండి పర్మనెంటు సెటిల్‌మెంటు నెడ విముఖత

కాని, ఆ సంవత్సరములో, "విలియం బెంటింక్" అను నతడు మద్రాస్ గవర్నర్‌గ వచ్చి "ఈ పద్ధతి బాగుండలేదు" అని చెప్పెను. "అనాదినుండి జమీందార్లు ఉన్నచోట వారి తీసివేయకుండ నిలపడం సబబైనప్పటికి, లేనిచోట, కొత్తవారిని మనం చేచేతులా సృష్టించడం – ఇటు మన రాజ్యానికిగాని, అటు పేదప్రజలకుగాని – మంచిదికాదు" అని అతడు ఒక రిపోర్టులో వ్రాసెను. ఇంగ్లాండు ప్రజల అభిప్రాయాలలోకూడ క్రమక్రమముగ మార్పుగలిగెను. నిన్న మొన్నటివరకు మహామంచి దని ఆకాశమంత ఎత్తు పొగడబడిన అభిప్రాయాలే, నేడు మనకు మంచివికావని తోచడం లోకంలో ఆశ్చర్యమైన విషయము. ఇట్లుండగ, ఒకప్రక్కన, "సర్ థామస్ మన్రో" యను నతడు బయలుదేరి, రైతువారీ

సెటిల్‌మెంటు చేసుకోవడం మంచి దని వాదింపజొచ్చెను. ఆప్రకార మతడు 1792 సం॥లో కంపెనీ చేతిక్రిందికి వచ్చిన "బారామహాల్" పరగణాలో 1798 సం॥ నాటికి, రైతువారీ సెటిల్‌మెంటు చేసి చూపించెను కూడాను. ఈ కారణము లన్నిటిచే ప్రేరితులై, "ఇకనుండి వచ్చే రాజ్యాలలో జమీందార్ల ద్వారా పర్మనెంటు సెటిల్‌మెంటు చేయవద్దు" అని 1813 సం॥లో సీమ డైరెక్టర్లు ఇండియాకు ఖచ్చితముగ హుకుముల బంపిరి. ఇక, అప్పటినుండి రైతువారీ పద్ధతియే అమలులోనికి వచ్చెను.

1813 సం॥ పర్మనెంటు సెటిల్‌మెంటు నిషేధము

1793 సం॥లో బంగాళా దేశములో ప్రారంభమై 1813 సం॥వరకు అనగ, రెండు దశలకాలము - కంపెనీవారి రివిన్యూ పరిపాలనా నీతిని నడిపించిన ఈ పర్మనెంటు సెటిల్‌మెంటు యొక్క స్వరూపస్వభావము లెట్టివో - మద్రాస్ గవర్నమెంటువారు 1802 సం॥లో ప్యాస్ చేసిన 25వ రెగ్యులేషను ననుసరించియున్న, దానికి ఉపాంగములుగ ఆరోజుననే ప్యాస్ చేసిన "పట్టా రెగ్యులేషన్ (30 వ రెగ్యులేషన్) "కరణాల రెగ్యులేషన్) (29 వ రెగ్యులేషన్) లయు, 1822 వ సంవత్సరపు 4వ, 5వ సవరణ రెగ్యులేషనుల ఆధారమున నున్నా చర్చింతము.

## రెగ్యులేషనుల సారాంశములు

ఈ రెగ్యులేషనుల సారాంశములు - రెండు

(1) భూమిహక్కు రైతుదేగాని జమీందారుదికాదు. పర్మనెంటు సెటిల్‌మెంటు రెగ్యులేషన్ యొక్క ఉపోద్ఘాత

ములో జమీందార్లకు ఇవ్వబడిన దనే Proprietory right to the Soil ("భూమికి ప్రొప్రయిటరీహక్కు") అనేమాటకు అర్థము భూమికి సంపూర్ణ హక్కు కాదనిన్ని, అది కేవలము "రాజభాగమగు భూమిశిస్తు వసూలు చేసికునేహక్కు" మాత్రమే అనిన్ని; ఈ రెగ్యులేషనులను ప్యాస్ చేయుటకు ముందు కంపెనీ ఉద్యోగస్థుల మధ్య జరిగిన చర్చలు, ఉత్తరప్రత్యుత్తరములున్ను కలెక్టర్లకు పంపబడిన సలహాలున్నూ, ఈ రెగ్యులేషనులలో అసందిగ్ధముగ చెప్పబడిన ఇతరక్లాజులున్ను వాటిక్రింద చేయ బడిన రూల్సున్ను దరిమిలా ఈ రెగ్యులేషనుల ననుసరించి మద్రాస్ గవర్నమెంటువారు ఆ యా జమీందార్లతో పర్మ నెంటు సెటిల్ మెంటు చేసుకొనుచూ జారీచేసినఉత్తరువులున్నూ కోర్టుతీర్పులున్నూ, రెవిన్యూబోర్డువారి ప్రొసీడింగ్సున్నూ ఇంకా ఎన్నెన్నో టన్నులకొద్దీగల గ్రంథరాశినిన్ని పరిశీలించిన పిమ్మట ఋజువుకాగలదు. వీనినన్నిటిని విపులముగ మాట మాటను ఉదహరించి చర్చించుటకు ఈ గ్రంథము చాలదు.

అట్టి ప్రయత్నమునకే పూనుకొన్న యెడల, మరల ప్రకాశం కమిటీవారి పద్ధెనిమిది పర్వాల గ్రంథమున్ను*ఇచ్చట తర్జుమా చేయవలసివచ్చును. కాబట్టి, ఇట్టి ప్రయత్నము నిట విరమించి, ప్రధానమగు ప్రమాణవాక్యములను మాత్రము మచ్చుకు కొన్ని ఇట ఉదహరించి, అంతటితో తృప్తిచెందెదను.

(2) పర్మనెంటు సెటిల్ మెంటు జరిగినప్పుడు, శాశ్వత ముగ స్థిరపరుపబడినవి సర్కారుకు జమీందార్లివ్వవలసిన

---

* మద్రాసు ఎస్టేట్సుల్యాండు సివేదిక తెలుగులో ప్రకటితము విలాసము గవర్నమెంటుప్రెస్సు, మౌంటురోడ్డు, మద్రాసు.

ఒక్క పేష్కస్ను గాక, జమీందార్లకు రైతు లివ్వవలసిన శిస్తు రేట్లుకూడ ఒకేసారి శాశ్వతముగ స్థిరపరుపబడిన వనిన్నీ, వాటిని హెచ్చించడానికి జమీందారుకు ఏవిధమైన హక్కు లేదనిన్నీ— అనేది రెండవ సారాంశము. దీనికి కూడ, పైన పేర్కొన్న గ్రంథరాశియే ప్రమాణము:—

ఈ రెండుసారాంశములకు కలిపి కొన్ని ప్రమాణవాక్యముల నుదహరించెదము.

## —: ప్రమాణ వాక్యములు :—

(పర్మనెంటు సెటిల్‌మెంటు రెగ్యులేషన్ ఉపోద్ఘాతములోని వాక్యములు)

### I. "ప్రొప్రియిటరీహక్కు" అంటే ఏమిటి?

"ప్రొప్రయిటరీ హక్కు"-అంటే ఏమిటి?

భూమిమీద సర్కారుకు చెల్లించవలసిన శిస్తు లోగడ ఏ ప్రభుత్వమున్ను స్థిరముగను మితముగను నిర్ణయించక పోవడంవల్ల ప్రజలకు జమీందార్లకు కూడ చాలచిక్కులు, అవస్థలు గలిగె ననియు, ప్రజలు జమీందార్లు ఎప్పుడెంత మొత్తము చెల్లించుకోవలె ననే నిశ్చయం లేకపోవడమున్ను, ఎవరి నెప్పుడు భూమినుండి తరిమివేస్తారో అనే భయంచేత ప్రజలు జమీందార్లు తల్లడిల్లడమున్ను లోగడ జరుగుచుండె ననియు, అట్టి అస్థిరమును, అపాయకరమును నగు పూర్వపు పద్ధతిని మానివేసి జమీందార్లకు, వారివారసులకు భూమియందు "ప్రొప్రయిటరీహక్కు" నిచ్చుటద్వారా స్థిరమును మితమును నగు భూమిశిస్తు విధానమును అవలంభించుటకు

హక్కుగా రావలసియున్న దని ఆచారసిద్ధముగ విధించబడిన శిస్తు వసూలు చేయుటయు, దానిపైగల లాభము పొందుటయు. లాభమనగా మొదటిది వ్యవసాయము యెక్కువచేసినచో రాబడి మొత్తము హెచ్చించుట; రెండవది శిస్తు వస్తురూపమున ఒసంగబడుచున్నచోట్ల ధాన్యమున వచ్చు లాభము; మూడవది వ్యవసాయదారుడు ప్రోత్సహించుట యుభయుల ఆమోదముపై తక్కువరకము పంటలనుండి ఎక్కువరకమునకు మార్చుటవలన గల్గులాభము.

1908 సం॥ ఎస్టేటు ల్యాండు ఆక్టు ఫోర్బ్సు ఉపన్యాసము.

(2) ఫోర్బ్సు ఉపన్యాసము:—1908 సం లో మద్రాస్ ఎస్టేటులాండు ఆక్టును శాసనసభలో ప్రవేశపెట్టుచు చేసిన ఉపన్యాసములో, అప్పుడు గవర్నమెంటు మెంబరైన "ఫోర్బ్స్ * "పర్మనెంటు సెటిల్ మెంటుక్రింద జమీందారుని స్థితి పబ్లిక్ ల్యాండు రివిన్యూ వసూలు హక్కు మాత్రము పొందబడిన వాని స్థితికంటె, చట్టరీత్యా, ఎక్కువ స్థితి కాద"ని చెప్పెను.

(3) రివిన్యూబోర్డుకు వ్రాయబడిన ఉత్తరము:—

మద్రాస్ గవర్నమెంటువారు రివిన్యూబోర్డుకు వ్రాసిన ఉత్తరము 4-9-1799 సం॥

పర్మనెంటు సెటిల్ మెంటును ఏయే పద్ధతులపై చేయవలెనో సూచించుచు 1799 సం॥ సెప్టెంబరు 4వ తేదీన మద్రాస్ గవర్నమెంటువారు తమ రివిన్యూబోర్డునకు వ్రాసిన ఉత్తరము పార్లమెంటు 5వ రిపోర్టునకు 18 వ అనుబంధముగ ముద్రింపబడినది.

*"The legal status of the Zamindar under the permanent settlement cannot be put higher than that of an assignee of the public land revenue"—

బ్రిటిష్ గవర్నమెంటువారు పూనుకున్నారని పర్మనెంటు సెటిల్‌మెంటు రెగ్యులేషన్ యొక్క ఉపోద్ఘాతములో గలదు *

"ప్రొప్రయిటరీ రైట్-టు-ది-సాయిల్" (Proprietory right to the soil) "భూమికి గల ప్రొప్రయిటరీ హక్కు" అనేమాటయొక్క నిజార్థము విషయమై తగాదా రాగా, అప్పటి రివిన్యూబోర్డు మెంబరగు "హాడ్జిసన్" అను నతడు చర్చించి తేల్చిన సారాంశము ఈ దిగువ కాన నగును.†

"హాడ్జిసన్" రిపోర్టు - 1808-37 వ. పేరా.

పేరా 37:- కావున రెగ్యులేషన్సులో పేర్కొనబడిన జమీందారుని "ప్రొప్రయిటరీరైటు" అనగా వ్యవసాయదారునివద్దనుండి ప్రభుత్వమువారికి

* "........the British Government, impressed with a deep sense of the injuries arising to the state and to its subjects from the operation of such principles, has resolved to remove from its administration so fruitful a source of uncertainity and disquietude, to grant to Zamindars and other landholders their heirs and successors, a permanent property in their land in all time to come and *to fix for ever a moderate assessment of public revenue on such lands, the amount of which shall never be liable to be increased under any circumstaices*".

[ప్రకాశంకమిటీ రిపోర్టు 32వ పేజీలోనుండి ఎత్తివ్రాయబడిన వాక్యములు]

† The proprietory right of Zamindars in the Regulations is therefore no more than the right to collect from the cultivators, that rent which custom has established as the right of Government and the benefit arising from this confined first to *an extention of the amount not of the rate of the customary rent by an increase of cultivation*;—secondly, to a profit in dealings in grain where the rent may be rendered in kind;—thiridly, to a change from an inferior to a superior kind of culture, arising out of a mutual understanding of their interest between the cultivator and the proprietor."

(Report of the Madras Estates Land Act Committee Part I p ·32)

[పార్లమెంటువారి 5వ రిపోర్టు 977 పేజి 37వ పేరా- ప్రకాశం కమిటీ రిపోర్టు 46వ పేజీనుండి]

ఆ ఉత్తరములో ఇట్లున్నది. *

"తాలూక్‌దార్లయు, దిగువసేద్యగాండ్రయు హక్కులకు సంబంధించిన భోగట్టాయావత్తుకూడ మీరు తయారుచేయవలెను. ఎలననగ, జమీందార్లకు ప్రొప్రయిటరీహక్కు ఇస్తున్నామంటే తదితరులకు గల నిర్దిష్టమగు హక్కులను మనము భంగపుచ్చరాదు"

జమీందార్ల కివ్వబడినదని చెప్పబడే "ప్రొప్రయిటరీ హక్కు" అనేది సర్వసంపూర్ణమైనదికాదు. అదిఎన్నో నిర్బంధనలకు, తదితరులకు అనాదినుండియున్న హక్కులకు లోబడియున్నదేదాని వేరుకాదని ఈ ఉత్తరములోని పై వాక్యములను బట్టియు, సదరు ఉత్తరమునుండి ఈ దిగువ నెత్తివాయబోవు 5వ పేరాలోని వాక్యములనుబట్టియు స్పష్టము కాగలదు. ‡

జమీందార్ల కివ్వబడిన "ప్రొప్రయిటరీ హక్కు" ఇకముందు నిర్వచింపబోవు షరతులకు లోబడి యుండుననిన్నీ, అట్టి షరతులు గట్టిగ పాలింపబడినప్పుడే జమీందార్లకు ఈ ప్రొప్రయిటరీ హక్కు నిలుచుననియు కూడ ఆ వాక్యముల సారాంశము. అనగ, ఈ షరతులకు ఏ మాత్రము భిన్నము గలిగినను జమీందార్ల ప్రొప్రయిటరీ హక్కు నిలువ జాలదని అర్థము.

---

* "You will also prepare every necessary information respecting the rights of the talookdars and under tenants throught the different districts, *that in conferring the proprietory rights on the Zamindars we may not violate the ascertained rights of other individuals.*"

‡ "........it has been resolved to adopt the reform introduced some years since into the Bengal Province by constituting the several Zamindars and landholders actual proprietors of the soil or lands composing their estates, *subject to such conditions as will be hereafter noted and secured to them under strict adherence to those conditions...*"

## II. శిస్తుయొక్క శాశ్వతత్వము, మితత్వము

రివిన్యూబోర్డుకు ఉత్తరము 7,8,17 పేరాలు:—

భూమిమీద సర్కారు డిమాండును మితపరచుటవల్లనున్ను, శాశ్వత పరచుటవల్లనున్ను, భూమికి విలువ హెచ్చును కాబట్టి, ఈ పద్ధతిమీద పర్మనెంటు సెటిల్‌మెంటు చేయ సంకల్పింపబడ్డదని గవర్నమెంటువారు 4-9-1799 సం॥న తమ రివిన్యూబోర్డుకు వ్రాసిన ఉత్తరములోని 7,8 పేరాలలో స్పష్టపరచిరి. *

రివిన్యూబోర్డుకు గవర్నమెంటు ఉత్తరము 4-9-1799 సం॥

7, వ పేరా.

శిస్తు ఎన్నటికి మారకుండ, ఒకేసారి శాశ్వతముగ నిర్ణయింపబడినది.

"Fixed in perptuity and declared unalterable".

మితమును శాశ్వతమును చేయసంకల్పింపబడ్డది ఒక్క పేష్కస్సే కాదనిన్ని, శాశ్వతముగ ఎన్నటికి మారడానికి వీలులేకుండ చేయబడ్డది "ల్యాండుటాక్సు" "భూమిపన్ను" అనిన్ని ఆ వ్యాములు బల్లగుద్ది చెప్పచున్నవి.

8వ పేరా:- మితమైనట్టియు శాశ్వతమైనట్టియు రేటు పుచ్చుకోడానికి గవర్నమెంటు ఎందుకు సంకల్పించినది? ఒక్క జమీందార్లను బాగుచేయడానికేనా? కాదు. అసలు ప్రధానోద్దేశ్యము భూమిని సేద్యముచేయు రైతును సంరక్షించడానికి

సేద్యగానివాక్కులు సంరక్షించడంకూడ

---

* " It has been further resolved to form a settlement with each estate on a principle of permanency, calculating the same upon equitable moderate terms,........ *the jumma or land tax* which may be deemed adequate upon this principle *to be fixed in perpetuity and declared unalterable.*"

పర్మనెంటు సెటిల్ మెంటుయొక్క సంకల్పం

8వ పేరాలోని వాక్యములు ఘంటాపథముగ చెప్పుచున్నవి. *

సర్కారు ఖజానాను భద్రపరుచుకోవడంమాట అటుండగ భూమి మీాదనుండి వ్యవసాయంచేసుకునే అశేషజనంతాలూకు హక్కులు గుర్తించి వాటిని సంరక్షించడానికిన్ని సర్కారుపన్ను వసూలు చేసేవారివల్ల ఈ జనానికి ఇక్కట్టులు కలుగకుండ వారి బాధలనుండి వారికి విముక్తి కలుగడానికిన్ని గవర్నమెంటు ముఖ్యముగ సంకల్పించినదని గలదు.

మొత్తంశిస్తులో 2/3 పేష్కష్

17వ పేరా: ఈ సంకల్పము ఏ లెక్కప్రకారము నెర వేరుతుందోకూడ గవర్నమెంటువారు తమఉత్తరములోని 17వపేరాలో ఇట్లుచెప్పిరి. †

"జమీాందార్లవల్ల సర్కారుకు చేరవలసిన మొత్తము సర్క్యూటు కమిటీవారిలెక్కల ప్రకారము తేల్చబడినది. అనగా, శాయిరీ, ఉప్పు పన్నులు మినహాయించి, జమీాందార్లు రైతుల వల్ల వసూలుపరుచుచున్న మొత్తములో మూడింట రెండు వంతులు (⅔) సర్కారు తీసికొనుటకు తీర్మానింపబడినది. శాయిరీ, ఉప్పు పన్నులు ఇక మీాదట సర్కారువారే నేరుగ వసూలుచేసుకొనుటో లేక రద్దుపరుచుటో జరుగును."

---

* "The object of the Government, distinct from the consideration of the public revenue, is to ascertain and protect private rights, and the limitaion of the public demand upon the lands is obviously the *most important and valuable right that can be conferred on the body of the people* who are in any respect concerned in the cultivation of the land. The measure is likewise connected with the *emancipation of this class of people* from those necessarily employed to collect the public dues........"

†" With respect to the amount of the permanent settlement to be secured on these principles with the Zamindars, you will observe that the Government have desired as to prepare materials for that purpose................ It has been resolved to adopt the statements of the committee of circuit as the general standard...............(that is, after deducting " *Sayer* " and " *Salt* " duties) taking two-thirds of the remaining gross collections upon a general calculation........"

భూమిమీదవుండి, సేద్యంచేసే రైతును రక్షించుటకు గాను భూమిమీద చెల్లవలసిన శిస్తును ఒకేసారి శాశ్వతముగ నిర్ణయించుచు, దానిలో మూడింట రెండువంతులు మాత్రమే సర్కారు జమీందారు ద్వారా తీసికొంటూ ఉంటారంటే అర్థమేమి? మిగతా ఒకవంతున్న ($\frac{1}{3}$) జమీందారు తన ఇష్టము వచ్చినట్లు హెచ్చించవచ్చు ననియా అర్థము? అట్లయినచో, పర్మనెంటు సెటిల్‌మెంటుకు పునాదియైన రైతురక్షణ ఏ గంగలో కలుస్తుంది? కాబట్టి పర్మనెంటు సెటిల్‌మెంటునాడు స్థిరపరుపబడినది ఒక్క పేష్కస్సే అని చెప్పుట శుద్ధపొరబాటు, అతిసాహసము.

## III రైతుహక్కు ఇతరులవల్ల ప్రసాదింపబడినదికాదు అది స్వతస్సిద్ధమైనది.

రైతుకు భూమియందుగల హక్కు స్వతస్సిద్ధముగ ఏర్పడినదేగాని, ఇతరులవల్ల దానముగగాని, మరి ఇతర విధముగగాని, లభ్యమైనదికాదు. గవర్నమెంటుగాని, గవర్నమెంటువల్ల దఖల్ పొందిన జమీందారుడుగాని ఇస్తే వచ్చినదికాదు. దీనికి ప్రమాణము సర్ థామస్ మన్రో వాక్యములే. అవి వినండి:—*

సర్ థామస్ మన్రో వాక్యములు

"భారతదేశపు రైతు ఇంగ్లీషు గుత్తదారు భూస్వామి వంటిస్థితిగలవాడుగాదు. కొంచె మించుమించుగా ఇతని హక్కు

*"According to Sir Thomas Munroe, the Indian ryot is not in the position of the English tenent or English land-lord. That was so because the rights of the ryots. came into existence mostly, *not under any letting by the Government of the day, or its assignees, the Zamindars etc., but independently of them*'.
(Arbuthnots' selections from the minute of Sir Thoms Munroe, Vol. I, Pages 234, 253.)

లన్నినాటి గవర్నమెంటువారు భూమి గుత్తకివ్వడంచేతనో వారి వారసులకు జమీందార్లు వగైరాలు గుత్తకివ్వడంవల్లనో వచ్చినవిగావు. వారి ప్రసక్తిలేకుండా స్వతంత్రముగా కలిగినవి.

ఈ పై వాక్యములనుబట్టి జమీందారను నతడు గవర్నమెంటువల్ల రివిన్యూవసూలు నిమిత్తమై ఏర్పరుపబడిన ఒకానొకవ్యక్తి ('అసైని') మాత్రమే యనికూడ స్పష్టమగుచున్నది.

ఇంకా వినండి:

* భూమిమీదగల హక్కులన్నీ రైతున్ను, రాజున్ను పంచుకున్నారు. రాజు ప్రత్యేకముగ తనకని పేరుపెట్టి అట్టేయుంచుకొనని హక్కులన్నీ రైతువే. ఎప్పుడు లేచిపొమ్మంటే అప్పుడు లేచిపోయేవాడుగాడు హిందూదేశపు రైతు. ఇన్ని ఏండ్లలో లేచిపోవాలంటేకూడ పోయేవాడుకాదు అతడు. ఇతరులు ఎక్కువ శిస్తు ఇస్తామన్నారు గనుక నీవు లేచిపో అంటేకూడా లేచిపోయేవాడుగాడు ఇండియారైతు.

ఈ సిద్ధాంతమునే 1903 సం॥లో ఎస్టేటు ల్యాండు ఆక్టును ప్యాస్ చేసే సమయంలో ఫోర్బస్ ఇట్లు చెప్పినాడు:—

"ఇండియా రైతులోగల జిరాయితీ హక్కు అనేది, అతనికి (స్వతస్సిద్ధముగ పుట్టినదేగాని), కొంతకాల మతడు భూమిని ఆక్రమించుకొన్నందువల్ల క్రమక్రమముగ పెరిగి వచ్చినదికాదు.

---

* " A ryot divided with the Government all the rights of the land. Whatever is not reserved by the Government belongs to him. He is not a tenent at will or for a term of years. He is not removable because another offers more." (abid-pages 234,250)

* " The truth is that there is no such thing known to the common law of India as the growth of occupancy right by mere efflux of time"

(2) రైతు జమీాందారుకు చెల్లించినా, ఇనాందారుకు చెల్లించినా, ఇంకెవ్వరికి చెల్లించినా అదంతా రాజభాగమేగా? ఇంకొకటికాదు. మధ్యనున్న జమీాందార్లు, ఇనాందార్లు మొదలైన వారికి స్వతస్సిద్ధమగు హక్కులేమిన్నీ లేవు. ఇందుకు ప్రమాణము 1890 సం॥రం జనేవరి 5-వ తేదీనాటి మద్రాస్ రివిన్యూబోర్డు ప్రొసీడింగ్సులోని ఈ దిగువమాటలే—

మద్రాస్ రివిన్యూ బోర్డు ప్రొసీడింగ్సు 5-1-1890

*పబ్లిక్ రివిన్యూ అనేది భూమిలో సస్యోత్పత్తిలో రొక్కంగాగాని, వస్తురూపంగాగాని, సేవగాగాని చెందే యేదో యొకభాగము. రాజాలకివ్వనీ, జహాగీరుదారులు, జమీాందారులు పాళీదారులు, మిట్టాదారులు, శ్రోత్రియందారులు లేదా ఇనాందారులకివ్వనీ, లేదా తాసిల్దారు, అమల్దారు, ఠాణాదారు లనబడే సర్కారుద్యోగులకివ్వనీ రైతులెల్లకాలమూ చెల్లిస్తూ వస్తుంటే ఈ చెల్లుబళ్లు సర్వేసర్వత్ర గవర్నమెంటుకు చెందవలసిన సొమ్ము అనే పేరుతో ఆ రీతిగా అంగీకృతమవుచున్నది.

దీనినిబట్టి, రైతువారీ ఏరియాలో నున్న రైతుకున్ను, జమీాందారీ లేక ఇనాందారీ ఏరియాలో నున్న రైతుకున్ను తేడా ఏమీాలేదు. కాకపోతే, రైతువారీ ఏరియాలో నున్న రైతు రాజభాగమును సరాసరి గవర్నమెంటుకు (తహశీలు

* "............a certain portion of the produce of the land in kind or money as public revenue, and whether rendered in service, in money or in kind, and whether paid to Rajas, Jagirdars, Zamindars, Poligars Mittadars, Shrotriemdars, Inamdars, or Government Officers such as Tahsildars, Amildars or Tanadars—— these payments, which have always been made by the ryots, are universally termed and considered "*the dues of the Government.*"

దార్ వగైరాల ద్వారా) చెల్లిస్తున్నాడు. జమీందారీ వగైరా ప్రాంతములోని రైతు ఈ రాజభాగమునే మధ్య ఏజెంట్లుగ నున్న జమీందార్ వగైరాల ద్వారా చెల్లిస్తున్నాడు. అంతే.

## IV. పట్టారెగ్యులేషన్ (1802 సం॥పు 30. వ రెగ్యులేషను)

[ముఖ్యమైన సెక్షనుల వివరణ]

### (1) జనరల్ ఉపోద్ఘాత వాక్యములు:—

అదివరకున్న గందరగోళస్థితిని చక్కజేసి, ఇటు రైతుకున్ను, అటు జమీందారుకున్ను మితమును, శాశ్వతమును నైన భూమి శిస్తు పద్ధతికి నిర్ణయించుటకు గవర్నమెంటు సంకల్పించినది కావున, ఇందు నిమిత్తమై 1802 సం॥ జులై 13 వ తేదీన రెండు రెగ్యులేషనులు చేయబడినవి.

పట్టా రెగ్యులేషను లోని ఉపోద్ఘాత వాక్యములు

1802సం॥ (25. వ.) పర్మనెంటు సెటిల్మెంటు రెగ్యులేషను జమీందార్ల నిమిత్తమున్ను రెండవది 1802 సం॥పు (20. వ.) పట్టారెగ్యులేషను రైతురక్షణ నిమిత్తమున్ను.

25. వ. రెగ్యులేషనుయొక్క ఉపోద్ఘాతములోని వాక్యముల నిదివరకే ఉదాహరించితిమి. ఇక 30 వ. రెగ్యులేషను—పట్టారెగ్యులేషను—లోని ఉపోద్ఘాత విషయము చూచెదము గాక—

ఉపోద్ఘాత వాక్యముల సారాంశము *

* "It being advisable that the *existing indefinite mode of dividing the produce of the earth* and of accounting for the customary ready money revenue should be abolished, to the end that the under-Collectors and the under-tenants of the land may have the benefit of protection by *determined*

"ఇంతకు పూర్వము భూమిమీద పండేపంటను పంచు కోవడములోను, రొఖ్ఖా దాయమును లెక్క కట్టుకోవడము లోను, ఒక దోవ తెన్ను లేకుండ వున్నదనిన్ని, ఇక మీదట ఈ గందరగోళపద్ధతిని రద్దుపరచి, పైనున్న శిస్తుదారులు దార్ల కున్ను, దిగువనున్న రైతులకున్ను, మధ్య "సునిశ్చిత మగు కరారునామాలు" - (డిటర్మినేడ్ అగ్రిమెంట్సు) ఏర్పరచి, ఆ షరతుల నన్నిటిని ఖండితముగ (స్పెసిఫిక్ గ) పట్టాలలో పొందుపరచుట అవసరమనిన్ని, కాబట్టి ఈ పట్టా రెగ్యులేషన్ చేయబడుచున్నదనిన్ని ఈ ఉపోద్ఘాతవాక్యముల సారాంశము.

ఈ ఉపోద్ఘాతవాక్యములలో రెండుమూడు సారాంశ ములు కన్పించుచున్నవి:—

(a) లోగడ, ఒకదోవ తెన్నూ లేకుండ తీసుకోబడు చున్న రాజభాగము స్థిరపరచడం ఒకటి. అనగ, అప్పటి లెక్కను బట్టి భూమి పంటలో సగమో, మూడోవంతో, రాజభాగము నిశ్చయింపబడు ననియు, ఇకముందు దానికి - పూర్వమువలె - చీటికి మాటికి మార్పు వుండదనియు అర్థము. ఎక్కువ కావాలని రాజుగాని, తక్కువ చెయ్యాలని రైతుగాని అడగడానికి వీలులేదు.

---

*agreements* in their dealings withthe superior land-holders and farmers of the land, and it being necessary to the tenents that the terms of such agreements should be made *specific* to the end that the cultivators and under tenants being sensible of the advantage of such security may have recourse to them for the provision of disputes, wherefore the following rules have been enacted for the execution of pattas between the proprietors and Zamindars of land or *amanies* and under-tenants, under-farmers or ryots".

(b) ఇట్లు ఒకేసారి నిశ్చయపరుపబడిన శిస్తురేటును, ఇతరషరతులను - ముందెన్నటికీ తగాదా రాకుండ - ఖచ్చితముగ ఒక పట్టాలో పొందుపరుపవలెను. పర్యాయతీని ఏమైనా తగాయిదాలు వస్తే వాటిని పరిష్కరించడానికి ఈపట్టాయే ప్రమాణముగనుండును. జమీందారుకు "సన్నదు" ఎంత విలువైనదో, రైతుకు "పట్టా" అంత విలువైనది. ఇందు కోసమనియే ఈ రెంటికి సంబంధించిన రెగ్యులేషనులను మద్రాస్ గవర్నమెంటువారు ఏకకాలమందే - ఒకరోజుననే ప్యాస్ చేసినారు.

(2) పట్టా రెగ్యులేషన్ సెక్షనుల వివరణ:— 7, 8, 9, 11, 12, 14) సెక్షనులు.

పట్టారెగ్యులేషన్‌లోని ప్రధానమైన కొన్ని సెక్షనుల వివరణ

పట్టా ఎంత ప్రాముఖ్యమైనదో తెలియపరచుటకు, పట్టా రెగ్యులేషనులలోని 7, 8, 9, సెక్షనులే చెప్పక చెప్పుచున్నవి.

*7. వ. సెక్షన్:— పట్టాలో ఉదాహరింపబడినవి గాక ఇంకా ఇతరపన్నులుగాని, రుసుములుగాని, ఏపేరుతోగాని,

జమీందారుపై మూడురెట్లు పినాలిటీ

ఏ వంక చెప్పిగాని, విధింపరాదని ఈ సెక్షన్ నిషేధించుచున్నది. అట్లు జమీందారు విధించే మొదల, ఆ మొత్తానికి మూడురెట్లు పినాల్టీ జమీందారు రైతుకు ఇవ్వవలసియుండును.

* "Proprietors or farmers of land shall not levy, any new assessment or tax on the ryots, under any name, or under any pretence, exactions other than those consolidated in the patta or otherwise authorized by the Government, shall, upon proof, subject the proprietor or farmer to a *penalty* equal to three times the amount of such exaction".

8. వ. శెక్షన్:— ఆరు నెలలలోగా జమీందార్లు రైతుకు పట్టా ఇవ్వనియెడల జమీందారును క్రిమినల్‌గా ప్రాసి క్యూట్ చెయ్యడానికిన్నీ, రైతుకు కలిగిన నష్టానికి తగు పరిహార మిప్పించడానికిన్నీ కూడ ఈ 8 వ. శెక్షనులో ఏర్పాటు చేయబడినది.

జమీందారుపై క్రిమినల్ ప్రాసిక్యూషన్

9. వ. శెక్షన్:— పంటలోవంతు నిర్ణయించుకోవడంలోగాని, రొఖ్ఖపు రేటు విషయములోగాని, ఎప్పుడైనా తగాదావస్తే, పర్మనెంటు సెటిల్‌మెంటుకు పూర్వపు సంవత్సరపు రేటు ఎట్లున్నదో ఆ రేటే నిశ్చయింపబడవలెను. ఆ రేటు దొరకనిచో, అట్టిదే స్వభావముగల హాంసాయీ భూములకు ఆనాడు (అనగ, పర్మనెంటు సెటిల్‌మెంటునాడు) ఏ రేటు స్థిరపరుపబడినదో (రేట్సు ఎస్టాబ్లిష్డ్) ఆ రేటు ప్రకారమే నిశ్చయింపబడవలెను. "రేట్సు ఎస్టాబ్లిష్డ్" అను పదమువల్ల ఆనాడే భూములకు రేట్లు స్థిరపరుపబడినవని స్పష్టమగుట లేదా ?

తగాదావస్తే పర్మనెంటు సెటిల్‌మెంటుకు పూర్వపు సంవత్సరపు రేటు ప్రమాణము

పర్మనెంటు సెటిల్‌మెంటునాడు, రైతులు చెల్లించవలసిన శిస్తుకూడ ఒకేసారి, (పేష్కస్‌తోపాటు) శాశ్వతముగ

* "Where disputes may arise respecting rates of assessment in money or division in kind the rates shall be determined according to the rates prevailing in the cultivated lands in the year preceding the assessment of the permanent Jumma on such lands; or where those may not be ascertainable, according to the *rates established* for lands of the same description and quality as those respecting which the dispute may arise":—

స్థిరపరుపబడిన దని చెప్పుటకు ఈ 9వ శెక్షన్ ప్రమాణము ఒక్కటి చాలదా ? ఎందు కిన్ని ఇతరప్రమాణాలు ?

11, 14 శెక్షనులు:—పట్టాలోని శిస్తురేటుగాక, అనవసరముగ ఇతరరుసుములు వగైరాలు జమీందారు వసూలుపరచినయెడలగాని, జమీందారుడు రైతుకు సదరు మొత్తాలకు రెట్టింపుగ నష్టపరిహారమివ్వవలసి యుండునని ఈ రెండు శెక్షనులు బహుకఠిననియమముల నేర్పరుచు చున్నవి. జమీందారే భూమికి సర్వాధికారియై యుంటే అతని కిన్ని దిగ్బంధనలు శిక్షలు, ప్రాసిక్యూషనులు ఎందుకు ?

రైతుకు నష్టపరిహారము

12వ శెక్షన్:—పట్టాలు ప్రతిసాలునా రెన్యూచేయు చుండవలె నని ఈ 12వ శెక్షన్ చెప్పు చున్నది. అట్లు రెన్యూ చేయకపోతే, అవి రెన్యూ అయ్యే పర్యంతము ఆలాగు ననే చెల్లుబడి యగుచుండు ననియు కలదు. పట్టాలను ప్రతిసాలునా ఏల రెన్యూ చేయవలెను ?

పట్టాలు ప్రతిసాలునా రినెన్యూ చేయబడవలెను. ఎందుకు ?

అవి ఏక్‌సాలా కౌళ్లా ? ఏ యేటి కాయేడు జమీందారు తన ఇష్టమువచ్చిన రేట్లు విధిస్తూ, ఏ యేటి కాయేడు కొత్తపట్టాలు ఇవ్వడానికి ఇవి ఏక్‌సాలా కౌళ్లు కావుగదా ? కాకపోతే ఇక ఏమి అర్థము? వానిని ప్రతిసాలున ఏల రెన్యూ చేయవలెను ? దీనికి కారణము వినండి—

రైతు ప్రతిసాలునా తన వీలునుబట్టి, ఇదివరకు సేద్యము చేయుచున్న భూమిలో కొంత విడుదల పెట్టడానికిగాని పాత

భూమిని అమ్ముకోడానికిగాని, క్రొత్తభూమిని కొనుక్కోడానికి గాని, బంజరుగ వదలివేయడానికిగాని, లోగడ బంజరుగ వదలిన భూమినో, లేక అనాదిబంజరునో ఈ ఏడు సాగులోకి తెచ్చుకోడానికిగాని, రైతుకు అవకాశమున్నది. కాబట్టి ఏ సాలున ఎంత విస్తీర్ణపు భూమిని, ఏ యేరకపుభూమిని రైతు సాగుచేయుచున్నాడో ఆ తప్సీలు తెలుసుకోడానికే పట్టా ప్రతి సాలునా రెన్యూ చేయవలసిన అవసరం ఏర్పడుతూ వున్నది గాని, ఇంకొక కారణముచేత కాదు. రైతు ప్రతిసాలునా ఒకే రకపుభూమినిన్నీ, ఒకే విస్తీర్ణపు భూమినిన్నీ, సేద్యము చేస్తూ వుంటే, నిజానికి పట్టా ఏటేటా రెన్యూ చేయవలసిన అవసరమే లేదు. 1802 సం॥నాడు ఇచ్చిన పట్టాయే నేటికిని, జమీందారు కిచ్చిన సన్నదువలె, సుస్థిరముగ ఉండిపోయి యుండును.

జమీందారుడు రైతుకు పట్టా ఇచ్చారంటే, లోగడ రైతుకు లేని హక్కును, ఇప్పుడు ఈ పట్టాద్వారా ఆతడు రైతుకు ప్రసాదిస్తున్నాడని అర్థముకాదు. రైతుహక్కు అనాది సిద్ధముగ—ఎవరి ప్రమేయము లేకుండ— అక్కడ వుండనే వున్నది. దాని నిప్పుడు జమీందారుడు గుర్తించి సర్కారు తరపున రాజభాగం వసూలు చేయడానికి దాఖలాగా వుండే టందుకే ఈ పట్టా ఉద్దేశింపబడినది. అంతవరకే దాని ప్రయోజనము.

## V పర్మనెంటు సెటిల్‌మెంటు రెగ్యులేషన్

### (ముఖ్యమైన సెక్షనుల వివరణ)

ఇంతవరకు పట్టారెగ్యులేషన్‌లోని ప్రధానమైన సెక్షనులను పరిశీలించితిమి. ఇక జమీందార్ల

1802 సంllపు 25వ రెగ్యులేషను

XXV of 1802 పట్టుకొని వ్రేలాడే పర్మనెంటు సెటిల్ మెంటు (25-వ) రెగ్యులేషనులను కూడ కొద్దిగ చూద్దాము.*

జమీాందార్లకు ప్రొప్రయిటరీహక్కు ఎప్పుడు ఇవ్వబడినది ? సర్కారుకు శిస్తుచెల్లే యావత్తు భూములమీాద (ఉపోద్ఘాతవాక్యములలో చెప్పినట్లు) మితమును, ఎన్నటికి ఏకారణముచేగాని మార్పులేనట్టిన్నీ పబ్లిక్ రెవెన్యూను స్థిరపరచిన పిమ్మటనే ఇన్ కాన్సీక్వెన్సు అఫ్ సచ్ అసెస్మెంటు ఈ ప్రొప్రయిటరీహక్కు జమీాందార్లలో (వెస్టు అవుతుందని) అనగ సంక్రమిస్తుం దని ఈ శెక్షను బల్లగుద్ది చెప్పుచున్నది. ముందుగ రైతులివ్వవలసిన శిస్తును స్థిరపరచి మరీ జమీాందార్లకు ప్రొప్రయిటరీ హక్కు ఇచ్చారు. అంతకు ముందు ఇవ్వలేదు. ఇట్లు ఎన్నటికి మారని పద్ధతిగ భూమి శిస్తును స్థిరపరచి తరువాత జమీాందార్లకు సన్నదులనిస్తే, ఆశిస్తులను హెచ్చించడానికి వీరికి అధికార మెట్లావచ్చినది ? జమీాందార్ల కివ్వబడిన ప్రొప్రయిటరీ హక్కు, తదితరులకుగల హక్కులకున్ను, ఇంకా అనేక షరతులకున్ను లోబడి యుండు నని గద పైన 3వ. పేరాలో రివిన్యూబోర్డువారి వాక్యముల వలన మన కిది వరకు స్పష్టమైనది. ఆ షరతులలో ప్రధానమైన షరతు రైతుకు ఆయువు పట్టువంటిది. ఎన్నటికీ మారనిశిస్తు రేటుగద!

---

* 2వ శెక్షను : "In Conformity to these Principles, an assessment shall be fixed on *all* lands to pay revenue to the Government, *and in Consequence of such assessment* the Proprietory right of the soil was to become *vested* in the Zamindars or other lawful successors for ever".

3 వ. శెక్షను:— పర్మనెంటు సెటిల్ మెంటు రెగ్యులేషను 3. వ. శెక్షను రెండవక్లాజులో ఏమివున్నది ? జమీందార్ల కిచ్చిన ప్రొప్రియిటరీ హక్కు సంపూర్ణమైనది కాదనిన్నీ, దానికి చుట్టూ అనేక షరతులు, దిగ్బంధనలు వున్న వనిన్నీ, వాటి కన్నిటికీ లోబడియే ఈ ప్రొప్రయిటరీ హక్కు చెల్లుబడి కావలసియుండుననియు, ఈ క్లాజు స్పష్టముగ చెప్పుచున్నది.

14. వ. శెక్షను:— ఈ షరతులలో ప్రధానమైనది 14 వ. శెక్షనులో గలదు. జమీందారులున్ను, రైతులున్ను తమ మధ్య సాధ్యమైనంత త్వరలో పట్టాలు, ముచ్చిలికాలు వ్రాసుకోవలసి యుండుననిన్నీ, అందులో రైతు జమీందారుకు చెల్లించవలసిన మొత్తము ఖచ్చితముగ ఉదాహరింపబడవలసియుండు ననిన్నీ ఇతరషరతులు కూడ వివరింపవలసి యుండుననిన్నీ, ఈ శెక్షను విధించుచున్నది.*

ఈ శెక్షనులో గల "defining the amount" అను పదమునున్ను, పట్టా రెగ్యులేషన్ యొక్క ఉపోద్ఘాతములో గల "determined agreements" అను పదమునున్ను, పర్మనెంటు సెటిల్ మెంటు రెగ్యులేషన్ యొక్క ఉపోద్ఘాతములోని చివరవాక్యములలోగల "and to fix for ever a moderate assesment of public revenue on such lands, the amount of which shall never be liable to be increas-

* Section 14 Prescribe "that the Zamindars and lan holders should enter into engagements with their ryots fo rent either in money or kind, and shall within a reasonab period of time exchange *pattas* and *mutchilikas defini the amount to be paid by him* and explaning every conuition of the engagement...........".

ed under any circumstances" అను పదములలోని అర్థమే తప్ప ఇంకొక అర్థము చెప్పడానికి వీలులేదు. ఈ ఉపోద్ఘాతములు, రెగ్యులేషనులు సెక్షనులు అన్నీ ఒకేసంకల్పముతో ఒకేమనస్సుతో, ఒకేరోజున చేయబడినవేగాని భిన్నసంకల్పములతో చేయబడలేదు. ఈ సంకల్పము ధారావాహికముగ ఈ శెక్షనుల అన్నింటియందును ఏకరీతిగ ప్రవహించుచున్నప్పుడు ఈ మాటలకు ఒకచోట ఒక అర్థమున్ను, ఇంకొకచోట ఇంకొకఅర్థమున్ను చెప్పడానికి ఏ శాస్త్రసాంప్రదాయమున్ను ఒప్పదు.

కాబట్టి, జమీందారు కివ్వబడిన ప్రొప్రియిటరీ హక్కు ఎన్నటికి మారని శిస్తురేటుతో తనకు, రైతుకు మధ్య పట్టా ముచ్చిలికాలు ఏర్పడితీరవలె ననే ఖచ్చితమగు షరతుకు లోబడిన దేగాని విచ్చలవిడిదైనది కాదని పర్మనెంటు సెటిల్‌మెంటు యొక్క ఈ 14వ. శెక్షనే చెప్పుచున్నప్పుడు, జమీందారెట్లు తప్పించుకోగలరు ?

8, 9, సెక్షనులు:— జమీలు ఇతరులకు ట్రాన్స్‌ఫర్ అయినప్పుడుగాని, జమీలలో కొంతభాగము విభాగమైనప్పుడు గాని, పేష్కస్ బాకీక్రింద వేలం అయినప్పుడుగాని, లేక క్రియం వగైరాలవల్ల ఇతరులకు చేతులలోనికి బదలాయింపైనప్పుడు గాని, అట్లు విడగొట్టబడిన జమీలలో శిస్తు రేట్లు ఎట్లుండవలెనను ప్రశ్నకు సమాధానము 9వ. శెక్షన్ 2వ క్లాజులో కనిపించును. ఎట్లనగ:—

"ఈ సందర్భంలో వేరుచేసిన భూమిమీద నిర్ణయించ

వలసిన అసెస్మెంటు జమీందార్ అంతటి విలువకూ, ఖాయము మొత్తపు జుమ్మా యే హిస్సగా ఏర్పడుతుందో ఆదామాషానే వేరుచేసినభూమి ప్రత్యక్షపువిలువనుబట్టి ఏర్పడవలెను.''*

ఉదాహరణ:- జమీ యావత్తుఖరీదు ఒక లక్షరూపాయలనుకొనండి. దానిమీద రైతులనుండి శాశ్వతముగ చెల్లవలసిన వెరశిశాశ్వతపు జుమ్మా (పేష్కస్ కాదునుమండీ-) అనగ, పర్మనెంటు సెటిల్మెంటు నాడు సాగుబడిలో నున్న భూమిపై రైతులివ్వతగిన శిస్తు లెక్కగట్టి శాశ్వతముగ తేల్చిన అంకె—ఒక నాలుగు వేల రూపాయ లనుకొనండి.

దరిమిలా కొన్ని ఏండ్లకు జమీలో నాలుగవవంతు ఏ కారణంచేతనో విభాగమైన దనుకొనండి. ఈ నాల్గవవంతు జమీలో ఎంతశిస్తు చెల్లవలెనంటే, పర్మినెంటు సెటిల్మెంటు నాడు చెల్లుచుండిన నాలుగువేలలో నాలుగోవంతు అనగ ఒక వెయ్యిరూపాయలు మాత్రమే చెల్లవలెనుగాని, హెచ్చు చెల్లరాదని ఈ శెక్షన్ యొక్క అర్థము. ఈ లెక్కలో దరిమిలా సాగుబడిలోనికి వచ్చిన బంజరు భూములమీద శిస్తు ప్రశంశ రాలేదు. అది వేరే లెక్కగ తీసికోబడును.

ఈ సెక్షనులో మనము గమనింపవలసిన పదము లేమంటే "వెరశి శాశ్వతపుజుమ్మా" జమీలపై ఆనాడు జుమ్మా

* "The assessment to be fixed in this case on the separated land, shall bear the same proportion to the actual value of the separated portion as the *total permanent jumma* on the Zamindari bears to the actual value of the whole Zamindari"

(శిస్తు) శాశ్వతముగ తేల్చబడిన దని చెప్పుటకు ఈ పదములు చాలవా? జమీందారీవర్గమువారు ఈ మాటలకు "రైతు లిచ్చే శిస్తుకాదు, మేము చెల్లించే పేష్కస్" అని వాదించుట సాహసము! పేష్కస్ అనే అర్థమే ఉద్దేశింపబడి వుంటే "part of the jumma" (జమ్మాలో భాగము) అని యుందురుకాని, "total permanent jumma. (వెరశి శాశ్వతపు జుమ్మా) అని అనియుండరు.

ఈ 8, 9 సెక్షనులవల్ల తేలినసారాంశ మే మనగా:— పర్మినెంటు సెటిల్‌మెంటునాడే రైతు లివ్వవలసిన శిస్తుకూడ శాశ్వతముగ నిర్ణయింపబడె ననిన్ని జమీలు అంతాగాని, కొంతభాగం గాని వేలా లయినప్పుడున్ను, క్రయ-వక్రైరాలవల్ల ఇతరుల చేతులలోనికి పోయినప్పుడున్ను వాటిని కొనుక్కొన్న వారు రైతులపై హెచ్చుశిస్తు విధించరా దనిన్నీ స్పష్టమగుచున్నది.

6, 7 సెక్షనులు:—జమీందారుకివ్వబడిన ప్రొప్రయిటరీ హక్కు చాలసంకుచితమైన దనుటకు ఇంకను మూడుప్రమాణముల జూపెదము.

(a) పేష్కస్‌కు రిమిషన్ లేదు:—జమీందారివ్వవలసిన పేష్కస్‌కు ఎన్నడూ రిమిషన్ ఇవ్వబడదు. ఎందువల్లనంటే అతడు కేవలము శిస్తుకంట్రాక్టుదారుడే. కంట్రాక్టుయొక్క స్వభావమేమి? కంట్రాక్టుదారుకు వచ్చే లాభనష్టాలతో ఎవరికీ పనిలేదు. కంట్రాక్టుదారుకు నష్టమువస్తే, కొనకు అతనికి మిగిలే కమిషన్‌లోనే తగ్గుతుందిగాని వేరొకటిలేదు. ఈ లాభ

నష్టాలకు ఒప్పుకొనియేగద అతడీ కంట్రాక్టుచేశాడు. కాబట్టి అతడివ్వవలసిన పేష్కస్‌కు రిమిషన్ ఇవ్వవలసిన అగత్యం లేదని ఈ 6వ సెక్షన్ బహు సబబుగ చెప్పుచున్నది. ఈ ఒక్క-అంశమునుబట్టికూడ జమీందారుడు శిస్తుకంట్రాక్టుదారుడని స్పష్ట మగుచున్నది. ఇంకను-

(b) 7వ సెక్షన్‌చూడండి:—పేషస్ బకాయపడితే, ముందుగ జమీభూములను వేలంవేయమన్నారు. ముందుగ జమీందారు తాలూకు స్వంతఆస్థి (పర్సనల్ ప్రాపర్టీ) అనగ దివాణంలో గంట, చెంబు, తప్పాలా, గొడ్లు గోద వగైరాలు వేలంవేసి దానివల్లకూడా పూడకపోతే అప్పుడు భూమిమీదికి వెళ్ళ మన్నారు. ఒకసారి ఇట్లాగే నూజివీడు జమీలో ముందుగ దివాణంగంట జప్తుచేశారట!

జమీందారులకు గలహక్కు ప్రధానముగ భూమియే అయినట్లయితే, ఈ 7వ. శెక్షన్‌కు పనిలేదుగద! జమీ భూములను వేలంవేసినప్పుడైనను, కొనుక్కొన్నవాడు వాటిమీద శిస్తు వసూలు చేసుకోవలసినదేగాని, రైతులను లేవగొట్ట డానికి వీలులేదుగద! జమీవేలమైనను, రైతులహక్కు చెక్కు-చెదరకుండ అట్లే యుండును. కాబట్టి, జమీవేలాలలో అమ్ముడు పోయే దేమిటి? జమీందారు తాలూకు "మేల్‌వరం" హక్కేగాని, వేరొకటికాదు. అతని కున్న దన్న "ప్రొప్రియిటరీ హక్కు" అదేగాని అంతకు మించికాదు.

(c) కారన్‌వాలీస్ వాక్యాలు:— "ప్రొప్రియిటరీ హక్కు" అనేమాటకు చెప్పబడిన ఈ అర్థమే 1786 సం॥

ప్రిల్ 12 వ తేదీన గవర్నర్ జనరల్ కారన్‌వాలీస్ నోటి నుండి వచ్చినట్లు గవర్నమెంటు రికార్డులలో గలదు. *

జమీందార్లు భూస్వాము లని, భూపతు లని; కారన్‌వాలీస్, షోర్‌లు చెప్పిన మాటలు, ఇంగ్లండు దేశములోని అర్థములో గాక, హిందూ దేశములోని అర్థములో — అనగ, కేవలము కవితాలంకారముగ - చెప్పబడినవే గాని, వేరు కాదని ఇందున్నది.

12 వ శెక్షన్ :— పర్మనెంటు సెటిల్‌మెంటు రెగ్యులేషను 12 వ శెక్షనులో జమీందార్లు ముందుగ గవర్నమెంటు అనుమతి లేనిది, ఇకమీదట కొత్త యినాములను సృష్టించరాదను నిషేధ మేర్పరుపబడినది. ఏల? గవర్నమెంటుకు చెల్లవలసిన పేష్కస్‌కు హామీ జమీలోని భూములమీద జమీందారుకు చెల్లే శిస్తేగద. ఇనాములను సృష్టించుట యనగ జమీందారుడు ఈ శిస్తును మాఫు చేస్తున్నా డన్నమాట. అనగ, హామీ యొక్క విలువ తగ్గిపోయేటట్లు చేస్తున్నాడన్న మాట. తమ కిచ్చిన హామీ విలువ తగ్గడానికి ఎవరు ఒప్పు

---

"Extracts from selections from the State Papers of the Governer-General of India" by Sir George Forrest C. I. E; Ex-Director of Records, Government of India:—

"Cornwallis spoke of the Zamindars, as "Lords of the soil, and owners of land". *He used these terms in the same sense as Shore did in the Oriental and not in the English sense.* He only recognised a limited and not an absolute proprietorship. His aim was to make the Zamindars liable to pay a fixed moderate revenue to the State and the rights and interests of the ryots protected so that they would become customary tenants."

కుంటారు? కనుకనే "ముందుగ మా పర్మిషన్ లేనిది నీవు రైతు లివ్వవలసిన శిస్తును నీవు మాఫుచేసుకోడానికి వీలులేదు. అనగ ఇనాములను సృష్టించడానికి వీలు లేదు" అని ఈ 12వ శెక్షను ద్వారా గవర్నమెంటువారు నిషేధించారు. అందువల్లనే గవర్నమెంటు పర్మిషన్ పొందకుండ ఇవ్వబడిన "దరిమిలా ఇనాములు" చెల్లవని ప్రకాశం కమిటీ రిపోర్టులో స్పష్టముగ తెలియపరచినారు. జమీందారులకు కేవలం శిస్తు హక్కేగాక నిజంగా భూమిహక్కే వుంటే ఈ నిషేధానికి అవసరం ఉండదుగద.

## VI హాడ్జిసన్ రిపోర్టు

1802 సం॥ నాటి 25,30 రెగ్యులేషనులలో రైతులయు జమీందార్లయు హక్కు బాధ్యతలు వివరింపబడినప్పటికి, జమీందార్లు క్రమేణ డబ్బు, పలుకుబడి గలవారగుటచే రైతుల హక్కులను భంగపరుచుటకు పూనుకొనిరి.

ఈ రెగ్యులేషనులలో గల ఒక సన్నని రంధ్రమువల్ల జమీందార్లకి అలుసు చిక్కెను. ఆ రంధ్ర మే మనగ— జమీందార్లు తమ శిస్తులను వసూలుచేసుకోడానికి వారికి జప్తు, వేలం అధికారం నేరుగ యివ్వబడినది. కాని రైతు తన హక్కును సమర్థించుకోవా లంటే అతడు సివిల్‌కోర్టుకు పోవాలని చెప్పబడినది. దీనితో రైతు దుంప తెగినది. డబ్బు, పలుకుబడి గల జమీందారుతో పేదరైతు ఏమి వ్యాజ్యమాడగలడు? కోర్టులలోకూడ న్యాయము డబ్బుగలవానికే సులభముగ లభిస్తుంది గనుక, రెగ్యులేషనులలో రైతుల కివ్వబడిన హక్కులు

అడుగున పడిపోయినవి. ఈ దుస్థితిని విచారించి మాన్పడానికి మద్రాసు గవర్నమెంటువారు 1808 సం॥ లో 'హాడ్జిసన్' అను రివిన్యూబోర్డు మెంబరును నియమించిరి. అతడు విచారించి పెద్ద రిపోర్టు వ్రాసెను. ఆ రిపోర్టు అత్యద్భుతమైనది. దానిలో "ప్రొప్రయిటరీ రైట్", "రెంటు" వగైరా పదములకు స్పష్టమగు నిర్వచనములు చేయబడెను. వానిలో "ప్రొప్రయిటరీ రైట్" అను పదమునకు గల అర్థమును ఈతని రిపోర్టుయొక్క 37వ పేరాలో నుండి లోగడనే ఉదహరించి యుంటిమి. ఇంకను ఎక్కువ అంశములున్ను, రైతు లివ్వవలసిన శిస్తురేట్ల స్థిరత్వాన్ని గురించిన్నీ ఈతని రిపోర్టులోని 35, 36 పేరాలుకూడ ప్రమాణ వాక్యములుగ పఠింపదగి యున్నందున వాని నిట పూరాగా ముద్రించుచున్నాము.

35 :— రిగ్యులేషనులో పేర్కొనబడిన 'ప్రొప్రయిటరీ రైట్సు' అను పదము నందు రెండు హక్కులున్న వనియు, అందు ఒకటి వ్యవసాయదారులు, రెండవది జమీందారులు కలిగి యుండగల రనియు, అవి రెండు సుస్పష్ట మగు విభాగము గలిగి యున్నవనియు అప్పటికాలములో అందరు ఎరుగరు. ఇప్పుడుకూడ సర్వత్రా అంగీకరింపబడకుండుట విచారకరము. రిగ్యులేషనులో తరచు వాడబడిన 'ప్రొప్రయిటరీ రైట్సు', జమీందారు లందఱికి, కొన్నవారికి ఆనువంశీయులకు కూడ ఉన్నట్లు సన్నద్ మిల్కియతు యిస్తిహారు ఖాయపరచిన హక్కు, పరిమితి లేని హక్కనియు, అనగా నిర్వచనము లేని హక్కనియు, దానిని జమీందారు ఎస్టేటు భూము లన్నింటి యం దుపయోగించుకొనవచ్చు ననియు వాదించబడెను.

ప్రొప్రయిటరు శిస్తు వసూలుచేయునపుడు తన యిష్టప్రకారము తప్ప నిబంధనలకు కట్టుబడి ప్రవర్తింపవలె ననుట 'ప్రొప్రయిటరీ హక్కు'నకే విరుద్ధమనియు, రెంటు ఎక్కువని తోచినచో లేచిపోవుట ఒక్కటే రయితునకున్న మార్గ మనియు ప్రకటింపబడెను. ఈ విషయమున రైటు ఆనరబులు కార్నవాలీసు ప్రభువు, సర్ జానుషోరుగార్ల వివాదమును, బెంగాలు రిగ్యులేషనులు, పెర్మనెంటు సెటిల్మెంటు కోరుచు మదరాసు రెవిన్యూబోర్డువారు గావించిన తీర్మానములును అందరికి అందుబడిగా నుండి పరిశీలించి యున్నచో యీ రీతిగా వాదించుట కవకాశ ముండెడిది కాదు. ఈ డాక్యుమెంటులను ప్రజలందరు చూచుట కవకాశ ముండినను వాటిలోని ముఖ్యభాగములను ప్రకటించియున్నను పెర్మనెంటు సెటిల్మెంటులోని ప్రధాన సిద్ధాంతము వ్యవసాయదారుల హక్కులను ఖాయపరచి భద్రపరచుటే యని తెలియ గలదు. 'ఖాయపరచి, భద్రపరచుట' అను మాటలను గమనింపవలెను. ఏమన, వారికి క్రొత్తగా నేమియు హక్కు లొసంగుట లేదు. వారికి గల ఈ దిగువ హక్కులను గూర్చి ఎట్టి సందేహము లుండుటకును వీలు లేదు.

1. జమీందారుగాని, ప్రొప్రయిటరుగాని (ఏ పేరున పిలువబడినను ఆ తరగతివాడు) శిస్తునకై డిమాండులు తన ఇష్టము ననుసరించి చేయు వీలు లేదు. అట్లు చేయవచ్చునని చట్టముకాని, ఆచారముకాని, వాడుకగాని లేదు. అనగా

2. నేల దున్ను వ్యవసాయదారులకు అనాదినుండియు తాము

సాగుచేయుచున్న భూమికి నిర్ణీతమగు శిస్తునే చెల్లించు హక్కు కలదు.

36 :—ఈ హక్కు యిండియాలో ఉత్తరము నుండి కన్యాకుమారీ అగ్రం వరకు గూడ అందరు వ్యవసాయదారులకు గలదు. ఈ హక్కు భారతసామ్రాజ్యములో యితర ప్రాంతము లందు ఎట్లు క్రమేణ తప్పిపోయినదో మున్ముందు చూపగలను. అంతకంటె యెక్కువ చెల్లింపవలసిన బాధ్యత ఏ మాత్రమును లేదు".

[ నవరణ రెగ్యులేషనులు ]

VII 1822 సం॥ పు 4వ, 5వ, నెంబరు రెగ్యులేషనులు

జమీందార్ల కివ్వబడిన జప్తు అధికారములవల్ల రైతులకు చాలా హింస కలిగిన దనిన్నీ, దీనిని మాన్పుటకు పట్టా రెగ్యులేషనులోని షరతులను గట్టిగ అమలు జరుపవలసిన దనిన్నీ, సీమ డైరెక్టరుకూడ 1812 సం॥ డిశంబరు 16వ తేదీ గల తమ ఉత్తరములో మద్రాసు గవర్నమెంటును గట్టిగ కోరిరి. హాగ్సర్ చెప్పిన అర్థాలున్ను, డైరెక్టర్లు చేసిన హెచ్చరికలున్నకూడ నిరర్థక మయ్యెను. అప్పుడు రైతుల యొక్క హక్కులను ధ్రువపరుచుటకు గాను మదరాసు గవర్నమెంటువారు 1812 సం॥లో రెండు (నవరణ) చట్టములను చేయవలసి వచ్చెను.

4వ నెంబరు చట్టములో "జమీందార్లకు ప్రొప్రయిటరీ

హక్కు యిచ్చినామంటే, అది రైతుల కున్న హక్కులకు లోబడే" అని స్పష్టము చేయపడ్డది. 5 వ నెంబరు చట్టములో రైతులు సివిల్ కోర్టులకు పో నక్కర లేకుండ సమ్మరీగా కలెక్టరు వద్దనే దావాలు పరిష్కరించుకో వచ్చు నను సౌకర్యము చేయ బడెను.

## VIII హావేలీభూముల వేలం షరతులు.

పురాతన జమీలలో చేసిన పర్మనెంటు సెటిల్ మెంటుతో పాటు, హావేలీ భూములను కూడ ముఠాలుగ విడగొట్టి, వేలం వేసి, కొనుక్కొన్నవారికి, ఇతర జమీందార్లకు యిచ్చినట్లుగానే సన్నదుల నిచ్చిరి. ఈ సందర్భమున గవర్నమెంటుచే ప్రకటింపబడిన వేలం షరతులలో మచ్చుకు మచిలీ పట్నం జిల్లాకు సంబంధించిన వానిలో 18వ, 20వ షరతులను ఈ దిగువ పూరాగా ముద్రించుచున్నాము.

18వ క్లాజు:—"సర్వ భూఖామందుగా గవర్నమెంటు ఈ భూముల యందు కలిగి యుంటున్నట్టియు, చలాయించు చుండినట్టియు సదరు అధికారమును యీ భూములను కొను వారు పొందగలరు. కాని, అధికార దుర్వినియోగము జరుగ కుండు నట్లును, క్రింది రకపు జనుల కగు హక్కులను, నిర్ణితాధి కారములను, రివాజులను మామూలు సౌకర్యములను రక్షించి కాపాడు నిమిత్తమున్ను గవర్నమెంటు కొన్ని రెగ్యులేషనులను తయారు చేయుచున్నారు. సదరు జాగీరులలోని జనులకు 1210 ఫసలీ తాలూకు డౌలునందు నిర్ణయింపబడిన తరం రేటుకంటె హెచ్చు తరం రేటును, యీ భూములను కొనుక్కొనేవారు,

విధించి వసూలుచేయుటకు అధికారము కలిగియుండరు. సదరు డౌలులో నిర్ణయింపబడిన రేట్లకంటె హెచ్చు రేట్ల ప్రకారము పంటలోని భాగమును గవర్నమెంటువారి హక్కులకు ఉత్తరాధికారు లయ్యెడి క్రయదారులు వసూలుచేయుటకు అధికారముండదు. ఆ జాగీర్లలోని జనులవల్ల వ్యాజ్యపు తగాదాలు రాకుండ గలందులకై యీ విషయములను నిర్ధారణ చేయడమయినది.”

20వ క్లాజు:—“1210 ఫసలీ బాపతు డవులునందు నమోదు చేయబడిన రేట్ల ప్రకారము మాత్రమే రొక్కాదాయమును వసూలు చేసికొనుటకు క్రయదారు లందరును హక్కు కలిగి యుందురు. కాని ఫలవృక్షముల తోటలకు మాత్రము కాడి ఒకటికి ఒక్కటి చొ॥న రొక్కమును తీసికొనుటకు హక్కు కలిగి యుందురు. ఈ రేటును గవర్నమెంటువారు రద్దుచేయ నిశ్చయించిరి. వీటికి మామూలు పూర్వపద్ధతి ప్రకారము ఫలసాయభాగమును తీసుకొను పద్ధతిని నిర్ణయింప దలంచిరి. కాబట్టి అచటి నివాసులతో సహా ఇంతకు ముందున్న అచటి ఫలవృక్షములలోని భాగమును సమానంగా క్రయదారులు తీసికొనవలెను. గవర్నమెంటుకుకూడా సమాన భాగమునే గాని, సమానమైన రెవిన్యూనుగాని చెల్లింపవలెను. ఈ విధమైన ఫల విభాగ పద్ధతిలో చింతచెట్లు మినహాయింపబడినవి. ఈ భూములకు ప్రొప్రయిటర్లు కాబోవు క్రయదార్లు సర్కారు రెవిన్యూ చెల్లించు యింతకుముందు వున్న చింతచెట్ల ఫలసాయములో ముప్పాతిక వంతును తీసికొనవలెను. క్రయదారులకును, అచటి నివాసులకును ఉభయక్షేమకరమైనటు

వంటి ఒడంబడికలను, కిమ్మతు మదింపులను క్రయదారులు చేసికొనుటకు స్వతంత్రులై యుందురు."

1210 ఫసలీ నాడు వసూలు చేయబడుచున్న తరం రేట్లకున్నూ రొక్కపు రేట్లకున్నూ మించి ఈ హవేలీలను కొనుక్కున్న పాటదార్లు హెచ్చు మొత్తములను రైతుల నుండి ఎన్నడు వసూలు చేయరాదను షరతు ఈ రెండు క్లాజులలోను సుస్పష్టము చేయబడినది.

19వ క్లాజులో ఈ పాటదార్లు గవర్నమెంటు స్థానే శిస్తు వసూలుదార్లుగ నియమింపబడినట్లు చెప్పబడినది. ఇసారడే.

1217 ఫసలీలో (అనగ 1807 సం॥ జులై 12వ తేదీన) కడలూరు; తిరువనంతపురం హవేలీలను అమ్మిన వేలం షరతులలో 6వ క్లాజు చూడండి.*

వేలం పాటలో హవేలీ ముఠాలను కొనుక్కొన్న ముఠాదార్లు రైతులతో శాశ్వత మగు రేట్లతో కరారునామాలు ఏర్పరచుకొన్నప్పుడే వారికి సన్నదులలో చెప్పబడిన హక్కులు సంక్రమించు నని ఈ 6వ క్లాజు చెప్పుచున్నది.

IX 7743 నెం. బోర్డు ప్రొసీడింగ్సు.

1864 సం॥ డిశంబరు 2వ తేదీ గల 7743 నెంబరు మద్రాసు రెవిన్యూ బోర్డు ప్రొసీడింగ్సు:—

ఈ ప్రొసీడింగ్సు చాల చరిత్ర ప్రసిద్ధివడసిన గ్రంథము

---

* "This clause also refers to the engagements which the Zamindars and Proprietors were called upon to enter into with the cultivators with a rent fixed in perpetuity as a condition precedent.

(Prakasam's Committee Report, Page 59)

మనువుకాలము నుండి 1864 సం॥ వరకు గల భూ సంబంధమైన చరిత్రయు, చట్టములును, ఇందులో పూసగ్రుచ్చినట్లు వివరింప బడినవి. రెవిన్యూ బోర్డువారు ఈ గ్రంథము తయారుచేయ వలసిన సద్యఃకారణ మేమి వచ్చిన దంటే ఒక జిల్లాజడ్జి ఒక కేసులో 1802 సం॥లో ప్యాస్ చేయబడిన పట్టా రెగ్యులేషన్ పర్మనెంటు సెటిల్‌మెంటు రెగ్యులేషను మున్నగు వాటికిన్ని 1822 సం॥లో ప్యాస్ చేయబడిన 4వ,5వ రెగ్యులేషనులకున్ను అర్థము చెప్పుతూ ఇండియాలోని రైతులు, జమీందార్లు ఇంగ్లండులోని రైతులు, జమీందార్ల స్థితిలోనే వున్నారను ఒక గొప్ప తప్పుతీర్పు చెప్పెను. ఈ తప్పుతీర్పును విమర్శించి-దానికి సవరణ చేయు తలంపుతో రెవిన్యూబోర్డువారు అప్పుడు ఈ ఉద్గ్రంథమును తయారుచేయవలసి వచ్చినది. ఈ గ్రంథము రెండు భాగములుగ విభజింప తగి యున్నది. మొదటి భాగ మంతా పూర్వ చరిత్రాంశములతో నిండి యున్నది. ప్రస్తుత చర్చనీయాంశము 2వ భాగములో నున్నది. ఈ రెండవ భాగము ప్రకాశం కమిటీవారు వేరే వ్యాఖ్యానముతో నిమిత్తము లేకుండా తమ రిపోర్టులోని భాగముగానే స్వీకరించి, ముద్రించిరి. ఇందలి అంశము లన్నియు పైన ఎనిమిది పేరాలలో తప్సీలుగా వివరించి యున్నాము గనుక వాని నిట మరల నేకరువు పెట్టము.

## X. కోర్టు తీర్పులు

కోర్టు తీర్పులు:— ఈ రెగ్యులేషనులను ప్యాస్‌చేసిన కొత్తలో అప్పటి కోర్టులు (సదర్ అదాలత్ కోర్టులు) వీని

కట్టి అర్థములను చెప్పెనో ఈ దిగువ కేసుల జడ్జిమెంటులలోని వాక్యములవలన తెలియగలదు.

(a) 1812 సం॥రపు 15 వ స్పెషల్ అప్పీలు కేసును విచారించిన జడ్జీలలో "గ్రీనవే"యను నత డుండెను. 1802 సం॥లో మద్రాస్ గవర్నమెంటు పర్మనెంటు సెటిల్‌మెంటు రెగ్యులేషను, పట్టా రెగ్యులేషనులను ప్యాస్ చేసినప్పుడు సదరు గవర్నమెంటులో ఇత డొక మెంబరుగా నుండెను. కాబట్టి, తాను గవర్నమెంటు మెంబరుగ నుండి ప్యాస్ చేసిన రెగ్యులేషనులకు దరిమిలా, పదేండ్లకు ఇతడే జడ్జీ హోదాలో చెప్పిన అర్థముకంటె వేరే పరమప్రమాణము మన కెక్కడ దొరక గలదు ?

1812 సం॥ 15 వ. నెంబరు స్పెషల్ అప్పీలు నూటులో జడ్జీ "గ్రీనవే" తీర్పు

పట్టా రెగ్యులేషనుయొక్క 9 వ శెక్షను ప్రకారము పర్మనెంటు సెటిల్‌మెంటుకు పూర్వసంవత్సరపు రేటు ప్రకారమే శిస్తు చెల్లిస్తూ రైతుభూమిలో ఉండుటకు హక్కుగలదని ఇతని మాటల సారాంశము.*

(b) 1812 సం॥ 18 వ నెంబరు 1814 సం॥ 10 వ నెంబరు స్పెషల్ అప్పీల్ కేసులలో బందరులో కొందరు కట్టుల

* "It was therefore adjudged that the respondent (i.e. the ryot) was entitled to hold possession of the land in question on a patta defining the rate of division of the produce; which rate as prescribed by section 9 of Regulation XXX of 1802, was to be determined according to the rates prevailing in the year preceding the assessment of the permanent Jumma on the lands, or if the rates were not ascertainable, according to the rates established for lands of the same description and quality"

1812 సం॥ 18 వ. నెంబరు 1814 సం॥ 10 వ. నెంబరు స్పెషల్ అప్పీళ్లు

వర్తకులు జమీందారుకు ఏవిధమైన ప్రతిఫలం యివ్వకుండా దివిసీమ అడవులలోనుండి కట్టెలు కొట్టుకోడానికి తమకు హక్కుగలదని ఈ కేసులో వాదించిరి. జడ్జి గ్రీనవే చెప్పిన తీర్పులోని మాటలివి.

ఈ కేసు జడ్జిమెంటులోని వాక్యములు వినండి:—*

"పర్మనెంటు సెటిల్‌మెంటుకు పూర్వమున్న ఆచారమునుబట్టి యీ సమస్య తేల్చవలెను. అప్పుడు గవర్నమెంటు వారు యీ కట్టెలకోసమై ఏ రుసుమున్నూ వసూలుచేస్తూ వుండి వుండకపోతే యిప్పుడు జమీందారు వచ్చి వసూలు చేయడానికేమిన్నీ హక్కులేదు. ఎందువల్లననగా, తనకున్న హక్కుకంటె ఎక్కువ హక్కును గవర్నమెంటువారు జమీందారుకు పర్మనెంటు సెటిల్‌మెంటు ద్వారా యివ్వడానికి అవకాశములేదు. అట్లిచ్చినట్లయితే గవర్నమెంటువారు ఇతరుల (అనగా భూమి మీదనున్న రైతుల) హక్కులను భంగపుచ్చిన దోషమునకు గురియగుదురు."

---

*"The determination of the present question rested upon very simple grounds, and must follow the usage which prevailed before the introduction of the Permanent settlement. By the Act of permanent settlement the Govt. transferred to Zamindars (with certain specified exceptions) the proprietory right excercised by itself. It could not do more without infringing the rights of others. All usages which are not specially abrogated by the regulation must be held to be confirmed, and if previously to the introduction of the permanent assessment, no payment was exacted by the Govt. for fire-wood cut in the jungles of Divi. none could be exacted by the Zamindar."

## IX బోర్డు తేల్చిన సారాంశములు

### సింహావలోకనము

వేలకొలది గ్రంథప్రమాణములను, రికార్డులను పరిశీలించిన మీదట రివెన్యూబోర్డువారు తమ ప్రొసీడింగ్సు 61 మొ॥ 81వ పేరాలలో తాము తేల్చిన సారాంశములను ప్రకటించిరి. అవి ప్రకాశం కమిటీ రిపోర్టులో 65 మొదలు 68 పేజీలలో యథాతథముగ ముద్రింపబడియున్నవి. వానిని పూరాగా పరిశీలింపదలచినవారు సదరు గ్రంథములో చూడనగును. అయినా వానిలో ముఖ్యమైన పేరాలను అనగా 61, 62, 74లో కొంత (The increase in the value of produce is of no proof whatever by itself that the Zamindar is justified in raising his demand. Plunder to the Zamindar) 75, 77, 79, 80 పేరాలనుమాత్రము ఈ దిగువ ముద్రించుచున్నాము.

"ఈ క్రింది విషయములు పూర్తిగ నిరూపింపబడెనని బోర్డువారు అభిప్రాయపడుచున్నారు:—

చరిత్రాధారము లందుబాటులో నున్నంతవరకు ఈ దేశమునం దనాదిగ వచ్చుచున్న సాంప్రదాయము ప్రకారము భూమియొక్క ఫలసాయమున ప్రభుత్వమువారికి రావలసిన రాజభాగము నిర్ణీతమైనదనియు, పరిమితమైనదనియు బోర్డు వారి నిర్ణయములు. రాజభాగము పోగా రైతునకు ఫలసాయములో తగినంత మిగులుట కవకాశముండుటచే, అది రైతునకు మంచి విలువయగు ఆస్తిగ ఏర్పడు చున్నదనియు, సదరు రాజభాగమును చెల్లించుచుండునంతకాలము రైతునకు భూమి

యందు గల స్వామ్యములు స్థిరమైనవనియు, వంశపారంపర్యముగ ననుభవింపబడుచున్నవనియు, అతని హక్కు లనుల్లంఘనీయములనియు నిరూపితమగుచున్నది.

మహమ్మదీయ పరిపాలనయందు గూడ ఫలసాయము లోని నిర్ణీతమగుభాగముమాత్రమే పరిపాలకులు వసూలు చేసుకొనుచుండిరి. అంతకంటె ఎక్కువ వసూలు చేసికొని యుండలేదు.

జమీాందారు అను పదవి యిటీవల ఏర్పడినదనియు, జమీాందారుల ప్రారంభ మెట్టిదైనను వారి హక్కులన్నియును ప్రభుత్వమునుండి మాత్రమే సంక్రమించెననియు, ప్రభుత్వము వారు, తమకున్న వానికంటె అధికమగు హక్కులను అధికారములను జమీాందారుల కొసగియుండజాల రనియు స్పష్టపడెను.

జమీాందారుల తొలగించి, వారి అధికారములను తిరిగి తీసుకొనుటకు ప్రభుత్వమువారి కధికారము కలదనియు, అట్టి యధికారమును తరుచు నుపయోగించుచుండెడి వారనియు దానివలన రైతుల హక్కులకుగాని, అమరకపు షరతులకుగాని ఏవిధమగు భంగముగాని మార్పుగాని గలుగుచుండెడిదిగా దనియు నిశ్చయమయ్యెను.

తాను చెల్లింపవలసిన మొత్తమును ప్రభుత్వమువారు హెచ్చించి యుండిరను కారణముచే తప్ప మరేకారణముచే తమ రైతునుండి తనకు రావలసిన శిస్తురేటును హెచ్చించుటకు జమీాందారుకు అధికారములేదు. శిస్తురేటును హెచ్చించుటకు ఇదియైనను తగినంత కారణముగాదు. ఏల ననగా, శిస్తు రేటును హెచ్చింపకుండ జమీాందారుయొక్క ఆదాయమును

హెచ్చించుకొనుటకు శాస్త్రీయ మగు మార్గములు అనేకములు గలవు. ఎస్టేటులో సాగుబడి విస్తీర్ణమును హెచ్చించుటవలన జమీందారు ఆదాయము హెచ్చును. వ్యవసాయము నభివృద్ధి పరచి ఎక్కువ విలువగల పైరులు సాగుచేసినయెడలగూడ జమీందారు ఆదాయము హెచ్చును. ప్రభుత్వమువారికి జమీందారు చెల్లించు మొత్తము నిర్ణయింప బడకపోయినను, ఆదాయము లని ఆతనికి నూటికి ఎన్నివంతులు వదలివేయబడ వలెనో నిర్ణయమై యుండవచ్చును.

## XII కరణాల రెగ్యులేషను

### (1802 సం॥పు 29వ రెగ్యులేషన్

పర్మనెంటు సెటిల్‌మెంటుకు పూర్వము అనేకరకముల ఫన్నులు వుండెను. వీటినన్నిటిని వసూలుచేయడానికి ఎన్నో రకముల ఉద్యోగస్థులుండిరి. వీరు యిటుప్రజలను అటు గవర్న మెంటువారినికూడ నానాక్షోభ పెట్టుచుండిరి. ఇప్పుడు పర్మి నెంటు సెటిల్‌మెంటు జరిగినతర్వాత రకరకాలపన్నులన్ని రద్దుకావింపబడి అన్నియు ఒకేరేటుగా విధింపబడినవిగాబట్టి యింతమంది ఉద్యోగస్థులు వుండవలసిన అవసరము తీరిపోయి నది. అయితే గ్రామములో సాగుబడిలెఖ్ఖలు తయారుచేయ డానికిన్ని యిటు గవర్నమెంటుకు జమీందారుకు రైతులకు మధ్య లెఖ్ఖలు తేల్చడానికిన్ని కరణముఉద్యోగము మాత్రము ఉంచి తీరవలసివచ్చినది. కాబట్టి, దీనిని ఒక్కదానిని వుంచుచు మిగతా ఉద్యోగపదవు లన్నిటిని గవర్నమెంటువారు రద్దుపఱి

చిరి. ఈ ఏర్పాటుచేసిన రెగ్యులేషనుకే కరణాల రెగ్యులేషనని పేరు.

కరణము యొక్క ప్రాముఖ్యత

ప్రజలయొక్క హక్కులను, ఆస్తులను కాపాడడానికిన్ని, అందరికి ప్రమాణప్రాయముగ వుండగల లెఖ్ఖలను తయారు చేయడానికిన్నీ కరణము ఉద్యోగము చాలా అవసరమని యీ రెగ్యులేషనుయొక్క ఉపోద్ఘాతము చెబుతున్నది.*

"కరణముయొక్క ఉద్యోగము ప్రజలహక్కులను ఆస్తులను రక్షించుటయం దింకను ప్రాముఖ్యము వహించినదగుటచేత న్యాయస్థానములలో దావాలు నిరాలస్యముగా పరిష్కారమగుటకై తోడ్పడుటకున్ను ప్రభుత్వమువారి నిర్ణీత శిస్తు తగ్గకుండ చేయుటకును, వ్యక్తులకు అన్యాయము జరుగకుండ చూచుటకును, సరియైన లెఖ్ఖలును సరియైన విషయములును ప్రభుత్వోద్యోగీయులకు లభించునట్లు చేయుటకును కరణముఉద్యోగమును చక్కగా సుస్థిరముగా జరుగునట్లు చేయుటవసరము కావున దేశమునందుపూర్వము నుండియు వచ్చుచున్న వాడుకల ననుసరించి కరణము ఉద్యోగమునకై ఈ క్రింది విధముగా శాసింపబడుచున్నది"

---

*"But the office of the Karnam being still of great importance to the preservation of the rights and property of the people, it is expedient to provide for the continuance of that office on an efficient establishment, for the purpose of facilitating the decision of suits in the Courts of Judicature of preventing the diminution of the fixed revenue of the Government, in securing individual persons from injustice, by enabling the public officers of Government, of the courts

'కరణము' అనే ఉద్యోగము యిప్పటికి సుమారు 800 సం॥ ల క్రిందటనే అనగా 1144 సం॥ ప్రాంతమున నిర్మింపబడి నట్లు తెలియుచున్నది. కరణము యొక్క ప్రాముఖ్యము, అత నిని తృప్తిపరుపవలసిన ఆవశ్యకత, సుమతీశతక కారుడుగూడా యీరీతిగ ఒక చిన్న కందపద్య ములో చెప్పియున్నాడు. (క॥ కరణముల ననుసరింపక విరసం బునఁ దిన్న తిండి వికటించుఁజుమీ, యిరుసునఁ గందెన బెట్టక పరమేశ్వరు బండియైనఁ బాఱదు సుమతీ.) ఇట్టి ప్రాముఖ్యమును బ్రిటిష్ గవర్నమెంటు కూడ గ్రహించి యీ పోస్టును నిలుపు టకై ప్రత్యేక మొక రెగ్యులేషనును కూడ చేయుట వారి వివేకమును, దూరదృష్టిని సూచింపుచున్నది.

కరణాలవిధులు

కరణాలను చేయవలసిన విధులు, తయారుచేయవలసిన లెఖ్ఖల తఫ్సీళ్లు యీ రెగ్యులేషను యొక్క 11 వ శెక్షనులో వివరింపబడ్డవి. ఈ రెగ్యులేషను యీ రోజువరకు అమలులో నున్నది.

కరణాలను నామినేట్ చేసే అధికారము తప్ప డిస్‌మిస్ చేసే అధికారము జమీందార్లకులేదని పర్మినెంట్ సెటిల్‌మెంటు రెగ్యులేషను 11వ శెక్షను చెప్పుచున్నది. ఏల ? జమీందా రుడు ఇంగ్లండులోని "లాండులార్డు"వలె సంపూర్ణ అధికారము

---

of Judicature to procure authentic information and accounts in confirmity therefore, to the ancient usages of the country the following have been enacted for the establishment of the office of Karnam."

—Prakasam's Report, Page 69.

గల వ్యక్తిగాదు. అతడు కేవలము శిస్తువసూలు హక్కు మాత్రము గలవాడు గనుకనే, కరణములపై అతనికి సంపూర్ణ అధికారము యివ్వబడలేదు. పైగా, అతని ఉద్యోగనియామకము కేవలము ఒక జమీందారు ప్రయోజనానికేగాక, అటు ప్రజల హక్కులను ఆస్తులను కాపాడటానికిన్నీ సర్కారుకు, కోర్టులకు, యింకా యితర అధికారులకు కావలసిన లెక్కలు, భోగట్టాలు, సప్లయి చేయడానికిన్నీ ఉద్దేశింపబడినట్లు కరణాల రెగ్యులేషను యొక్క ఉపోద్ఘాతమే ఉద్ఘోషించి చెప్పుచున్నది. గనుక, జమీందారుకు కరణముపై సంపూర్ణ అధికార మివ్వబడక పోవడము సబబుగనే వున్నది.

## XIII. 1865 సం॥ రపు రెంటు రికవరీ ఆక్టు

1865 సం॥పు VIII వ. ఆక్టు Act VIII of 1865 Rent Recovery Act.

1802, 1822 సం॥లలో చేయబడిన రెగ్యులేషనులను బట్టియు, 1808 సం॥ములో రివిన్యూబోర్డు మెంబరు హాగ్సస్ రిపోర్టును బట్టియు, 1864 సం॥లో రివెన్యూబోర్డు వారి 7743 వ. నెంబరు ప్రొసీడింగ్సునుబట్టియు, 1812-14 సం॥లలో మద్రాసు సదర్ అదాలత్ కోర్టువారిచ్చిన తీర్పులను బట్టియు, రైతులకు పర్మినెంటు సెటిల్మెంటు ద్వారా స్థిరపరుపబడిన సహజమగు జిరాయితీ హక్కునున్నూ ఎన్నటికి మారని శాశ్వతమగు శిస్తు రేట్లహక్కునున్నూ వివరించి యుంటిమి.

ఇట్లుండగా 1865 సం॥ములో, మద్రాస్ గవర్నమెంటు వారు "రెంటు రికవరీ ఆక్టు"ను (8 నెంబరు ఆక్టును) ప్యాస్ చేసిరి. దానిలో రెండు రకాల భూస్వాములు(ల్యాండుహోల్డర్సు)

వివరింపబడినవి. పర్మనెంటు సెటిల్‌మెంటు ద్వారా సనదులు పొందిన జమీందార్లు, ముఠాదార్లున్ను ఈనాందార్లున్ను ఒకరకం. రైతువారీ (శేరీ) గ్రామాలలో సర్కారునుండి నేరుగా పట్టాలుపొందిన భూస్వాములు రెండవరకం.

మొదటిరకంవారికి (అనగా జమీందార్లు వగైరాలకు) జిరాయితీరైతులవల్ల చెల్లవలసినదానికిన్ని రెండవరకంవారికి తమక్రిందనున్న దిగువసేద్యగాండ్ర (under tenants) వల్ల తమతమ ప్రయివేటు ఒడంబడికలద్వారా రావలసినదానికిన్ని జమీందార్లకు తమ ప్రైవేటు (సొంత) భూములను సేద్యము చేయువారి నుండి రావలసిన దానికిన్ని జమీందారీ జిరాయితీ రైతులకు తమ దిగువ సేద్యగాండ్రవల్ల రా నేర్పరచుకొన్న దానికిన్ని ఈ అమాంబాపతు రాబడులకు కలిపి "రెంటు" అని పేరు పెట్టబడినది. అన్నిటికి కలపి ఒకేపేరు పెట్టడంవల్ల, అనగ 1802 సం॥ నాటి రెగ్యులేషనులవల్ల ప్రత్యేక, శాశ్వత, ఉత్తమ హక్కులను పొందిన రైతులనున్ను అట్టి ప్రత్యేకపు హక్కులు లేని నానాగోత్రపు రైతులను, సేద్యగాండ్రనున్ను ఒకేఆక్టులో పెట్టి వా రిచ్చేదానికి, వీరిచ్చేదానికి ఒకటేపేరు పెట్టి సెక్షనులను తయారుచేయడమువల్ల ఉత్తమహక్కులను పొందిన జిరాయితీరైతుల ప్రాముఖ్యము కొంచెము మరుగున బడినది.

11వ శెక్షన్ వల్ల కలిగిన చిక్కులు

దీనికి కారణము ఈ ఆక్టు 11వ శెక్షన్‌లోని మొదటినాలుగు క్లాజులే.

రెంటురేటులనుగురించి ఏదైనా తగాదాలు వస్తే వాటిని

పరిష్కరించుటకు కొన్నిసూచనలు యీ క్లాజులో యివ్వబడినవి. అందులో మొదటిసూచన ఏమిటంటే "రెంటును గురించి ఏదైనా కంట్రాక్టుఉంటే, ఆ కంట్రాక్టు షరతులప్రకారం కలెక్టరు తీర్పుచెప్పవచ్చు"నని యీ మొదటిక్లాజుకు అర్థము. ఈ "కంట్రాక్టు" అనేపదము ఇతరబాపతు రైతువిషయములో చెల్లుతుందిగాని 1802, 1822 సం॥ రెగ్యులేషనులవల్ల సుస్థిరమై శాశ్వతమైన ఉత్తమహక్కులను స్థిరపరచుకొనిన జిరాయితీ రైతులవిషయములో ఎట్లు చెల్లుబడి అవుతుంది? ఈ జిరాయితీ రైతుల విషయములో ఎట్టికంట్రాక్టులుగాని ఉండనేరవు. అథవా తెలియక ఏరయితునా తనసహజపుహక్కుకు భంగకరమగు షరతులతో జమీందారుకు కంట్రాక్టు వ్రాసియిచ్చినప్పటికిన్ని అట్టిది 1802 సం॥పు రెగ్యులేషనుల దృష్టిలో చెల్లనేరదుగద! కాబట్టి ఈ అక్టు 11వ శెక్షన్ 1వ క్లాజులో ఉదహరింపబడిన "కంట్రాక్టు" అనేపదము జిరాయితీహక్కుగల రైతులవిషయములోగాక, జిరాయితీహక్కు లేని తదితర రైతుల విషయములో మాత్రమే వర్తించుననుట స్పష్టము. అందుకు నిదర్శనము యీ సెక్షన్ 4వ క్లాజులోనే కనిపించుచున్నది.

కొన్నికొన్ని సందర్భములలో "ల్యాండుహోల్డర్లు" తమకు రావలసిన "రెంటు"లను హెచ్చుచేసికోడానికి అవకాశం ఉందని యీ సెక్షన్‌యొక్క సారాంశము. అయితే యీ సారాంశమునకొక మినహాయింపు పైన వివరించిన 'ప్రొవిజో'లో కనిపించుచున్నది. అనగా యీ శిస్తుహెచ్చించే పద్ధతి లోగడ చట్టములవల్లగాని, యితర ఆచారములవల్లగాని ప్రత్యేకపు హక్కులను (Special rights) పొందిన రైతులవిషయములో

వర్తించదని ఈ ప్రోవిజో చెప్పుచున్నది. * అనగ అర్థమేమి ? ఈ శిస్తుహెచ్చించేపద్ధతి లోగడ పర్మినెంటు సెటిల్‌మెంటు వగైరాలవల్ల ఉత్తమహక్కులను స్థిరపరచుకొనిన జిరాయితీ రైతులకు వర్తించదనిన్ని, తదితర బాపతు రైతులకు, సేద్యగాండ్రకు - అనగ, రెండవరకపు రైతులకు మాత్రమే వర్తించుననిన్ని అర్థము. ఈ రెండవ రకపు రైతులు, సేద్యగాండ్రు ఎవరనగా ?

(1) రైతువారీ గ్రామాలలో గవర్నమెంటు నుండి శేరీ పట్టాలు పొందిన వారి నుండి కౌళ్లు పొందిన సేద్యగాండ్రు.

(1) శేరీపట్టాదార్లు, వారి క్రింది సేద్యగాండ్రు.

శేరీ పట్టాలు పొందిన వారినికూడ "లాండు హోల్డర్లు" అని యీ ఆక్టులో చెప్పుట చాలా వింతగా నున్నది. జనసామాన్యం వీరిని సాధారణంగా "రైతులే" అని పిలుస్తారుగాని "లాండు హోల్డర్లు" అని పిలువరు. వీరినికూడ యీ ఆక్టులో "లాండు హోల్డర్లు" అన్నారనే సంగతి సామాన్యంగా అందరికి తెలియదు. ఈ శేరీ "లాండు హోల్డర్లు" తమ భూములను ఇతరులకు కౌలుకు యిచ్చుకుంటే ఈ కౌలుదార్లవల్ల తమకు రావలసిన దానికికూడ 'రెంటు' అని పేరుపెట్టి దానిని రాబట్టుకోడానికి కూడ, అందరితోపాటు ఒకే ప్రొసీజరు ఈ ఆక్టులో చెప్పియున్నారు. తమ సౌకర్యం నిమిత్తమై ఇట్టి ప్రొసీజరు ఒకటి ఈ ఆక్టులో చేయబడినదనే సంగతి సాధారణంగా ఈ

---

*"Provided that nothing in this rule shall be held to affect any special rights which by law or usages having the force of law, are held by any class or person in such waste and unoccupied lands."

రైతువారీ 'లాండు హోల్డర'కు తెలియనే తెలియదు. ఈ అవకాశమును ఏ రెన్నడును వినియోగించుకొన్నట్లు కూడ కనిపించదు. ఈ ప్రొసీజరు రైతువారీ 'లాండు హోల్డర'కు క్రియలో ఎక్కువగ ఉపయోగపడక పోయినప్పటికి, అజ్ఞానులగు జడ్జీల చేతులలో ఇది జిరాయితీ హక్కు గల ఉత్తమ రైతులపాలిటి ధూమకేతువై వారిని హింసించినది. "శేరీ ల్యాండు హోల్డర" కని చెప్పినదానిని, జమీందారీ లాండు హోల్డర్లు ఉపయోగించుకొని, తమ క్రింద గల ఉత్తమ తరగతి రైతులను హింసించుటకు ఈ ఆక్టువల్ల సందు చిక్కినది. దీనికి తోడుగ అప్పుడే క్రొత్తగ సీమనుండి దిగి వచ్చి, క్రొత్తగ ఏర్పాటుచేయబడిన హైకోర్టులో జడ్జీలుగ కూర్చున్న తెల్ల దొరల అజ్ఞానమున్నూ, జమీందార్ల ధనబలము, పలుకుబడి బలమున్నూ మరింత తోడ్పడినది.

(2) జమీలలో జమీందారుతాలూకు సొంతభూములను సేద్యముచేసే రైతులు కొందరున్నారు. వీరికి జరాయితీ హక్కు లేదు కాబట్టి వీరికి జమీందార్లకు మధ్య కంట్రాక్టు రేట్లు వుండవచ్చును. వాటిలో వారి ఉభయుల సమ్మతి ప్రకారము రేట్లను హెచ్చించుకోవడానికిన్ని తగ్గించుకోవడానికిన్ని ఒడంబడికలు ఉండవచ్చును

(2) జమీందారు తాలూకు సొంతకమతాలు సేద్యంచేసే సేద్యగాండ్రు.

(3) అనాది బంజర్లను సాగులోనికి తెచ్చేటందుకుగాను రైతులను ప్రోత్సహించడానికి పర్మినెంటు సెటిల్‌మెంటు రేట్ల

(3) అనాది బంజర్లను సేద్యంలోకి తేవడానికి నియమితమగు కంట్రాక్టు రేట్లతో ప్రవేశించిన సేద్యగాండ్రు)

కంటె తక్కువ రేట్లను జమీందారుడు కొంతకాలము పుచ్చుకోడానికిన్నీ దరిమిలా క్రమక్రమముగా సదరు రేట్లను హెచ్చించడానికిన్నీ ఒడంబడిక యుండవచ్చును. అయితే యీ కేసులోకూడ సదరు పెంపుదల హాంసాయీభూములకు 1802 సం॥ నాడు స్థిరపరుపబడిన రేట్లకు మించియుండకూడదను సంగతి జ్ఞాపకముంచుకోవలెను.

జిరాయితీహక్కుగల ఉత్తమతరగతి రైతులనున్నూ, జిరాయితీహక్కులేని రెండవరకపు రైతులనున్నూ ఒకేఆక్టులో చేర్చడంవల్ల ఈ చిక్కులన్నీ తటస్థించినవి. రేట్లుహెచ్చించుకోవడం, ప్రయివేటు ఒడంబడికలు చేసికోవడం వగైరాపద్ధతులు ఈ ఆక్టులో సామాన్యంగా చెప్పుతూ, ఇవి ప్రత్యేకపుహక్కులుగల రైతులవిషయములో వర్తించవని ఒకచిన్న ప్రోవిజోలో ఏమూలనో మినహాయించినప్పటికి ఈ చిన్నమినహాయింపు లోకులదృష్టిని ఆక్టే ఆకర్షించక అడుగునపడిపోయి క్రియలో గుజ్జము, గాడిద ఏకము చేయబడినవి. ఇట్లు చిరకాలము జిరాయితీ రైతులకు ఈ రెంటు ఆక్టువల్ల హానికల్గినది.

ఇందుకు ప్రబలనిదర్శనము 1871 సం॥రములో జరిగిన చొక్కలింగంపిళ్ళె కేసే. అజ్ఞానుడగు ఒక తెల్లజడ్జీవచ్చి రైతుకు

1871 సం॥ చొక్కలింగం పిళ్ళె కేసులో తప్పుతీర్పు

జిరాయితీహక్కు లేదనిన్నీ పట్టాలు ప్రతిసాలున రిన్యూచేయవలెనని ఉన్నది కాబట్టి రైతు ఏక్‌సాల్ కౌలుదారు కంటె ఎక్కువ హక్కుగలవాండు కాడని ఈ చొక్కలింగం కేసులో

ఒక తప్పుతీర్పు చెప్పెను. దీనిని సవరించు నిమిత్తమయియే, 1908 సం॥లో మద్రాసు ఎస్టేటు లాండు ఆక్టు ప్యాస్ చేయవలసి వచ్చినది.

ఇంకొక ముఖ్యవిషయ మేమిటంటే, 1865 సం॥పు రెంటు ఆక్టువల్ల ఎవరికి గాని, ఎట్టి హక్కులుగాని యివ్వబడ లేదు, తీసివేయబడ లేదు. లాండు హోల్డర్లు తమకు రావలసిన రెంటులను ఏ విధముగా రాబట్టుకోవాలో అనే దానికి ఒక ప్రొసీజరు ఏర్పరుప బడినదే గాని, యింకొకటి గాదు.

1865 సం॥పు ఆక్టు వట్టి ప్రొసీజరుఆక్టు మాత్రమే - ఎవరికిగాని, వున్న హక్కులు తీసివేయలేదు, లేని హక్కులు ఇవ్వలేదు.

ఇదివరకు వారి వారికి ఉన్న హక్కులను ఎట్లా చెలాయింపు చేసుకోవాలి అనే విషయాన్ని మాత్రము ఈ ఆక్టు పరిష్కరిస్తున్నది. అంతేగాని, ఇదివరకు ఉన్న వారి హక్కులను తీసివేయనూ లేదు, లేనివారికి క్రొత్తగ హక్కులను యివ్వనూ లేదు. అనాదిసిద్ధముగ రైతులకున్న జిరాయితీ హక్కులను 1802, 1822 సం॥ల నాటి రెగ్యులేషనులు వచ్చి ధ్రువపఱచినవి. వాటిని తీసివేయడానికి యీ రెంటు ఆక్టు పూనుకోలేదు. అయితే, యిందులో తదితర బాపతు రైతులను కూడ చేర్చి, ఏదో ప్రొసీజరు ఏర్పరచడమువల్ల అసలు ఉత్తమ తరగతి రైతుల తాలూకు అనాదీయపు హక్కులే మరుగున పడిపోయినవి. ఈ ఆక్టువల్ల జరిగిన అపకార మిది!

అదిన్నిగాక, అనాది బంజర్లును బాగుచేసే సందర్భములో జమీందారు ఖర్చుమీద ఏర్పరచిన యిరిగేషను వస

ఇరిగేషను వసతులు కల్పిస్తే జమీందారుడు హెచ్చు శిస్తు కోరవచ్చునా?

తులు వగైరా అభివృద్ధిపనులవల్ల, సదరు భూములు హెచ్చు ఫలితము లోకి వస్తే వానిమీద శిస్తు హెచ్చించ వచ్చు నని ఈ ఆక్టు (4 వ శెక్షను) చెప్పుచున్నది. ఇది అక్ర మము. ఇది పర్మనెంటు సెటిలుమెంటు మరతుకు భిన్నమైనది. ఏల ననగా, ఇట్టి బంజరులను ఫలవంతపు భూములుగ తయారు చేయడానికి అవకాశము యివ్వాలనే తలంపుతోనే గద, జమీందారుకు వీటివల్ల రాదగిన శిస్తులో నుండి గవర్నమెంటు వారు భాగం కోరకుండ ఊరుకున్నది! అట్టి సందర్భములో "ఇరిగేషను పనులు నా ఖర్చుమీద చేయించినాను కాబట్టి నాకు హెచ్చు శిస్తు రావా"లని జమీందారు కోరడంలో అర్థ మే మున్నది? అట్టి హెచ్చు శిస్తు నతడు కోరేయెడల పేష్కు సును మాత్రము ఏల హెచ్చింపరాదు?

ఈ పైన వివరించిన సారాంశముల నన్నిటికి ప్రమాణ ముగ 1908 సం॥లో ఎస్టేటు ల్యాండు ఆక్టును మద్రాసు శాసన

ఫోర్బుస్ పరిఖ్యాత ఉపన్యాసం- 1908

సభలో ప్రవేశపెట్టుచు, అప్పుడు గవర్న మెంటు మెంబరుగ నున్న "ఫోర్బుస్" అను నతడు చెప్పిన ఉపన్యాస భాగము నీ దిగువ ముద్రించుచున్నాము.

"వ్యవసాయదార్లను జిరాయితీహక్కుగల రయితు లనియు, జిరాయితీహక్కులు లేని రయితులు అనియు, విచక్షణ చేయు నభిప్రాయముగాని ఆ హక్కులకు గల హద్దులను నిర్ణయించుటగాని ఆక్టు నిర్మించినవారికి లేకుండెనని స్పష్టము. రయితునుండి భూస్వాములు రెంటు వసూలుచేయు పద్ధతులను నిర్ణయించుటకు మాత్రమే ఈ ఆక్టు చేయబడియుండెను. ఆక్టులో చెప్పబడిన వివిధతరగతుల భూస్వాములు రయితుల నుండియు, కవులుదార్లనుండియు తమకు న్యాయముగ రాదగిన బాకీలను వసూలుచేసుకొనుట సుకరము గావించుటకు ఆక్టు ఉద్దేశింపబడెను. మనబిల్లులో ఈ రెండుతరగతులక్రిందికి వచ్చు వారు ఆక్టులో చేర్చబడియున్నారు. 1865 వ సంవత్సరము వరకు రయితులకు కొన్ని అధికారము లుండియున్నచో వానిని తొలగించున దేమియు ఆక్టులో లేకుండెను.

"ఈ విషయమును యింతకంటె యెక్కువ వివరముగా చర్చించు టవసరమని తోచదు. దురదృష్టవశమున ప్రాతకోర్టగు సదర అడాలత్ రద్దుచేయబడిన తరువాత కొలదికాలములోనే 1865వ సం॥పు 8వ ఆక్టు అమలులోనికి వచ్చెను. ఈ కోర్టుచే అనుసరింపబడిన సాంప్రదాయములు వేరుగా నుండెను. ఆంగ్ల న్యాయశాస్త్రము నిజముగా ఈ దేశమునకు వర్తింపనిదైయుండ ఆంగ్లశాసనమున ఉపయోగింపబడిన పారిభాషికపదములు యిచ్చట స్థితిగతులకుగూడ వర్తించు నని క్రొత్తగా నేర్పరుప బడిన హైకోర్టు జడ్జీలు దురభిప్రాయపడిరి. ఒక సంవత్సరమునందు యెంతభూమి సాగుబడియుండుండెను? ఏ పైరులు వేయబడు చుండెను. అను విషయములను మాత్రము పట్టాలు తెలుపు

నవై యుండ ఒక సంవత్సరమునుండి మరియొక సంవత్సరమువరకు మాత్రమే భూమి కవులు కొసగబడినట్లది సూచించుననియు, తప్పువ్యాఖ్యానముచేసిరి. ఆఖరుకు ఈ విషయము చొక్కలింగపిళ్లె కేసులో హైకోర్టువారి యెదుటికిరాగా రయితు ప్రతిసంవత్సరము కవులు నంగీకరించుటచేత కౌలుపట్టాదారు ఒకసంవత్సరము మాత్రమే పట్టాదారనియు అంతకంటె అతనికి యెక్కువ అధికారములు లేవనియు పరిగణింప బడదగునని కోర్టువారు నిర్ణయించిరి. పరంపరానుగుణముగ వచ్చుచున్న హక్కుల విషయమై సాక్ష్యము యించుకేనియు విచారింపబడి యుండినచో కోర్టువారి నిర్ణయము మరియొక విధముగా నుండియుండెడిది. హైకోర్టువారి నిర్ణయమువలన తరువాత అనేక భ్రమ ప్రమాదములు కలిగెను. అనర్థములుగూడ వాటిల్లెను. జమీందారు తనయిష్టము వచ్చినవారికి భూమిని యివ్వవీలగు నను షరతు యేర్పరుపబడిన పట్టాలను రయితులనుండి పొందుటకు జమీందారులు యత్నించుచుండిరి. ఉత్తర సర్కారులలో నిట్టి నమూనాఫారములు వేలకొలది పంచిపెట్టబడెను. తాత తండ్రులనాటి యిల్లువాకిళ్ళనుండి వెడలగొట్టెదమని బెదరించి రెంట్లు హెచ్చుచేసిరి. జమీందారులు, రైతులను వెడలగొట్టిన కేసులు బహుళరుదు. వెడలగొట్టబడనంతకాలము రయితు యెట్టి ఫారములోనైనను సంతకము చేయ వెనుదీయకుండెను. జమీందారులకును రయితులకును గల అసమానత్వమును గుర్తించినచో యిట్టి కంట్రాక్టు ఎంత నిష్ప్రయోజనమో చెప్ప నక్కరలేదు.

"జిరాయితీ అధికారముగల రయితుకు జమీందారుతో గల సంబంధము కంట్రాక్టు యెంతమాత్రమును గాదు. రయితులలో పోటీపెట్టి రెంటును హెచ్చించుటకును వీలులేదు. ఐనను 1865 వ సం॥పు 8 వ శాసనపు క్లాజులో యిట్టి కంట్రాక్టులు చేసుకొన నధికారము గలవారుగూడ చేర్చబడిరి. అనగా ప్రస్తుత బిల్లులో 'టెనెంట్లు' క్రింద మేము చేర్చినవారు రయితునుండి భూమిని కవులుకు పుచ్చుకొన్నవారు జమీందారు స్వంతభూములను చేయువారుగూడ చేర్చబడిరి. జిరాయితీ హక్కులులేనివారని చెప్పదగినవారు వీరుమాత్రమే యను విషయమై అభిప్రాయభేద ముండునని తలంపము. తాను బంజరుభూమిని సాగులోనికి తీసికొని వచ్చుటకు కవులుదారు అంగీకరించుచో యిరుపక్షములవారును కంట్రాక్టుచేసికొనుటకు కూడ వీలయ్యెను. అప్పుడు కొంతకాలమువరకు తక్కువ రేటుకు భూమి నొసంగ జమీందారు అంగీకరించెను. కాని యీ కంట్రాక్టువలన వ్యవసాయదారుని జిరాయితీహక్కులకు భంగము కలుగదు. మరియు ప్రతి సంవత్సరము జమీందారు రయితులలో పోటీపెట్టి రెంటు హెచ్చించుటకు గూడ వీలుపడదు. భూస్వాముల సంఘమువారు 1898 వ సం॥పు బిల్లును గూర్చి గావించి యుండిన విజ్ఞాపనములో నీ విభేదమును అంగీకరించియే యుండిరి. వారు యిట్లు వ్రాసిరి. జమీందారీ భూములను పట్టాభూములనియు, పట్టాలేని భూములనియు రెండుగా విభజించినచో యిబ్బంది తొలగును. 1865 వ సం॥పు 8 వ రెంటు రికవరీ ఆక్టు 12 వ సెక్షను వర్తించు భూములు పట్టాభూములుగా నుండవచ్చును. పుంజలు, స్వంత లేక వస్తు

భూము, ఉఖాన్ భూములు, ఈనాంభూములు రెండవతరగతిలో చేర్చబడవచ్చును. జిరాయితీ హక్కులు మాత్రము అంగీకరింప బడిన ప్రాంతములలో జేయుబడుచున్న విభేద మేమనగా, అట్టి భూములు యితరులకు మార్చబడరాదని మాత్రమే.

"ఈ మాటల అర్థమేమి ? ఎస్టేటునందు వ్యవసాయము నకు పనికివచ్చు 'పబ్లిక్' భూములలో జిరాయితీ హక్కులు వానియంతట నవియే వచ్చుననిగదా ? ఈ 'పబ్లిక్ కల్టివబిల్ భూమి' యన్న లేక ఖాస్ అనగా జమీందారు స్వంతభూమి కానట్టిదనికూడ అర్థమేగదా ? ఈనాము లనుటవలన చిన్న ఈనాములని తలపబడినట్లు నేననుకొందును. వీనిలో భూమియు రెవిన్యూగూడ చేరియుండెను. అసోసియేషనువారు (ల్యాండు హోల్డర్ల అసోసియేషనువారు) బంజరుభూములనుగూడ చేర్చిరి. ఇట్లు చేర్చుటను నేనెంతమాత్రమును అంగీకరింపజాలను. ఇందు విషయమై యిప్పుడు నేను ప్రస్తావింతును. బంజరుభూములమీద తమకు ప్రత్యేకాధికారములు కలవని చూపుటకు జమీం దారులు భగీరథ ప్రయత్నములు చేసిరి. ఈ భూములను సాగు చేసికొన్నందుకు తమ యిష్టమైన రెంటు విధింప వచ్చునని వారనిరి. అనగా వీనిపై రెంటు విధింపవచ్చునుగాని ఎస్సెస్మెంటు విధింప వీలులేదని వారన్నట్లు దీనియర్థము. ఈ వాదము క్రమమనుట కెట్టి యాధారములును లేవు. న్యాయ శాస్త్రరీత్యా భూస్వామి ప్రభుత్వమువారి రెవిన్యూను వసూలు చేయువారు మాత్రమే యైయున్నారు. 1865 వ సం॥రం వరకు నిందువిషయమై అభిప్రాయము తెలిపియుండిన ప్రము ఖులు ఈ వాదము నెంతమాత్రమును అంగీకరించుటలేదు.

ఇనాముల్లనుండి హక్కు లేక పోయినచో తరువాత చేయబడిన శాసనమేదియు ఆ సమయమున లేని హక్కును క్రొత్తగా నిచ్చియుండ లేదు.

"1865 వ సం॥పు 8 వ ఆక్టు విషయమై యీ ప్రభుత్వమువారు ఇండియా ప్రభుత్వమువారికి వ్రాసియుండిన లేఖను నే నుల్లేఖించియే యుంటిని. భూమి ననుభవించుచున్న రయితు బంజరుభూమినిగూడ వ్యవసాయము చేసికొనుటకు గల హక్కును మేము దీనిలో అంగీకరించి యుంటిమి. భూస్వాములు తమయిష్టమువచ్చిన రెంట్లు యేర్పరుపవచ్చునని ఆక్టు వందలి 2 వ సెక్షను (4) లో కలదనుట నిజమేకాని ప్రత్యేక హక్కు లున్నపుడది వర్తింప దను ప్రావైజోద్వారా ఆ హక్కులు రక్షింపబడుచున్నవి. ఈ ప్రత్యేకహక్కు లేవి? బంజరుభూమిలో గూడ సాగుచేసుకొనుహక్కు, రెంటుగాక దానిపై ఎస్సెస్సుమెంటు చెల్లించుటకు పర్మనెంటు సెటిల్ మెంటు లగాయతు అంగీకరింపబడిన హక్కు, బంజరు భూములను సాగులోనికి తీసికొని వచ్చినపుడు జమీందారు తనకు యెక్కువ ద్రవ్యము వచ్చునట్లు చూచుకొన వీలయ్యెను. చూచుకొను చుండిరి గూడాను.

20 సంవత్సరముల క్రిందట 1865 వ సం॥పు 8 వ ఆక్టుకు ఎట్టి అర్థము చేయబడినను తరువాత దానికి వ్యాఖ్యానము చేసినవారు కేవలము గొప్ప న్యాయవాదులు మాత్రమేగాక ఈ దేశ సాంప్రదాయములను బాగుగా తెలిసి, వానియొక్క అంతరార్థములను తెలిసిన మహామహులై యుండిరి. వర్

ముత్తుస్వామి అయ్యర్, సర్ సుబ్రహ్మణ్య అయ్యర్ గార్ల విషయమై నేను ప్రస్తావించుచుంటి నని వేరుగా చెప్ప నవసరము లేదు. బిల్లునందలి ముఖ్యవిషయములపై ఈ విఖ్యాతన్యాయమూర్తులు గావించిన వ్యాఖ్యానము నాధారము చేసుకొనుట వలన ఈబిల్లును గావించుటలో ప్రభుత్వము వారికి బలము చేకూరినది. ఈ బిల్లు ఆమోదింపబడినచో ఈ రాజధాని యందలిరయితులు ఈవిఖ్యాతన్యాయమూర్తు లిద్దరికిని సర్వదా కృతజ్ఞులై యుండదగియున్నారు.''



There was clearly no intention on the part of the framers of the Act, which was no more than procedural enactment, to differentiate the cultivators into occupancy and non-occupancy ryots or to define the limit of their rights. The Act was intended to do more than facilitate the recovery by the various classes of land-holders enumerated in the Act of their just dues from their ryots and tenants, and the Act includes persons who will fall under both these classes of our bill. If up to 1865, the ryots had certain rights there was nothing in the Act to destroy them.

"It seems scarcely necessary to go much further into this question. Unfortunately however, Act VIII of 1865 came into operation shortly after the abolition of the old Court of Sadar Adalat, which had other traditions to guide it, and the Judges of the newly established High Court, were misled into construing the inapplicable terminology of English Law which the Act employed as if the terms connoted the corresponding legal conceptions of that law. The patta, mere memorandum of the extent under cultivation in the year and of the particular crops harvested, was treated as a lease for a year, which it is not, and soon, until the matter culminated in 1871 in Chokkalingam Pillai's case, in which the High Court held that, by the acceptance of a year patta, the presumption was that the pattadar was a yearly tenant and no more. No doubt, a slight evidence of this customary status might have thrown the presumption on the other way. The legal effect of the case, however, was widely misapprehended and it is with actual results we have to do in legislation, and this apprehension had far reaching consequences. The Zamindars

sedulously set themselves to procure from their ryots pattas in which was entered a stereotyped clause that the Zamindar was at liberty to lease the land at his pleasure. These were distributed in thousands, generally as printed forms in the Northern circars. Rents were forced up under the dire misapprehension of eviction from ancestral homes. The Zamindars rarely did actually eject; and the ryot so long as he was not evicted, would sign anything. Such a 'contract' was virtually valueless, having regard to the unequal relations of the parties.

"The status of the occupancy ryot is incompatible with a contractual relation and the payment of a competitive rent. Act VIII of 1865 included however, classes to whom such a contract was open, namely, those whom we have classed 'Tenants' in the present bill—the under-tenant of the ryot and the tenant of the Zamindar's home-farm lands. I do not think there is really much dispute that these are the only classes who can properly be called non-occupancy cultivators. Contract was also open to the parties where, in consideration of the reclamation of waste lands, the Zamindar agreed to take a favourable rate of assessment for a term; but such a contract would neither obstruct the cultivator's occupancy right nor justify the Zamindar in ultimately imposing a competitive or economic rent. The landholder's Association, in a memorial which they presented on the bill of 1899, virtually admitted the distinction. They wrote:"It would simplify the diffi culty to class the zamindari lands into two divisions. viz. patta lands and non-patta lands may be of the description of lands to which section 12 of the Rent Recovery Act VIII of 1865 is applicable. Non-patta

lands may be the lands of the remaining description, which are waste, private or pannai, or khas lands or inam lands etc. The pattah lands are already virtually occupancy lands throughout the Presidency. The only difference in those parts where the theory of occupancy right is not recognized is that such lands are not transferable.

"This is clear admission that in all the public cultivable land is all which is not pannai or khas land, that is home-farm. By inam lands, I understand the reference to have been to small inams which as they occasionally did include the land itself as well as the revenue. The Association added waste lands. This addition I cannot admit and I will now deal with that question. The Zamindars make a strenuous claim that they have special rights over the waste in other words, that they can exact for the cultivation there of such terms as they please or what is the same thing, impose a rent and not an assessment. No. constitutional basis can be found for such an argument; Zamindar is in law no more than an assignee of the public revenue. The review which I have taken of the opinions recorded by the highest authorities down to 1865, give no colour to such pretension; and it did not exist during all these years, nothing that has been enacted since, has conferred rights which were not possessed at that time.

"In the letter which I have quoted addressed by this Government to the Government of India, regarding Act VIII of 1865, the right of the resident ryots to extend their cultivation to the waste is distinctly averred. Section II (iv) of the Act no doubt declared that the landholders may arrange their own terms of rent. But the clause is carefully guarded by the proviso that all special rights are

preserved. The special rights so preserved are the right to extend cultivation to the waste and the right recognised since the permanent settlement to pay not a rent but the assesment thereon due. The Zamindars could of course and did usually arrange favourable terms for such cultivation in or to obtain reclamation of the lands.

"Whatever may have been the construction placed upon the provisions of the Act VIII of 1865, some twenty years ago, it is fortunate that in later years its interpretation has been in the hands of judges not only great and eminent lawyers but jurists possessed of a native knowledge of the common law of this country and imbued with its spirit. I refer, I need not say, to those great Judges Sir Muthu Swami Ayyar and Sir Subrahmanya Ayyar. Nothing has strengthened the hands of the Government in prosecuting this legislation so much as the expositions of the law which these judges have from time to time given forth on the questions which are fundamental in this Bill; and if this bill passes, it is a deep debt of gratitude that the agricultural population of this Presidency will owe to the memory of Sir Muthuswami Ayyar and to the labour of Sir Subrahmanya Ayyar."

203



## XIV 1908 సం॥ ఎస్టేటుల్యాండ్ ఆక్టు

### 1938 సం॥ ప్రకాశము కమిటీవారి శిఫార్సులు;—

1865 సం॥ రపు రెంటురికవరీఆక్టు దరిమిలా ప్యాస్ చేయబడిన ఆక్టు 1908 సం॥రపునాటి "మద్రాస్ఎస్టేటుల్యాండు ఆక్టు." జమీందారుడు భూమికి సంపూర్ణహక్కుదారుడనిన్నీ, రైతు కేవలము ఏక్‌సాలా కౌలుదారుకంటె హెచ్చుహక్కుగల వాడు కాడనిన్నీ చొక్కలింగం పిళ్ళ కేసులో చెప్పబడిన తప్పు తీర్పును సవరించడానికే ఈ ఆక్టు ముఖ్యముగ పుట్టినదని చెప్పి యుంటిమి. ఈ ఆక్టును తయారుచేయుటకు పూనుకొనిన ఫోర్బ్స్ మొదలగు మెంబర్లు నిజస్థితిని బాగుగ తెలిసికొన్నారు. అందుకనే వారు ఆక్టులో "రెంటు" అనుమాటకు బదులుగ 'శిస్తు' అను మాటను చేర్చవలెనని సూచించిరి. కాని అదేమిమాయయోగాని, కొసకు తీరా ఆక్టు ప్యాస్అయ్యేటప్పటికి మరల "రెంటు" అను మాటయే ఆక్టులో ప్రత్యక్షమయ్యెను. ఇది ఒకవిషయము.

"రెంటు" అనుపదమును "శిస్తు"అను పదముగ మార్చుయత్నమేల సాగలేదు? మాయ!

ఈ ఆక్టులో ప్రధానమైన శెక్షన్ 4వ శెక్షన్. దీనిలో జమీందారుడు రెంటు వసూలుచేసుకోడానికి మాత్రం హక్కు-దారు డని స్పష్టముగ ప్రకటింపబడినది. ఈ విషయమై ఇదివరకు లేవదీయబడిన సందేహములన్నియు ఈఒక్క శెక్షన్‌తో విడగొట్టి వేయబడినవి. ఇందునుగురించి ఇంకెవరుగాని తగాదాచేయడానికి వీలులేదు. అయినప్పటికీ

4వ శెక్షను జమీందారుడు శిస్తువసూలుహక్కు-దారుడు మాత్రమే.

జమీందార్లు ఇంకను ఈ విషయమై సందేహములు లేవదీయుట యున్నూ, భూమిహక్కు మాదేనని మొన్న మొన్న ప్రకాశం కమిటీ ఎదుటకూడ వాదింపబూనుటయున్నూ సాహసము. సందు దొరకినప్పుడల్లా జమీందార్లు తమకు లేనిహక్కులను ఉన్నట్లుగ పెద్దగందరగోళము చేయుడము తమ ఆగతనమును, తమ ధనబలమును, పలుకుబడిబలమును ఇంకా వినియోగించి ఇంకా తమపంతమును నెగ్గించుకోవలెనని వారికి వున్న అహంకారమున్ను వ్యక్తపరచుచున్నది. అయితే ప్రకాశముకమిటీ వారు వీరివాదముచు అంగీచరించక త్రోసివేయుట ముదావహము.

బంజర్లలో జమీందార్లకుగల హక్కు ఏమి ? ఫోర్బ్సు ఉపన్యాసం

సేద్యముక్రిందనున్న భూములలో హక్కు లేనప్పటికి బంజరుభూములలో తమకు హక్కువున్నదనిన్నీ జంజర్లమీద తమ ఇచ్ఛానుసారము రేట్లు విధింపవచ్చుననిన్నీ జమీందార్లు 1908 సం॥ నాడు పెద్దగందరగోళము చేసిరి. అయితే, మొదటిస్టేజిలో గవర్నమెంటువారు ఈ వాదనను అంగీకరించక త్రోసివేసిరి. ఈ సందర్భమున ఈ బిల్లు ప్రవేశపెట్టిన ఫోర్బ్సు అను మెంబరు జమీందార్లతరఫున చేయబడిన యీ వాదనను పూర్తిగ ఎదిరించుచు ఇందునుగూర్చి ఇండియాగవర్నమెంటువారు తెలియపఱచిన అభిప్రాయమును తన ఉపన్యాసములో విశదీకరించెను. సదరు ఇండియాగవర్నమెంటువారి అభిప్రాయ మేమో వినండి.

"పర్మనెంటు సెటిల్‌మెంటు వలన బంజరు భూముల విషయమున తమ యిష్టమువచ్చిన విధముగ వ్యవహరించుటకు జమీందారుల కధికార మొసగబడె నను వాదమును భారత ప్రభుత్వమువారేమాత్రమును అంగీకరింప జాలరు. ఈ విషయము బెంగాలు టెనన్సీ ఆక్టును గావించు సందర్భమున పూర్తిగ చర్చింపబడెను. అపుడు గావించు కొనబడిన నిర్ణయములవలన బెంగాలు పర్మనెంటు సెటిలుమెంటు నందు, బంజరు భూములు, రైతులకు జిరాయితీ అధికారములు లేని ఖమర్ భూములలోను సర్ భూములలోను చేర్చబడ లేదు. బెంగాలు పర్మెనెంటు సెటిల్మెంటు నిబంధనలకును, మదరాసు పర్మెనెంటు సెటిల్మెంటు రెగ్యులేషనులకును కొంచెము భేదములు గలవు. అట్లు భేదించిన సందర్భములలో మదరాసు నిబంధనలయందు రైతుల హక్కులకే అధిక తరమగు రక్షణ మొసగబడెను. ఈ సందర్భమున, 1793 వ సం॥పు VIII బెంగాలు రెగ్యులేషను నందలి, 37, 39 వ సెక్షనులను, మదరాసులో పర్మనెంటు సెటిలుమెంటును ప్రవేశపెట్టుటకు గాను కలెక్టరులకు పంపబడిన సూచనలలోని 25, 34 వ పేరాలను చూడవలెనని గోరుచున్నాము. 27 వ పేరాను చూచినయెడల - పర్మెనెంటు సెటిలుమెంటు వలన బంజరు భూములపైన గూడ జమీందారులకు సంపూర్ణ మగు హక్కు లొసగబడె నను వాదనకు ఆ పేరాలో ఏ విధమగు ఆధారమును గనుపింపదు. జమీందారులు, వారి స్వప్రయోజనము కొఱకే - సదరు బంజరు భూములను ఇదివరకే అమలునందున్న శిస్తు రేటులను పుచ్చుకొని, దేశాచార సాంప్రదాయ సిద్ధములగు హక్కులకు

భంగము కలుగని విధమున - వ్యవసాయకులకు సాగున కొసగ వలె నని మాత్రమే ఆ పేరాయందు సూచింపబడెను. భూస్వామియొక్క స్వాంతకమతము భూములలో రైతులకు జిరాయితీ హక్కు నొసగరా దను సూచనను అంగీకరించుటకు భారత ప్రభుత్వము వారి కాక్షేపణ లేదు. కాని బంజరు భూముల విషయమున మాత్రము అట్టి సూచనను ఏ మాత్రమును అంగీకరింపజాలరు. బంజరు భూములలో జిరాయితీ హక్కును తొలగించుట సాంప్రదాయ సిద్ధ మగు దేశాచారమునకు విరుద్ధ మనియు, ప్రజా శ్రేయస్సునకు గూడ భంగకర మనియు భారత ప్రభుత్వము వారి అభిప్రాయము.

భూస్వామి యొక్క స్వాంతకమతము భూములను తప్ప మిగతా బంజరుభూమి నంతను జిరాయితీ హక్కులోనికి దెచ్చు విషయమును చాల జాగ్రత్తగ నాలోచించి దేశీయాచారమును, ప్రజా శ్రేయస్సును పురస్కరించుకొని ప్రభుత్వము వా రిదివరకే ఒక నిశ్చయమునకు వచ్చి యున్నారు. బంజరు భూములను సాగుచేసుకొనుటకు తమకు సంపూర్ణ మగు అధికారము కలదనియు, దానిని మార్చుట కెవరికిని అధికారము లేదనియు గ్రామము లందలి రైతులు భావించుచు చిరకాలముగ అట్టి హక్కును అనుభవించుచున్నారు. ప్రాతసాగునకును, క్రొత్త బంజరు సాగులకును షరతులయం దెట్టి భేదము లేకుండ ఒకేవిధ మగు షరతులతో బంజరుల సేవ్యమొనర్చుకొనుటకు హక్కు గలదని గ్రామస్థు లగు రైతు లెప్పుడును భావించుచుండిరి. ఇట్టి యభిప్రాయము యితర జిల్లాలలోనే గాక చెంగల్పట్టు జిల్లా యందలి గ్రామస్థులందుగూడ బలవత్తరముగ

207

వ్యాపించి యున్నది. దేశాచారసిద్ధముగ రైతులకు గల ఈ హక్కులు 1865 వ సం|పు శాసనముచే తొలగింపబడలేదు. ఇందుచేతను - ప్రజాశ్రేయస్సునకు సంబంధించిన యితర కారణములచేతను జిరాయితీ హక్కు విషయమున, సాగు భూములకును, బంజరు భూములకును ఏ విధముగ విచక్షణను ప్రభుత్వమువారు గావింపజాలరు. కాని, బంజరు భూములను రైతులకు పంచిపెట్టు నధికారమును మాత్రము జమీందారులకే యుండవచ్చును. అందు కాక్షేపణ లేదు."

సొంతకమతం భూములు:—బంజరుభూములన్నీ తమవే అనిన్నీ, వాటిని తాము ఆక్రమించుకుని సొంతకమతాలక్రింద మార్చుకోవచ్చుననిన్నీ జమీందార్లు వాదించిరి. ఈ వాదననుగూడ ఫోర్బ్సు అంగీకరించలేదు. ఈ వాదమును అంగీకరించుట "పబ్లిక్ పాలసీ"కి అనగా (పరిపాలనా ధర్మములకు) కేవలము విరుద్ధమగుటయేగాక ప్రజలకు అనాదినుండి అంగీకరింపబడుచూ వచ్చిన హక్కులను భంగపుచ్చుట యగుననికూడ ఫోర్బ్సు *ట్టిగ చెప్పెను.

సొంతకమతాలను ఏర్పాటు పెట్టిగాని పెంపుచేసుకోడానికి జమీందారుకు హక్కులేదు.

బంజర్లను ఆక్రమించుకోవడము వల్లనేగాక జిరాయితీ రైతులక్రిందనున్న భూములను తాము కొనివేసిన వానినికూడ తమ స్వంతకమతంభూములుగ మార్చివేసికోవచ్చునని ఇంకొక వాదనను జమీందార్లుచేసిరి. అట్లయినచో కొద్దిసంవత్సరములలోనే జమీభూములన్నియు జమీందారుకు సొంతకమతం భూములైపోయి ఎస్టేట్లలోని రైతులందరు "ఎప్పుడులేచి

పొమ్మంటే అప్పుడు లేచిపోయే" దిక్కుమాలిన కౌలుదార్లుగ మారిపోవలసివచ్చుననిన్నీ ఇట్టి దుస్థితిని అంగీకరించడానికి ఎంత మాత్రము వీలులేదనిన్నీ, జమీందార్లు ఏవంక పెట్టిగాని స్వంత కమతములను విస్తరింపజేసికోడానికి వీలులేదనిన్నీ ఫోర్బ్సు గట్టిగ వాదించెను.

ఇందునుగూర్చిన అతని ఉపన్యాసభాగ మీదిగువ ముద్రించుచున్నాము.

"స్వంతభూమిలేక కమతము భూమి అని వ్యవహరింపబడు భూములలో భూస్వామికి రైతు హక్కును జమీందారు హక్కునుగూడ గలవు. అట్టి కమతము భూమి విస్తీర్ణమును హెచ్చించుకొనుటకు యెంతవర కధికారము గల దను విషయమును గురించి యిక చర్చించెదము. బంజరు భూములను సాగు చేసుకొనుటకు, కమతము భూములను హెచ్చించుకొనుటకు, అందుకుగాను రైతుల నుండి రయితీభూములను కొనుక్కొనుటకు భూస్వాముల కధికార మొసగవలె నను వాదము, పైకి చూచుటకు మాత్రము బాగుగనే గన్పించును. నిజమే, కాని భూస్వాముల కిట్టి అధికారము నొసగినచో, ఆ యధికారము గ్రామములలో ప్రస్తుతము గ్రామవాసులు అనుభవించుచున్న హక్కులను భంగపరచుట కుపయోగింపబడును. జమీందారు యొక్క స్వంత కమతం భూమిగాక, మిగిలిన భూమి యంతటి యందునుగూడ ప్రజలు అనాదిగా సాంప్రదాయసిద్ధముగా అనుభవించుచున్న హక్కులు కొన్ని కలవు. ఆ హక్కుల ప్రకారము గ్రామస్థులు తమ సాగును బంజరు భూములకుగూడ వ్యాపింపచేసుకొనవచ్చును. ఇది అనాది సిద్ధమైన హక్కు.

209



ప్రజలకు గల సాంప్రదాయ సిద్ధమగు హక్కులమాట అటుంచి నను - దేశక్షేమమును దృష్టియం దుంచికొని ప్రభుత్వము వా రవలంబించ వలసిన విధానము నాలోచించినను, జమీందారు తన స్వంత కమతమును హెచ్చించుకొనకుండ చూచుట, ప్రభుత్వమువారి కర్తవ్యము. రయితీ భూమిని తన యిష్టము వచ్చినటుల స్వంతకమతములోనికి మార్చుకొనుటకు జమీం దారున కధికారమున్నచో అతడు కొలది సంవత్సరములలో - ఈ శాసనము నందలి నిబంధన లన్నిటి నుండియు గూడ తప్పిం చుకొని, తన ఎస్టేటు నంతను గూడ స్వంతకమతము లోనికి మార్చుకొన గలడు. అపుడు వ్యవసాయకు లందరును గూడ జమీందారునకు కవులుదార్లుగ నొనర్ప బడెదరు. జమీందారు వారిని తన యిష్టము వచ్చినపుడు పొలములనుండి తప్పింప వచ్చును. వారందరును జమీందారుని దయాధర్మములపై నాధారపడి యుండవలసిన వా రయ్యెదరు. అట్టి పరిస్థితులు సంభవింప నిచ్చుటకు ప్రభుత్వమువారే మాత్రమును అంగీక రింపరు. కనుక, సాంప్రదాయసిద్ధ మగు ఆచారమును బట్టి చూచినను దేశక్షేమదృష్టితో చూచినను స్వంతకమతపు విస్తీ ర్ణమును హెచ్చించుకొనుట కధికార మొసగరాదు. ఈ చట్టముయొక్క ప్రధాన సిద్ధాంతములలో యిది యొకటి. భారతదేశ మందలి యితర ప్రాంతముల యందుగూడ యిదే సిద్ధాంతము అవలంబింప బడెను.''

శిస్తు హెచ్చించు హక్కు జమీందార్లకు లేదు :—

శిస్తు హెచ్చించేహక్కు జమీందార్లకులేదు

జమీందార్లకు శిస్తు హెచ్చించే హక్కులేదని ఫోర్బ్సు చేసిన వాదన

బహుధర్మసమ్మతముగ నున్నందున దాని నిట పూర్తిగ ముద్రించక విడువలేము.

“రెండవవిషయము కృష్ణనాయరుగారు సూచించినది. శిస్తును హెచ్చించుటకు జమీందారునకు చట్టమునం దొసగబడు అధికారముల గురించి గౌరవనీయుడగు ఆ సభ్యుడు గావించిన సూచనలయెడ నాకెంతయు సానుభూతిగలదు. రైతు జమీందారునకు ఎంతశిస్తు చెల్లింపవలెనను విషయమున ఈ రాష్ట్రమున చిరకాలముగ నున్న ఆచారమునుబట్టియే శిస్తు నిర్ణయింపబడవలెనని మదరాసుప్రభుత్వమువారి అభిప్రాయము. భారతప్రభుత్వమువారికి మొదట పంపిన చిత్తుచట్టములో అందు కనుగుణమగు నిబంధనలే సూచింపబడెను. ఈ ప్రాంతము నందు అమలులోనున్న “వరం”ను బట్టియే శిస్తురేటు నిర్ణయమగును. “వరము”నే ప్రమాణముగ దీసుకొని అనుసరించిచో దానిని నగదురేటులోనికి మార్చుకొనుట కష్టము కాదు. శిస్తుహెచ్చింపు తగ్గింపుల సమస్యగూడ చాలవరకు పరిష్కారమగును. లెక్కలబట్టి వానిని సులభముగ నిర్ణయింపవచ్చును. కమ్యుటేషను రేటులగురించి భూస్వాములు రైతులును తమలో తాము పరిష్కరించుకొనవలెను. ఆ సిద్ధాంతము తప్పుగ అమలుజరుపబడిననేతప్ప ప్రభుత్వమువారీ విషయమున జోక్యము కలిగించుకొన నవసరముండదు. “వరము”ను పంటలలో ఎంతభాగము న్యాయమగు శిస్తు అను విషయమును నిర్ణయించుకొనుటలోగూడ కొన్నిచోట్ల చిక్కులు రావచ్చునని కొందరు సూచించిరి.”

“చాలమంది జమీందారులు పంటశిస్తులను చాల సంవ

త్సరములకు పూర్వము శాశ్వత మగు నగదు శిస్తులోనికి మార్చుకొని తరువాత ఆ నగదుశిస్తు హెచ్చించుకొనుచుండుట వలన ఇపుడు పంటలో వారికి చెల్లింపబడెడిభాగ మెంతయో తెలియుట కొంత కష్టమే యైనను ఆ రేటుల నిప్పటికిని ఎక్కువ కష్టము లేకుండగనే ఋజువు చేయవచ్చు నని నమ్ముచున్నాను. గ్రామస్థు లందరకును ఈ రేటులు బాగుగనే తెలియును. రైతులు శిస్తుల భారముచే క్రుంగిపోవుచుంటి మని భావించు ప్రాంతములలో వారి ఆక్షేపణ కంతకును వెనుకటి గ్రామశిస్తుల రేటులకును, యిప్పటిరేటులకును గల వ్యత్యాసమే కారణము. అయినను యీ బిల్లునందు కొన్ని సందర్భములలో శిస్తుల హెచ్చింపునకు అనుమతి యొసగబడెను. కాలము గడచిన కొలదియు పరిస్థితుల మార్పును బట్టి ఈ విషయమున భూస్వాముల కెక్కువ స్వాతంత్ర్యమొసగుట అవసరముగావచ్చును. నిర్దాక్షిణ్య మగు తమ షరతుల ప్రకారము తమకు రావలసిన దానికంటె యింకను హెచ్చుమొత్తమును గోరు జమీందారుల యెడల నా కెక్కువ సానుభూతి లేదు. పర్మనెంటు సెటిల్మెంటు సమయమున గావించుకొన్న ఒడంబడిక వలన మొత్తము ఆదాయములో మూడవ వంతు కంటె అధికభాగమే భూస్వామికి సంక్రమించెను. ప్రభుత్వమువారికి రావలసిన శిస్తును వసూలు చేసి మూడింట రెండువంతులను ప్రభుత్వము వారికి చెల్లించి, మిగతా మూడవవంతు అత డనుభవింపవలెను. అది అప్పటి యొడంబడిక. జమీందారులకు వదలి వేయబడినది మూడవ వంతే యని చెప్పబడినను నిజముగా నది అప్పుడే మూడవ వంతు కంటె చాల అధికముగనే యుండియుండవలెను. అవును

ప్రభుత్వోద్యోగులకు దేశం బాగుగ తెలియదు. ఎక్కడెంత భూమియున్నదో తెలియదు. అందుచే ఎస్టేటు ఆదాయపు విలువను సరిగా లెక్కింప గలిగి యుండ జాలరు. ఆ యొడంబడిక క్రింద ఇపుడు జమీందారు లెంత అనుభవించుచున్నారో సులభముగా లెక్కింప వీలు లేదు కాని వారి వంతు ఆదాయము అపారముగ హెచ్చె నను విషయము సుప్రసిద్ధము. సర్. భాష్యం అయ్యంగారు అయిదారు వత్సరములకు పూర్వము గ్రామోద్యోగుల బిల్లు చర్చలో పాల్గొని ప్రసంగించుచు, అప్పటికి మొత్తము ఆదాయములో మూడింట రెండువంతులు జమీందారు అనుభవించుచున్నా డని అంచనా వేసిరి. భూస్వాములకు చెందుచున్న యీ అదనపు ఆదాయము ప్రభుత్వ కోశాగారమునకు చేరినయెడల ప్రజోపయోగకరము లగు కార్యముల కుపయోగించెడిది. లేనిచో ప్రజలపై గల శిస్తుల భారమును తగ్గించుట కుపయోగించెడిది. సాగు విస్తీర్ణము నభివృద్ధి పరుచుట వలన జమీందారు ధనవంతుడు గావలెను గాని ఉన్నభూములపై శిస్తుల నిర్దాక్షిణ్యముగ హెచ్చించుట వలనగాదు. బంజరు భూములను సాగులోనికి దెచ్చి రైతుల కొసగవలెను. ఆ పద్ధతి వలన జమీందారు ఆదాయము హెచ్చును. దేశమునకు గూడ మంచిది. ఈపద్ధతి నవలంబించి నంతవరకు జమీందారుల చర్యలు అభినందనీయములు. వారెటుల వ్యవహరించి యున్నను యిదివరకు గావింపబడిన సెటిల్మెంటును మార్చు ఉద్దేశము లేదను విషయము నిజమే. కాని దానివలన జమీందారులు పొందిన లాభములను చూచినచో వారు తమకున్న వని భావించు హక్కులను తగ్గించు

కొని వ్యవహరించుచుంటి మని చెప్పి ప్రజాభిమానమును బడయ ప్రయత్నించుచున్నపుడు - వారియెడల నాకే మాత్ర మును సానుభూతి గలుగుట లేదు. వారు ఏ విధమగు సాను భూతికిని అర్హులు కారు. 1802వ సం॥పు జమీాందారుల సంతతివారు ఎంతయో లాభకర మగు ఒడంబడిక యొక్క ఫలితముల ననుభవించుచున్నారు. దుబారాగా వ్యసనలోలురు కాకుండ నున్నచో వీ రందరును ఎంతయో ధనికులుగ నుండ వలసినది.''

''కాని ఈ ఉపాఖ్యానము నింతటితో వదలివేసి అసలు విషయమునకు వచ్చెదను. శిస్తులహెచ్చింపు విషయమున జమీాందారుల కీ బిల్లులో సంపూర్ణమగు అధికార మొసగబడ లేదు. 22 క్లాజునకు ఏర్పరుపబడిన ప్రొవైజోవలన కొంతపరిమితి యేర్పరుపబడెను. పంటలో భాగముగా పాలుపద్ధతిని విధింప బడిన శిస్తులను హెచ్చించుటకు అధికార మొసగబడలేదు. రొఖ్కరూపమగు శిస్తుమాత్రమే హెచ్చించవచ్చును. అందు కును కలెక్టరు యెదుట దావా వేయవలెను. ఆ ప్రొవైజో యం దిట్లుగలదు. దావా భూమి యున్న గ్రామములో ఏ ''వారము'' ప్రకారము శిస్తు చెల్లించుట ఆచారసిద్ధమో తెలి సినయెడల సదరు ''వారము'' రేటుపంటను 33 సెక్షనునందలి సిద్ధాంతములప్రకారము 'కమ్యూటు' చేయుచో వచ్చు శిస్తు రేటుకంటె హెచ్చింపరాదు. ఈ యేర్పాటువలన 1802వ సం॥ రెగ్యులేషనుచే రైతులశిస్తు కేర్పరుపబడిన పరిమితిని ఇకమీాద యీ బిల్లునందుగూడ కొనసాగించుటకు ప్రభుత్వమువారు ప్రయత్నించిరి. నేను నా ప్రారంభోపన్యాసమున నుడివినట్లు ఈ

3. ప్రభుత్వమువారిచే సదరు భూమికి ఉపయోగింపబడు ఇర్రిగేషను వర్కు ఏదైన నిర్మింపబడి ఆ కారణముచే భూస్వామిని అదనముగా కొంత ఆదాయమును చెల్లింపవలెనని ప్రభుత్వమువారు కోరి యుండుటచేతను,

4. నదీప్రవాహముల చర్యలచే రైతుభూమియొక్క ఫలసాయమధిక మయ్యె నను కారణము చేతను."

1వ క్లాజు:- ధాన్యపు మార్కెటు రేట్లు హెచ్చితే, శిస్తు హెచ్చించవచ్చునా?

(1) ధాన్యపు మార్కెట్ రేట్లు:—ధాన్యాదుల ధరలు హెచ్చితే, రొక్కపు రేటు హెచ్చించవచ్చు నట. అయితే ఈ పద్ధతి పర్మినెంటుగ రేట్లు నిర్ణయమైన కేసులకు వర్తించ దని ఈ క్లాజుక్రిందనే మినహాయింపు స్పష్టముగ వ్రాయబడి యున్నది. అనగ, ఈ పద్ధతి 1802 నాడు జిరాయితీహక్కు రేట్లు స్థిరపరుపబడిన భూముల విషయములో వర్తింపదనుట నిస్సందేహమే గద. కాబట్టి యిది పాత బంజర్లకు మాత్రమే వర్తించునని సారాంశము.

2వ క్లాజు:— భూసారము హెచ్చితే శిస్తు హెచ్చించవచ్చునా?

(2) భూసారము హెచ్చితే:— భూసారము జమీందారు ఖర్చుమీద హెచ్చయినట్లయితే శిస్తు హెచ్చించవచ్చునట. దీనిని గురించి లోగడ రెంటుఆక్టును చర్చించు సందర్భములో చెప్పియే యున్నాము. రెంటు ఆక్టులో యిట్టి ఏర్పాటు అనాది బంజర్ల విషయములోనే చెప్పబడెను. దానిని 1908 సం॥ ఆక్టులో జిరాయితీ భూములకు గూడ వర్తింపజేయబూనుట ఆశ్చర్యము. ఇట్టి

కొని వ్యవహరించుచుంటి మని చెప్పి ప్రజాభిమానమును బడయ ప్రయత్నించుచున్నపుడు - వారియెడల నాకే మాత్ర మును సానుభూతి గలుగుట లేదు. వారు ఏ విధమగు సాను భూతికిని అర్హులు కారు. 1802వ సం॥పు జమీందారుల సంతతివారు ఎంతయో లాభకర మగు ఒడంబడిక యొక్క ఫలితముల ననుభవించుచున్నారు. దుబారాగా వ్యసనలోలురు కాకుండ నున్నచో వీ రందరును ఎంతయో ధనికులుగ నుండ వలసినది.''

''కాని ఈ ఉపాఖ్యానము నింతటితో వదలివేసి అసలు విషయమునకు వచ్చెదను. శిస్తులహెచ్చింపు విషయమున జమీందారుల కీ బిల్లులో సంపూర్ణమగు అధికార మొసగబడ లేదు. 22 క్లాజునకు ఏర్పరుపబడిన ప్రొవైజోవలన కొంతపరిమితి యేర్పరుపబడెను. పంటలో భాగముగా పాలుపద్ధతిని విధింప బడిన శిస్తులను హెచ్చించుటకు అధికార మొసగబడలేదు. రొఖ్ఖరూపమగు శిస్తునుమాత్రమే హెచ్చించవచ్చును. అందు కును కలెక్టరు యెదుట దావావేయువలెను. ఆ ప్రొవైజోయం దిటులగలదు. దావా భూమి యున్నగ్రామములో ఏ ''వారము'' ప్రకారము శిస్తు చెల్లించుట ఆచారసిద్ధమో తెలి సినయెడల సదరు ''వారము'' రేటుపంటను 33 సెక్షనునందలి సిద్ధాంతములప్రికారము 'కమ్యూటు' చేయుచో వచ్చు శిస్తు రేటుకంటె హెచ్చింపరాదు. ఈ యేర్పాటువలన 1802వ సం॥ రెగ్యులేషనుచే రైతులశిస్తు కేర్పరుపబడిన పరిమితిని ఇకమీాద యీా బిల్లునందుగూడ కొనసాగించుటకు ప్రభుత్వమువారు ప్రయత్నించిరి. నేను నా ప్రారంభోపన్యాసమున నుడివినట్లు ఈ

బిల్లుక్రిందకువచ్చు ఒకతరగతి ప్రజలనుగురించి మాత్రము కొంత దిగులుపడుచున్నాను. అనగా 1802వ సంవత్సరమునుండియు గూడ ఒకేనిర్ణీతమగు శిస్తునుచెల్లించుచున్న రైతులనుగురించి. రైతు 1802 నుండి ఇంతవరకు నగదులో ఒకేశిస్తు చెల్లించుచు, ఆ విషయమును ఋజువుచేయగలిగినయెడల ఈ ప్రొవైజో ఎంతవర కాతనిని శిస్తుహెచ్చింపునుండి కాపాడగల్గునో స్పష్టముగ చెప్పజాలను. అయినను దీనివలన అట్టి రైతునకు ఎక్కువ నష్టము గలుగునని అనుకొనను. ఇటీవలకూడ కొన్నిదావాలలో రైతులు 1802వ సంవత్సరమునుండియు తాము నగదురూపముననే శిస్తులు చెల్లించుచుంటి మనియు ఇదివర కెపుడును సదరు శిస్తులు మార్చబడలేదనియు ఋజువుచేసియుండిరి. రైతులు ఇకమీదగూడ ఏవిధమగు మార్పును లేకుండ వెనకటిశిస్తులనే చెల్లించుకొను హక్కుగలిగియున్నా రనియు ఎక్కువ చెల్లించ నక్కరలే దనియు న్యాయస్థానముల వారా దావాలలో తీర్పు చెప్పియుండిరి."

## "పాతబంజర్లు"—విశ్వామిత్రసృష్టి

"పాతబంజర్లు" విశ్వామిత్రసృష్టి

ఫోర్బస్ ఉపన్యాసమునుండి ఇన్ని భాగములను ముద్రించితిమి. వానిలో ముఖ్యముగ బంజరుభూములయందు జమీందార్ల కేవిధమైన ప్రత్యేకపుహక్కులు లేవనిన్నీ వాటిలోకూడ రైతులకు జిరాయితీ హక్కుగలదనిన్నీ వాటిమీదకూడ ప్రక్క భూములలో 1802 సం॥రమునాడు విధించిన రేట్లకంటె హెచ్చురేట్లు విధించరాదనిన్నీ ఈ ఉపన్యాససారాంశము.

అయినప్పటికి తీరా బిల్లుప్యాస్ కాబోయేసమయానికి సీమలోని ఇండియామంత్రినుండి హుకుములు వచ్చెను. జమీందార్ల ప్రయత్నము వారి ధనబలము, పలుకుబడిబలము ఇక్కడనుండి సప్తసముద్రములుదాటి ఇంగ్లండులో నున్న ఇండియామంత్రిని కూడ కదలించివేసెను. అత డేమని హుకుముల బంపెను? "పాతబంజరులు' అనుపేరుతో కొన్నిటిని ఏర్పరచవలసిన దనిన్ని వాటిలో రైతులకు జిరాయితీహక్కు లేకుండజేసి జమీందార్లకు పూరాహక్కు లివ్వవలసిన దనిన్ని ఈ హుకుముల సారాంశము.

ఈ హుకుముల ననుసరించి లోగడ పదేండ్లనుండి రైతాధీనములో లేని బంజర్లన్ని "పాతబంజర్లు"గ ఆక్టులో నిర్వచింపబడెను. ఇది విశ్వామిత్రసృష్టి. ఈ రీతిగ యీ ఆక్టులో మరల రెండు రకాలభూములు ప్రత్యక్షమైనవి. ఒకటి ఉత్తమ తరగతివి—అనగా రైతులకు జిరాయితీ హక్కుగలవి. 1802 సం॥ నాటినుండి శాశ్వతపు రేట్లతో స్థిరపరుపబడినవి. ఇక 1908సం॥ ములో జమీందార్లకు మెహర్బానీ చేయడానికిగాను సీమ మంత్రి హుకుముమీద కృత్రిమముగ సృష్టింపబడిన "పాత బంజర్లు" అనేవి రెండవరకపుభూములు— ఈ ఆక్టులో ఈ రెండు రకముల భూములు కలగాపులగంగా కలిపి సెక్షనులను వ్రాసిరి. దీనిఫలిత మేమి టంటే 1865 సం॥రపు రెంటుఆక్టువల్ల జడ్జీలచేతులలో జరిగిన అవకతవకలే మరల యీ ఆక్టువల్లకూడ జరుగ నారంభించినవి. ఇది అయ్యవారిని చేయబోతే కోతిఅయిన చంద మైనది.

50 వ శెక్షను 1 వ క్లాజు రెండురకాలభూముల మిళితము

ఈ రెండురకాలభూములు కలగాపులగంగా కలిపినట్లు 1908 సం॥నాటి యీ ఆక్టుయొక్క 50వ శెక్షన్ 1వ క్లాజు చెప్పుచున్నది, చూడండి—

ఈ అధ్యాయములోని నియమాలు అనుభవశాశ్వతత్వము పొందియుండే అందరు రైతులకున్నూ మరి అవసరమయినంతవరకూ వ్రాతమూలకంగా కౌలుపొందినవారుతప్ప ఇతరవిధాల ప్రాతబంజరును ల్యాండుహోల్డరు వద్దనుండి పొందియుండే రైతులకును అన్వయముగాగలవు.*

రెండు రకాల భూములను కలుపుతూ శిస్తు హెచ్చింపులకు ఈ ఆక్టుయొక్క 30, 40 శెక్షనులలో కొన్ని అవకాశములు కల్పింపబడెను. ఈ అవకాశాలు నిజానికి జిరాయితీ హక్కు లేని రెండవ తరగతి భూములకు వర్తింప నుద్దేశింపబడినవైనప్పటికీ, అవి అజ్ఞానపు జడ్జీలయు, అవకతవక లాయర్లయు చేతులలో జిరాయితీ రైతులకు కూడ వర్తింప చేయుబడి వారి దుంపలు తెంపబడెను.

శిస్తు హెచ్చింపులకు అవకాశమిచ్చే 30 వ, 40వ శెక్షనులు 'పాత బంజర్లకు మాత్రమే వర్తిస్తవి కాని, జిరాయితీ భూములకు వర్తించవు.

30 వ శెక్షను చూడండి.

ఇందు ఉదహరింపబడిన నాలుగు విధాలుగ తప్ప, ఇం

*"The provisions of this chapter shall apply to all ryots with a permanent right of occupancy and also so far as may be to ryots holding old waste under a landholder otherwise than under a lease in writing."

కొక అయిదవ విధముగ జమీందారుడు శిస్తు హెచ్చించడానికి వీలు లేదని ఈ శెక్షను చెప్పుతుంది. ఆ నాలుగు విధాలు ఏమిటో అవి నిజముగ జిరాయితీ రైతులకు ఉద్దేశింపబడినవో లేవో తెలిసికొందము.

30వ సెక్షను వివరణ

"శెక్షను 30 :— రైతు తన భూమిపై భూస్వామికి నగదు రూపమున శిస్తు చెల్లించుచున్న యెడల భూస్వామి ఈ క్రింద నుదహరింపబడిన వానిలో ఏ కారణము చేతనైనకాని శిస్తును హెచ్చింపవలె నని కలెక్టరుకు దరఖాస్తుచేయవచ్చును.

1. జమీందారీ డివిజనులో గాని, సదరు తాలూకాలోగాని ప్రస్తుతపు శిస్తు అమలులో నున్న కాలమందు స్థానిక ఆహారధాన్యముల ధరలు దామాషాయిన హెచ్చె నను కారణము చేతను :— అయితే

 (ఎ) సదరు శిస్తు శాశ్వతముగ నొకే రేటున చెల్లింపబడవలసిన దైనయెడల యీ క్లాజు క్రింద ధరలు హెచ్చె నను కారణముచే శిస్తును హెచ్చింపరాదు.

 (బి) ఇదివరకు చెల్లింపబడుచున్న శిస్తును ఈ క్లాజుక్రింద రూపాయికి రెండణాలు చొప్పున కంటె ఎక్కువ హెచ్చింపరాదు.

2. ప్రస్తుతము చెల్లింపబడుచున్న శిస్తురేటు అమలునందున్న కాలమున భూస్వామిచేగాని, భూ స్వామి ఖర్చుమీద గాని, రైతు భూమియొక్క ఫలసాయ మధికతరమొనర్చ బడె నను కారణముచేతను,

3. ప్రభుత్వమువారిచే సదరు భూమికి ఉపయోగింపబడు ఇర్రిగేషను వర్కు ఏదైన నిర్మింపబడి ఆ కారణముచే భూస్వామిని అదనముగా కొంత ఆదాయమును చెల్లింపవలెనని ప్రభుత్వమువారు కోరి యుండుటచేతను,

4. నదీప్రవాహముల చర్యలచే రైతుభూమియొక్క ఫలసాయమధిక మయ్యె నను కారణము చేతను."

1వ క్లాజు:- ధాన్యపు మార్కెటు రేట్లు హెచ్చితే, శిస్తు హెచ్చించవచ్చునా?

(1) ధాన్యపు మార్కెట్ రేట్లు:—ధాన్యాదుల ధరలు హెచ్చితే, రొక్కపు రేటు హెచ్చించవచ్చు నట. అయితే ఈ పద్ధతి పర్మినెంటుగ రేట్లు నిర్ణయమైన కేసులకు వర్తించ దని ఈ క్లాజుక్రిందనే మినహాయింపు స్పష్టముగ వ్రాయబడి యున్నది. అనగ, ఈ పద్ధతి 1802 నాడు జిరాయితీహక్కు రేట్లు స్థిరపరుపబడిన భూముల విషయములో వర్తింపదనుట నిస్సందేహమే గద. కాబట్టి యిది పాత బంజర్లకు మాత్రమే వర్తించునని సారాంశము.

2వ క్లాజు:— భూసారము హెచ్చితే శిస్తు హెచ్చించ వచ్చునా?

(2) భూసారము హెచ్చితే:— భూసారము జమీందారు ఖర్చుమీద హెచ్చయినట్లయితే శిస్తు హెచ్చించవచ్చునట. దీనిని గురించి లోగడ రెంటుఆక్టును చర్చించు సందర్భములో చెప్పియే యున్నాము. రెంటు ఆక్టులో యిట్టి ఏర్పాటు అనాది బంజర్ల విషయములోనే చెప్పబడెను. దానిని 1908 సం॥ ఆక్టులో జిరాయితీ భూములకుగూడ వర్తింపజేయబూనుట ఆశ్చర్యము. ఇట్టి

పెంపుదల పర్మనెంటు సెటిలుమెంటు షరతులకు భిన్నమైనది. ఎట్టి కారణముచే గాని శిస్తు రేట్లు హెచ్చింపబడ రాదని 1802 సం॥రపు రెగ్యులేషనులు చెప్పుచుండగ వానికి భిన్నముగ ఈ 1908 సం॥రపు ఆక్టు ఇట్టి ఏర్పాటు ఎట్లు చేయగలదు?

ఆనకట్టలు వగైరాలుకట్టి భూములను హెచ్చుఫల వంతములోనికి తేవడానికేగద గవర్నమెంటువారు శిస్తువసూలు చేయుచున్నది? శిస్తుమాత్రము వసూలుచేస్తూ, "ఈ అభివృద్ధి పనులు మేముచేయడము ఎందుకు? చేస్తే అదనపురేట్లు పుచ్చు కుంటాము" అని గవర్నమెంటు వాదిస్తే ప్రయోజన మేమిటి? గవర్నమెంటుస్థానేవున్న జమీందార్లకుగూడ ఇట్టిబాధ్యత గలదు. ఈ బాధ్యతనుండి తప్పించుకొనుటకై వారు చీటికి మాటికి హెచ్చుశిస్తులు కావాలని కోరడం పబ్లిక్‌పాలసీకి పరిపాలనా ధర్మములకు విరుద్ధ మగుటయేగాక పర్మనెంటు సెటిల్‌మెంటు షరతులకుకూడ భిన్న మనుసంగతి వారు గమ నించకపోవడము విచిత్రము! ఏవోవంకలుచెప్పి రైతులమీద శిస్తులనుమాత్రము హెచ్చించడానికి జమీందార్లు తయారుగ వుంటారుగాని, తమపేష్కస్ హెచ్చించడానికి మాత్రము వారు ఒప్పుకొనరు. పేష్కస్ హెచ్చించడ మనేది పర్మనెంటు సెటిల్‌మెంటుకు విరుద్ధమైతే శిస్తులుహెచ్చించడం మాత్రం కాదా? కాబట్టి 30వ సెక్షనులోని 2వ క్లాజు నిజానికి పాత బంజర్లకు ఉద్దేశింపబడినదేగాని 'జిరాయితీహక్కుగల' భూము లకు వర్తింప నుద్దేశింపబడినది కాదనియైనా అర్థము చెప్ప వలెను. లేదా అట్టి అర్థము ఈ ఆక్టుచేసినవారి బుర్రలలో లేదంటే, ఈ క్లాజు పర్మనెంటుసెటిల్‌మెంటు షరతులకు భిన్న

మైనది కావున దానిని వెంటనే రద్దుపరచవలసియుండు నని యైనా చెప్పవలెను. ఈ సందేహాలను తీర్చి "లా"ను స్పష్టముగ నిర్వచించడానికోసమే ప్రకాశముకమిటీవారు సంకల్పించిరి. అందుకనియే వారు యీ శిక్షనులు రద్దుకావలె నని శిఫారసు చేసిరి.

3వ క్లాజు ఇరిగేషన్ పనులు:—

3.వ క్లాజు ఇరిగేషన్ వసతులు కల్పిస్తే, శిస్తు హెచ్చించ వచ్చునా ?

దీనికికూడ పైన 2వ క్లాజుకు చెప్పిన అర్థమే వర్తించవలెను. ఇరిగేషను వసతులు కల్పించినా మనే పేరుచెప్పి జిరాయితీభూములపై హెచ్చుశిస్తు విధించరా దని ప్రకాశంకమిటీవారు స్పష్ట మొనర్చిరి.

4వ క్లాజు. ఫ్లూవియల్ యాక్షన్:—

4వ క్లాజు— ఫ్లూవియల్ యాక్షన్ వల్ల అనగ నదులఒండువగైరాలవల్ల భూమికిబలం పట్టితే, శిస్తు హెచ్చించ వచ్చునా ?

నదుల మార్గాలుమారడంవల్లనున్నూ ఒండుమట్టి వగైరాలు పట్టుటవల్లనున్నూ భూమికిబలంపట్టితే అందువల్లకూడా జమీందారుకు శిస్తు హెచ్చింపవచ్చునట. ఇది బలేవింత యైన పద్ధతి. భగవంతుడు చేసిన అభివృద్ధికి కూడ తామే కర్తలమని జమీందార్లు బయలుదేరడం బలేబాగున్నది. శిస్తు హెచ్చించే విషయములో ఇంత మెలకువగ నున్న జమీందార్లు అతివృష్టి, అనావృష్టులవల్ల పంటలు పోయినప్పుడున్నూ, పొలాలు నదీపాతమైనప్పుడున్నూ రైతులకు రిమీషనులు యిచ్చుటకు అంతటి ఉత్సాహమునే యేల చూపరు ? ఈ సందర్భమున పూర్వకవి, మహానుభావుడు, అడిదం సూరన్న

గారు తమ రామలింగేశ్వర శతకములో చెప్పిన చక్కని పద్యము జ్ఞాపకము వచ్చుచున్నది.

సీ. "ఎండిన యూళ్ల గోడెరిగింప డెవ్వడు
పండిన యూళ్ళకు ప్రభువు లంత"

ఈ క్లాజుకూడ విపరీతమైనదే గాక, పర్మెనెంటు సెటిల్ మెంటు వరకుకు భిన్నమైన డగుటచేతనున్నూ, వర్తిస్తే నిజానికి పాతబంజర్లకు వర్తింపవలసిన దగుటచేతనున్నూ, దీనిని రద్దు పరచవలసి యుండు నని ప్రకాశం కమిటీవారు శిఫార్సుచేయుట మిక్కిలి సబబుగా నున్నది.

1908 సం॥ నాడు సృష్టింపబడిన పాతబంజర్లనునవి 1934 సం॥రపు సవరణచట్టాలలో రద్దుపరుపబడినవి. కాబట్టి ఆనాడే ఈ నాలుగు క్లాజులనుకూడ నిజానికి రద్దుపఱచవలసి యుండెను. అట్లు జరుగకపోవుట తప్పు. ఈ తప్పును సవరించుటకు ప్రకాశము కమిటీవారు సిఫారసుచేయుట సబబుగ నున్నది.

## 40 వ శెక్షను - కమ్యుటేషను.

30వ శెక్షనులో నుదహరించిన నాలుగు మార్గాలవల్లను గాక, ఇంకొక అయిదవ మార్గమువల్ల కూడ జమీాందార్లు రైతులపై శిస్తులను హెచ్చింపజూచిరి. ఇదే ఎస్టేటు ల్యాండు అక్టులోని 40 వ శెక్షనులో చెప్పబడిన "కమ్యుటేషను" పద్ధతి. కమ్యుటేషనుపద్ధ తంటే ఏమిటి?

40వ శెక్షను_"కమ్యుటేషను పద్ధతి" అంటే ఏమిటి? పంటరూపేణా శిస్తును రొక్కరూపేణామార్చుకోవడం

శిస్తు పంట రూపేణా యిచ్చే కేసులలో దానిని రొఖ్ఖ రూపంగా మార్చుకోడానికే "కమ్యుటేషను" పద్ధతి అంటారు.

ఏ లెక్క ప్రకారం ఈ మార్పు జరగాలి?

ఈ మార్పుదల ఏ లెక్క ప్రకారం జరగాలి? 1802 సం॥ నాటున్నూ, దరిమిలా 1865 సం॥ వరకున్నూ శిస్తులు చాల చోట్లపంటరూపేణా చెల్లుబడి యగుచుండెను. దరిమిలా, అవి ఉభయుల సమ్మతి మీద రొక్కమున మార్చుకొనబడుచుండెను. ఈ సందర్భములో యీ శెక్షను ఏమి చెప్పుచున్నదనగ, ఇట్టిమార్పుకోసం ఉభయులలో ఎవరైనా కలెక్టరువద్ద దరఖాస్తుపెట్టుకోవచ్చు ననిన్నీ, అతడు గత పదేండ్లపంటధరలనుబట్టిన్నీ ప్రక్కభూముల రొఖ్ఖపురేట్ల వగైరాలను బట్టిన్నీ విచారించి రొఖ్ఖపు రేట్లను నిర్ణయించవచ్చు ననిన్నీ ఈ శెక్షను చెప్పుచున్నది.

మార్కెట్టుధరల మార్పులకు తలతోక యుండదుగద! వాని సెట్లు నమ్మకొన వచ్చునా?

1802 దరిమిలా పంటలధరలు ప్రపంచములో అనేక కారణములచే హెచ్చసాగెను. రైళ్ళు, రోడ్లు, ఓడమార్గాలు, టెలిగ్రాములు వగైరా రాకపోక సౌకర్యములవల్లనున్నూ, కరెన్సీ మార్పులవల్లనున్నూ, జమీందార్లకు గవర్నమెంటుకు సంబంధములేని ఇంకా ఎన్నో అదృశ్యపు కారణాలవల్లనున్నూ ప్రపంచములో ధరలు హెచ్చసాగెను. ఈ హెచ్చింపును చూచి గవర్నమెంటుకు కళ్ళుకుట్టెను. తమరైతువారీ ఏరియాలలో కూడ 30ఏండ్లకొకసారి "రీసెటిల్‌మెంటు" పేరుచెప్పి శిస్తులను హెచ్చించడానికి గవర్నమెంటు పూనుకొనెను. ఈ విధంగా 1866, 1896, 1926 సం॥లలో మూడుసార్లు 3 'రీసెటిల్‌మెంటు'

లలో సర్కారువారు భూమిపన్ను హెచ్చించిరి. ఈ గాలియే జమీఏరియాలకుకూడ 1908 సం॥లో ప్రాకింపబడెను. గవర్న మెంటు ఏరియాలలో రీ సెటిల్‌మెంటు పేరిట జరిగే హెచ్చిం పులే జమీ ఏరియాలలో "కమ్యుటేషన్" అనే మిషమీద చేయబడసాగెను. కాని, ఇది అక్రమము. వస్తువులధర లనేటటు వంటివి స్థిరమైనవికావు. 1926 సం॥ లో ధర లన్ని ఇకమీద హెచ్చుతునే వుంటవనే అంచనామీద రీ సెటిల్‌మెంటు రేట్లను రూపాయికి ము డణాల చొప్పున పొడిగించివేసిరి. కాని, తీరా, అవి 1930 సం॥లో వసూలు చేయవచ్చేనాటికి ప్రపంచములో ధరలు విపరీతముగా పడిపోయి, అందరినడు ములు విరిగెను. కాని రైతులమీది పన్నుభారముమాత్రము అట్లే నిలచియుండెను. కాబట్టి యీ ధరలను నమ్ముకుని హెచ్చింపుచేయుట శ్రేయస్కరమైన పద్ధతికాదు.

ఇది యిట్లుండగ, యీనాటి ధరలనుబట్టి కమ్యుటేషన్ చేయడమంటే శిస్తులను హెచ్చించడానికి ఇంకొక మార్గము కనిపెట్టడమనే అర్థము. ఇది 30 వ శెక్షన్‌లో చెప్పబడిన నాలుగు మార్గాలలో లేదు. కాబట్టి, ఇది చెల్లనేరదు. ఈదృష్టిలో చూస్తే 40 వ శెక్షన్, 30 వ శెక్షనుకు కేవలము విరుద్ధమైనదని చెప్పక తప్పదు. ఈరెండు శెక్షనులను ఇద్దరు వేర్వేరు గుమాస్తాలు ముసాయిదాలు వ్రాసినట్లు కని పిస్తుంది. రెంటిని ఒకడే వ్రాసియుంటే యీ పొరపాటు జరిగి యుండదు.

40 వ శెక్షన్‌కు 30 వ శెక్షన్‌కు పరస్పర వైరుధ్యము!

ఇక "కమ్యుటేషన్" అసలే చేయకూడదా అంటూ

రేమో? మహారాజులాగ చేసికొనవచ్చును. అయితే, పంట ధరలు యిప్పటివికాక 1802 సం॥నాటివి అయివుండవలెనని మావాదన. ఏలననగా ఆనాడు రొఖ్ఖపురేట్లున్నూ, పంటభాగములున్నూ స్థిరపరుపబడినవి. దరిమిలా సంవత్సరాలలో హెచ్చుచు తగ్గుచున్న ధరలనుబట్టి రేట్లు మారుతూ వుండవలెనంటే, 1802 సం॥నాడు ఏర్పరుపబడిన "స్థిరత్వము" "శాశ్వతము" అను మాటలేమైపోతవి? రైతు ఆనాడే పంటభాగాన్ని రొఖ్ఖంగా మార్చుకొని వుంటే ఆరేటే నేటికిని స్థిరపడి వుండేదిగద? అట్లు మార్చుకోకుండా ఉన్నందుకు ఇప్పుడతనిని యీ విధంగా శిక్షించడానికి వీలు లేదు. పర్మినెంటు సెటిల్‌మెంటుయొక్క ఉద్దేశ్యము అట్టిది ఎన్నడూ కాజాలదు. అదిగాక, "కమ్యుటేషన్ జేసేటప్పుడు ప్రక్కభూముల రొఖ్ఖపురేట్లుకూడ ఎట్లున్నవో కలెక్టరు విచారించవలెనని ఈ శెక్షన్ బి - క్లాజు చెప్పుచున్నది. ప్రక్కభూములకు 1802 సం॥లో రొఖ్ఖపురేట్లు స్థిరపడివుంటే, అవి ఆనాటి పంటధరలనుబట్టి యుండునుగాని వేరువిధంగా ఉండవు గద! అట్టిచో, ఇప్పుడీ భూముల విషయములో ఈనాటి (హెచ్చు) ధరలను లెక్కగా తీసికొనడంలో సబబేమున్నది?

"కమ్యుటేషన్" అసలే చేయకూడదా? ఏలెక్క ప్రకారం?

ఈ కారణాలచేత, కమ్యుటేషన్ విషయములో 1802 సం॥ నాటి ధరలు ప్రమాణంగా తీసికోవాలిగాని, ఇటీవలవికావని ప్రకాశం కమిటీవారు మిక్కిలి సబబుగా శిఫారసుచేసియున్నారు.

1802 సం॥ నాటి మార్కెట్ ధరల ప్రకారమే కమ్యుటేషన్ చేయవలెను.

## — ఇతర శెక్షనులు —

ఇంతవరకు ఎస్టేటుల్యాండు ఆక్టులో జిరాయితీ హక్కుకున్నూ, శిస్తు హెచ్చింపులకున్నూ సంబంధించిన శెక్షనుల గురించి చెప్పితిమి. మిగతా కొన్ని యితర శెక్షనులనుగూడ పరిశీలించి ఈ అధ్యాయమును ముగించెదము:—

## 25 వ శెక్షను

25 వ శెక్షన్ నజరానాలు పుచ్చుకోవచ్చునా?

రైతును జమీందారుడు భూమిలో ప్రవేశపెట్టేటప్పుడు "ప్రీమియం" అనగా "నజరానా" పుచ్చుకోవచ్చునని ఈ శెక్షను చెప్పుచున్నది. ఇట్టి ఏర్పాటు 1865 సం॥ రెంటుఆక్టులో లేదు. 1802 నాడు దీనిని తలపెట్టిన వాడే లేడు. గవర్నమెంటు ఏరియాలలో కూడ ఇట్టి ఏర్పాటు లేదు. కొత్తభూమిలో ప్రవేశించేటప్పుడు అది సాధారణంగా నిస్సారంగా వుంటుంది. దానిని బాగుచేసికోడానికి రైతుకు ఎంతో ఖర్చు, కష్టము అవుతుంది. అట్టి సందర్భములో రైతుకు కొన్నాళ్లపాటు శిస్తు రాయితీ చేయడం సబబుగాని, అది లేకపోగా పైపెచ్చు నజరానా తేతెమ్మని అడగటములో సబబేమీ కనిపించదు. తెల్లదొరలకు టీ, కాఫీ, వగైరా పంటలు పండించుకునే నిమిత్తము సర్కారువారు లక్షలకొలది యకరముల భూములను ఇచ్చినపుడు వారికి మొదటి సంవత్సరాలలో శిస్తులు తక్కువ కట్టి క్రిమక్రిమముగా గాని, మామూలు శిస్తులు పుచ్చుకోలేదు. తెల్లదొరల కిచ్చిన యిట్టి సౌకర్యము మన పేదజమీందారు రైతులకు లేకపోగా వారివల్ల ఎదురు

నజరానాకూడా పుచ్చుకోవడమా? కాబట్టి దీనిని రాబోవు ఆక్టులో పూర్తిగ రద్దుపఱచుటకు ప్రకాశం కమిటీవారు శిఫార్సు చేశారు.

## 28 వ శెక్షను

రేట్లవిషయమై దావాలుపడ్డప్పుడు "అప్పటికి చెల్లిస్తున్న రెంటే న్యాయమైన రెంటు" అని ఊహించుకోవలెనని ఈ శెక్షను చెప్పుచున్నది. ఇట్టి ఊహ 'ప్రిసంప్షను'. తప్పు. ఏలననగా, రైతులు తెలిసియో తెలియకయోఆనాటికి హెచ్చు శిస్తులను ఇస్తూ వుండవచ్చును. 1865సం॥ దరిమిలా అనేకమంది జమీందార్లు రెంటు ఆక్టు 11 వ శెక్షన్ 1 వ క్లాజు నాధారము చేసికొని, హెచ్చురేట్లతో, రైతులను నిర్బంధించి కంటూ్రక్టులు వ్రాయించుకొన్నారు. నిజానికి అవి పర్మనెంటు సెటిల్ మెంటు షరతులప్రకారం చెల్లదగినవి కావని పైన వివరించి యుంటిమి. అయితే, అట్టి అక్రమపు కంట్రాక్టు రేట్లన్నీ న్యాయమైనవని కలెక్టరు ఊహించుకోవలెనని ఈ 28వ శెక్షణ చెప్పుచున్నది. ఇది విరుద్ధముకాదా? కాబట్టి యీ శెక్షనుకూడ ప్రకాశం కమిటీవారి శిఫార్సు ప్రకారం రద్దుకాబడవలెను.

28 వ శెక్షణ "న్యాయమైనరెంటు" "ఫెయిర్ రెంటు" అంటే ఏమిటి?

## 46 వ శెక్షన్

పాతబంజరును శలవులేని సాగుచేస్తే దానికి $2\frac{1}{2}$ రేట్లు శిస్తు విధిస్తామని ఈ శెక్షన్ చెప్పుచున్నది. బంజర్లను సాగు

46 వ సెక్షన్ కలవులేనిసాగు-పినాలిటీలు

లోనికి తేవలసిన డ్యూటీ జమీందార్లయందున్నది. బంజరును ఆక్రమించుకొని సాగుచేసుకునే హక్కు రైతుకు స్వతస్సిద్ధముగనున్నది. అట్టిచో "కలవులేని సాగు" అనేది ఉండనేరదు. కాకపోతే, రైతు ముందుగ జమీందారును కోరవలెను. అట్లు కోరినప్పుడు, జమీందారుడు నిరాకరించడానికి వీలులేదు. కాబట్టి ఎవరైనా రైతులు బంజరును ఆక్రమించి సాగుజేస్తూవుంటే అది కలవులేని సాగని పేరుబెట్టి దానిమీద $2\frac{1}{2}$ రెట్లు శిస్తుకట్టడము అన్యాయమనిన్నీ, మామూలు ఒంటిరేటే పుచ్చుకోవలెననిన్నీ, ప్రకాశంకమిటీ వారి అభిప్రాయము. కాబట్టి ఈ పినాలిటీ శిక్ష కూడ రద్దు కావలెనని వారు శిఫార్సు చేసిరి.

## పట్టాలు, ముచ్చిలికాలు

ప్రతిసాలున పట్టాలు ముచ్చిలికాలు ఇచ్చి పుచ్చుకునే నిమిత్తము మిక్కిలి చిక్కయిన తంతు ఒకటి ఎస్టేటు ల్యాండు

4 వ అధ్యాయము పట్టాలు, ముచ్చిలికాలు.

ఆక్టు 4 వ అధ్యాయములో వివరింపబడినది. ప్రతిసాలున యివి యిచ్చి పుచ్చుకోవాలని చెప్పడమువల్ల అజ్ఞానులగు జడ్జీలు కొందరు బయలుదేరి, ఈ రైతులు ఏకసాలు కౌలుదార్లేనంటూ విపరీతార్థము చెప్పడమున్నూ, దానివల్ల రైతులకు ఇబ్బందులు కలగడమున్ను మన మిదివరకు చూచియున్నాము.

జమీందారుకు సన్నదు ఎట్టిదో రైతుకు పట్టా అట్టిది.

కాబట్టి జమీందారుకు శాశ్వతముగా ఒకేసారి సన్నదు ఇచ్చి నట్లు, రైతుకుకూడ ఒకేసారి స్థిరమగు రేటుతో పట్టా ఇవ్వ బడవలెనని ప్రకాశం కమిటీవారు సూచించిరి. దీనిప్రకారం ఇప్పటి ఎస్టేటులాండ్ ఆక్టుయొక్క 4 వ అధ్యాయం యావత్తు పూర్తిగ రద్దుకావలెనని వారితలంపు.

## జప్తులు - వేలాలు

ఇందు నిమిత్తమై ఎస్టేటుల్యాండు ఆక్టు 6 వ అధ్యాయ

6 అధ్యాయము జప్తులు, వేలాలు.

ములో బోలెడుతంతు చెప్పబడినది. అదంతా అనవసరము. గవర్నమెంటు వరి యాలో గవర్నమెంటు ఉద్యోగులద్వారా శిస్తు చెల్లుబడియగు చున్నట్లే, జమీవరియాలో జమీందార్లద్వారా చెల్లుబడి యగుచున్నది గనుక ప్రస్తుతము ఈ ఆరవ అధ్యాయములో చెప్పబడిన తంతునంతా రద్దుపరచి, రివిన్యూ ఉద్యోగుల ద్వారానే యీ శిస్తులు వసూలుపరచడము మంచిదని ప్రకా శము కమిటీవారి అభిప్రాయము. గవర్నమెంటు శిస్తులతో పాటు గవర్నమెంటు కరణాలు, మునసబులే జమీశిస్తునుకూడ వసూలుపఱచి తమకు రావలసిన పేమ్కాస్ పోను మిగతాది జమీందార్లకు యిచ్చివేస్తే జమీందార్లు ఇప్పుడు పెట్టుకొను చున్న సముద్దార్లు వగైరా శిబ్బంది ఖర్చంతయు వారికి తగ్గి పోవును.

## ఇరిగేషన్ పనులు

ఇందును గూర్చిన శెక్షనలు ఎస్టేటుల్యాండ్ ఆక్టు 8 వ

అధ్యాయములో చెప్పబడినవి. ఇరిగేషను వసతులు కల్పించడము, నాటిని మరమ్మతులు చేయడమనేది అనాదిసిద్ధముగ రాజులకు విధింపబడిన డ్యూటీలలో ప్రధానమైనది. అందు కొఱకే వారికి ప్రజలు శిస్తులు చెల్లించడము. ఈ డ్యూటీ పర్మనెంటు సెటిల్మెంటుద్వారా జమీందారులపై పెట్టబడినప్పటికి, దానిని జమీందార్లు సరిగ నెరవేర్పలేదు. చెర్వులు మరమ్మత్తులు లేక శిథిలమై పోయిన వను గగ్గోలు ప్రతి ఎస్టేటునుండి వచ్చుచున్నది. ఇవి తమపని కాదన్నట్లు జమీందార్లు ఊరుకొనుచున్నారు. ఈ డ్యూటీ నుండి జమీందార్లు తప్పించుకోడానికి వీలులేదని చెప్పడానికి కార్వేటి నగరం జమీందారు కేసులో ప్రీవీకౌన్సిలువారు చెప్పిన తీర్పే ప్రమాణం. ప్రీవీకౌన్సిలు వారు చెప్పిన వాక్యము లివి.

8వ అధ్యాయము, ఇరిగేషన్ పనులు

నీటివనరుల మరమ్మతు జమీందార్ల డ్యూటీ. కార్వేటినగరం కేసులో ప్రీవీకౌన్సిలు తీర్పు

"చెరువులు పురాతనములైనవి; జాతీయమగు ఇది గేషనుపద్ధతికి, హిందూ, మహమ్మదీయ న్యాయశాస్త్రముల చేతను, ఈస్టు ఇండియా కంపెనీ రెగ్యులేషనులచేతను, చరిత్రకన్న ప్రాచీనమైన అనుభవమునుబట్టి ఇండియాలో అధిక సంఖ్య జన బాహుళ్యముయొక్క శ్రేయమునకు అగత్యమయినట్లుగా గుర్తింపబడినవి. ఉన్న చెరువులను మరమ్మత్తు చేయించి బాగుగ నుంచుట, క్రొత్తవాటిని త్రవ్వించుచునటువంటి ప్రజా

జమీందారులు వారి పెన్యూరు నిర్ణయం ప్రకారం ఇరిగేషను పనులు సరిగా నుంచుటవిధి. ఐ.ఎ. 364

హిత కార్యభారము మొదట ఇండియా ప్రభుత్వమువారు వహించిరి. సెటిల్ మెంటు జరిగినపిమ్మట చాలచోట్ల యీ బాధ్యత జమీందారులపై బడినది. ప్రతివాది ఆ తరగతికి చెందినవాడే. అనేకమంది ఆధారపడియున్న యీ చెరువులను జమీందారులు మూసివేయుటకు అధికారములేదు. అంతేకాక ఇండియా న్యాయశాస్త్రము ప్రకారము వారి అమరకం విధి ప్రకారము వాటిని మరమ్మతుచేసి కాపాడే పూచీగూడ గలిగి యున్నాడు."

8 వ అధ్యాయంలోని తంతు అనవసరం. సులువైన మార్గం కనిపెట్టాలి

జమీందారుపై యిట్టి విధియుండగా దానిని సంకుచిత పరచుటకు ఎస్టేటు ల్యాండు ఆక్టు 8 వ అధ్యాయములో ప్రయత్నము జరుగుట అన్యాయము, చెర్వుక్రింద నాలుగోవంతు వరియా సాగుచేసే రైతులు దరఖాస్తు చేస్తేనే జమీందారుడు చెర్వుమరమత్తుకు పూనుకొనునట! ఇట్టిది భాగ్యవంతులగు రైతులకే సాధ్యమగును గాని పేదవారికిగాదు. అదిగాక "మేజరువర్క్సుకు" రు 200 లున్నా "మైనరువర్క్సు"కు రు 100 లున్నా రైతులు డిపాజిట్టు చేయవలయునట! ఇదియు పేదరైతుల వశముకానిసంగతి. దరఖాస్తులు, డిపాజిట్టులు, పెట్టినతర్వాతకూడ ఇంకా ఎంతో తంతు చెప్పబడినది. ఇదంతా జరిగేవరకు పుణ్యకాలం కాస్తా పోతుంది. పంటలు పాడయిపోయి రైతులు బాధపడుతూ వుంటారు. కాబట్టి, యీ తంతునంతా రద్దుపరచి సులువైన మార్గాన్ని కనిపెట్టాలి. రైతుకు అర్ధరూపాయికంటె హెచ్చు దరఖాస్తులు ఖర్చులేకుండా అతనికి న్యాయము కలిగించాలి.

జమీందారు నకాలములో మరమ్మతు చెయ్యకపోతే గవర్న మెంటు వెంటనే చేసివేసి, జమీందారునుండి ఆ ఖర్చు రాబట్ట డానికి నిర్దుష్టమైన శిక్షలు వుండాలి,

నీటి వనరుల కంట్రోలు ఎవరిది?

చెరువుల యొక్కయు, కాల్వలయొక్కయు నీటి వనరులను కంట్రోలుచేసే అధికారము సహజముగా అనాదినుండి గ్రామసంఘాలకు ఉండుచుండెను. గ్రామసంఘాలు శిథిలమైపోయినవి. గనుక వాటిని పునరుద్ధరించే వరకు సదరు హక్కు జమీందారుకు గాకుండ, గ్రామసంఘాల తరఫున గవర్నమెంటు చేతులలో వుండడము ఉత్తమ మని ప్రకాశం కమిటీవారి అభిప్రాయము.

అదనపు రేటులేకుండ నీరు సప్లయి చేయవలసిన డ్యూటీ జమీందారులమీద నున్నది.

పర్మనెంటు సెటిల్ మెంటునాడు శిస్తులును పేష్కను లును శాశ్వతముగ నిర్ణయమయినప్పుడు, అప్పటి సాగుబడి భూముల స్థితి గతులను గుఱించిన్నీ యికముందు సాగులోనికి రావలసిన బంజరుభూములను గుఱించిన్నీ కూడ లెక్కలు కట్టుకొనియే సదరు రేట్లు నిర్ణయింపబడెను. అందువల్ల యిప్పుడూ జమీందారుడు నీరు సప్లయి చేసినాడు కాబట్టి యిప్పుడు అదనంగా నీటిపన్ను కోరడంలో సబబు లేదు. అదనపు నీటి తీర్వ లేకుండ జమీం దారు నుండి నీటిసప్లయి పొందడమనేది పర్మనెంటు సెటిలు మెంటు వల్ల జమీరైతుకు ఏర్పడిన సహజమగు హక్కు. ఇటువంటి యిరిగేషను పనులు వగైరాలు చేసి భూమిని సార వంతముగ జేసి, ప్రజలయొక్క సౌఖ్యాన్ని కాపాడడంకోసమే

సమస్తమైన సాముదాయకభూములను అందలి ఫలసాయమును స్వేచ్ఛగ వేరే అదనపురుసుములు వగైరాలు చెల్లించకుండ అనుభవించడానికి జమీరైతులకు హక్కుగలదనుమాట దానంటత అదియే రూఢమగుచున్నది. అయినను, ఈ హక్కు పర్మనెంటుసెటిల్మెంటుకు పూర్వము, రైతులేవైనా రుసుములు అనాదిసిద్ధముగ సర్కారుకు చెల్లిస్తూవుంటే మాత్రము, అంతవరకు పుచ్చుకోడానికి జమీందారుకు హక్కువుండవచ్చును. ఈ అంశములు బందరు కట్టెల వర్తకులు దేవరకోట జమీందారుమీద, వేసిన దావాలో చెప్పబడిన తీర్పునుండియే లోగడ వివరించియుంటిని గనుక, వాని నిట తిరిగి వకర్వు పెట్టనక్కరలేదు.

1882 సం॥పు V చట్టము ఫారెస్టుఆక్టు 26వ శెక్షన్ క్రింది 7, 13, రూల్సు

1882 సంవత్సరములో ప్యాస్ చేయబడిన "ఫారెస్టు ఆక్టు"లోకూడ రైతులకు అనాదిసిద్ధమైన హక్కులు మిక్కిలి భద్రముగ గుర్తింపబడి కాపాడబడియున్నవి. ఈ ఆక్టు 26వ శెక్షన్ క్రింద చేయబడిన 7, 13, రూల్సు చూడండి.

7వ నిబంధన యిట్లు గలదు :—

ఏ గ్రామమందైన రిజర్వుకాని భూములందు (దక్షిణ కనడాలో కుమాకిభూములు తప్ప) పశువులమేత గడ్డికోత, ఎండుపుల్లలు వరుకొనుట, ముళ్ళు, ఆకులు, తుప్పలు, రిజర్వుకాని చెట్లుకొట్టుకొనుట, ఉచితముగ చేసుకొనుట కనుమతించబడును. అగడ్డి, ముళ్ళు, ఆకులు లేక చెట్లు ఆగ్రామము లేక

చేరువ గ్రామముల నివాసుల స్వంతపనులకు, లేక వ్యవసాయ పనులకు అవసరమయినపుడే తీయవలెను. పైన దెలిపిన సౌకర్యములు దుర్వినియోగము చేయకుండా గ్రామాధికారులు చూడవలెను. చేరువ గ్రామము లన నేవో తగవువచ్చినపుడు కలెక్టరు పరిష్కరించును.

13వ నిబంధన యిట్లుగలదు. రిజర్వుకాని భూములందు క్వారీయింగు (రాళ్ళుకొట్టుకొనుట) ప్రజలందరి స్వంత లేక వ్యవసాయప్రయోజనములకొరకును, స్థానికసంస్థలు చేయు ప్రజోపయుక్తకార్యములకును ఉచితముగ చేసికొనవచ్చును గాని, విక్రియమునకు, వర్తకముచేసి లాభముపొందుటకు చేయరాదు.

పశువులమేత, వంటచెరుకు, ఎరువు, ఆకు, వగైరాలన్ని ఏవిధమైన ఫీజులేకుండ అన్‌రిజర్వు అడవులలోనుండి రైతులు తీసికోవచ్చునని ఈ రూలుయొక్క అర్థము.

5వ రూలు అడుగంటుట ఆశ్చర్యము.

ఇట్టి సౌకర్యాలే ఎస్టేట్లలోకూడ చేయబడవలెనని 5వ రూలు చెప్పుచుండగ అది నేటివరకు పాటింపబడక పోవుట ఆశ్చర్యము!

సంఘప్రయోజనానికై అడవులను రిజర్వుచేయవలసి వచ్చినప్పుడుకూడ అందు రైతులకు అనాదినుండిగల హక్కులను గమనించి వాటికి సర్కారువారు కంపెన్‌సేషన్ ఇచ్చిన పిమ్మటనే సదరు ప్రదేశములను రిజర్వు ఫారెస్టుగ మార్చియున్నారు.

కాబట్టి జమీా పరియాలలోని అడవులనుకూడ ఫారెస్టు ఆక్టు క్రిందికి తెచ్చి వాటి పరిపాలనను గ్రామస్థులచే ఎన్నుకో బడిన ఫారెస్టుపంచాయితీలపరము చేయవలె నని ప్రకాశం కమిటీవారి శిఫారుస్సు.

—: గ్రామ సాముదాయక భూములు :—

(కమ్యూనల్ ల్యాండుస్సు)

పుంతలు, చెర్వులోతట్టులు, చెర్వునీటిపడకలు, మంద బయళ్ళు, పంటకళ్ళములు, వగైరా గ్రామసాముదాయపు భూములుకూడ గ్రామసంఘానివేగాని

ఆక్రమపు టాక్రమణాలు

జమీాందారువికావు. వీటిమీాదశిస్తులేదు. పేష్కస్ లెక్కకట్టేటప్పుడు వీటిమీాద శిసు లేనట్లే ఎంచ బడెను. కాబట్టి ఇట్టివాటి నిప్పుడు జమీాందారుడు ఆక్ర మించుకొని శిస్తుకట్టి రైతులకు పట్టా లిచ్చుట కొన్ని ఎస్టేటలలో జరుగడం మిక్కిలి దురాగతమైనపని. జమీాం దార్ల పక్షకులతో బలవంతులు స్వార్థపరులు నగు రైతునామ ధేయులు కొందరు వీటిని ఆక్రమించుకొని గ్రామసాముదాయ ప్రయోజనాలకు భంగం కలిగించడం విచారకరమైన సంగతి. ప్రకాశంకమిటీరిపోర్టు ప్రచురణమైన దరిమిలా జరిగిన ఇట్టి ఆక్రమణముగాని, పుట్టిన పట్టాలుగాని చెల్లుబడి కానేరవని శేపురాబోయే ఆక్టులో కఠినినియమము ఏర్పరచవలసి యున్నది.

గ్రామసంఘాలను పునరుద్ధరించవలసిన ఆవశ్యకత ఎంతేని కలదు. ఇందునిమిత్తమై ప్రకాశంపంతులుగారును ఇతర

గ్రామపునరుద్ధరణ, సాముదాయక ప్రయోజనముల కల్పన, గోభూమి పునరుద్ధరణ.

ప్రజానాయకులును నిరంతరము కృషి చేయుచున్నారు. ఈ పునరుద్ధరణ కార్యములో గ్రామస్థులకు ఎన్నోసాముదాయక ప్రయోజనాలను కల్పించవలసి యున్నది. ముఖ్యముగ గొడ్డు తిరగడానికి పశుభూమిలేక పశుసంపద క్షీణించి పోతున్నది. మనిషిమునిగే బీళ్ళల్లో మేకలు మేసి, పొదుగుల వెంట పాలుజల్లించుకొంటూ అంభారవములతో నిండ్లకు పరుగులు వారుచు, ఈ భరత భూమిని యావత్తు నిజముగ పాలునేతులతో ప్రవహింపజేసిన ఆ పశులక్ష్మి నేడేల మనలను బాసిపోయినది? మానవుడు దురాశావశుడై గోవుకోసమై అట్టేయుంచిన భూమిని తాను దౌర్జన్యముగ ఆక్రమించుకొని దిక్కుమాలిన పాగాకో నంజు రోగాలకు బురదగుంటలకు అనారోగ్యమునకు ఆకరమగు వరివంటనో పండించుకొనుచుండబట్టియేగద!

కాబట్టి ఇదివరకు అక్రమముగ ఆక్రమణమై పోయిన సాముదాయ భూములను 'లా' ప్రకారము అవసరమైతే కంపెన్సేషన్ ఇచ్చియైనాసరే పునరుద్ధరించవలెను. ఈ కంపెన్సేషన్ ఖర్చు వీలు చిక్కినంతవరకు లోగడ అక్రమంగా ఆక్రమించుకొన్నవారినుండియే వసూలుపరుచుట సబబు. అన్యాయపు ఆక్రమణలు చేసినట్లు ఋజువైతే దానికి 30 ఏండ్ల లిమిటేషన్‌తో నిమిత్తంలేకుండ, అట్టి ఆక్రమణదార్లను కంపెన్సేషన్ కూడ ఇవ్వకుండ - తొలగించడానికి "లా"ను మార్చవలసి యుండునని ప్రకాశం కమిటీవారి సలహా.

ఆక్రమణల తొలగింపు

ఇదివరకు సాముదాయిక భూమిగ నున్నది, యిప్పుడు అవసరం లేకపోతే, అది జమీందారుకు సంక్రమించవలె నను వాదన ఒకటి జమీందార్ల తరఫున లేవదీయబడినది. జమీందారుడు ఎప్పు డైతే కేవలం శిస్తు వసూలుదారు డనే మాట రూఢియై పోయినదో, అప్పుడే ఈవాదన నేల కూలిపోక తప్పదు.

ప్రయోజనం తీరిపోయిన సాముదాయభూమికి జమీందారుడు వారసుకాదు

# సర్వే సెటిల్ మెంటు

## (11 వ అధ్యాయము)

భూములను సర్వేచేయడానికి, సెటిల్‌మెంటు చేయ డానికి ఇప్పుడున్న ఎస్టేటుల్యాండు ఆక్టు 11 వ అధ్యాయములో నవాలతు గ్రంథము చెప్పబడినది.

ఎవరెవరిభూములు ఎంతెంతో రైతులకు రైతులకు మధ్యనున్ను, జమీందారుడున్ను తెలిసికోడానికి గాను భూములు ఇదివరకు సర్వేకాకపోతే ఇకముందు చేయించు కోవచ్చును. దానికి ఆక్షేపణ లేదు.

165 శెక్షన్–ఇ–క్లాజు "సెటిలుమెంటు" అనేది "పాత బంజర్లకే గాని, జిరాయితీ భూములకు కాదు.

ఇక, సెటిల్‌మెంటు విషయమై ఇదివరకే వర్మనెంటు సెటిల్‌మెంటువల్ల రేట్లు నిర్ణయమైయున్న జిరాయితీ భూముల విషయములో తిరిగి సెటిల్‌మెంటు అంటూ వుండనేరదు. కాబట్టి, ఈ అధ్యాయములో చెప్పబడిన సెటిల్‌మెంటు తంతు

అంతా కృత్రిమముగ సృష్టింపబడిన పాత బంజర్లకు వర్తింప వచ్చునేమో గాని, జిరాయితీ భూములకు ఎన్నడూ వర్తింప జేయ బడజాలదు. ఈ సంగతి ఈ అధ్యాయములో 165 సెక్షను ఇ. క్లాజు లోనే స్పష్టపరుపబడి యున్నది.

1934 సం॥ దరిమిలా "పాత బంజరు" అనేదికూడ రద్దు పరుపబడినది కాబట్టిన్నీ, ఇక ఈ సెటిల్‌మెంటు తంతు వర్తించే ఎస్టేటు భూములు లేనే లేవు కాబట్టిన్నీ, "సెటిలు మెంటు"కు సంబంధించిన ఈ యావత్తు సెక్షనులు ఒక్క కలం పోటుతో కొట్టివేయవలెను.

—: రిమిషనులు :—

పేష్కసుల రిమిషను లేదు కాబట్టి రైతు యిచ్చేశిస్తుకు కూడ రిమిషను ఉండనక్కరలేదని జమీందార్ల వాదన.

38, 39 సెక్షనులు - నిష్ప్రయోజనములు.

ప్రస్తుతమున్న ఎస్టేటు ల్యాండు ఆక్టులో అతివృష్టి అనావృష్టులవల్ల పంటలు పోయి నప్పుడు రిమిషనులకు తావే చూపబడ లేదు. అయితే, 38, 39 సెక్షనులలో శిస్తు తగ్గింపుకు కొన్ని సూచనలు చేయబడినవి. కాని, అవి క్రియలో అమలు జరగ డానికి పనికివచ్చేవి కావు. అథవా, ఎప్పుడైనా జరిగినా, తిరిగి 20 ఏండ్ల వరకు రైతు శిస్తు తగ్గింపు కోరడానికి వీలులేదు. రైతుకు ఈ సెక్షనులు ఉండీ ఒకటే, లేకా ఒకటే!

ఈ విషయంలో నిజానికి, పేష్కసుకూ, శిస్తుకూ, పోలిక పెట్టడానికి వీలులేదు. కారణం వినండి :— రొఖ్ఖపు

*పంట పంపిణీ పద్ధతిలో 'రిమిషన్' దానంతట అదే రైతుకు సహజమగు హక్కుగ ఏర్పడుతున్నది.*

శిస్తులు ఈనాడు వచ్చినవి కాని, మన దేశంలో అనాదినుండి వన్ను పంటలో భాగముగానే తీసికోబడుచుండెను. కాబట్టి రైతులతోపాటు రాజు ఎండడమో పండడమో జరుగుచుండెను. పంటలు నష్టమయినప్పుడు రాజభాగం కూడ సహజముగ తగ్గిపోతున్నది. పంటలు అసలే పండకపోతే రాజుతీసికొనేదిన్నీ ఏమీవుండదు. అనగ పంట పంచుకునే పద్ధతిలో 'రిమిషన్' అనేది దానంతట అదే సహజ పరిణామముగ ఏర్పడి వున్నది. 'రిమిషన్' అనే మాట వేరే వక్కాణించి చెప్పకుండానే, క్రియలో జరిగిపోతూ ఉండేది.

*చట్టరీత్యా రిమిషనులకు ఏర్పాటు ఉండవలెను.*

పంటభాగమును రొఖ్ఖముగ ఇటీవల మార్చినంత మాత్రముచేత రైతుకు అనాదిసిద్ధముగ సహజముగ ఉంటుచు వచ్చిన "రిమిషన్" హక్కును ఇప్పుడు కాదనడం న్యాయంకాదు. కాబట్టి దానికి రాబోయే చట్టములో తగు ఏర్పాటు చేయవలసియుండునని ప్రకాశంకమిటీ శిఫార్సు. గవర్నమెంటు పరియాలో ఇస్తున్నట్లుగానే అతివృష్టి అనావృష్టి వగైరా ఈతిబాధలవల్ల పంటలు నష్టమైనప్పుడు జమీరైతులకుకూడ జమీందార్లు దయాధర్మబిచ్చముగ గాకుండ చట్టరీత్యా రిమిషనులు ఇవ్వవలెను.

## —: తగవుల పరిష్కారములు :—

రేట్లు, బకాయవసూళ్ళు వగైరాల విషయములలో తగాదాలువస్తే ఎవరు పరిష్కరించవలెనను ప్రశ్న వున్నది.

1803 సం॥పు 2.వ రెగ్యులేషన్ గ్రామపంచాయితీలకు గల అవకాశం 1లలో మాట ఆయినది.

అనాదినుండి మనదేశంలో తగాదాలు గ్రామపంచాయితీలే తీర్చుచుండెను. ఇట్టి తగాదాలను పరిష్కారం నిమిత్తమై గ్రామపంచాయితీలకు పంపడానికి కలెక్టరకు ఇప్పటికిని 1803 సం॥లో చేయబడిన రెండవ రెగ్యులేషన్ ప్రకారం అవకాశం ఉంది. కాని, స్వాభావమగు ఆ నాటి పంచాయితీలు ఈ 140 ఏండ్లలో వట్టి గుల్లలై పోయినవి. వాటిని గురించి జనులందరు మరచియే పోయినారు.

ఇట్టి గ్రామసంఘాలను, గ్రామపంచాయితీలను పునరుద్ధరించడానికే ప్రకాశంపంతులుగారు ఇతర ప్రజానాయకులును తలపెట్టియున్నారు. అవి పునరుద్ధారణ అయ్యేవరకు, జమీలలో వచ్చు ఇట్టి తగాదాల నన్నిటిని,

స్పెషల్ రివిన్యూ కోర్టులు కావాలి

మిక్కిలి అనుభవము గలట్టియు, న్యాయబుద్ధి గలట్టియు, రివిన్యూ ఆఫీసర్లతో కూడిన ప్రత్యేకపు రివిన్యూకోర్టులకు అప్పగించవలెననిన్నీ, స్టాంపు డ్యూటీ వగైరా ఖర్చులు తగ్గించివేసి, రైతుకు న్యాయము కొద్దిఖర్చుతోనున్ను, త్వరితముగానున్ను జరిగేటట్లు ఏర్పరచవలసినదనిన్నీ, ప్రకాశం కమిటీవారు సూచించి యున్నారు.

## —: పైరువారీ రేట్లు చెల్లరాదు :—

కొన్ని జమీలలో పంటలరకాలను బట్టి హెచ్చుశిస్తు విధిస్తున్నారు. ఎక్కువ విలువగల చెరుకు, పసుపు, వగైరాలకు హెచ్చు రేట్లను పుచ్చుకొనుచున్నారు. పర్మనెంటు

సెటిల్‌మెంటు కిది కేవలము విరుద్ధముగాన ఈపద్ధతి ఇకమీఁద చెల్లకూడదనిన్నీ, ఆ హెచ్చురేట్లనన్నిఁ రద్దుపరచి వేయవలె ననిన్నీ, ప్రకాశం కమిటీవారి శిఫార్సు. ఇందుకు ప్రమాణము, 1799 స౦॥లో గవర్నమెంటువారు కలెక్టర్లకిచ్చిన సూచనలలో 37 వ దానిలో ఇట్లున్నది.

### 37 వ క్లాజు

రానురాను భూస్వామ్యపు హక్కుగల భూస్వాములును, తాలూక్‌దార్లును పెద్దరైతులును, చిన్నరైతులును భూవైశాల్యముపై నాధారపడి యుండు నొకనిశ్చితమైన మొత్తమున కొప్పుకొనుచును, రైతులకు వారిష్టమువచ్చినట్లు లాభకరమైన పంటలను పండించుకొనుట కధికారము నిచ్చుచును, మరి

1799 సం॥లో గవర్నమెంటువారు కలెక్టర్లకు వంపిన ఇన్‌స్ట్రిక్షన్సులో 37 వ ది.

మిషపైని క్రొత్తపన్నులను విధించుటకు వారికి హక్కులేదని హెచ్చరిక నిచ్చుచును ఒడంబడికలను చేసికొనిన యెడల పరస్పర లాభముల అమితముగ గలుగుననుటకు సందియ మెంతమాత్రమును లేదు. ఎవరైన క్రొత్తపన్నులను విధించిన ట్లగపడిన యెడల నత్యధికశిక్షకు పాత్రులగుదురు. ఇప్పటికి దివరకే అట్టి పన్నులుండి రైతులను బాధపెట్టుచుండిన యెడల వారితో సంప్రదించుకొని జమీందార్లే వాని నన్నింటిని రద్దుపరచి న్యాయమున ప్రవర్తించుటయు, న్యాయమైన పన్నుల నొక మొత్తముగ నేర్పాటుచేయుటయు ముఖ్య కర్తవ్యము అట్లు చేసినయెడల ఒండొరుల కెంతయు చిక్కు తొలగి పోవును.”

పన్ను వేసేది భూమికిగాని, పంటకుగాదు. కాబట్టి సదరు భూమిలో హెచ్చు విలువైన పంట వేశాడు గాబట్టి హెచ్చు శిస్తు యివ్వమనడం సరికాదు. కాబట్టి పైరువారీ రేట్లు పోవా లని ప్రకాశం కమిటీవారు శిఫార్సు చేసి యున్నారు.

## వైశాల్యములో హెచ్చు కనపడితే యిప్పుడు శిస్తు హెచ్చించవలెనా?

కొలమానముల తేడాల వల్ల ఏర్పడ్డ హెచ్చు వైశాల్యములపై, హెచ్చుశిస్తు విధింపరాదు.

పర్మనెంటు సెటిలుమెంటు కాలమందు, సరిహద్దులతో వివరింపబడ్డ భూమి ఏదైనా వుంటే, దానిని దరిమిలా సర్వే చేసి, హెచ్చు వైశాల్య మున్నదనే కారణంచేత, హెచ్చు మొత్తమును దాని మీద దరిమిలా విధించి యుంటే, అట్టి హెచ్చు మొత్తముకూడ చెల్లకూడదని ప్రకాశం కమిటీవారి అభిప్రాయము. ఏల ననగ, సర్వే అనేటటువంటిది దరిమిలా వచ్చినది. అప్పటి కొలమానములకు, ఇప్పటి కొలమానములకు తేడాలుండడంవల్ల అదే పొలము సర్వేలో ఈ నాడు వైశాల్యము హెచ్చుగ కనపడవచ్చును. ఈ హెచ్చింపు నిజమైనదిగాక, కృత్రిమ మయినది కావచ్చును. కొలమానములలో గల ఇట్టి కృత్రిమ తేడాలను ఆధారముగ జేసికొని, పర్మనెంటు సెటిలుమెంటు నాడు శాశ్వతముగ స్థిరపరుపబడిన శిస్తు మొత్తమును ఈనాడు హెచ్చింపజూచుట సబబుకాదు. కాబట్టి అట్టి హెచ్చింపులన్నీ కొట్టివేయబడవలె నని ప్రకాశం కమిటీవారి అభిప్రాయము.

పైన సూచింపబడిన ప్రకాశం కమిటీవారి శిఫార్సుల ప్రకారం ప్రస్తుతమున్న ఎస్టేట్సు ల్యాండు ఆక్టును పూర్తిగ రద్దు పరచి, దాని స్థానే "ఎస్టేట్సు ల్యాండు రివిన్యూ ఆక్టు" అను పేరుతో వేరొక చట్టమును చేయుటకు కాంగ్రెసు గవర్నమెంటు సంకల్పించెను. కాని, ఆ సంకల్పము నెరవేరకమునుపే ఇతర రాచకీయ కారణములచే కాంగ్రెసువారు తమ అధికార పదవులను ఐచ్ఛికముగ వదలుకొని రావలసి వచ్చినది.

-: పర్మనెంటు సెటిలుమెంటులోని కొన్ని విశేషాంశములు :-

1802 సం॥లో జమీందార్ల ద్వారా పర్మనెంటు సెటిల్మెంటు చేసుకొన్నప్పుడు అందు కొన్ని విశేషాంశము లుండెను. వాని నిక్కడ క్లుప్తముగ తెలిసికొందము.

జమీా యొక్క ఆవరణలో వున్న యావత్తుభూములపై శిస్తు వసూలు అధికారము జమీందారులకు ఇవ్వాబడెను.

జమీా ఆవరణ

పేష్కసు లెక్క తేల్చేటప్పుడు, సదరు ఆవరణలో గల కొన్నిభూములపైని శిస్తు లెక్కలోకి రానంతమాత్రముచేత, ఆ భూమి జమీందారుకు సన్నదుద్వారా సంక్రమించలేదని వాదించడానికి వీలులేదు.

పర్మనెంటు సెటిలుమెంటుకు పూర్వము కొందరు జమీందార్లు కేవలము భూమిశిస్తులే గాక, సముద్రముద్వారాను, మెట్టదారిని, జరుగుచుండిన ఎగుమతి దిగుమతి వ్యాపారముమీాద శాయిరీ పన్నులనుకూడి వసూలు పరచుచుండిరి.

శాయిరీ వగైరా ఇతర పన్నుల వసూలు అధికారము జమీందార్ల నుండి తీసివేయబడినది.

ఉప్పు, సూరేకారము, కల్లు, సారా మొదలగు మత్తుపదార్థముల పైనను, చేతిపనులు వగైరా

వృత్తులపైనను కూడ పన్నులు వసూలు చేయుచుండిరి. ఈ అమాంబాపతు యితర పన్నులు వసూలుచేయు అధికారము ఈ పర్మనెంటు సెటిల్‌మెంటుద్వారా జమీందార్లనుండి తీసి వేయబడెను. కేవలము ఒక్క భూమిశిస్తు వసూలు అధికారము మాత్రమే నిలువబడెను. ఇతరపన్నులను వసూలుచేసికొను అధికారము గవర్నమెంటువారే నేరుగ వహించిరి.

పోలీసు, మిలిటరీ, అధికారములుకూడ జమీందార్లనుండి తీసివేయబడెను.

కొందరు జమీందార్లు పోలీసు సిబ్బందిని, మిలిటరీ సిబ్బందిని నిలిపి దేశసంరక్షణ చేయుచుండిరి. ఇందుకై కొన్ని ప్రత్యేకపు రుసుములను ప్రజలనుండి వసూలు పరచుచుండిరి. కాని, 1801 సం॥నుంటి మిలిటరీ అధికారము జమీందార్లనుండి తీసివేయబడెను. 1876 నుండి పోలీసు అధికారము కూడ తొలగించివేయబడెను. లోగడ వారివద్దనుండిన శిపాయిలు, పోలీసుబంట్రోతులు తీసివేయబడిరి. ఇట్టి మిలిటరీ అధికారమును పూర్వము చలాయించుచుండినవారిలో వేంకటగిరి, కాళహస్తి, జమీందార్లు ముఖ్యులు. 1802 సం॥నుండి వీరికి మిలిటరీ ద్యూటీ తీసివేసి, అందుకు బదులుగ పేష్కస్ విధించిరి.

"లా-ఖిరాజ్" భూముల మినహాయింపు "Excluded" "ఎక్స్‌క్లూడెడ్" ఇనాములు

పర్మనెంటు సెటిల్‌మెంటునాటికి జమీ ఏరియాలలో అనేక రకపు ఇనాములు ("లా ఖిరాజ్" భూములు) ఉండెను. వీటిలో కొన్నింటిపై శిస్తు పూరాగానున్ను, కొన్నిటిపై కొంతభాగమున్ను మాత్రమే మాఫుచేయబడియుండెను. ఈ ఇనాములపై అప్పటికి సర్కారుకు రాదగిన శిస్తున్ను, లేక పర్యాయితీని ఎప్పుడైనా సదరు ఇనాములను

రద్దు పరచవలసియుండి వాటిమీాద పూరాశిస్తు విధించవలసి వుంటే సదరు పూరాశిస్తునున్ను, వసూలు చేసుకొనే అధికార

పర్మనెంటుసెటిల్ మెంటురెగ్యులేషన్ 4. వ. శెక్షన్

మును, పర్మనెంటు సెటిల్ మెంటు రెగ్యులేషన్ నాలుగవ శెక్షన్ ద్వారా, గవర్నమెంటువారే అట్టే పెట్టుకొనిరి. అనగ, వీటిపై అధికారము జమీాందార్లనుండి తొలగింపబడి, సర్కారువారు నేరుగ తమ చేతులలోనే వుంచుకొనుటకు ఈ శెక్షన్ ద్వారా అవకాశము ఉంచుకొనిరి. ఈ రీతిగ ఈ శెక్షన్‌లో వుంచుకొన్న అధికారము నాధారము చేసికొని సర్కారువారు, (1802 సం॥లో జమీాందార్లతో పర్మనెంటు సెటిల్ మెంటు చేసుకొన్నప్పుడే చాల ఇనాములను (దాదాపు అన్నిటిని) జమీాందార్ల అధికారమునుండి తొలగించిరి. ఇట్టివాటినే ఎక్స్‌క్లూడెడ్ ఇనాములు-తొలగింపబడిన ఇనాములు అంటారు.

"ఇన్‌క్లూడెడ్" ఇనాములు.

కొన్ని చిల్లర నౌకరీ ఇనాములనున్ను ("పెటీసర్వీసు ఇనామ్సు" నున్ను పండితులు వగయిరాలకు సొంత అనుభవం నిమిత్తమై యిచ్చిన "పర్సనల్" ఇనాముల నున్ను మాత్రము జమీాందారు అధికారములో నుంచిరి. వీటినే "ఇన్‌క్లూడెడ్ ఇనామ్సు" అంటారు. అనగ, వీటిని ఎన్నటికైనా రద్దుపరచవలసి వుంటే, వీటిపై పూరాశిస్తు విధించి, వసూలుచేసుకునే అధికారము జమీాందార్ల కివ్వబడిన దన్నమాట. అందుకనే వీటిపై (ఎన్నటికైనా రాదగిన) పూరాశిస్తు జమీాందారుకు రాదగిన వరుంబడిలో ఇన్‌క్లూడ్ చేసి - ఆ వరుమానంమీాద పేష్కసు

లెక్క తేల్చి యున్నారు. వీటికి "ఇన్‌క్లూడెడ్ ఇనాములు" అని పేరు రావడానికి కూడ యిదొక కారణము.

"ఇన్‌క్లూడెడ్" ఇనాములకు ఆఖరు వారసు లెవరు? జమీందారు కాదు.

వీటిలో కూడ యినాందార్లు నిస్సంతుగాను, బేవార్సుగాను, చనిపోతే, సదరు యినాములు జమీందారుకు సంక్రమింప వనిన్నీ గవర్నమెంటుకే సంక్రమించు ననిన్నీకూడ ఏర్పాటు కలదు. తమకు గల యిట్టి సహజ మగు "ఆఖరువారసత్వపు" హక్కును, సర్కారువారు 1860 సం॥లలో "ఇనాం కమీషన్" ప్రొసీడింగ్సు ద్వారా వదలుకొని అట్లు వదలుకొనుటకు చిహ్నముగ ఇనాములమీద స్వల్పమగు "క్విట్ రెంటు"ను విధిస్తూ ఇనాందార్లు తమ యినాములను తమ యిచ్ఛానుసారము అమ్ముకొనుటకు, ఆర్చుకొనుటకు స్వాతంత్రము నిచ్చివేసిరి. ఇట్టి స్వాతంత్రమునకే "ఎన్‌ఫ్రాన్‌చైజ్ మెంటు" అంటారు. ఇట్టి స్వాతంత్రము యినాం కమీషన్‌కు పూర్వము యినాందార్లకు లేదు. వారు తమ యినాములలోని ఫలసాయమును అనుభవించడానికే తప్ప, యినాం భూములను అమ్ముకోడానికి, తాకట్టుపెట్టుకోడానికి వీలులేకుండా ఉండేది. ఇట్టి స్వతంత్రమును క్విట్ రెంటు పుచ్చుకొని "ఎన్‌ఫ్రాన్‌చైజ్ మెంటు" చేయుటద్వారా 1860 సం॥లో ఇనాం కమీషన్ వారు ఇనాందార్లకిచ్చిరి. అప్పటినుండియే యినాములు అన్యాక్రాంతములగుట జరుగ జొచ్చెను. ఇనాములనుగురించిన ఎక్కువ వివరములు రాబోయే అధ్యాయములో చూడ నగును.

ఇనాంభూముల విషయములోనేగాక, ఇతర భూముల విషయములోకూడ రైతులు నిస్సంతుగానున్న, బేవారసుగా

మృతసన్తపు ఆస్తి జమీందారుది గాదు.

నున్ను చనిపోవుట తటస్థించేయెడల, అట్టి భూములు జమీందారుకు సంక్రమింపవు; సర్కారుకు సంక్రమిస్తవి. వారు వానిని ఇతరులకు ఇవ్వవచ్చును. భూమిహక్కు జమీందారులకు లేదని చెప్పడానికి ఇది ఇంకొక నిదర్శనము.

ఏ యే ఎస్టేట్లలో పేష్కస్ ఎట్లు లెక్కకట్టబడెను?

ఏ యే జమీలలో ఎట్లు పేష్కస్ లెక్కకట్టబడెనో, కొన్ని నిదర్శనములను జూపెదము. 1799 సం|| అక్టోబరు 15 వ తేదీన కలెక్టరుకు పంపబడిన ఆర్డరు ప్రకారము, జమీలలో అప్పటికి రైతుల నుండి వసూలయ్యే శిస్తు మొత్తములో మూడింట రెండువంతులు జమీందార్లు సర్కారుకు పేష్కస్‌గ చెల్లిస్తూ, మిగతా ఒక వంతును తమ కమీషన్‌గ మిగుల్చుకోవచ్చునని ఏర్పాటు చేయబడినది. ఈ లెక్కలో తమ సొంత కమతపు భూములపై రాదగిన శిస్తు కూడ చేర్చబడెను. ఈ ఆర్డరు ప్రకారము కలెక్టర్లు అంకెలను తయారుచేసి వుంచిరి. కాని, తీరా ఆయా జమీందార్లతో తుది (ఫైనల్) సెటిల్‌మెంటు చేసుకునేటప్పుడు, సరిగ ఈ వంతుల ప్రకారమే అన్ని జమీలలోను జరుగలేదు. కొన్ని ఎస్టేట్లలో వీలును బట్టి- అప్పటి అవసరమును బట్టి- మార్పులు చేయబడెను. బందరు, విశాఖపట్టణము, రాజమహేంద్రవరము, ప్రాంతములలో తప్సీలు లెక్కలను బట్టి పేష్కస్ అంకెలు తేల్చబడెను. గంజాం ప్రాంతములో స్థిర మగు లెక్కలు లేకపోవడంవల్ల రివిన్యూబోర్డువారే, ఏదో గురికి బెత్తెడు హెచ్చుతగ్గుగ అంకెలను తేల్చిరి. గుంటూరు

సర్కారులో, అది బ్రిటిష్ గవర్నమెంటు క్రిందికివచ్చిన గత 13 సంవత్సరములలో వసూలైన దామాషా వసూళ్ల ప్రకారము పేష్కస్ అంకెలు నిర్ణయించబడెను. "ఆర్నీ" ఎస్టేటు జమీందారుకు సర్కారుకు మిక్కిలి విధేయుడనై యుంటానని వాగ్దానముచేసిన పిమ్మట, మిక్కిలి తేలికయైన పేష్కస్ విధింపబడెను. వేంకటగిరి, కాళహస్తి, కార్వేటినగరము వారు మిలిటరీ శిబ్బందిని పోషిస్తూ వుండేవారు. ఇప్పుడు దానినితీసివేసి, దానిస్థానే,జమీందారుకు లోగడ సదరు శిబ్బందికై చేయుచుండిన ఖర్చుదామషాను పేష్కస్ నిర్ణయించిరి. రామనాథపురం, శివగంగ, ఎస్టేట్లలో, 'లూషింగ్టన్'అనే ఆఫీసరు తయారుచేసిన లెక్కలప్రకారము పేష్కస్కట్టబడెను. అది లోగడ వారు చెల్లించుచుండిన మొత్తమునకు 1½ రెట్లుండెను. తిరునల్వేలి ప్రాంతపు ఎస్టేట్ల మీద, మొత్తము వసూళ్లలో మూడింట రెండువంతులు విధింపబడెను. ఇది కూడ లోగడ చెల్లుచుండిన దానికి 1½ రెట్లుండెను. కొన్నిచోట్ల, అనగ భూమి అప్పటికి పేదగనుండి, తరువాత ఫలవంతము కాగలదని తోచినచోట్ల- అప్పటికి కొద్ది మొత్తము మాత్రమే విధిస్తూ దరిమిలా క్రమక్రమంగా నిర్ణీతపు పూరా మొత్తమునకు హెచ్చించే ఏర్పాటు కూడ చేసుకోబడెను. చెంగల్పట్టు జాగీరులో "ప్లేస్" అనే ఆఫీసర్ తయారుచేసిన లెక్కల ప్రకారము పేష్కస్ నిర్ణయించబడెను. అతడు లోగడ గ్రామాలవారీగా చెల్లుబడియగుచున్న మొత్తాలనుబట్టి లెక్కవేసెను. దిండిగల్ వరగణాలో, గత సంవత్సరముల దామాషా వసూళ్లపైగాక, బాగా పాడిగించివేసిన అంచనాలనుబట్టి లెక్కవేయబడెను. గోదావరి

జిల్లాలో, గత సంవత్సరాల దామాషానుబట్టిన్నీ, సేలంజిల్లాలో గత సంవత్సరాల దామాషానుబట్టిన్నీ, సేలం జిల్లాలో లోగడ సంవత్సరాలలో "కర్నల్ మాక్లియడ్" అనే ఆఫీసరు విధించిన దామాషాశిస్తులను బట్టిన్నీ, పేష్కస్ మొత్తములు నిర్ణయించబడెను.

ఈ రీతిగ, ఆ యాచోట్ల, ఆ యావీళ్లను బట్టిన్నీ, రాచకీయాదికారణములను బట్టిన్నీ, కట్టబడిన పేష్కస్ మొత్తములు, ముఖ్యముగ కొత్తగ సృష్టింపైన ఎస్టేట్లలో, చెల్లుబడి కాక, బకాయిలు పడిపోయెను. కొందరు జమీందార్లు దుబారా ఖర్చులు చేస్తూ, తమ డాబు దర్పముల నిలుపుకొనుటకై అనవసరముగ ఏనుగులు, గుఱ్ఱములు, పల్లకీలు మొదలగు షుష్క లాంఛనముల నుంచుకొనజొచ్చిరి. అందుచే పేష్కస్ చెల్లక కొన్ని ఎస్టేట్లు వేలములై పోయి, ఎవరూ కొనక, సర్కారులో కలిసిపోయి నేటికి రైతువారీ ఏరియాలుగ మారినవి. అటువంటివాటిలో వాసిరెడ్డివారి సంస్థానము, ఉదయగిరి జాగీరు, పెద్దాపురం, బెజవాడ వగైరా ఎస్టేట్లు పేర్కొనదగియున్నవి. 1802 సం॥లో దాదాపు రెంములక్షల పేష్కస్ చెల్లించుచుండిన పెద్దాపురం ఎస్టేటు నేడు కానరాదు. అందుచేతనే కాబోలు, తిరుపతి వేంకటేశ్వరకవులు ఇట్లొక సీసపద్యములో చెప్పిరి.

*పేష్కస్ చెల్లని ఎస్టేట్లు*

సీ. "పెద్దాపురపు కోట పెద్దమ్మ కిరవయ్యె
కవివరేణ్యుల శాపకారణమున"

ఏకవులు ఏమిశాపము పెట్టిరో గాని, తెలియదు.

తిరునల్వేలి, మధుర ప్రాంతములలోని పురాతన పాలెగాండ్రు కొందరు తమ పూర్వపు స్వతంత్ర భావములను, రణతీవ్రతను మరచిపోలేక — మామూలు శిస్తు కంట్రాక్టుదార్లుగ నోరు మూసుకొని పడియుండలేక — ఇంగ్లీషు గవర్నమెంటు మీాద తిరుగుబాటు చేసిరి. అప్పుడు సర్కారువారు లోగడ వారి కిచ్చిన పర్మనెంటుసెటిలుమెంటు సన్నదులను ఊడలాగికొని, వారి జమీాలను సర్కారులో కలుపుకొనిరి. కొన్నిటిని తమతో స్నేహముగ వుంటామన్న యితరులకు యిచ్చివేసిరి.

పర్మనెంటు సెటిలుమెంటు నందు వ్యామోహము పోయిన పిమ్మట, గవర్నమెంటువారు ఏవో వంకలు పెట్టి, చాల జమీాలను వేలాలువేసి, రైతువారీ ఏరియాలక్రిందకు మార్చివేసిరి. ఇతర జమీాందార్లు వేలాలలో కొనడానికి వస్తే 'మీారు రావద్దు, సర్కారువారే ఈజమీాలను తీసికోదలచారు' అని కలెక్టర్లు రహస్యంగా కబుర్లు పంపుటచే, ఈ జమీాలు సర్కారులో కలిసిపోయి, రైతువారీ ఏరియాలుగ మారిపోయినవి.*

పర్మనెంటు సెటిలుమెంటు వల్ల సర్కారు శిస్తు సులభముగ వసూలగుట — 1814 సం॥ డిశంబరు 26 తేదీగల రివిన్యూ బోర్డు ఉత్తరం.

కొన్ని ఎస్టేట్లు ఈరీతిగ పేష్కస్ చెల్లించలేక వేలాలు పడిపోయినను, మొత్తముమీాద అదివరకు కంటె సర్కారు ఖజానాకు రాబడి అతి సులభముగానే రా జొచ్చెను. ఇందుకు ఎంతో సంతోషించుచు, రివిన్యూబోర్డువారు 1814

* తప్పేళ్లు కోరువారు ఈ గ్రంథకర్త రచించిన భూమి తరముల 150–157 పేజీలు చూడవచ్చును.

సం॥ డిశంబరు 26 వ తేదీన గవర్నమెంటువారికి నివేదించు కొనిరి.

పర్మనెంటు సెటిల్‌మెంటునాడు నిర్ణయింపబడిన పేష్కష్ స్థిరమైనప్పటికి, దానిలో దరిమిలా కొన్ని హెచ్చింపులు, తగ్గింపులు, జరగడానికి అవకాశ మేర్పడెను. ఎట్లనగ, ఏరాబడి మీదనైతే 1802 సం॥నాడు పేష్కష్ నిర్ణయింప బడెనో, ఆ రాబడులలో ఏదైనా ఒకటి, దరిమిలా సర్కారువారు ప్యాస్ చేసిన ఆక్టుల వల్ల, జమీందారుకు చెందకుండాపోతే, ఆ దామాషాను పేష్కష్ తగ్గించవచ్చునని 1847 సం॥లోనే సీమ డైరెక్టర్లు సూచించిరి. దాని కొక ఉదాహరణ చూడండి:—బందెల దొడ్లను గురించిన చట్టము గవర్నమెంటు ప్యాస్ చేయక మునుపు, విచ్చలవిడిగ తిరిగే గొడ్లను బందెలలో పెట్టడం, బందెలు వసూలుచేసుకోవడం అధికారం కొందరు జమీందార్లకు ఉండేది. ఈ ఆక్టు ప్యాసైన తరువాత, ఈ బందెలఫీజు జమీందారుకు రాకుండ పోయినది. పేష్కష్ లెక్కకట్టి నప్పుడు గనుక, ఈ ఫీజుకూడ జమీందారుకు వచ్చే రాబడిలో జమకట్టబడివుంటే, అది ఇప్పుడు పోయినదికాబట్టి, దానికి ముదరాగా, కొంతపేష్కష్ తగ్గించవచ్చునని సీమడైరెక్టర్లు చెప్పిరి. ఆ ప్రకారం బందరు జిల్లాలో కొందరు జమీందార్లకు పేష్కష్ తగ్గించినట్లు నిదర్శనములు కలవు.

పేష్కష్ ఎప్పుడు తగ్గించవచ్చును? ఎప్పుడు హెచ్చించ వచ్చును?

కొన్ని జమీలలో గ్రామనౌకర్ల జీతాలు దరిమిలా సర్కారువారే ఇవ్వటం తటస్థించినప్పుడు, ఆ బరువు జమీం

దారుకు తగ్గిపోయిందికాబట్టి, దామాషాను పేష్కస్ హెచ్చించవచ్చుననిరి.

పేష్కస్ అనేది ఒక్క భూమిశిస్తుకు మాత్రం సంబంధించుచు వచ్చిన "రోడ్డుసెస్సు" వగైరాలు జమీందార్లుకూడ ఇవ్వవలసినదేనా ? అట్లు ఇవ్వవలసివస్తే, అది పేష్కస్సును హెచ్చించినట్లు కాదా యను ప్రశ్న వచ్చినది. లోకల్ సెస్సులు జమీందార్లుకూడ ఇవ్వవలసినదేననిన్నీ, అది పేష్కస్‌ను హెచ్చించినట్లు కాదనిన్నీ, నిర్ణయమయ్యెను.

జమీందారుపై లోకల్ సెస్సులు విధించడం పర్మనెంటు సెటిల్ మెంటుకు భిన్నమా ?

కొత్తచట్టం ప్యాస్ చెయ్యడానికి రాష్ట్ర గవర్నమెంటుకు అధికారం ఉన్నదా యను ప్రశ్న ఒకటి బయలుదేరదీయబడినది. అసలు ఈ ప్రశ్న బయలుదేరడమే ఆశ్చర్యము. పర్మనెంటు సెటిలుమెంటు యొక్క నిజతత్వమును పూరాగా అర్థముచేసుకున్నట్టయితేనున్ను, ఇప్పుడుప్రకాశం కమిటీవారు చేసిన శిఫార్సులు పర్మనెంటు సెటిలుమెంటు షరతులకు భిన్నమైనవి కావనిన్నీ, పైగా అవి సదరు సెటిలుమెంటు షరతులమీాదనే ఆధారపడి యున్నవనిన్నీ తెలుసుకున్నట్లయితేనున్ను, ఇట్టి ప్రశ్న పుట్టడానికి అవసరం ఉండేది కాదు. ఈ కమిటీవారి శిఫార్సులను అమలులో పెట్టడానికి పర్మనెంటు సెటిలుమెంటును రద్దుపరచనక్కరలేదు. ఇందు నిమిత్తమై బ్రిటిషుపార్లమెంటును యాచించనూ అక్కరలేదు. రైతులయు

కొత్తచట్టం ప్యాస్ చెయ్యడానికి గవర్నమెంటుకు అధికారము వున్నదా ?

ప్రజలయు క్షేమము నిమిత్తమున్ను, ప్రజాపరిపాలనాధర్మ మును సవ్యముగ నిర్వహించడానికిన్ని, గవర్నమెంటువారు ఎట్టి నూతన చట్టములనైనను చేయవచ్చుననిన్ని, దానికేమీ ఆటంకము ఉండరాదనిన్ని, అనాడు పర్మనెంటు సెటిలుమెంటును ఆమోదించుచు ఇండియా ప్రభుత్వమువారు మద్రాసు ప్రభుత్వమువారికి వ్రాసిన ఉత్తరములో స్పష్టముగ చెప్పియే యున్నారు. వారి మాటలు వినండి.

"మదరాసు రాజధానిలో పర్మనెంటు సెటిలుమెంటును ప్రవేశపెట్టుటకు ముందు గవర్నరు జనరల్ సదరు మదరాసు గవర్నమెంటువారికి జారీ చేసిన ఇన్‌స్ట్రక్షన్సులో సూచనలలో యిట్లు విస్పష్టముగ ఉన్నది. ఇప్పుడున్నట్టి గాని, యిక ముందు సృజింపబడునట్టిగాని, జమీందారులకు ప్రొప్రయిటరీ హక్కును మనము అంగీకరించుచున్నామంటే అర్థమేమనగ:-

లోగడ జమీందారులయొక్క గాని, ఇతర ల్యాండు హోల్డర్లయొక్క గాని, అథారిటీకి ఏ రకముగా గాని లోబడి యున్న రైతులయొక్క గాని తదితరులయొక్క గాని హక్కులకు ఏ రకముగా గాని భంగము కలిగించే టట్లు చేయుచున్నామని అర్థము కాదు. అట్లు కలుగనీయరాదు.

మరియు రైతులయొక్కగాని, తదితరులయొక్కగాని సంరక్షణకు అప్పటప్పట అవసరమని తోచే ఏ "లా"లనుగాని, "రెగ్యులేషనులను" గాని చేయుటకు గవర్నమెంటుకు వీలు లేదనియున్ను అర్థము చెప్పుకొనరాదు.

అట్లే దేశముయొక్క సత్ పరిపాలనకు అవసరమని తోచబడునట్టి ఇతర పనులకున్ను 'లా'లను, రెగ్యులేషనుల

నున్ను చేయుటకున్ను గవర్నమెంటుకు అధికారము లేదనిన్ని అర్థముకాదు.”

గత 50 సంవత్సరముల నుంచి మీరు చెల్లిస్తుండే లెక్కప్రకారం మాకు పేష్కస్ చెల్లిస్తూవుండే పద్ధతిని “అన్‌సెటిల్‌డ్ పాలెములు” మీకు సన్నదులు ఇస్తాము” అంటే “Un-settled Palayams” అప్పుడు కొందరు పాలెగాండ్రు ఆప్రకారం సన్నదులు పుచ్చుకోడానికి వలనో ఒప్పుకోలేదు. వాటిలో, తిరుచనాపల్లి జిల్లాలో నున్న “మురుంగపురి” జమీ ఒకటి. ఇట్టివాటినే, (అన్-సెటిల్‌డ్ పాలెములు) అనగ, సెటిల్‌మెంటుకాని పాలెములు - అంటారు. వీటికిన్ని, సెటిల్‌మెంటు అయిన వాటికిన్ని క్రియలో అట్టె తేడాలేదు. వీరు పట్టా పుచ్చుకో పోయినప్పటికి, పేష్కస్ మాత్రం, “గత 50 వండ్ల లెక్కప్రకారమే” చెల్లిస్తున్నారు. ఆ ప్రకారమే, గవర్నమెంటున్ను మెదలకుండ పుచ్చుకొంటున్నారు. కాకపోతే, సన్నద మాత్రంలేదు. అంతే. సన్నదులేదుకాబట్టి సర్కారువారు వీటిపై పేష్కస్ హెచ్చించడానికి “లా” ప్రకారం అధికారం వున్నది. సన్నదు ఇచ్చిన వాటి విషయంలో ఇట్టి అధికారం సర్కారుకు లేదు. ఇదీ “లా” దృష్టిలో రెంటికి తేడా. కాని, క్రియలో మట్టుకు సర్కారు వారు ఈ 140 వండ్లనుంచి ఈ “అన్-సెటిల్‌డ్ పాలెములలో పేష్కస్ హెచ్చించనూ లేదు. ఇకముందు హెచ్చించ దలచనూలేదు అని చెప్పవచ్చును.

248

# భవిష్యత్తు - జమీందారీల రద్దు

జమీల ఉత్పత్తియు, ఇంతవరకు వాని చరిత్రయు, వివరించితిమి. వాని కాలములో అవి రాజ్యపాలకులకు, ప్రజలకు చేయదగిన మేలును చేసెను. మేలునుకంటె ఇటీవల హెచ్చుగ కీడునే చేయుచున్నట్లు మనము గమనించినాము. అదిగాక, వాని అవసరమున్ను నేడు తీరిపోయినది. ఒకప్పుడు రివిన్యూ వసూలుకై జమీందారు లనబడు యీ ఉద్యోగులు అవసరమైరి. ఇప్పుడట్టి అవసరము కనిపించదు గనుక, ఈ ఉద్యోగముల నిక రద్దుపరుపవచ్చును. ఈ జమీ పరియాలలోని రివిన్యూవసూలును మామూలు శేరీగ్రామములలోవలెనే కరణము మునసబులచేత చేయించుకొనవచ్చును.

ఇట్లు చేయుటలో జమీందారు కేమియో అన్యాయము చేయుచున్నా మని తలంప పనిలేదు. ఆయనకున్నట్టి హక్కులనుగాని, ఆస్తులనుగాని అక్రమముగ ఊడలాగుచున్నామనియు అర్థముకాదు. శిస్తువసూలుపరచినప్పుడు, ఆ శ్రమకు ప్రతిఫలము పొందుటకు మాత్రమే జమీందారుకున్న హక్కు ఆ శ్రమను అతనికి పెట్టబడనప్పుడు, దానికి సంబంధించిన ప్రతిఫలమున్ను ఉండదుగద. కనుక, దీనిలో ఆస్తులహారింపు హక్కుల హారింపు (ఎక్సుప్రొప్రియేషన్ - Expropriation అనునదే లేదు.

దీనిని బట్టి, జమీందారులకు నష్టపరిహారము (కంపెన్సేషన్ - compensation) కూడ యివ్వపనిలేదని తేలుచున్నది. అమెరికాలో బానిసవర్తకమును రద్దుపరచినప్పుడు కూడ సదరు బానిసయజమానులకు కంపెన్సేషన్ ఇవ్వబడలేదు. కొద్దిదో గొప్పదో హక్కు అనేది వున్న బానిసయజమానుల సందర్భములోనే కంపెన్సేషన్ ఇవ్వబడనప్పుడు

అసలు హక్కే లేనట్టి మన జమీందార్ల విషయములోనా కంపెన్సేషన్ మాట తలపెట్టుట?"

అయితే ఒక్కమాట. జమీందారులకు కంపెన్సేషన్‌కు "లా" ప్రకారము హక్కు లేకపోయినప్పటికి దయాధర్మ బిచ్చముగ వారికిన్ని - అందరి ప్రజలతోపాటు - బ్రతుకుదెరువు నిమిత్తము ఏదో త్రోవ చూపించుట అత్యవసరము - ఇది సంఘముయొక్క విధిన్నికూడ అయియున్నది. ఇంతకాలం నుంచి యీ ఉద్యోగములో జీవించుచున్న వారి జీవనోపాధిని హఠాత్తుగ లాగివేసి, వారిని బుక్కాపకీరులను చేయుట తగదు. వారును మనుష్యులే. సంఘములో నలుగురితో పాటు బ్రతుక వలసినవారే. కనుక, వారి సొంతకమతము జీవిత ఆర్థిక పరిమాణమని యెంచబడే (ఎకనమిక్ హోల్డింగు (Economic holding) సుమారు 20 లేక 25 ఎకరాలకు తక్కువ వున్న జమీందార్లకు సదరు పరిమితికి భర్తీగా భూములను యివ్వవలయు నని నాయభిప్రాయము. ఈఏర్పాటే ఇనాందార్లకున్ను, శేరీరైతు లనబడువారికిన్ని కూడ ఉండవలయు నని ముందు అధ్యాయములలో చెప్పబోవుచున్నాము.

వ్యవసాయవృత్తి చేసుకొనదలచినయెడల ఏదైనా వ్యాపారము చేసుకొనుటకుగాను చిన్న జమీందారులకు కొంత పెట్టుబడిధనమును (గవర్నమెంటు పత్రముల రూపేణా) యివ్వవచ్చును. ఇట్టి యేర్పాట్లతో జమీందారీలను ఒక్క కలము పోటుతో తక్షణము రద్దుపరుప వలె నని నా శిఫార్సు. ఇట్టి హక్కును పర్మెనెంటు సెటిలుమెంటునాడే గవర్నమెంటు తమకు అట్టిపెట్టుకొన్నట్లు (రిజర్వు చేసికొన్నట్లు)నిదర్శనమునుచూపియే యున్నాము కనుక దీనిని గురించి యెట్టి చిక్కును ఉండదు.

మనరాజధానిలోని కొన్ని ముఖ్య జమీలా తాలూకు గ్రామముల సంఖ్య, చెల్లించుచున్న పేష్కస్సు.

| జమీ పేరు. | గ్రామముల సంఖ్య. | చెల్లించుచున్న పేష్కస్సు. |
|---|---|---|
| 1. విజయనగరం | 1,157 | 5 లక్షల రూపాయలు |
| 2. కురుపామ్ | 66 | 14,500 ,, |
| 3. బొబ్బిలి | 193 | 90,000 ,, |
| 4. మాడుగుల | 103 | 35,000 ,, |
| 5. ఉర్లాం | 6 | 11,770 ,, |
| 6. గుంనూరు | 501 | 70,000 ,, |
| 7. వల్లూరు సముత్ | 10 | ఆరు వేల పూలవరహాలు |
| 8. దేవరకోట | 66 | 29,340 ,, |
| 9. మైలవరం | 53 | 5,200 ,, |
| 10. మునగాల | 19 | 1,285 ,, |
| 11. వెంకటగిరి (దక్షిణాదిని) | 971 | 1,11,058 ,, |
| 12. రామనాథపురం | 2,152 | 94,733 ,, |
| 13. శివగంగ | 1,937 | 75,000 ,, |

## రెండవ అధ్యాయము

# ఇనాందారీ పద్ధతి

భూమి పంటలోని రాజభాగమును వసూలుచేసి, విని యోగపరచుటలో గల మొదటి పద్ధతిని అనగ జమీందారీ పద్ధతిని గురించి, వెనుకటి అధ్యాయములో చెప్పి యుంటిమి. ఇక, ఈ అధ్యాయములో రెండవ పద్ధతిని గురించి అనగ, ఇనాందారీ పద్ధతిని గురించి తెలిసికొందము. జమీందార్లు రాజభాగములో కొంత వసూలు కమిషన్ క్రింద పుచ్చుకొని మిగతాది రాజుకు ఇర్సాలు చేయుచుండిరి. ఇక, ఇనాందార్లన్ననో అట్టి కమిషన్ దార్లుకారు. వారిలో చాలమందికి రాజభాగములో కొంత భాగము ఒకప్పుడు పూరాగా కూడ ఉచితదానముగ ఇచ్చి వేయబడెను. ఈ రీతిగ చూస్తే, జమీందార్లు, ఇనాందార్లు కూడ రాజభాగములో అంతర్భాగస్వాములని చెప్పినను చెప్ప వచ్చును.

జమీందారుకు ఇనాందారుకు తేడా ఏమి?

రాజులు తమవంతు భాగమును ప్రజోపయోగము నిమిత్తమై ఖర్చుపెట్టవలెనుగాని, వారికీ వీరికీ దానముచేయ డాని కేమి హక్కు గలదను ప్రశ్నరావచ్చును. రాజు లీ దానములను విచ్చలవిడిగ, అర్థరహిత ముగ చెయ్యలేదు. ఆ కాలమందునూ, ఈ కాల మందును కూడ దేవాలయములు, మఠములు, పాఠశాలలు, మొదలగు పబ్లిక్ సంస్థలను పోషించవలసిన విధి, సంఘము

రాజభాగదాన మేమి సబబు?

తరఫున ప్రతినిధిగ నున్న రాజునం దుండెను. ఆ విధిని నెర వేర్చుటకయియే రాజు లిట్లు తమ రాజభాగములో కొంత దానములుగ (గ్రాంటులుగ) ఇచ్చుచుండిరి. నేటి రాజ్యాంగ ములు కూడ తమ రివిన్యూలోనుండి ఇట్టి గ్రాంటులనిచ్చు చుండుట మనము చూచుచున్నాము. పబ్లిక్ సంస్థలకేగాక, వ్యక్తులకు కూడ, ముఖ్యముగ వేదశాస్త్రములందును, ధర్మ శాస్త్రములందును, ప్రవీణులైన వారి పోషణ నిమిత్తముకూడ రాజులు తమ రాజభాగములో కొంత దానము చేయుచుండిరి. ఇట్టివారు తమ తపస్సంపన్నతచేతను, విద్యాప్రవీణత చేతను, సంఘమునకు సేవచేయుదురని భావింపబడెను. కాబట్టి, సంఘ మున కిట్టి సేవచేయువారిని పోషించుట రాజధర్మముగ ఎంచ బడెను. వేదశాస్త్రములందు గల ప్రావీణ్యమును పరీక్ష చేసిన పిమ్మటనే రాజు ఇట్టి దానముచేయవలసి యుండుననియు, ప్రతి జ్ఞానము లేనివానికి దానము చేయరాదనియుకూడ మన శాస్త్ర ములు నియమించుచున్నవి. తెలివితేటలు గల విద్యార్థులకు, పేదవారికి, స్టయిపెండులను, స్కాలర్ షిప్పులను, గ్రాంటులను ఇచ్చి సర్కారువారు నేడు విద్యార్థులను పోషించుచుండుట మన మెరుగుదుము. కాబట్టి, ఇట్టి దానములు పూర్వము అర్థ రహితముగ చేయబడలేదని గ్రహించునది. ఆనాడు ప్రభువులు ప్రజలు తలంచిన (ఆశించిన) ప్రయోజనములు ఈనాటి వారికి అర్థరహితముగ కనబడవచ్చును. కాని అది విషయాంతరము.

ప్రజలు తమ పంటలోనుంచి ఇచ్చిన రాజభాగమునే గాక, రాజులు భూములను కూడ నేరుగ దానముల జేయు

రెండురకాల దానాలు

చుండిరి. ఈ దృష్టితో చూచినచో రాజు లిచ్చిన దానములు రెండు రకములు. ఒకటి రాజభాగ దానము; రెండు భూదానము. ఈ దానములు ప్రతిగ్రహీతలను గౌరవించి అనగ మన్నించి ఇవ్వబడుచుండెను గావున వీనికి మాన్యములను పేరు సర్వసాధారణమయ్యెను. దరిమిలా, మహమ్మదీయ పరిపాలనలో వీటికే "ఇనాము"లను పేరువచ్చెను. ఇది అరబ్బీభాషా పదము. నేటికి నిలిచియున్న మాన్యములలో ఈ రెండు రకపు మాన్యములున్ను కలవు. అయితే వీటిలో ఏ మాన్యము ఏ రకముది ? అని నిశ్చయముగ తేల్చుటకు నేడు అన్నిమాన్యముల విషయములలోను సాధ్యముకాక పోవచ్చును. అందుచేతనే నేటి మాన్యముల సమస్య అతిగహనమైపోయినది.

ఇవిగాక, తమ రాజ్యాంగములోని ఉద్యోగస్థులకు కూడ ఇప్పటివలె రొఖ్ఖరూపమగు జీతములుగాక, భూరూపేణా ఈనాముల నిచ్చుచుండిరి. ఇవి తరచురాజులచేతను, గ్రామ సంఘములచేతను ఇవ్వబడుచుండెను. వీనికి "నౌకరీ ఇనాము"లను పేరేర్పడెను. ఇవి ముఖ్యముగ గ్రామకరణము, పంచాంగపు బ్రాహ్మణుడు, చాకలి, మంగలి, కమ్మరి, కుమ్మరి, వడ్రంగి, దేవదాసి, నీర్గంటి వగైరా గ్రామసిబ్బంది పోషణకై ఇవ్వబడుచుండెను.

ఇంతేకాదు, సంఘపు నడకకు ఏ ఏ పనులు అవసరమో ఆ యా పనులకన్నింటికి మాన్యము లేర్పడెను. వీనికి "పనుల మాన్యము" లనిపేరు.

ఉదాహరణ:—రెండు గ్రామములకు పొలిమేర తగాదా వచ్చినప్పుడు, దానిని పరిష్కరించుటకై ఒకవ్యక్తి నియమింపబడుచుండును. అతడు విచారించి, తగాదాతీర్చి, "పొలిమేర ఇది" అని నిర్ధారణచేసి, ఆ పొలిమేర పొడుగునా అన్నపు ముద్దలు పెట్టునట. ఈ పనికై ఆ వ్యక్తి కివ్వబడిన ఈనాముకు "ముద్దఈనాము" అని పేరుండెను. ఇట్టివి రాయల సీమలో నేటికిని కొన్ని చోట్ల నిలిచియున్నవి. ఈ విధముగ పూర్వ కాలమున ఆయా ప్రాంతముల నేర్పడిన "పనుల మాన్యముల" సంఖ్యకు రకములకు, మితములేదు.

ఇది హిందూరాజుల కాలమునాటి సంగతి. ఇట్టి మాన్యముల నిచ్చుట తమ గౌరవమునకు, రాజ్యాదర్పమునకు, ఐహికాముష్మిక శ్రేయఃప్రాప్తికి, మార్గమని రాజు లెంచుచు, ఇవి ఆచంద్రార్కము నిరాఘాటముగ సాగుటకై, ఇట్టి దానములను శిలాఫలకములపైనను, రాగిరేకులపైనను, వ్రాయించి యిచ్చుచుండిరి. ఈ మాన్యములకు భంగము గలిగించినవారికి ఘోరనరకప్రాప్తి యగుననికూడ శాపవాక్యముల లిఖించుచుండిరి.

దరిమిలా, మహమ్మదీయ పరిపాలనలో కూడ నబాబులు, బాదుషాలు, పూర్వపు మాన్యముల మన్నించుటయేగాక, క్రొత్త మాన్యములుగూడ నిచ్చుచుండిరి. హిందువులకేగాక, తమ మశీదులకు, దర్గాల్వలకు, ముసాఫర్ ఖానాలకు, కూడ, ఈనాము లను పేరుతో మాన్యముల నిచ్చుచుండిరి. తమ సైన్యములో పనిచేయు సేనాపతులకు, దండనాయకులకు "జాగీరు"లను పేరుతో ఈనాముల నిచ్చుచుండిరి. తమ రాచ

బంధువుల పోషణకై, లేక మనోవర్తికై "మొఖాసాల" పేరుతో ఈనాముల నిచ్చు చుండిరి. ఇట్లే వేర్వేరు పనులకు వేర్వేరు పేర్లతో ఈనాముల నిచ్చుచుండిరి.

—: బ్రిటిషు హయాములో :—

మహమ్మదీయ పరిపాలన అంతరించి, బ్రిటిషు పరిపాలన సుస్థిరమగులోపల,—ఈ అరాచక స్థితిలో ఏ మాత్రపు అధికారము చేతిలో నున్న పాలెగాండ్రో, తహశ్శీలుదార్లో, లేక ఇతర ఉద్యోగస్థులో అడిగినవారికి లేదనకుండా ఏదో కాగితముమీద ముద్రవేసి, ఈనాములను విచ్చలవిడిగ యిచ్చివేసి నట్లు కనిపించుచున్నది. నిజముగ ఈనాముల నిచ్చుటకు ప్రభువున కొక్కనికే అధికారమున్నను, దేశములోని అరాచక స్థితిని సందుజేసికొని, క్రింది ఉద్యోగస్థులు అధికారరహితముగ చాల ఈనాముల నిచ్చివేసినట్లు చరిత్రవలన కనబడుచున్నది.

బ్రిటిష్ పరిపాలన సుస్థాపితమై కంపెనీవారు కన్నువిప్పి పారజూచుకొనేటప్పటికల్లా, ఎక్కడ చూచినా ఈనాముల పుట్టయే. ఇన్ని ఈనాము లుండుటయు, తద్వారా తమకు రావలసిన భూమిపన్నులో ఇంత పెద్ద రంధ్రమేర్పడుటయు, చూచుకొన్నప్పుడు, కంపెనీవారికి కన్నెర్రయయ్యెను. "ఇవన్నీ నిజమైన ఈనాములేనా" అను అనుమానము వారికి పుట్టెను. కంపెనీ పరిపాలన వచ్చిన మొదటిరోజులలో ఇంగ్లీషు వారును ఈనాముల నిచ్చు ఆచారమును కొనసాగించిరి. కాని, దరిమిలా మానివేసిరి. 1822 సం॥ జనేవరి 2, 1829 సం॥ మే 27 తేదీలు గల సీమదైరెక్టర్ల ఉత్తర్వుల ప్రకారము ఈ పద్ధతిని కంపెనీ

వారు మానివేసిరి. భూముల నిచ్చుటకంటె రొఖ్ఖరూపము గనో, పట్టి బిరుదురూపముగనో, తమకు తోడ్చినవారిని, తమకు సేవజేసినవారిని, సత్కరించుట ఉచితమని వారభిప్రాయపడిరి.

అదిగాక, లోగడ తమ హయాముకు పూర్వము ఇవ్వబడిన ఈనాములు ఎంతవరకు సరియైనవో యని విచారించి సరియైన వానిని స్థిరపరుచుటకును, అధికార రహితముగ దిగువ యుద్యోగస్థులచే నివ్వబడిన వానిని, లేక మోసముచే సంపాదించుకోబడిన వానిని రద్దుపరచుటకును కంపెనీవారు తీర్మానించుకొనిరి.

అందుకనియే, 1802 సం॥లో పర్మనెంటు సెటిల్‌మెంటు చేసుకునే సమయములో ఇనాములను (లేక * 'లా ఖిరాజ్' భూములను) జమీలనుండి విడదీసి, మరీ జమీందార్లతో పర్మనెంటు సెటిల్‌మెంటును జేసికొనిరి. పర్మనెంటు సెటిల్‌మెంటు రెగ్యులేషన్ 4 వ శెక్షన్ చూడుడు.

జమీలను గూర్చి పర్మనెంటు రెగ్యులేషన్ (1802 సం॥పు 25 వ రెగ్యులేషన్) చేసిన 1802 సం॥ జులై 13 వ తేదీననే ఇనాములను గూర్చి కూడ మదరాసు గవర్నమెంటు వారు వేరొక రెగ్యులేషనును (31 వ రెగ్యులేషనును) ప్యాసు చేసిరి. ఇనాములు ఎంతవరకు సరియైనవి అని పరీక్షించుటయే ఈ రెగ్యులేషన్‌యొక్క ప్రధానోద్దేశము. ఈ పరీక్షనిమిత్తమై ఈ రెగ్యులేషన్ 2 వ శెక్షన్‌లో ఒక నియమ మేర్పరచిరి.

* 'ఖిరాజ్' అనగా శిస్తు: 'నా' = 'లా' = 'లా' - ఖిరాజ్ అనగ శిస్తులేనివి అని అర్థము.]

అనగా, ఇప్పటి ఇనాందార్లుగాని, వారి పూర్వీకులుగాని, సదరు భూములను సంపాదించి, వానిని తమస్వాధీనభుక్తములో నుంచుకొనియున్నారా?" అట్లు ఉంచుకొని యున్నట్లయితే, అవి సరియైన ఇనాములని నిర్ధారణ చేయబడెను.

—♦ ఇనామ్ కమిషన్ ♦—

ఈ నియమముల ప్రకారము ఇనాములను పరీక్షించు పని సివిల్ కోర్టులకు వదలుట తమ రాజ్యాంగక్షేమమునకు మంచిదిగాదని యెంచి, కంపెనీవారు 1831-1836 సంవత్సరములలో రెండు చట్టములద్వారా (1831 సం॥ 4వ రెగ్యులేషన్, 1836 సం 31 వ ఆక్టులద్వారా) ఈనాములపై సివిల్ కోర్టు అధికారములను తీసివేసి, తమ రివిన్యూ డిపార్టుమెంటునందే పెట్టుకొనిరి. కాని, ఈనాముల సంఖ్య అపరిమితముగ నుండుట చేతనున్ను, ఒక్కొక్క ఇనామును గురించి అనేక చిక్కులుండుట చేతనున్ను, ఈపని మామూలు రివిన్యూడిపార్టుమెంటుకు సాధ్యము కాకపోయెను. అందుచేత, 1858 సం॥లో ఇందు నిమిత్తమై ప్రత్యేకముగ కమిషను గవర్నమెంటువారు నియమింపవలసివచ్చెను. దానికే "ఈనాము కమిషన్" అని పేరు సుప్రసిద్ధమయ్యెను. ఈనాములను జమీలనుండి విడదీసి వానిని ప్రత్యేకముగ విచారించవలయునను సంకల్పము కంపెనీ వారికి 1802 సం॥లో గలిగినను, అందుకు తగిన పరీక్షానియమములను 1802 సం॥ 31 వ రెగ్యులేషను 2 వ శెక్షనులో ఆనాడే వారేర్పరచియుండి యున్నను, అసలుపని నిజముగ 1858 సంవత్సరములో ఇనాము కమిషన్ ఏర్పడువరకు ప్రారం

భము కాలేదనియే చెప్పవచ్చును. ఈ మధ్య సుమారు 60 ఏండ్లలో అనేక అవాంతరములు గలిగెను. సంతతిలేని రాజులు దత్తత చేసికోరాదనిన్ని, వారి రాజ్యములన్ని కంపెనీకి సంక్రమించవలసినదే ననిన్ని అప్పుడు గవర్నర్ జనరల్‌గ వచ్చిన డల్‌హౌసీ ప్రభువు మృతనష్టసిద్ధాంతము నొకదానిని లేవదీసెను. దాని ఛాయలు ఈనాము భూములమీదకుకూడ ప్రసరించెను. నిస్సంతుగ చనిపోయిన ఇనాందార్లు దత్తత చేసుకోరాదనియు, వారి ఈనాములు గవర్నమెంటుకు సంక్రమింపవలెననియు ఒక నియమ మేర్పరుపబడెను. ఇందువల్ల, దేశములో అలజడిగలిగెను. కడపజిల్లాలో నరసారెడ్డి యను నతడు గవర్నమెంటుపై పెద్ద తిరుగుబాటు లేవదీసెను. అప్పటినుండి, గవర్నమెంటువారు తీవ్రతను తగ్గించి, దత్తతల నంగీకరింపసాగిరి. ఇట్టి అవాంతరములవల్లనున్ను, మామూలు రివిన్యూడిపార్టుమెంటుకు పనితూగకయున్న ఈనాముల విచారణ పని 1858 వరకు నిలిచిపోయెను.

ఈనాము కమిషన్ ఏర్పాటైన పిదప పని చురుకుగ సాగ నారంభించెను. తమ తమ సన్నదులతోనున్ను, ఇతర దాఖలాలతోనున్ను, తాలూకా కచేరీకి హాజరు కావలసినదని ఈనాందార్ల కందరకు పెద్ద ప్రకటన చేయబడెను. ఆ ప్రకారమే ఇనాందార్లు కచేరీలకు హాజరైరి. తాలూకా కచేరీలలో ఈనాముల తాలూకు చిత్తుజాబితా దేశభాషలలో తయారు చేయబడెను. విచారణ పూర్తియైన పిదప, ఇంగ్లీషుభాషలో సాఫురిజిష్టరు డిప్యూటీ కలెక్టరుచే తయారు చేయబడెను. ఈ ప్రకారము ఈనాందార్లకు పట్టాలు (టైటిల్ డీడ్సు)

ఈనాం కమిషనరుచే జారీచేయబడెను.

ఏ విషయమునిూద ఇవి జారీచేయుబడెను? 1802 సం 31 వ రెగ్యులేషన్ 2 వ శెక్షనులో ఈనాంభూముల స్వాధీన భుక్తము నాధారము చేసికొనవలెనని విధించబడెను. ఎంత కాలము స్వాధీనము అనునది ఈ శెక్షనులో నిర్ధారణ పరుప బడలేదు. ఈ విషయము దరిమిలా 52 వ బోర్డు స్టాండింగ్ ఆర్డరులో విశదీకరించబడెను. అనగ, ఈనాం కమీషన్ విచారణనాటికి పూర్వము 50 ఏండ్లు సదరు భూములు ఈనాములుగ ఈనాందార్లయొక్క స్వాధీనభుక్తములలో ఎడతెంపు లేకుండ ఉండియుంటే, వానిని ఖాయపరచవలెనని విశదీకరించబడెను. ఇట్టి నియమముప్రకారమే ఈనాం కమిషనరు ఈనాందార్లకు పట్టాల నిచ్చెను. ఒక్కొక్క ఇనాముయొక్క పరిస్థితుల ననుసరించి, కొన్నిటికి హెచ్చుగను, కొన్నిటికి తగ్గుగను క్విట్ రెంటు నిర్ణయించబడెను. క్విట్ రెంటును అంగీకరించినవారికి వారి ఈనాములందు స్వేచ్ఛ – అనగ, అమ్ముకొనుటకు, ఇతరవిధముగ అన్యాక్రాంతము చేసికొనుటకు అధికారము— ఇవ్వబడెను. గవర్నమెంటును ఈనాములందుండిన వారసత్వాధికారము వదలుకోబడెను. (ఇట్లు వదలుకొనుటకు (Quit) 'క్విట్' చేయుటకు ప్రతిఫలముగ విధింపబడినదే "క్విట్ రెంటు అనబడెను.) క్విట్ రెంటుకు అంగీకరించని ఏ కొలదిమందికో, వారి ఈనాములను ఖాయపరుస్తూ, వాటిని అన్యాక్రాంతం చేసుకొనే హక్కు లేకుండాచేసిరి. ఒకవేళ, సదరు ఈనాందారు నిస్సంతుగ, వారసులులేకుండ చనిపోయే పక్షములో, సదరు

ఈనాము గవర్నమెంటుకు సంక్రమించే ఏర్పాటున్ను చేయబడెను. పై నిబంధనలప్రకారము 4 లక్షల 44 వేల 550 ఈనాము పట్టాలు 1869 సంవత్సరము నాటికి ఈనాం కమిషనరుచే జారీచేయబడి, ఇనాముల పని ముగించబడెను. ఈపట్టాలలోని భూమియొక్క వెరశివిస్తీర్ణము 65 లక్షల ఎకరాలు. ఇట్లు పట్టాలివ్వబడిన ఇనాందార్ల సంఖ్య 25 లక్షలు. వీరిపై విధింపబడిన క్విట్ రెంటు 1884 వరకు 18 లక్షల రూపాయలు. కమిషనరుచే ఇవ్వబడిన పట్టాలను ధృవపరచటానికి గవర్నమెంటువారు 1862 సం॥లో ఒక చట్టమును చేసిరి.

ఈనాముల పరీక్ష, విచారణ, పూర్తియై, నికరపు ఇనాములు తేల్చడమనే పని పూర్తియైనదికాబట్టిన్నీ, ఇంతటినుండి ఈనాందార్లు (ఒక్క శిస్తు రాయితీ విషయంలో తప్ప)మిగతా అన్ని విషయములలోను మామూలు రైతువారీ రైతులతో పాటే చేయబడిరి గనుకనున్నూ, లోగడ 1831, 1836 సంవత్సరములలో ఈనాముల గూర్చి సివిల్ కోర్టులపై విధింపబడిన నిషేధము ఇక నిలిచియుండుట అనవసరము గనుక ఇప్పుడది తొలగింపబడెను. ఇందు నిమిత్తమై 1862, 1866, సంవత్సరములలో రెండు ఈనాము చట్టములు (Acts IV of 1862, IV of 1866) చేయబడెను. ఈ చట్టములవల్ల ఈనాములపై సివిల్ కోర్టుల అధికారము తిరిగి స్థాపింపబడెను. ఒక్క శిస్తు రాయితీవిషయములలో తప్ప, మిగతా అన్నివిషయములలోను ఇనాందార్లు, ఇనాము భూములు, ఇతర రైతాంగముతోసాటే చేయబడెను. ఇది 1866 సంవత్సరమునాటికి ఉన్నస్థితి.

—: ఇనాం రైతులు :—

ఇంతవరకు జరిగిన కథలో, రెండుపార్టీల పేర్లే— అనగ, గవర్నమెంటు, ఇనాందార్ల పేర్లే వినుచున్నాము. ఇనాందార్ల క్రింద ఎవరైనా సేద్యగాండ్రు ఉంటే, వారి ప్రశంస ఇంతవరకు రాలేదు. ఇనాము కమిషన్ విచారణలో కూడ సదరు సేద్యగాండ్రు రాలేదు. వీ రెవరు? వీరికేట్టి హక్కులున్నవి? అను విచారణ ఎన్నడు జరుగలేదు. ఇనాందార్లు మామూలుగ తమ ఇనాముభూములను తమ సొంతవిగ ఎంచుకొనుచు, సేద్యగాండ్రను కేవలము కౌలుదార్లుగనే భావించి, వారిని తమ ఇష్టము వచ్చినప్పుడు లేవగొట్టుచుండిరి—తమ ఇష్టమువచ్చినంత కట్టుబడిని విధించుచుండిరి. అంతట సేద్యగాండ్రలో అలజడి గలిగి; భూములయందు జిరాయితీహక్కు మాదేనని వాదింపసాగిరి. "కాదు, మాది" యని ఇనాందార్లు చెప్పసాగిరి. ఉభయపార్టీలకు వ్యాజ్యములు తీవ్రముగ చెల రేగెను. ఇనాందార్లు తమకు ఇనాము కమిషనరుచే ఇవ్వబడిన పట్టాల నాధారముచేసికొని, అనగా, 50 ఏండ్ల నిరాటంకపు స్వాధీన భుక్తములపై ఇవ్వబడిన పట్టాల ననుసరించి—సదరు భూములందు జిరాయితీహక్కు మాకుగాక, ఇంకెవరికని వాదించిరి. 50 ఏండ్ల భుక్తము ననుసరించి ఇనాందార్లకు పట్టాలివ్వబడిన మాట వాస్తవమే. అయితే, ఈ విచారణ సమయమందు సేద్యగాండ్రను కూడ పిలిపించి విచారించిరా? లేదు. ఇనాం కమీషనరుచే చేయబడిన విచారణయందు, సేద్యగాండ్రు పార్టీలు కాదు. కాబట్టి, ఆ విచారణలోని తీర్పు సదరు సేద్యగాండ్రమీద ఎట్లు బైండింగ్ కాగలదు? ఈ

వాదన నెదుర్కొనుటకు గవర్నమెంటుకు సావకాశము లేక, "ఇదంతా మా కెందుకు? మేము 50 ఏండ్ల భుక్తము ననుసరించి, ఇనాందార్లకు పట్టాలిచ్చినమాట వాస్తవమే. అయితే సదరు భూములయందు ఇనాందార్లను గాక, యింకో మూడవ పార్టీ కెవరికైనా — సేద్యగాండ్రను గాని, తదితరులకుగాని — ఏవైనా హక్కులుండియుంటే వాటిని భంగపుచ్చుట మా యుద్దేశము కాదు. ఇనాందార్ల కివ్వబడిన పట్టావల్ల ఇనాందార్లకు లోగడ లేని ఎక్కువ హక్కులు యిచ్చినట్లూ కాదు. తదితరుల కేవైనా హక్కులుంటే అవి తీసివేయబడ్డట్లూ కాదు" అని గవర్నమెంటువారు చమత్కారముగ ప్రకటనచేసి, ఊరుకున్నారు.

ఈ ప్రకటన చేయడానికి 1869 సం॥లో ఒక ప్రత్యేకపు చట్టమును (Act VIII of 1869) గవర్నమెంటువారు ప్యాసు చేయవలసి వచ్చెను. ఈ 1869 సం॥పు చట్టము బహు చమత్కారముగ నున్నది. దీనివల్ల పామూ చావలేదు — బడితే విఱుగలేదు. ఇనాం కమీషను విచారణలో ఆధారముచేసుకొన్న "ఇనాందార్ల తాలూకు 50 ఏండ్ల స్వాధీన భుక్త"మనే మాట ఈ 1869 సం॥పు చట్టమువల్ల త్రోసివేయబడినదా? అదీ కనబడదు. "సేద్యగాండ్ర యొక్క హక్కులెవ్వి?" యని ఈ చట్టమువల్ల ఖండితముగ తేల్చబడినవా? అదీ లేదు. "సేద్యగాండ్రకు గాని, తదితరులకు గాని, ఏమైనా హక్కులుంటే, వాటిని మేము భంగపుచ్చ దలచలేదు" అని మాత్రం ఈ చట్టము చెప్పి ఊరుకున్నది. "పోనీ, సేద్యగానికి ఏ హక్కులున్నవి?" అను విచారణయైనా గవర్నమెంటువారు అప్పుడు

పెట్టిరా? అదీ లేదు. ఊరికే పైమాట చెప్పి మౌనంగా ఊరుకున్నారు. కాబట్టి, సేద్యగానికి ఏ హక్కు లున్నవి అను ప్రశ్న నేటికిని తేలలేదు. ఎవరికి వారు వ్యాజ్యాలు వేసుకొని, కోర్టులలో ఋజువు పరచుకోవలసిన స్థితియే ఏర్పడెను. ఋజువు భార మెవరిది? ఎవరిదో! ఒక విధముగ చూస్తే, ఋజువుభారం రైతుదే — ఏల ననగ, గవర్నమెంటుచే నియామింపబడిన ఒక కమీషనుచే విచారణ జరుపబడి, 50 ఏండ్ల స్వాధీన భుక్తము యినాందారు దని ఋజువై- ఆ ఋజువుమీద ఇనాందారుకు పట్టా యివ్వబడినప్పుడు, అది కాదని ఋజువు చేసికోవలసినవాడు సేద్యగాడని చెప్పటలో తప్పులేదు. ఆ విచారణ, ఆ తీర్పు, తనమీద బైండింగ్ కాదని సేద్యగా డనవచ్చును - నిజమే. అయితే, ఋజువుభారము ఎవరిమీద వేయవలె నను ప్రశ్న వస్తే మాత్రము, ఇంతవరకు ఏదో — కొద్దో గొప్పో ఋజువు పరచుకొన్న ఇనాందారుమీదకంటె ఏమీ రంగం లోకే రా నటువంటి సేద్యగానిమీదనే వేయడం ఎక్కువ సబబుగ గన్పట్టుచున్నది.

—: కో ర్టు తీ ర్పు లు :—

ఇక కోర్టు తీర్పులసంగతి చూద్దాము. ఇనాముల విషయములలో సేద్యగాని హక్కేమి, ఇనాందారుని హక్కేమి? ఇనాందారుకు యివ్వబడినది శిస్తుతీసికొనే హక్కుమాత్రమేనా, లేక భూమి హక్కు కూడా యివ్వబడినదా అనే సమస్యపై నేటి బ్రిటిషు కోర్టులు - హైకోర్టులు, ప్రీవీకౌన్సిలుకూడ— అనేక తికమకలు పడెను. ఇదమిత్థమని కోర్టులే తేల్చి చెప్పలేకపోయెను.

1918 సం॥ వరకు రాజు తన మేల్‌వరం హక్కు ఒక్కటే దాన మిచ్చాడుగాని, భూమిహక్కు కా దను ఊహను మద రాసు, బొంబాయి హైకోర్టులు చేయుచుండెను. ఏ ఇనాం దారైన భూమి హక్కు కూడ నా కివ్వబడె నని చెబితే దానిని ఋజువు చేసుకునే భారము అతనిమీద వేయబడెను. కాని,

బిళ్లపాడు అగ్రహారం కేసు.

1918 సం॥లో సూర్యనారాయణ-వరఫు-పోతన్న అనబడు బిళ్లపాడు అగ్రహారం కేసులో ప్రీవీ కౌన్సిలువారు ఏమన్నా రంటే "రాజుకు ఒక్క శిస్తు హక్కే గలదనిన్నీ భూమిహక్కు లేదనిన్నీ, కాబట్టి అట్టి భూమి హక్కును రాజు యితరులకు దానము చేయజాల డనిన్నీ ఏ కోర్టున్ను ముందుగ ఊహించుకు కూర్చోడానికి వీలు లేదని" చెప్పిరి. ఇంగ్లండులోని ఫ్యూడల్ పద్ధతిలో పుట్టి పెరిగిన ఈ ప్రీవీకౌన్సిలు జడ్జీలు ఇండియాలో కూడ భూమిహక్కు రాజుదే ననుకున్నారు. అతడు పంటలో భాగం తీసుకొనుచున్నా డనే అంశమును ఆధారము చేసుకుని, "అతనికి భూమిహక్కు లేకపోతే, పంటలో భాగం ఎట్లా తీసు కుంటాడు" అనికూడ ఈ జడ్జీలు తలపోసిరి. ఇక, ఏతావతా ఈ కేసులో తేల్చిన సారాంశ మేమిటంటే :-

ఇనాముల విషయములలో రివిన్యూ ఒక్కటిమాత్రమే దాన మివ్వబడిన దని ఊహించుకోడానికి వీలు లేదనిమాత్రం వీరు తీర్పు చెప్పిరి. అంతేగాని, ఏమి యివ్వబడినదో—భూమి హక్కు కూడ యివ్వబడినది అనే అంశాన్ని వీరు ఖండితముగ తేల్చి చెప్పక ముభావముగ వదలివేసిరి. అయితే కేసులోని సాక్ష్యాన్నిబట్టి ఈ అగ్రహారం పుట్టినప్పుడు "జిరాయితీ హక్కు

మాది'' అని చెప్పగలిగిన రైతులెవరు లేరను సారాంశమును మాత్రము ప్రీవీ కౌన్సిలువారు తేల్చి తీర్పుచెప్పిరి.

వెంకటశాస్త్రుల్లు వరపు సీతారాముడు

దరిమిలా రెండేండ్లకు వచ్చిన వెంకటశాస్త్రుల్లు-వరపు-సీతారాముడు అనే కేసులో, తమ వెనుకటి అభిప్రాయమునే దృఢపరుచుచు, "అయినా, ఏ కేసుకు ఆ కేసుకు దానిలోని సాక్ష్యాన్ని బట్టి, దానపు షరతులను బట్టి ఈ సమస్య తేల్చవలసియుండు" నని ప్రీవీ కౌన్సిలువారు చెప్పిరి.

ఈ రెండు కేసులలో ప్రీవీ కౌన్సిలువారు మొట్టుకు తేల్చిన సారాంశమేమిటో ఎవరికీ బోధపడలేదు. కోర్టుతీర్పులు ఎంత అధ్వాన్నముగ వుంటవో, వారు చెప్పిన తీర్పులు వారికే ఎట్లా అర్థముకావో, ఋజువు చేయడానికి, ప్రీవీకౌన్సిలువారి ఈ రెండు తీర్పులే నిదర్శనము.

మదరాసు ఫుల్ బెంచి చెప్పినఅర్థము.

ప్రీవీ కౌన్సిలువారి అర్థమేమి టని బోధపరుచుకోడానికి మదరాసు హైకోర్టు జడ్జీలకు సాధ్యముకాలేదు. అప్పుడు "ఫుల్ బెంచి" వారు కూర్చుని ఈ క్రిందివిధముగ అర్థముగ చెప్పుకొనిరి :—

"ప్రీవీ కౌన్సిలువారు ఈ రెండు కేసులలో వ్రాసిన గ్రంథాన్ని, వారి వాదప్రతివాదాలను సమగ్రంగా పరిశీలించిన పిమ్మట మా కేమి అర్థమౌతుం దంటే - ఇనాముల విషయములలో రెండు హక్కులు (శిస్తు హక్కు, భూమిహక్కు-కూడ) ఇనాందారులకే చెందినట్లుగ ఊహించుకోవలె నని ప్రీవీకౌన్సిలు వారి అర్థమైనట్లు మాకు బోధ పడుతుంది! ఈ ఊహించిన్న ఇనాముల విషయములలో మరింత బలంగా ఉంటుంది.

అబ్బ, ఎంతబాధ! ప్రీవీకౌన్సిలు వారికి, హైకోర్టువారికి కూడ ఇదమిత్థమని తేల్చ శక్యము కానిదిగ, ఈ ఇనాముల సమస్య ఉన్నదంటే, ఇక ఇతరులమాట చెప్ప నేల? ఈకోర్టు తీర్పులన్నీ చివరకు ఇనాందార్లకు రైతులకు దుంపనాశనము చేసే జువ్వా ఆటక్రింద పరిణమించినది.

ఇంక, కోర్టులలోని జూదపుఆటల సంగతి విడిచి, ముందుకు సాగుదము.

## —: ఒరిజినల్ గ్రాంటులు ఎట్టివి? :—

అసలు ఇనాములుపుట్టి కొన్ని నందల ఏండ్లయినది. ప్రభువులు ఇనాములను ఆనాడు ఇచ్చినప్పుడు ఏమి ఇచ్చిరి? భూమిహక్కుతో సహా యిచ్చిరా, లేక భూమిపై శిస్తు వసూలు చేసుకొనే హక్కు మాత్రం ఇచ్చిరా?

మన ధర్మశాస్త్రప్రకారము రాజుకు భూమియందు హక్కులేదు. కేవలము దానిపై శిస్తు వసూలు చేసుకునే హక్కుమాత్రమే కలదు. ఎవరుగాని, తనకు ఉన్నదే ఇవ్వగలడు గాని, లేనిది ఇవ్వలేడుగద. కాబట్టి రాజు తనకున్న శిస్తు హక్కునే ఎవరికైనా దాన మివ్వగలడుగాని, తనకు లేని భూమి హక్కునెట్లివ్వగలడు? కాబట్టి, రాజులచే ఇవ్వబడిన ఇనాము లనబడునవి, కేవలము శిస్తుహక్కుగలవి మాత్రమేగాని, భూమి హక్కుగలవి కాదని ఒకవాదన. ఈ వాదనప్రకారము జిరాయితీ హక్కు రైతుదే యని తేలుచున్నది. ఇది సర్వసాధారణ విషయమైనప్పటికీ, అన్ని ఇనాములు శిస్తు హక్కుమాత్రము గలవేయని నిర్ధారణగ జెప్పుటకు వీలులేదు. ఏల ననగ, దీనికి

ఈ దిగువ చెప్పబోవు నాలుగైదు అవాంతరములు గమనింప వలసి యున్నది.

(1) భూమి ఒకడు స్వయముగ సేద్యముచేయుచు ప్రభువుకు శిస్తు చెల్లించుచున్నాడు. ప్రభువు అతనిని బహు మానింప దలచి, ఆ శిస్తును పూర్తిగానో, కొద్దిగానో మాపు జేసినాడు. అది అంతటినుండి ఇనా మగుచున్నది. ఈ ఇనాము నందు భూమిహక్కు ఎవరిది? ఇనాందారుదే. అనగ, భూమిహక్కు, శిస్తుహక్కు రెండుహక్కులున్ను ఈ ఇనాము దారుని యందే లీనమై యున్నవిగద!

(2) రాజుకు సర్వసాధారణముగ శిస్తు హక్కే ఉన్న ప్పటికి సొంతసేద్యపు భూములు ఉండవచ్చును. వానిలోనుండి కొంత ప్రదేశమును ఒకనికి రెండు హక్కులతో సహా ఇనాము ఇచ్చియుండవచ్చును. అప్పుడు రెండు హక్కులు ఇనాం దారుని యందే సంక్రమించునుగద!

(3) రాజు భూమిని రైతునుండో, గ్రామసంఘము నుండో కొని, దానిని ఏ దేవస్థానమునకో శిస్తు లేకుండ ఇచ్చి యుండవచ్చును. ఇట్టి ఇనామునందు కూడ రెండు హక్కులు ఇనాముదారునివే. అక్బర్ చక్రవర్తియు, తంజావూరురాజు లును, ఇట్లు భూములను కొని, మాన్యములుగ నిచ్చివేసినట్లు చరిత్రనిదర్శనములు గలవు.

(4) ఒక ప్రదేశము రైతాధీనములోగాక, బంజరుగనో

అడవిగనో, * బేచిరాకుగనే ఉండియుంటే, దానికి కొద్ది శిస్తు కట్టిరియో, లేక అసలు శిస్తులేకుండగనో, ఎవరికైనా రాజు మాన్యముగ నిచ్చియుండవచ్చును. లేదా, రైతు విడుదలపెట్టి పోయిన భూమినికూడ ఇట్లే ఇచ్చియుండవచ్చును. ఇట్టిమాన్యములలో రెండుహక్కులు ఇనాముదారునివే యగునుగద.

(5) మొదట ఇవ్వబడినది శిస్తుహక్కే అయినప్పటికి దరిమిలా ఇనాందారుడు భూమిహక్కును తగు ప్రతిఫల మిచ్చిరియో, కోర్టువేలంలోనో, కొనుక్కొని యుండవచ్చును; లేదా, భూమిని రైతు బంజరుగ విడుదల పెట్టిపోయియుంటే, ఇనాందారుడు దానిలో ప్రవేశించి, సేద్యము సాగించియుండ వచ్చును. ఇట్టి సందర్భములలో కూడ ఇనాందారుని యందు రెండుహక్కులు నిలిచియుండునుగద. ఈ స్థితి 1908 సం॥లో ప్యాసుచేసిన ఎస్టేటుల్యాండు ఆక్టు 8 వ శెక్షనులో అంగీకరింప బడియే యుండెను.

కాబట్టి నేటికి నిలిచియున్న అన్ని ఇనాములు కేవలము శిస్తుహక్కు (మేల్వరం) ఇనాములే యని నిర్ధారణగ చెప్ప టకు వీలులేదు. పై చరిత్రాంశములనుబట్టి చూడగ, భూమి హక్కుతో (కుడివరం హక్కుతో) కూడియున్న ఇనాములు ఛాలయుండుట కవకాశమున్న దని తెలియగలదు. అంతయేల, క్రిందటితరమువరకు ఇనాందార్లు (బ్రాహ్మణులుగాని, ఇతరులు

* చిరాగ్ = దీపము ; (హిందూస్థానీమాట). బే-చిరాగ్ - దీపములేని" అనగ రైతు లెవరూ లేక పాడువడియున్న ఊళ్లు అని అర్థము. "దీనికి భిన్నమైనది "షాంజీగ్రామము - అనగ, ఇనాము పుట్టిన నాటికే భూమిమీద రైతులుండి సేద్యము సాగించుచున్న గ్రామము అని అర్థము.

గాని) తమతమ భూములను సొంతముగ సేద్యము చేసికొను చున్నట్లు మనకు తెలియును. ఇటీవలనే ఇంగ్లీషు చదువులయు, గవర్నమెంటు నౌకరీలయు వ్యామోహమున బడి, ఇనాందార్లు తమ భూములను ఎవరికో కౌలు కిచ్చి, తమపిల్లల చదువుల కోసం బస్తీల కెక్కిరి. ఇప్పుడున్నట్లే, కొన్ని శతాబ్దముల క్రిందట మన పూర్వీకులు తమపిల్లల చదువులకోసమో, గవర్న మెంటు నౌకరీలకోసమో, ప్లీడరీలకోసమో, పల్లెలు విడచి బస్తీలలో రికామీగా తిరుగుచుండిరని భ్రమపడుట పొరబాటు. ఇప్పటికాలపు పరిస్థితులజూచి ఈ ఇనాములు పుట్టిన కొన్ని శతాబ్దములకు పూర్వముకూడ, ఇట్లేయుండెనని అనుకోరాదు. ఇంగ్లీషు చదువులయు, నవనాగరికతయొక్కయు వ్యామోహాన బడక, తమ తమ మాన్యక్షేత్రములను సొంత ముగ సాగుచేసికొనుచుండు ఇనాముదార్లు నేటికిని కొన్ని ప్రాంతములలో కానవచ్చుచున్నారు. పెద్దన్నగారు మను చరిత్రవ్రాసిన కాలమునాటి సంగతిచూస్తే ప్రవరాఖ్యుని "మాన్యక్షేత్రముల్ పెక్కుచందాలన్ బండు" చున్నట్లును; మఱియు "తరుగ దింటన్ పాడియున్ పంటయున్" అనుటవల్ల, అతనికి ఇంటిపాడి, ఇంటిపంట ఉన్నట్లున్ను, మరియు అతడు తీర్థయాత్రకు తాత్కాలికముగ పోయినప్పుడు "పై పరామరిక చొప్పడమి పండబారిన పొలం బెండబారి" నట్లును తెలియు చున్నది. అవి నిజముగ ప్రవరాఖ్యుని సొంతసేద్యములో లేకుంటే, అట్లు ఎండిపోవలసిన పనిలేదు గద!

—: 1936 సం॥పు ఇనాంబిల్లు విమర్శ :—

ఈయంశములను జ్ఞప్తియందుంచుకొన్నయెడల, భూమి హక్కుగల ఇనాందార్లు బహుఅరుదు అని 1936 సం॥పు

ఇనాంబిల్లు ఉపోద్ఘాతములో చెప్పిన మాట సత్యదూర మని తెలియగలదు. భూమిహక్కు, అనగ కుడివరంహక్కుగల ఇనాములు చాలయుండుట కవకాశమున్నది. ముఖ్యముగ చిన్న ఇనాములు అట్టివి. 1908—1936 సంవత్సరముల మధ్య భూమిహక్కు అనేకవిధములుగ సంపాదించుకొన్న ఇనాము దారులే చాలమందిగలరు. ఇట్టి వారిహక్కుల నన్నిటిని ఒక్క కలముపోటుతో తీసివేయుటకై 1936 సం॥పు ఇనాముల బిల్లు ప్రయత్నించినది.

ఇనాందార్లకు అసలు భూమిహక్కు లేనే లేదనినీన్నీ, ఒక వేళ బహు అరుదుగ ఎవరికైనా ఉంటే వారు దానిని కోర్టులో ఋజువుపరుచుకోవలసినదనినీన్నీ, ఇంతా కష్టపడి, ఖర్చుపడి, ఋజువుచేసుకుంటే, దానిని ఒక సంవత్సరపుశిస్తు ప్రతిఫలముగ తీసికొని, సేద్యగాని కిచ్చివేయవలసియుండుననినీన్నీ 1936 సం॥పు ఇనాము చట్టము చెప్పుచున్నది. ఈప్రతిఫలము అందలి కష్టానికి, ఖర్చుకు తగిన ప్రతిఫలముగ గన్పట్టదు. అందుచేత, ఇనాముదారు కున్నదన్న ఆ కాస్త భూమిహక్కు కూడ క్రియలో శూన్యము చేయబడెను.

భూమిహక్కు ఇనాముదారున కుండియుండుటకు పైన అనేక నిదర్శనములను, అవకాశములను జూపి యుండగ, సేద్యగానిదే భూమిహక్కను వాదనకు ఏమి ఆధారముగలదు? "యావత్తు గ్రామముపై కుడివరంహక్కు ఇనాముదారునకు ఆనాటిరాజు లిచ్చియుండుట మిక్కిలి అసంభవ"మని మాత్రము 1936 సం॥పు ఇనాము బిల్లులోని ఉపోద్ఘాతము చెప్పుచున్నది. అది ఏల అంత అసంభవమో బోధపడకున్నది! ఇది కేవలము

ఊహించి చెప్పినమాట. ఇనాందారు పక్షముగ పైనచెప్ప బడిన చరిత్రావకాశములను, చట్టనిబంధనలను, కాదని త్రోసి వేయజాలినంత బలమైన ఊహ కాదది.

ఇనాందార్లకు కుడివరంహక్కు ఉంటుటకవకాశము గల దనుమాట 1908 సం॥పు ఆక్టులోనే స్పష్టముగ అంగీకరింప బడెను. కాని, 1936 సం॥పు చట్టములో ఈమాత్రపు అవ కాశముకూడ లేకుండ చేయబడెను. ఇనాందార్ల కిట్టి హక్కు లేనే లేదను ఉపోద్ఘాతముతోనే ఆక్టు ప్రారంభమయ్యెను. ఇది సరియైన పద్ధతికాదనిన్ని, కుడివరంహక్కు తనకు ఉన్నదని ఋజువు చేసుకోడానికిన్ని, అట్లు ఋజువైనప్పుడు దానికి తగు ప్రతిఫల మిప్పించడానికిన్ని, సావకాశము కలుగజేయవలసిన దని గవర్నర్ జనరల్ పట్టుబట్టినమీదట, ఈ విధముగు కొద్ది మార్పు చేయబడెను. కాని, పైనచెప్పినట్లు, ఈ అవకాశము కాని, ఈ ప్రతిఫలముకాని, క్రియలో నిరర్థకమై పోయినవి. కుడివరంహక్కువున్న ఇనాందారుకూడ లేనివారితో సమమే యయ్యెను.

ఇట్టి పనిని 1936 సం॥ లో జస్టిస్‌పార్టీవారేల చేసిరి? ఇనాందార్లకు శిస్తుహక్కే తప్ప, భూమి హక్కు లేదను తప్పు టూహను వారు పునాదిజేసికొనిరి. ఆ ప్రకారము జమీందారు నున్ను, ఇనాందారునున్ను ఒకేవర్గములో జేర్చదలచిరి. అందు వల్ల ఈ తికమకలన్నియు గలిగెను. ఇనాందార్లస్థితి జమీం దార్లస్థితికంటె, అనేకవిషయములలో భిన్నమైనది. కొన్నిటి నిట జెప్పెదము.

1. జమీందార్లు కేవలము శిస్తుహక్కుదార్లనే మాట నిర్వివాదము. కాని, ఇనాందార్లు అట్లుకాదు. వారిలో చాల మందికి భూమిహక్కు, శిస్తుహక్కు—రెండున్ను — ఉన్నవి. లేవని జస్టిస్ పార్టీవారు చేసిన ఊహ, చరిత్రకు, ఇదివరకున్న చట్టములకు, విరుద్ధము.

2. జమీందార్లు గవర్నమెంటుచే శిస్తువసూలుకై నియమింపబడిన పబ్లిక్ ఉద్యోగస్థులు, లేక నౌకర్లు. వారు గవర్నమెంటు తరఫున నిర్వర్తింపవలసిన డ్యూటీలు అనేకము ఉన్నవి. కాని ఇనాందార్లు (ఏ కొద్దిమంది 'సర్వీస్ ఇనాముల' ననుభవించువారు మినహా) అట్టి పబ్లిక్ నౌకర్లు కారు. వారు నిర్వర్తించవలసిన పబ్లిక్ విధు లేమిన్నీ లేవు. వారు కేవలము దానము పట్టినవారు. ఇనాములు పండితులయు, దేవస్థానములయు పోషణకయినదో, రాజబంధువుల మనోవర్తికయినదో ఏర్పడ్డవే గాని, వేరువిధమైనవి కావు. తమ ఇనాములలో వచ్చు ఆదాయమును సుఖముగ అనుభవించుటయే తప్ప వారికి వేరే పబ్లిక్‌డ్యూటీ లేమీ లేవు. పబ్లిక్ డ్యూటీలతో కూడికొని యున్న ఇనాముల సమస్య వేఱు. వాటి విషయం వేరేచోట చర్చించబడును.

3. జమీలు సాధారణముగ విస్తారమైన ఏరియాగలవి. ఇనాముల ఏరియా ఒక్క గ్రామానికి మించిలేదు. అవిన్నీ దరిమిలా విభాగాలై పోయినవి. అందు నిమిత్తమయిదే, ఇనాముదార్లు రైతునుండి కుడివరం హక్కు సంపాదించుకొని, తమ భూమిని—సొంతభూమిగ—(అనగా రెండు హక్కులు గల భూమిగ) అభివృద్ధి చేసుకోడానికి అవకాశము. 1908

సంవత్సరపు ఆక్టు 8 వ శెక్షన్‌లో ఇవ్వబడ్డది. ఇట్టి అవకాశము జమీందారుకు ఇవ్వబడలేదు. ఈ ఒక్క అంశాన్ని బట్టియే, ఇనాములు జమీలకంటె భిన్నమైన వని చిరకాలముగ అంగీకరింప బడినట్లు స్పష్టమగుచున్నది. అయితే, 1936 సం॥ చట్టములో ఈ యవకాశమును తీసివేసి, ఇనాందార్లకు అన్యాయము చేసిరనుటలో సందేహము లేదు.

4. ఇనాములు జమీలకంటె భిన్నమైన వను తలంపుతోనే, 1802 సం॥లో జమీందార్లతో పర్మనెంటు సెటిల్‌మెంటు చేసుకొనేటప్పుడు, వానిని వేరుగ విడదీసి, వాని వ్యవహారమునకై వేర్వేరు రెగ్యులేషనులను, చట్టములను గవర్నమెంటువారు చేయుచు వచ్చిరి. జమీలను గూర్చిన వ్యవహారములలో, గవర్నమెంటు, జమీందార్లు, రైతులు - అను మూడు పార్టీలుండెను. కాని ఇనాముల వ్యవహారముల లోను వానిని గురించిన చట్టములలోను గవర్నమెంటు, ఇనాందారు అను రెండు పార్టీలే కనబడుచున్నారు. అనగ, ఒక్క శిస్తు రాయితీ విషయంలో తప్ప, తక్కిన అన్ని విషయముల లోను ఇనాందారు మామూలు రైతువారీ రైతుతోపాటే గవర్నమెంటుచే చూడబడెను. పర్మనెంటు సెటిలుమెంటు రెగ్యులేషన్ చదివి చూచినట్లయితే, దానిలో రైతులు జమీదార్లచే పీడింప బడుచున్నారనియు, వారిమధ్య ఖచితమగు పట్టాలు ముచ్చిలికాలు ఉండవలెననియు, కఠినమగు నిబంధనలు కానవచ్చుచున్నవి. సరియైన పట్టాలు సకాలంలో ఇవ్వని యెడల జమీందారును శిక్షించుటకుకూడ 1802 సం॥నాటి పట్టారెగ్యులేషన్‌లో ఏర్పాటుచేయబడెను. జమీందారు పబ్లిక్

సౌకర్ గనుకనే, అట్టి శిక్షానియమ మేర్పరుపబడెను. కాని, ఇనాములగురించి చేయబడిన చట్టములలో నెచ్చటగాని ఇనాం రైతుల బాధలను గురించిన ప్రశంసయే కానము. శిక్షానిబంధనలున్న లేవు. ఏలననగా, ఇనాముదారే అసలు రైతుగా భావింపబడినట్లు తోచుచున్నది.

ఇన్ని సందర్భములను బట్టిచూడగ, ఇనాములను అసలు ఎస్టేటుల్యాండు ఆక్టు క్రిందికి తెచ్చుటయే తప్పుగ కనుబడగలదు. వీని నిందు చేర్చరాదని ఆనాడు చాలమంది వాదించియుండిరి. కాని, ఎట్లో కొన్ని ఇనాములు—"పూరా గ్రామ" ఇనాములు (మేజర్ ఇనాములు) ఎస్టేట్లక్రింద జేర్చబడెను. అయినప్పటికి అన్ని మేజర్ ఇనాములుగాక, కుడివరం హక్కులేని ఇనాములు మాత్రమే' — ఎస్టేట్లగునని నిర్వచించబడెను. అనగ, కుడివరంహక్కువున్న ఇనాములు ఎస్టేట్లుకావని స్పష్టపరుపబడెను. ఇందువల్ల, ఇది కొంతగుడ్డిలో మెల్లగనుండెను. కాని, 1936 సంవత్సరపు ఆక్టులో మేజరు ఇనాములుగాక, మైనర్ ఇనాములుకూడ—అనగ, మొదట పూరా గ్రామాలుగ నుండి, దరిమిలా చిన్నచిన్న ఖండాలుగ విభాగాలైన చెక్కలుకూడ—ఎస్టేట్లుగానే భావించబడెను. ఇందువల్ల పిల్ల ఇనాముదార్లకు మిక్కిలి కష్టమయ్యెను. డబ్బుపెట్టి కొనుక్కున్న రైతీభూమిగూడ సొంతభూమిగ పరిగణింపరాదనుమాట చెప్పుటవల్ల పిల్ల ఇనాందార్లపని మరింత అధ్వాన్నమయ్యెను. మొదట పూరాగ్రామముగ నున్న ఇనాము రాను రాను భిన్నాభిన్నములుగ విభాగములై పాతికేసి సెంట్లు భూమిగల ఇనాందార్లు కూడ నేడేర్పడియున్నారు. వీరందరికి ఈ ఆక్టు

వ_ర్తింపజేయుటవల్ల, వీరు కేవలము నిరాధారులైరి. తమకు కుడివరం హక్కుగలదని కోర్టుకెక్కి ఋజువు చేసుకోతగ్గ తాహతు వీరికిలేదు. ఇనాందార్లను పెద్దపేరు వీరికున్నను, తాహతుమాత్రం శూన్యం. 'రైత'నిపేరు పెట్టుకున్న వ్యక్తి ఇట్టి — బక్క-ఇనాముదార్ల భూముల నెన్నింటినో సేద్యము చేయుచు బలవంతుడుగను, భాగ్యవంతుడుగను ఉంటున్నాడు. పేరేదియైనను, బలవంతునికంటె, బక్కవానికి ఎక్కువ రక్షణ నొసంగుట రాజధర్మ మనుమాట ఎవరుగాని మరువరాదు.

—: ఇక ముందు ఇనాములచట్టము ఎట్లుండవలెను :—

ఇనాములు జమీలకంటె భిన్నతత్వముగలవి గనుక వాటిని ఎస్టేటు ల్యాండుఆక్టునుండి విడదీసి, వానికొరకై ప్రత్యేక మొక చట్టముచేయుట అవసరమని ప్రకాశంకమిటీవారు చేసిన సూచన సరిగ నున్నది. ఇక ఈ చట్టమును ఏ పద్ధతులమీద చేయవలయు ననునది ప్రస్తుతాంశము. ఇంతవరకు ఇనాముల సమస్య యావత్తు మేల్‌వరం, కుడివరములమధ్య పడి నలిగినది. కుడివరంహక్కు వీరిదా వారిదా యను సంశయము తేల్చుటకు గాను కొన్ని శతాబ్దములు వెనుకకుపోయి చూడవలసివచ్చెను. అప్పటి రికార్డులు ఎక్కడవున్నవి ? గవర్నమెంటురికార్డు ఆఫీసులోనే అవి దొరకుట దుర్లభము. పోనీ, ఇనాం కమిషన్ ఎదుట దాఖల్‌చేయబడిన పురాతన సన్నదులకు కాపీలనైనను సదరు కమిషన్‌వారు తీసికొనిరా ? లేదు. నాలుగైదు వందల యేండ్లనాటి అంశములను ఇప్పుడు ఋజువుపరచుకొనవలసిన

దని ఎవరిని కోరినను అసాధ్యమేయగును. ఇందులో 'లా' పాయింటేమీ లేదు. ఆదికాలంలో కుడివరంహక్కు ఇచ్చారా, లేక, మేల్‌వరంహక్కు ఇచ్చారా అనే 'ఫ్యాక్టు' (Fact)-మీదనే, 'ఇనామ్' సమస్య యావత్తు ఆధారపడియున్నది. ఇంత వరకు బుజువుభారం ఒకప్పుడొకరిమీదను, మరియొకప్పు డింకొకరిమీదను వేయుచు, ఒక్కొక్కసారి ఎవరిమీదను వేయక సందిగ్ధముగనుంచియున్న, పార్టీలను వ్యాజ్యములలోనికి దింపి, నానాభ్రష్టముజేసిరి. ఈ వ్యాజ్యములవల్ల ఇటు ఇనాందార్లు, అటు రైతులుకూడ నాశనమైరి. ఇనాములనుగురించి అటు గాని, ఇటుగాని, నిర్ధారణగ చెప్పుట కెవరికిని సాధ్యముకా దనియు, అది అతిగహన మైనదనియు, సుప్రసిద్ధ 'లా' ప్రవీణు డగు కృష్ణస్వామి అయ్యర్‌గారే ఎన్నడో పలికియున్నారు. కాబట్టి, ఇకముందు కుడివరం హక్కు వీరిదా వారిదా యను మీమాంస పెట్టుకోవడం, బుజువుభారం వారిమీదనో వీరి మీదనో వేయుడం, తద్వారా పార్టీలను కోర్టులకు తోలడం, యీ వగైరాపద్ధతులను మానివేసి, ఇప్పటి దేశకాల పరిస్థితు లను భావములను అనుసరించి, ఎల్లరకు క్షేమకర మగు క్రొత్త పంథాను తొక్కుట ఉచితము. అందువల్ల నాకు తోచిన ఈ దిగువసూచనలను చేయుచున్నాను.

ప్రతివ్యక్తికి సౌఖ్యముగ జీవనోపాధి జరగడానికిగాను ఏదో కొంత విస్తీర్ణతకు తగ్గని భూమి ఉండుట (Minimum economic holding) అవసరమని ఈనాడు ఎల్ల నాగరక రాజ్యాంగములచే నంగీకరింపబడిన విషయము. ఇది అందరికి తెలియును. ఈ భావము ననుసరించి పల్లం మెరక కలిపి, కనీ

సము 25 ఎకరాలుగాని, అంతకు తక్కువగాని, ఇనాం భూమి గల ఇనాందారుకు, సదరుభూమియందు, ఈ దిగువ రెండు పద్ధతులకు లోబడి కుడివరం హక్కు నంగీకరించవలయు నని నా అభిప్రాయము.

ఆ పద్ధతు లేమనగా—

(1) ఇంతటినుండి ఇనాందారుడు సదరు కనీసపు క్షేత్రమును, ఎవరికి కౌలు కివ్వకుండా, సొంత సేద్యము చేసుకోవలెను. మైనర్లు, వితంతువులు, శరీరదార్ఢ్యము లేని అవధ్యులు మున్నగువారు మాత్రము కొంత పరిమితికట్టుబడికి మించకుండ ఇతరులకు కౌలు కిచ్చుకోవచ్చును.

(2) మరియు, సదరు భూమిని ఇప్పుడు సేద్యము చేయుచున్న సేద్యగాడెవడైన ఉన్నచో, అతనికి ఇప్పటికి 25 ఎకరాలకు తక్కువ కానట్టి ఇనాం భూమి (ఏ ఇనాందారు ద్వారా లభ్యమైనదైనా సరే) ఉండి యుండవలెను.

పరా:— పాలుపద్ధతి కూడ, సొంత సేద్యము క్రిందనే పరిగణింపవచ్చును. ఈ కనీస క్షేత్రమును సొంత సేద్యము చేసుకొనని యెడల, దానియందు ఇనాందారుకు కుడివరం హక్కు పోవునని స్పష్టముచేయవలెను.

ఏదో ఒక తేదీనాటికి ఏ ఏ ఇనాందారుకు ఎంతెంత భూమికలదో, దానిలో పైన చెప్పినట్లు "కనీసపుక్షేత్రము" లెవరెవరికి, ఎంతెంతకలవో, ఒకలెక్క గ్రామోద్యోగస్థుల చేత తయారు చేయించవలెను. దీనికి "కనీసపు క్షేత్రముల రిజిష్టరు (Register of economic holdings) అని పేరుపెట్టవచ్చును.

ఈ క్షేత్రములు అమ్ముకోడానికిగాని, విభాగాలు చేసుకోడానికిగాని, ఇతరత్ర అన్యాక్రాంతం చేయడానికిగాని, డిక్రీల ద్వారా జప్తులు వేలాలు చేయబడడానికిగాని, వీలులేకుండ నిబంధన చేయవలెను. ఇట్టి అన్యాక్రాంతాలు వగైరాలు జరిగే యెడల, అవి లేనట్లుగానే భావింపబడవలెను. ఈనాడు సదరు క్షేత్రములు 25 ఎకరాలకు తక్కువగ వుంటే, అవి 25 ఎకరాలవరకు వచ్చేదాకా, పెంపొందించుకోవడానికి ఇనాందారుకు అవకాశ ముండవలెను.

(2) ఈనాడు ఏ ఇనాందారుకైనా 25 ఎకరాలకు మించి ఇనాంభూమివుంటే, సదరు 25 ఎకరాలకు మించియున్న హెచ్చుభూమిలో సేద్యగానికి—(వానికింద 25 ఎకరాలకు తక్కువ ఇనాంభూమి ఎవరిదైనా సరే, వుండేపక్షములో మాత్రమే) జిరాయితీహక్కు అంగీకరించబడవలెను.

ఈ విధముగ, ఎవరికిగాని, పేరు ఇనాందారైనను, రైతైనను—25 ఎకరాలకు మించిన భూమిలో జిరాయితీహక్కు ఉండరాదని నా యభిప్రాయము. అంతకు మించిన భూమి, ఇతరుల జిరాయితీహక్కుకు సందర్భానుసారముగ — లోనై యుండును.

(3) 25 ఎకరాలకు మించియున్న భూమిని ఏ ఇనాందారైనా అమ్ముకునేయెడల, అట్టి క్రయము, దానియందు ఇతరులకు ఏర్పడియున్న జిరాయితీహక్కుకు లోబడియే జరుగవలెను. అయితే, ఆ సమయమందు దా క్రియభూమిని సేద్యముచేయుచున్న సేద్యగాని కనీసపు క్షేత్రస్థితినిన్నీ, దానిని కొనుక్కున్న వ్యక్తియొక్క కనీసపు క్షేత్రస్థితినిన్నీ పోల్చిచూచి, ఇందు పై

రెండవ పేరాలో నిర్వచించిన సూత్రప్రకారము ఈ ఇరువురిలో ఎవరికి జిరాయితీహక్కు నిల్పుట తగియుండునో నిర్ణయింప వలయును.

ఈ కనీసపు క్షేత్రసిద్ధాంతము ననుసరించి ఎవరెవరికి ఎప్పుడెప్పుడు జిరాయితీహక్కు ఏర్పడు నను సమస్యలను అప్పటప్పటికి పరిష్కరించుటకుగాను, తగురూల్సును గవర్నమెంటువారు చేయవచ్చును. ఈ రూల్సుప్రకారం రివిన్యూడిపార్టుమెంటువారు - అనగ, డిప్యూటీకలెక్టరు, అందుపైన కలెక్టరు, అందుపైన రివిన్యూబోర్డు - ఈ ఇనాముదార్లకు రైతులకు సంబంధించిన యావత్తు తగాదాలను పరిష్కరించవలెను. సివిల్ కోర్టుల అధికారము ఇనాము తగవులపై తొలగించవలెను. రివిన్యూబోర్డు తీర్పు ఆఖరు తీర్పుగ నుండవలెను. ఇట్లయిన యెడల, వ్యాజ్యములు చాలవరకు తగ్గిపోవును. తగవులు సులభముగ, సమ్మరీగా, పరిష్కారమగును. పార్టీలకు వ్యాజ్యపు ఖర్చులున్ను తగ్గును.

ఈ పైన చెప్పిన ఏర్పాటులలో కుడివరంహక్కు ఎవరిదను మీమాంస తొలగింపబడెను. అందుచేత, కుడివరం హక్కుకు ప్రతిఫలం-లేక-కంపెన్సేషన్-అనుసమస్యయేరాదు. వారివారికిగల కనీసక్షేత్రస్థితిని బట్టియే, కుడివరంహక్కు ఏర్పడుటయు, ఏర్పడకపోవుటయు జరుగును. ఈ కనీసక్షేత్రసిద్ధాంతమును బట్టిగాక, ఇంకేవిధముచే ఈ ఇనాంసమస్యను పరిష్కరించ యత్నించినను, ఎల్లరకు న్యాయమగు పరిష్కారము కుదరజాలదు.

ఈ కనీసక్షేత్రపుసిద్ధాంతము ఒక్క ఇనాంభూములకు

మాత్రమేల యుండవలయును, రైతువారీభూములకు, జమీం
దారీ భూములకుమాత్ర మేల యుండరాదు? అని ఎవరైన
ప్రశ్నింపవచ్చును. ఇది సరియైన ప్రశ్నయే. ఈ సిద్ధాంతము
అన్నిరకముల భూములకుకూడ వర్తింపజేయుటకు నా కెట్టి
ఆక్షేపణయున్ను కనిపించదు. తప్పక వర్తింపజేయవలయు
ననియే నా నిశ్చితాభిప్రాయము. ఏలననగ, పేరుకు జమీం
దారని పేరు పెట్టుకొన్నను, పావలా పేష్కస్ చెల్లించే జమీం
దార్లుకూడ నేడు గలరు! జమీలు భిన్నాభిన్నములుగ విభా
గములైపోయి, బక్క ఇనాందార్లవలెనే, బక్క జమీందార్లు
కూడ నేడు ఏర్పడి యున్నారు. కాబట్టి, ఇనాందార్ల విష
యంలో చెప్పిన కనీసపు క్షేత్రసిద్ధాంతమే ఇట్టి పిల్లజమీం
దార్లకును తప్పక వర్తింపజేయవలయునని నా వాదన.

—: శేరీభూములలో మాత్రమేల జిరాయితీహక్కు ఉండరాదు:-

అట్లే, పేరుకు రైతైనను, ఇతరులకు లేకుండ, వందల
కొలది ఎకరాల భూములను ఆకట్టుకొన్న రైతువారీ లేక శేరీ
రైతు లున్నారు. వారికి మాత్రము ఈ యావత్తు ఏరియా
లోను కుడివరంహక్కు ఏల యుండవలెను? వానిని సేద్యము
చేయు ఏ సేద్యగానికో, కౌలుదారుకో, 25 ఎకరాలకు మించిన
ఏరియాలో, ఏల జిరాయితీహక్కు నిచ్చివేయరాదు? ఇట్టి
పద్ధతిని బొంబాయి రాష్ట్రములో, కాంగ్రెసు గవర్నమెంటు
వచ్చిన తర్వాత, ఏర్పాటు చేయనే చేసియున్నారు. ఇందు
నిమిత్తమై వారు "బొంబాయి టెనెన్సీబిల్లు" ప్రచురించి
యున్నారు. ఆ బిల్లు ననుసరించియే, మన మద్రాస్ రాజధాని

లోని శేరీభూములకుకూడ జిరాయితీహక్కు ఏర్పడేటట్లు చేయుట ఉచితము, అవసరము. ఇది విషయాంతరమైనను సిద్ధాంత రీత్యా ఇచ్చట ముచ్చటించక తప్పినదికాదు.

ఇక ఇనాములను గురించిన మిగత అంశములగూర్చి చెప్పి, ఈ వ్యాసమును ముగించెదను.

జిరాయితీ హక్కును పొందిన రైతు ఇనాందారునకు రెంటు (లేక శిస్తు) ఎంత చెల్లించవలె నను సమస్య కలదు. 1933 సం॥ నవంబరు 1 వ తేదీ నాటికి రైతు ఏ రెంటునైతే చెల్లించుచున్నాడో, అది న్యాయమైన రెంటు అని 1936 సం॥పు ఆక్టు చెప్పుచున్నది. అట్టి భూములయందు సదరు రేటు చెల్లింపబడవచ్చును. అట్లుగాక, ఇకమీదట క్రొత్తగ జిరాయితీ హక్కు ఏర్పడబోవు కేసులలో, గవర్నమెంటు తరం రేట్లకు తగ్గకుండ కలెక్టరు ఉచితమగు రెంటును నిర్ణయించవచ్చును. జమీలలో చేరియున్న ఇనాములకు సదరు జమీ భూములలో జమీందారుకు చెల్లే రేటే చెల్లించిన చాలును.

రెంటు వసూలుకై జమీందారు విషయములో నెట్టి ఏర్పాటు చేయబడునో, అట్టి ఏర్పాటునే ఇనాందారు విషయములో కూడ చేయుట ఉచితముగ గన్పట్టుచున్నది. జమీ వరియాలోని శిస్తులు గవర్నమెంటువారే - కొంత కమిషను పుచ్చుకొని- తమ గ్రామకరణం, మునసబుల ద్వారా వసూలు పరచేయెడల, అట్టి ఏర్పాటునే ఇనాందారు విషయములో కూడ చేయవచ్చును. ఇనాందార్లు దానముపట్టినవారని చెప్పితిమి. కాబట్టి, దానముచేసిన ఆ సొమ్మును "ఇతరులనుండి నీవే తీసికో" అని ఆ భారమును ఇనాందారుమీద వేయుటకంటె,

దానిని తామే వసూలుపరచి, ఇచ్చుట ఉచితముగ గన్పట్టు చున్నది. బేరీజ్ మినహాయింపు, మోహినీ, తసదక్ అల్లవెన్సు లను పేరుతో కొన్ని దేవస్థానములకు, మఠములకు, మశీదు లకు ఇట్టి ఏర్పాట్లు ఇప్పుడు ఉండనేవున్నవి. ఇట్టిఏర్పాట్లు అన్ని ఇనాములకు ఏలవర్తింపచేయరాదు?

ఇంతవరకు ఇనాములను గురించిన సామాన్యసూత్ర ములగురించి చెప్పితిని. ఈ సూత్రములు నేటికాలపు భావముల ననుసరించియున్నవి. వానిలో ముఖ్యమైన రెండు సూత్రముల పునాదిపై ఈ ఇనాముల సమస్య పరిష్కరించుటకు నేను పూనితిని. అవేవనగా—

(1) 'సేద్యము చేయువానికే భూమి.'

(2) 'ప్రతివ్యక్తికి సౌఖ్యముగ జీవనోపాధి జరగడానికి గాను కొంత కనీసపు భూమియైనా వుండాలి.

వీనిలో మొదటి సూత్రము ననుసరించి తమ పూర్వార్జిత భూములను స్వయముగ సేద్యముచేయదలచుకొన్న ఇనాం దార్లకు ఒక అవకాశమివ్వబడినది. ఈ అవకాశమును వారు వినియోగించుకొందురని ఆశింపబడుచున్నది. అట్లు వినియో గించుకొననిచో, తప్పు వారిదే. 'తిరిగి గ్రామాలకు చేరండి, తిరిగి భూమిమీదికి రండి' అను కేకలు సర్వత్ర వినవచ్చుచుండు ఈ రోజులలో యీ ఏర్పాటునకు మించినది లేదు. విద్యార్థి కుల నిరుద్యోగ సమస్య నివారించుటకై వారికి భూముల నివ్వవలె నను సూచనలు (కాలనైజేషన్ స్కీములు) బయలుదేరుచున్నవి. ఇందుకు కూడ, ఈ వ్యాసములోని

సూచనలు అనుగుణ్యాముగనే యున్నవి. ఇక, రెండవ సూత్రము ననుసరించి ప్రతివానికి కనీసము 25 ఎకరా లైనా భూమి వుండవలె ననిన్నీ, అంతకుమించి ఉండనక్కర లేదనిన్నీ, సదరు 25ఎకరాలు భిన్నాభిన్నముగ విభాగాలుకూడ దనియు, అట్లు విచ్ఛిన్నమైనయెడల వ్యవసాయాం గిట్టుబాటు గాదనియు, మొదలైన ఆధునిక భావములు ఇనాముభూముల విషయములో వర్తింపజేయబడెను. ఇట్టి భూమివాక్కు పెద్ద ఇనాందార్లకుగాక, చిన్న ఇనాందార్లకే ఇవ్వబడెను. అదిన్నీ, రైతు 25 ఎకరాలకు మించిన బలిష్ఠుడైనప్పుడే అంగీకరింప బడెను. ఇరువురి భూస్థితియొక్క పరస్పర బలాబలముల గమ నించియు, అందులో సేద్యగానియెడలనే యెక్కువ అనుకూల భావముంచియు, పిల్ల ఇనాందారులకు స్వంత సేద్యమునకు కొంత అవకాశ మివ్వబడెను. ఈ మాత్రము అవకాశమును 1936 సం॥ చట్టములో ఇచ్చియుండిన యెడల, ఒక్క ఇనాం దార్లకు అన్యాయం జరిగెనని ఎవరుగాని అనడానికి అవకాశము ఉండెడిదిగాదు.

ఇట్టి సూచనను అనగ, ఒక్క ఇనాందార్లను ఈ ఆక్టు క్రిందికి తేకుండా మినహాయించ వలసిన దని — ఆనాడు చాలా మంది ఆందోళన చేసియుండిరి. ఈ సూచనకు అప్పటి గవర్న మెంటు అంగీకరించి యుండియుంటే, ఎంతో బాగుండెడిది. ఎవరు గాని, ఆక్షేపించుటకు వీలుండెడిదికాదు. ఇప్పుడు ఈ గ్రంథములో అట్టి ఆక్షేపణను తొలగించి, ఆధునిక భావముల కనుగుణ్యముగ ఈ సమస్యను అందరికి సమానన్యాయము గలుగు నట్లు పరిష్కరించుటకు ప్రయత్నించితిని.

-: ఇనాములను గురించిన వాడుకపదములు-వాని అర్థములు :-

ఇనాము లనునవి హిందూరాజుల కాలమునుండి నేటి వరకు వచ్చుచుండుటచే, వానిలో ఆయా ప్రాంతములలో అనేక రకపు ఇనాములు, అనేక పేర్లతో, అనేకషరతులతో పుట్టి యున్నవి. ఆ పేర్లను గురించియు, ఆ యారకముల ఇనాముల స్వరూపస్వభావములను గురించియు తెలిసికొనవలసియున్నది, ఈ అధ్యాయమును ముగించెదము.

రాజులు శిస్తు దానం చేసేటప్పుడు 1. కొందరికిపూరాగా నున్ను, 2. కొందరికి కొంతభాగము మాత్రమేనున్న, దానం చేస్తూవుండిరి. 3. మరికొందరికి కొద్దిశిస్తు చెల్లించే పద్ధతిమీద భూముల నిచ్చుచుండిరి.

పూరాశిస్తు మాఫుచేసిన భూములకున్ను, లేక సదరు భూముల మీద తనకు రావలసిన శిస్తును రాజు పూర్తిగ ఇతరులకు దానము చేసివేసిన కేసులకున్ను "సర్వమాన్యములు", సర్వదుంబాలా ఇనాములు" లేక "దరోబస్తు ఇనాములు" అనిపేరు. కొన్నిచోట్ల వీటికే

సర్వమాన్యములు, సర్వదుంబాలా, దరోబస్తు ఇనాములు.

"ఏకభోగం ఇనాము"లని కూడ పేరు. ఇట్టి సర్వమాన్యములు సాధారణముగ ధర్మసంస్థలకు, వేదపండితులకు, శిథిలమై పోయిన రాజవంశస్థులకు ఇవ్వబడుచుండెను.

శ్రుతి అనగ వేదములయందు ప్రవీణులైన బ్రాహ్మణుల కివ్వబడిన మాన్యములకు పూర్వకాలమున "శ్రోత్రియము"లనుపేరుండెను.

"శ్రోత్రియములు"

సర్వమాన్య మనేపదానికి ఇంకో అర్థంకూడా వున్నది. శిస్తుహక్కు, భూమిహక్కు రెండూకలసి ఇవ్వబడిన మాన్యానికికూడ సర్వమాన్య మని పేరుకలదు. ఒక్క శిస్తుహక్కే గలదానికి "అర్థమాన్యం" అని అనుచుండిరి. సగంశిస్తు దానం ఇవ్వబడినదానికి కూడ "అర్థ మాన్యం" అనవచ్చును.

"అర్థమాన్యం"

నాలుగోవంతు శిస్తు ఇవ్వబడిన దానికి "చాతుర్భాగ మాన్యం" లేక "పాతికబడి" మాన్యంఅందురు. ఇట్లే "ముప్పాతికబడికి", త్రిభాగం లేక "త్రిప్యైకమ్" అను ఇనాములు కలవు.

భూమిమీద మామూలుగ అందరూ చెల్లించే పూరా శిస్తుగాక, తేలికశిస్తు చెల్లించు పద్ధతిమీద ఇవ్వబడిన ఇనాం ములు కలవు. వాటిలో అనేకపేర్లు - ఎట్లనగ -

1. బిల్‌మక్తా ఇనాము:—ఎకరాని కింతనికాక, అసామీకి ఉన్న మొత్తం భూమికంతకు కలిపి, ఏదో కొద్దిమొత్తముకు శిస్తు గతీసుకుంటూ ఉండేదానికి బిల్‌మక్తా ఇనామని పేరు.

2. హాంగామీజోడీ :— ప్రతిసాలున పంటను బట్టి, విస్తీర్ణాన్నిబట్టీ తేలిక శిస్తు పుచ్చుకునేది.

3. నెల్లుగుత్త లేక ధాన్యపు గుత్తఇనాములు :— రొక్కముగ గాక, ధాన్యరూపంగా కొద్దిశిస్తు చెల్లించే వాటికి ఈ పేరు.

4. "అణాహిస్సా" ఇనాము:—ఫలాని భూమి అనే నియామకము లేకుండ "ఈ వూళ్లో వచ్చే శిస్తులో అణావంతు

లేక "అణాహిస్సా" శిస్తు ఏ బ్రాహ్మణునకైనా రాజు దానము చేసివుండవచ్చును. ఇట్టి ఇనాములకు "అణాహిస్సా" ఇనాములు అనిపేరు.

5. చెక్కు-బందీ ఇనాములు:—అణావగైరా హిస్సాలు కాకుండా ఫలాని భూమిమీద శిస్తు అని సదరు భూమికి హద్దులు నిర్ణయించి ఇవ్వబడే ఇనాముకు "చెక్కు-బందీ" ఇనాము లనిపేరు.

6. దాఖలా, గైర్‌దాఖలా ఇనాములు:—సర్కారు లెక్కలలో నమోదైనవి దాఖలా "ఇనాములు". అట్లు దాఖల్ కానివి "గైర్‌దాఖలా" ఇనాములు.

7. అసల్ మినహా ఇనాములు:—గోదావరి జిల్లాలో తోటల పెంపకమును ప్రోత్సహించడానికిగాను, కొన్ని భూములమీద శిస్తును పూర్వము సర్కారువారు పూర్తిగ వదలుకొనిరి. ఇవి శిస్తుచెల్లని భూములు గనుక, వీటిని అసలు సర్కారు లెక్కలలో నుండియే మినహాయించి వేసిరి. అందుకనే వీటికి "అసల్ మినహా ఇనాము"లను పేరువచ్చెను.

ఇనాములలో ఇంక ముఖ్యమైనవి రెండురకములుగలవు. 1. పర్సనల్ ఇనాములు అనగ, ఇనాందార్లు వారికుటుంబము వారు పిల్లపిల్ల తరానా అనుభవించడానికిగాను పండితులకున్ను, పకీరులకున్ను, రాజబంధువులకున్ను తరుచు ఇవ్వబడుచుండునవి. వీరిని గౌరవించడానికో, పోషించడానికో ఇవ్వి ఇవ్వబడుచుండెను. వీటిమీద వచ్చే శిస్తునో, భూమినో లేక రెంటినో హాయిగ అనుభవిస్తూ వుండడం తప్ప, వీరికి వేరే పబ్లిక్ డ్యూటీ ఏమిన్నీ వుండదు.

(2) ఇక, రెండవరకపువి "నౌకరీఇనాములు". చాకలి, కుమ్మరి, మంగలి, పంచాంగి, కరణం, వగైరా గ్రామశిబ్బంది కిన్ని, సైన్యంలోగాని, సర్కారులోగాని, పనిచేసే ఇతర ఉద్యోగులకున్ను ప్రతిఫలంగా ఇచ్చే ఇనాములకు నౌకరీ ఇనాములని పేరు. ఇనాములను అనుభవించు చున్నందుకు ప్రతిఫలంగా ఈ ఇనాందార్లు ఏదో నౌకరీ చేయవలసి వుంటుంది. ఇది వారి కిచ్చే జీత మన్నమాట, నౌకరీ చెయ్యకపోతే ఇనాం పోతుం దన్నమాట.

ఈ రెండురకాల ఇనాములను గురించిన వివరాలు కొన్నింటిని తెలిసికొందము.

—: పర్సనల్ ఇనాములు :—

పర్సనల్ ఇనాములు:— ఇవి పిల్లపిల్ల తరానా, వంశ పారంపర్యంగా అనుభవించడానికి మాత్రం హక్కుగలవిగ మొదట ఉద్దేశింప బడినవి. ఇనాందార్లు వీటిని అమ్ముకోడానికి, అర్పుకోడానికి వీలులేనివి. ఒకవేళ ఆ కుటుంబము నిస్సంతుగ, ఎవ్వరూ వారసులు లేకుండపోతే, ఆ ఇనాము గవర్నమెంటులో సంక్రమిస్తుంది. అనగ ఆ వంశములో ఎవ్వరూ లేనప్పుడు, ఆఖరువారసు గవర్నమెంటు అన్నమాట.

బ్రిటిష్‌గవర్నమెంటు వచ్చిన తరువాత 1860–1869 సం॥ల మధ్య ఇనాంకమిషన్ అంటూ ఒకటిపెట్టి, ఈ ఇనాములను అమ్ముకోడానికి, అర్పుకోడానికి ఇనాందార్లకు స్వేచ్ఛ నిచ్చుచు పట్టాల నిచ్చిరి. దీనికే (enfranchisement) అని ఇంగ్లీషులో అంటా రని లోగడ చెప్పియే యుంటిమి. తమ

ఆఖరువారసత్వపు హక్కును వదలుకుని, ఇనాందార్ల కీ రీతిగ ఇనాములను అమ్ముకోడానికి, అర్పుకోడానికి స్వేచ్ఛ నిచ్చి నందులకు ప్రతిఫలంగా గవర్నమెంటువారు ఇనాములమీద క్విట్ రెంటునుకూడ కట్టి యున్న సంగతిని మనము చూచియే యున్నాము.

పర్సనల్ ఇనాములు శాశ్వతముగ వంశ పారంపర్యముగ గాకుండ, మూడు నాలుగు తరాలవరకు మాత్రమే అనుభవించే హక్కుతో ఇవ్వబడినవికూడ కలవు. ఆ మూడు నాలుగు తరాలు పూర్తికాగానే, ఇనాము తిరిగి సర్కారులో కలుస్తుంది. అనగ, నదరు ఇనాముపై పూరా శిస్తు విధింపబడుతుంది. పర్సనల్ ఇనాములు కొన్ని జమీందారీ ప్రాంతాలలో వున్నవి. మరికొన్ని శేరీ ప్రాంతాలలో వున్నవి. ఈ రెండురకాలవాటికి కూడ ఆఖరువారసు గవర్నమెంటే. ఇనాందారుడు కట్టుబడిని జమీందారుకు చెల్లిస్తున్నప్పటికి, ఆఖరు వారసత్వం జమీందారుదికాక, సర్కారుదే అగుచున్నది. అందునిమిత్తమయియే, జమీ ప్రియాలలోని ఇనాందార్లుకూడ క్విట్ రెంటును సర్కారుకే చెల్లిస్తున్నారు.

బ్రహ్మదాయము

బ్రాహ్మణుల కివ్వబడిన పర్సనల్ ఇనాములకు బ్రహ్మదాయ మనిపేరు. ఇవి చాలవరకు పూరాశిస్తు మాఫీభూములో, లేక నామకః కొద్ది శిస్తుకట్టినవో అయి వున్నవి. ఒక్కొక్కప్పుడు వీరుచేయవలసిన పనికూడ మిక్కిలి తేలికైనదిగానో, గౌరవప్రదమైనదిగానో వుండుచుండెను. దేవస్థానములో వేదపారాయణ

చేసేటందుకుగాను ఇవ్వబడిన మాన్యానికి "అధ్యయనమాన్య" మని పేరు. భారతం పురాణం చెప్పడాని కని ఇచ్చినది "భారతీమాన్యం". జీవనభృతికై బ్రాహ్మణున కివ్వబడిన ఇనాముకు "భటవృత్తి" ఇనా మనిపేరు. ఇట్లే, పంచాంగం, పురాణం, వేదవృత్తి అనగ, బ్రాహ్మణులకు వేదము చెప్పడానికి ఇవ్వబడిన బావయ్య ఇనాము లెన్నో కలవు.

అగ్రహారం (శబ్దార్థం)

ఒక గ్రామంమీద వసూలైనశిస్తు పూర్వము పోస్టులు, రోడ్లువగైరా రాకపోకసౌకర్యాలు లేనిరోజులలో డబ్బుఖజానాకు పోవడం, తిరిగి అక్కడనుండి గ్రామాలలోనూ ఇనాందార్లకు రావడం అనవసరపు శ్రమగ ఉండెను. అందుకనియే, ఇనాందార్ల కివ్వవలసిన డబ్బు, ఏవూళ్లోది ఆవూళ్లోనే ఇచ్చివేసి, మిగతాదే సర్కారు ఖజానాకు ఇర్సాలు చేయబడుచుండెను. ఇర్సాలు చేయకుండా, సర్కారు ఖజానాకు ముందుగనే బ్రాహ్మణులకు హారము పెట్టబడునది; అనగ బ్రాహ్మణులకు సరాసరి ఇచ్చివేయబడునది ఏదైతే కలదో అదే "అగ్రహారము" (అనగ "ముందు భోజనము" అసలర్థము); లేదా, అగ్రవర్ణుల జీవనభృతికై హారముగ ఇవ్వబడునది అనికూడ అర్థం చెప్పవచ్చును. ఇట్టిది పలుగు రైదుగురు బ్రాహ్మణకుటుంబములకు దాన మివ్వబడు చుండెను. దీనిపై చెల్లవలసిన స్వల్పపు శిస్తు ఏదైనా వుంటే, దానిని చెల్లించేటందుకు బాధ్యత అందరిమీద జాయింటుగ ఉంటుంది. ఇట్టి అగ్రహారాలు పూరా గ్రామాలుగనో, లేక గ్రామంలో ఒక ఖండముగనో ఉండవచ్చును.

అగ్రహారములలో నాలుగైదు రకాలున్నవి, (1) బిల్

మక్తా అగ్రహారం. అనగ, ఊరిమీద, మొత్తం ఇన్నివరహాలు శిస్తు చెల్లించే పద్ధతి చొప్పున ఇవ్వబడిన అగ్రహారానికి ఈ పేరు వర్తిస్తుంది.

అగ్రహారాలలో రకాలు

(2) కట్టుబడి లేక "జోడీ" అగ్రహారం. సాధారణంగా జమీందార్లకు "ఇంత మొత్తం ధాన్యం" అని ఇచ్చే పద్ధతిమీద పుట్టిన అగ్రహారాలు: "జోడీ" అనే పదము దక్షిణాదిని వాడబడుచున్నది. ఇది కన్నడపదము.

(3) పుట్ల కట్టుబడి అగ్రహారం:—గ్రామంలో పండిన ప్రతిపుట్టి ధాన్యములోను ఇన్నవ వంతు జమీందారుకు అగ్రహారీకునివల్ల చెల్లవలె నను పద్ధతితో ఏర్పాటయిన అగ్రహారానికి ఈ పేరు.

"ఖండ్రిక"

(4) ఖండ్రిక:—పూరా గ్రామం గాక దానిలో ఒక పెద్ద ఖండం' బ్రాహ్మణులకు యివ్వబడినట్లయితే దానికి 'ఖండ్రిక' అని పేరు. అట్లే పూరాశిస్తు గాక, కొద్దిశిస్తు మాఫీ అయినప్పుడు కూడ ఈ పేరువర్తిస్తుంది.

"పార్వగ్రామాలు"

పార్వా గ్రామాలు:— దక్షిణాదిని మధురజిల్లాలో ఒకప్పుడు బ్రాహ్మణులకు పూరాశిస్తు మాఫీతోనున్న, ఏవిధమైన బాధ్యత లేకుండానున్న, కొన్ని గ్రామాలు హిందూరాజులచేత యివ్వబడెను. దరిమిలా దేశము అల్లకల్లోల స్థితిలో నున్నప్పుడు, ఎవరైనా వచ్చి ఈ భూములను లాగికొంటా రనే భయంచేత వాటిని రక్షించుకోడానికిగాను, "మే మీ భూములమీద కొంతశిస్తయినా ఇచ్చుకుంటాము, మమ్ములను రక్షించవలసినది" అని ఈ బ్రాహ్మణులు ఏ బలవంతునో ప్రార్థించడం జరిగి

ఉంటుంది. ఇట్లు చెల్లించుటకు ఇనాందార్లు ఒకంబడిన శిస్తుకు ఆ జిల్లాలో "పొర్వ" అని పేరు. దరిమిలా మహమ్మదీయ ప్రభువులు వచ్చి చూచేనాటికి సరియైన హక్కు లేకుండ, దొంగతనంచేతనో, మోసంచేతనో ఆ భూములను ఆక్రమించు కొన్నవా రుంటే అది కనిపెట్టి మహమ్మదీయ ప్రభువులు వీటి మీద శిస్తును విధిస్తూ వచ్చిరి. ఇట్టి శిస్తులకుకూడ "పొర్వ" అనే పేరు. ఈ విధంగా నేటికిన్ని పొర్వ చెల్లించే గ్రామాలకు "పొర్వ గ్రామా"లనిన్ని "పొర్వ భూము"లనిన్ని పేర్లు మధుర జిల్లాలో కలవు.

"ఖైరాతీ ఇనాములు"

మహమ్మదీయ పరిపాలనలో నవాబులు తమ తురక ఫకీర్లకు, మౌలానాలకు వారి కుటుంబపోషణ నిమిత్తమై ఇనాముల నిచ్చుచుండిరి. ఇట్టి వాటికి 'ఖైరాతీ' ఇనాములని పేరు. ఇవి బ్రాహ్మణుల కివ్వబడిన 'భటవృత్తి' ఇనాముల వంటివి. ఇటీవల ఈ పేరు తురకలకు గాక, తదితరుల కవసరిక గాని ఇవ్వబడిన ఇనాములకు కూడ వర్తింపజేయ బడుచున్నది.

'అల్తంగా ఇనాములు'

అల్తంగా ఇనాములు:—చక్రవర్తిగారి ఎర్రసీలు ముద్రలతో పూరాశిస్తుమాఫీతో శాశ్వతముగ వంశపారంపర్యంగా అన్యాక్రాంతము చేసుకునే హక్కుతో సహా యివ్వబడిన వాటికి "అల్తంగా" ఇనాములని పేరు.

"జాగీరు"

జాగీర్ :—ఇది మహమ్మదీయ పరిపాలన కాలములో పుట్టిన పదము. "జాగ్ ఈర్" అనగ "తీసికోబడిన స్థానము" అని శబ్దార్థము. రివిన్యూ సర్కారు

ఖజానాకు చేరకమునుపే మధ్యదోవలోనే సర్కారుస్థానే యిం కొకరు వచ్చి దానిని తీసికొనిపోయి అనుభవించడం అని అర్థము. ఇది పైన వివరించిన "అగ్రహార" శబ్దార్థమును పోలి యున్నది. జాగీర్లు అనేక పనులకోసము ఇవ్వబడు చుండెను:—

రాజధానికి దూరము ప్రాంతములనుండి శిస్తు వసూలు పరచి, పాలించుట కష్టమగుటచే, వాటి పరిపాలనా నిమిత్తమై జాగీరుదారు లనబడువారు మహమ్మదీయ ప్రభువులచే నియ మింపబడుచుండిరి. వారు అక్కడ శిస్తులు వసూలుపరచి, సైన్యము, పోలీసు వగైరా శిబ్బందులకుగాను ఖర్చుపెట్టి, తాము కొంత జీతముక్రింద మిగుల్చుకొని, మిగతాది హుజూరు ఖజానాకు ఇర్సాలు చేయుచుండిరి. ఈ రీతిగ, వీరు హిందూ రాజుల కాలమునాటి సామంతరాజులతో పోల్చదగి యున్నారు.

సర్కారుయొక్క సివిల్, మిలిటరీ డిపార్టుమెంటులలో ఉద్యోగులుగ నున్నవారికికూడ జీతముక్రింద, జాగీరుల నిచ్చు చుండిరి. రాజబంధువులయు, ఓడిపోయిన రాజవంశీకులయు కుటుంబ పోషణ నిమిత్తముయికూడ జాగీర్లు ఇవ్వబడుచుండెను.

జాగీరుదార్లయొక్క హక్కు బాధ్యతలు వాని నిచ్చి నప్పుడు ఏర్పరుచుకొన్న షరతులనుబట్టి యుండుచుండును. కేవలం శిస్తు వసూలుచేసి కమిటీక్రింద కొంతమిగుల్చుకొని, మిగతాది సర్కారుకు ఇర్సాలు చేసే పద్ధతిలో ఇది జమీాం దారీ పద్ధతిని పోందియుండును. అట్లుగాక దేశసంరక్షణ; శాంతి భద్రతలను కాపాడు సివిల్ క్రిమినల్ అధికారాలను చలాయించడ వగైరా స్వాతంత్ర్య చిహ్నములతో జాగీరు

ఇవ్వబడి యుంటే, అంతట సర్కారుకు చెల్లించునది కప్పము అగుచున్నది. మరియు అట్టి జాగీరుదారుకు కేవలము రాజోద్యోగి గాక, స్వతంత్రాధికారియగు సామంత ప్రభువుగ పరిగణింప బడుతాడు. కొన్ని జాగీరులు సర్కారుకు కొంత నౌకరీ చేసే ఏర్పాటుతో ఇవ్వబడినవి. ఆ నౌకరీ చేయకపోతే ఆ జాగీరున్ను పోతుంది. మహమ్మదీయ ప్రభువు కాలములో సాధారణముగ వంశపారంపర్యపు ఉద్యోగములు ఉండేవికావు. ఇన్నేండ్లకనో, జాగీరుదారుని జీవితాంతం వరకనో ఏర్పాటు ఉండేది. వంశపారంపర్యంగా, శాశ్వతంగా అనుభవించతగిన జాగీర్లు అరుదుగ వుండేవి. జాగీర్లు మొదటిలో అన్యాక్రాంతం చేసుకోడానికి వీలులేకుండ వుండేవి. కాని, కేంద్రప్రభుత్వ బలము తగ్గగానే, జాగీరుదార్లు స్వతంత్రులై తమ జాగీర్లపై దానాదమన విక్రయాది సమస్తహక్కులను చెలాయింప సాగిరి.

జాగీర్లుకూడ ఒకవిధమైన ఇనాములే. ఇనాములవలెనే జాగీర్లుకూడ రెండురకాలు. అనగా, శిస్తుమాత్రం దానమివ్వబడినవిన్ని శిస్తూ భూమీకూడ రెండుహక్కులు దానమివ్వబడినవిన్ని గలవు.

జాగీర్లు సర్కారు ఉద్యోగులకు, రాజబంధువులు మొదలైన వారికేగాక, ఇంక అనేక మందికి అనేక పనులకై ఇవ్వబడుచుండెను. వాటిలో కొన్నిటి నిట తెలిసికొందము.

"బాగ్ మారీ":—జాగీర్ "బాగ్" అనగ పులి అనిన్ని, మారీ అనగ చంపినవాడనిన్ని హిందూస్థానీ భాషలో అర్థము. కాబట్టి పులిని చంపిన

వానికిచ్చిన జాగీరుకు "బాగ్‌మారీ" జాగీర్ అని పేరు.

బురుజు జాగీరు:—ఊరుచుట్టూ కోటకట్టి, దానికి బురుజు కట్టిన వాని కిచ్చినది "బురుజు జాగీరు."

దండుగజాగీరు:—సర్కారు అవసరం నిమిత్తమై, యుద్ధాలు వగైరా ఉపద్రవసమయాలలో, ఎవరికైనా ఎక్కువ దండుగ వచ్చేటనులు సర్కారువల్ల జరిగివుంటే, ఆ దండుగను భర్తీ చేయడానికి గాను, ఇచ్చిన జాగీరుకు "దండుగ జాగీర్" అని పేరు!!

ఏరువాక జాగీర్;—ఊరిలో ముందుగ ఏరువాక సాగే నిమిత్తము ఇట్టిది ఇవ్వబడుచుండెను.

ఈడిగజాగీర్:—తాటి, ఈత, వగైరా చెట్లు నాటిన ఈడిగ వాని కివ్వబడిన జాగీర్.

ఇరుంబుకట్టు జాగీర్:—ఇనుము ఉత్పత్తిని ప్రోత్సహించడానికి ఇవ్వబడినది.

నెత్తురుకట్టు జాగీర్ లేక రక్తమాన్యం:—యుద్ధములోగాని, సర్కారు డ్యూటీ చేస్తూవుండగగాని, ఖూనీ అయిపోయిన వాని కుటుంబపోషణ నిమిత్తం ఇవ్వబడినది.

పులికట్టు జాగీర్:—మంత్రప్రభావముచే పులినోరును కట్టివేసే మంత్రగాని కిచ్చిన మాన్యం.

నిర్మాణమాన్యం:—హిందూదిగంబరుల పోషణకై ఇవ్వబడినది.

—: నౌకరీ ఇనాములు :—

నౌకరీ ఇనాములను నాలుగు రకాలుగ విభజించవచ్చును.

1. ప్రయివేటు నౌకరీ ఇనాములు, అనగ రాజులకు, జమీందార్లకు, దర్బారులలోను, దివాణములోను, రాజమందిరలోను చేసే ప్రయివేటు నౌకరీ.
2. పబ్లిక్ నౌకరీ ఇనాములు:—గ్రామ ఉమ్మడి ప్రయోజనాలకు సంబంధించిన నౌకరీ.
3. గ్రామోద్యోగుల కిచ్చిన ఇనాములు.
4. దేవస్థానములకు, ధర్మసంస్థలకు చేసే నౌకరీ కోసం ఇచ్చిన ఇనాములు. వీనిలో ఒక్కొక్కదానిని గురించి, వేర్వేరుగ తెలిసికొందము.

(1) ప్రయివేటు నౌకరీ ఇనాములు: –

వీనిలో తిరిగి రెండురకాలు:— (ఎ) అమరం, (బి) కట్టుబడి.

అమరం అనేది ఎక్కువ గౌరవప్రదమైనది. రాజులు కొలువు తీర్చినప్పుడు దర్బారులో రాజుగారి ఛత్రిచామరాలు పట్టుకోవడం, లేక ఊరికే, రాజుగారి ఘనతను ప్రకటించుటకై దర్బారులో, కుర్చీవేసుకొని దర్బారుకు అలంకారముగ కూర్చుండడం – ఇవి సాధారణముగ రాజబంధువులకు, గొప్ప కుటుంబములవారికి ఇవ్వబడుచుండెను. జార్జి చక్రవర్తిగారు 1911 సం॥లో ఢిల్లీ దర్బారు చేసినప్పుడు, వారి వెనుక నున్న పెద్ద పొడుగుపాటి గౌనును పట్టుకొని వారివెంట నడవడానికి గాను, హిందూదేశములోని రాజకుమారులందరు నియమింప

బడిరి. ఇట్టిభాగ్యము తమకు లభించుట గొప్ప అదృష్ట మని, అదిఎంతో గౌరవప్రద మైన దనీ ఈ రాచకుమారులు భావించు కొనిరి. ఇదిగాక, సేనాపతులుగను, దండనాయకులుగను, అశ్వ దళ పతులుగను రాజుకు సేవచేసేవారికి కూడ ఇట్టి 'అమరము' మాన్యము లివ్వబడుచుండెను.

ఇట్టి గౌరవప్రదమైన ఉన్నతతరగతి సేవకాక, తక్కువ తరగతిసేవ చేసేవాళ్ళకు అనగ, బంట్రోతులుగను, గుఱ్ఱపు మాలీసువాళ్ళగను, కాగడాలు పట్టేవాళ్ళగను, సైన్యంలో నీళ్ళతిత్తులు మూటలు వగైరాలు మోసేవాళ్ళగను, ఉండే వాళ్ళకు "కట్టు బడి"లనిపేరు. వీరి కివ్వబడిన మాన్యము లు కట్టుబడి మాన్యము లంటారు.

అమరం, కట్టుబడి అనేవి రాజులకు ప్రయివేటు సర్వీసు లయినప్పటికి, వీనిలో అమరం అనేది ఎక్కువ తరగతిదన్ని అని గుర్తుఅనుకోవలెను. ఇవి ఇంగ్లండులో నున్న "గ్రాండు సార్జంటరీ", "పెట్టీసార్జంటరీ" అను టెన్యూరులను పోలి యున్నవి.

బిస్సోయియా ఇనాములు:— గంజాంజిల్లా ఏజన్సీకొండ ప్రాంతాలలో "సవరలు" అను ఒక జాతివారు కలరు. వీరు చుట్టుపట్టుల జనులపై దౌర్జన్యము చేస్తూ ఉపద్రవకరముగ ఉండిరి. వీరిని అదుపులో ఉంచి ఆ ప్రాంతములలో శాంతి భద్రతలను కాపాడడానికై ఆ ప్రదేశమునంతా పదకొండు ముఠాలుగ విడగొట్టి, ఒక్కొక్క ముఠాకు ఒక్కొక్క ప్రము ఖుని నియమించిరి. ఈ ప్రముఖునికి "బిసోయియా" అని ఓఢ్రి భాషలోపేరు. ఒక్కొక్కబిస్సోయియాకి ఒకకోట, కొంతసిబ్బంది,

కత్తులు, ఈటెలు, తుపాకి కట్టెలు ఉండెను. తనక్రిందనున్న ముఠాభూములపై శిస్తు వసూలు అధికారమేగాని, అసలు భూమిహక్కు "బిస్సోయీ" దారునిదికాదు. ఈ భూమి అతనికి ఒకపని నిమిత్తమో, ఒక నౌకరీ చేసే నిమిత్తమో, అనగ, సవరలను అదుపులో ఉంచేనిమిత్తమై మాత్రమే ఇవ్వబడినదగుటచే ఇదికూడ నౌకరీ ఇనాముగనే భావింపబడెను. అయితే ఈ నౌకరీ గౌరవప్రదమైన నౌకరీ. బిస్సోయీకి ముఠాభూములపై వచ్చే శిస్తులో కొంత కట్టుబడియో, లేక క్విట్ రెంటో సర్కారుకు చెల్లింపవలసి యుండును. సవరజాతివాళ్ళవల్ల వెట్టి చేయించుకోడానికి కూడ, బిస్సోయీలకు ఆచారముగ ఏర్పడినది.

ఈ ప్రాంతములోనే కోయదొరలు ఉన్నారు. ఆ ప్రాంతములో శాంతి భద్రతలు కాపాడడానికిన్ని, సవరలు, ఇతరకొండజాతివాళ్లు దండెత్తి వచ్చినప్పుడు వారిని పారద్రోలడానికిన్ని ఈ దొరలకు భూము లివ్వబడెను. వీటికే "దొరతనము" ఇనాము లనిపేరు.

దొరతనము

"జీవితం" ఇనాములు—దక్షిణాదిని రామనాథపురం, మధురజిల్లాలలో రాజబంధువులయు రాజాశ్రితులయు పోషణ నిమిత్తమున్ను, కొంత నౌకరీకి ప్రతిఫలముగా నున్నూ, ఈ రకం ఇనాములు. ఇవి మన తెలుగు జిల్లాలలోని మొఖాసాలను పోలియున్నవి.

"జీవితం"

"ముఖాసాలు"-ఇదికూడ ఒక నౌకరీ ఇనామే. సేనాపతులకు, ఇతర రాజసేవకులకు జీతాలకు బదులుగ ముఖాసా

"ముఖాసా" లివ్వబడుచుండెను. రాజ్యములో మిక్కిలి పలుకుబడి, గౌరవముగల కుటుంబముల కిచ్చినప్పుడు, వారు చేయవలసిన నౌకరీ నామమాత్రముగ ఉండెను. ఒక్కొక్కప్పుడు రాజబంధువులకే ముఖాసా ఇస్తే, ఫలాని నౌకరీ చెయ్యవలెను. షరతు దానపత్రంలో ఖచ్చితముగ ఉండేదికాదు; ఇట్టి సందర్భాలలో ఈ ముఖాసా సదరు రాజ బంధువులు ఊరకే కూర్చుని భోజనం చెయ్యడానికే ఉద్దేశింప బడిన దానముగ ఎంచుకోవలసి వుంటుంది.

ఇచ్చిన పట్టాషరతులను బట్టి ముఖాసాలను మూడు రకాలుగ విభజింపవచ్చును. (1) కట్టుబడి ముఖాసా:—అనగ సర్కారుకు కొంతకట్టుబడి చెల్లించే పద్ధతిని ఇవ్వబడినది (2) రయాయత్ ముఖాసా:—ప్రతిసాలున అయ్యే వ్యవసాయపు విస్తీర్ణమును బట్టి, శిస్తు మార్పుచెందుతూ వుండేవాటికి ఈపేరు. (3) సర్వముఖాసా, లేక దరోబస్తుముఖాసా:— అనగ, ఏవిధమైన నౌకరీచేసే షరతులేని ముఖాసాల కీ పేరు. తంజావూరు రాజ్యాన్ని ఇంగ్లీషు గవర్నమెంటులో కలుపుకున్నప్పుడు, అప్పటి రాజు శరభోజమహారాజుగారికి కొన్ని ప్రయివేటు భూములు పూరా శిస్తు మాఫీతో వదలిపెట్టబడెను. ఆ భూములకుకూడ "ముఖాసా" అనే పేరు తంజావూరు జిల్లాలో వాడబడుచున్నది.

పూర్వపురాజులు తమకు హుషారు పుట్టినప్పుడెల్ల, ఆయా పనులుచేసే వాళ్లకు ఇనాములను శరపరంపరలుగ ఇచ్చివేయు చుండిరి. చూడండి.

అత్తిరు సప్లయి చేసేవాడికి అత్తర్ ఇనామ్; డేగలను ఆడించేవాడికి డేగ ఇనామ్; గొడుగు పట్టేవాడికి గొడుగు ఇనామ్. ఈ రీతిగ గుర్రపువాడికి, జెట్టీ వాడికి, ఖాసావాడికి, కొమ్ము ఊదేవాడికి, నగారావాడికి, పల్లకిమోసే బోయీ వాడికి, భటాభ్రిజుకు, తమలపాకులవాడికి, దర్జీకి, కాళ్లుపిసికే వాడికి, దొమ్మరికి, ఎఱుకలకు - బుడబుడక్కలవాడికి, వాడి కేమిటి పిడికేమిటి అందరికి తలోక పేరుతో తలోక ఇనామ్!

"కళవర్గం" ఇనాములు

దక్షిణాదిని గ్రామంలో పనిపాటలు చేసే వడ్రంగి, కమ్మరి, కుమ్మరి మొదలైన వాళ్లకున్ను, పొరుగూళ్లనుంచి వచ్చి మిరాశీదార్ల భూములను కొంపరరీగా సేద్యం చేస్తూ వుండే పాయకారీలకును, కాపురం ఉండడానికిగాను, కొన్ని నివేశనములు శిస్తు లేకుండ ఇవ్వబడుచుండెను. ఇట్టి వాటికి "కళవర్గం ఇనాములు" అని పేరు. భూమి మాదేనని వాళ్లెవ్వడైనా తగాదా పెట్టకుండ, దానిమీద నామకః కొద్ది అద్దెమాత్రం పుచ్చుకోవడంకూడ కలదు. నౌకరీ చేసినన్నాళ్ళే వాళ్ళు భూమిమీద వుండవచ్చును. తర్వాత ఉండడానికి వీలులేదు.

## (2) పబ్లిక్ నౌకరీ ఇనాములు.

దశబంధం ఇనాములు

ఇవి ఏ ఒక్క రాజుకో, జమీందారుకో సంబంధించిన నౌకరీవి కావు: ఇవి గ్రామాని కంతకు లేక సంఘాని కంతకు సంబంధించిన నౌకరీబాపతు. వీనిలో ప్రధానమైనవి "దశబంధం ఇనాములు" వీటికే తెలుగులో "చెరువుమాన్యము"లనియు, అరవములో

"కట్టుకొడిగ" మాన్యము లనియు పేర్లు. పూర్వము ఎక్కువ సాగుబడి చెరువుల క్రింద వుంటూవుండేది. చెరువులను సరియైన స్థితిలో ఉంచి, అవసరమగు మరమ్మత్తులు ఎప్పటికప్పుడు చేస్తూ వుండడానికి గాను, సదరు చెర్వువుల ఆయుకట్టులలోని భూములలో కొన్నిభూములు ఒకా నొకరికి శిస్తు రాయితీచేసి వుండేవారు. ఇట్టివాటికే "దశబంధం ఇనాము"లను పేరు వచ్చెను. ఏల ననగ వీటికి, మామూలు శిస్తులో పదోవంతు రాయితీ చేస్తూవుండేవారట! శిస్తు రాయితీమాత్రమేగాక, భూమి హక్కుతో సహా ఇవ్వబడిన ఇనాములు ఈ రకంలో గలవు. వాటికి "ఖండదశబంధం ఇనాము"లనియు, ఒక్క శిస్తు రాయితీ మాత్రమే గలవాటికి, "శామిలత్ దశ బంధం ఇనాము"లనియు పేర్లు పెట్టబడెను.

చెర్వులను ఇనాముదార్లు సరియైన స్థితిలో వుంచక పోతే, సదరు ఇనాములను రద్దుపరచే హక్కు సర్కారు ప్రాంతాలలో సర్కారుకున్నూ, జమీ ప్రాంతాలలో జమీందారుకున్ను కలదు.

చెర్వుల మరమ్మతులకై మాత్రమేగాక ఇంకా ఇతర పబ్లిక్ ప్రయోజనాలకై ఇవ్వబడిన పబ్లిక్ నౌకరీ మాన్యాలు ఎన్నో కలవు — వానిలో కొన్నిటిని తెలిసికొందము.

పల్లెవాడిమాన్యం.—కాల్వలు, నదులు, దాటవెయ్యడానికి పల్లెవానికిచ్చిన మాన్యం.

బందెలమాన్యం:—గొడ్లు విచ్చలవిడిగ తిరుగకుండా కాపాడే వానికిచ్చినమాన్యం.

ఉప్పర, లేక వడ్డీమాన్యం:—చెరువులు త్రవ్వి మరమ్మతుచేసే ఉప్పర్లకు, వడ్డెలకుఇచ్చిన మాన్యం.

### (3) గ్రామోద్యోగుల మాన్యములు

గ్రామశిబ్బందిలో కమ్మరికుమ్మరి వగైరాలు గాక, కరణములకు వేరేమాన్యములుంటూవుండేవి. కరణీకం ఎవరైతే చేస్తూవుంటారో, వారి వంశంవారికే మాన్యము పారంపర్యగా వస్తూవుంటుంది. వంశంలో ఎవరూ కరణీకం చెయ్యకపోయినా విద్యావిహీనత వగైరాలవల్ల కరణీకానికి పనికివచ్చే వాళ్లెవళ్లూ ఆ వంశంలో లేకపోయినా, ఆ ఇనాము సదరు వంశం నుంచి తొలగిపోయి, సదరు వుద్యోగానికి నియమింపబడిన ఇంకొక వంశంవారికి చెందుతుంది. 1802 సం॥ నాటికి ఇతర రివిన్యూ సిబ్బంది నంతో తీసివేసినప్పటికీ, కరణీకం ఉద్యోగం మాత్రం అత్యవసర మను తలంపుతో నిలుపుదలచేయుబడె నని చెప్పియుంటిమి. ఇందుకొరకై 29 వ. నెంబరున ప్రత్యేక మొక రెగ్యులేషన్ (కరణాల రెగ్యులేషన్) చేయుబడినట్లున్నూ మనము వెనుకచూచి యున్నాము. దరిమిలా 1894 సం॥లో జమీన్ ఏరియాలకు సంబంధించిన గ్రామ శిబ్బందిని గురించిన్నీ, 1895 సం॥లో రైతువారీ ఏరియాలలోని గ్రామ శిబ్బందిని గురించిన్నీ రెండు చట్టములు (ఆక్టు II ఆఫ్ 1894; ఆక్టు III ఆఫ్ 1895) మద్రాస్ గవర్నమెంటుచే ప్యాస్ చేయ బడెను. వీటి ద్వారా కరణం మునసబులకు గల వంశపారంపర్యపు హక్కులు నిలువపెట్టబడెను. వారసత్వవిషయములు, ఉద్యోగాలు ఇచ్చేహక్కు, తీసివేసేహక్కు ఎప్పుడు ఎవరెవరికి

గలవో అనే అంశములు, మొదలైన లాపాయిం ట్లున్నో ఈ రెండుచట్టాలలో వివరింపబడియున్నవి. వాటిని గురించి తెలిసికోదలచినవారు ఆ చట్టములను చూడవచ్చును.

పూర్వకాలములో కరణాలు వగైరాల కిచ్చిన మాన్య ములు ఎట్లోపోయి, ఇప్పుడువారికి నెలజీతములు ఏర్పాటుచేయ బడెను. ప్రస్తుతము మద్రాస్ రాజధాని మొత్తము మీద వసూలయ్యే 16 కోట్ల రూపాయలలో దాదాపు నాలుగోవంతు గ్రామశిబ్బందీ క్రిందనే ఖర్చయిపోతున్నది. గ్రామాలలో ఎన్నో పోరంబోకలు, బంజర్లు వృథాగా పడియున్నవి. గ్రామశిబ్బందికి పూర్వమువలెనే ఈ బంజరు వగైరాలను ఇనాములుగ ఇచ్చే టట్లయితే, 4, 5 కోట్ల రూపాయలు ఖర్చు తగ్గిపోతుంది. బంజర్లు సాగుబడిలోకి వచ్చి ప్రజల కింత అన్నము, సర్కారుకు ఇంత శిస్తుకూడ వస్తుంది.

### (d) దేవస్థానపు నౌకర్లకు ఇతర ధర్మసంస్థల నౌకర్లకు ఇవ్వబడిన ఇనాములు.

దేవస్థానములు వగైరా సంస్థల పోషణనిమిత్తమై ఇవ్వబడిన ఇనాములుగాక, ఆ యాసంస్థలకు నౌకరీచేయు అర్చకులు, మేళగాళ్లు, దేవదాసీలు (భోగంవాళ్లు) మొద లైనవాళ్లకు కూడ ప్రత్యేకముగ ఇనాములు పూర్వపు ప్రభువులచే ఇవ్వబడెను. ఆ యావ్యక్తులు ఆ యానౌకరీలు చేసినంతకాలమే వారికి ఈ ఇనాములు దక్కును.

నౌకర్ల కిచ్చిన ఇనాము లిట్లు నౌకరీచేసే షరతులకు లోబడినను, సంస్థల కిచ్చిన ఇనాముల కిట్టి నిర్బంధములు లేవు.

సంస్థలపేరిట ఇవ్వబడిన ఇనాములకు ఇనాందారుడు సంస్థయే. ఉదాహరణ:—ఒక దేవాలయానికిచ్చిన ఇనాము విషయములో సదరు దేవాలయములోని విగ్రహమే ఇనాందారుడగుచున్నాడు. విగ్రహం తరఫున మేనేజిమెంటు చెయ్యడానికి ట్రస్టీ ఏర్పడుచున్నాడు. జాయింటుహిందూకుటుంబ మేనేజరుకు ఎట్టి హక్కు బాధ్యతలుగలవో, ఈ ట్రస్టీకికూడ, సంస్థ తాలూకు ఇనాములు వగైరా ఆస్తులపై అట్టి హక్కు బాధ్యతలే గలవు.

## —: "తసదక్" "మోహిసీ" - అల్లవెన్సులు :—

తసదక్, మోహిని అలవెన్సులు

పూర్వపు నవాబులు, రాజులు మశీదులకున్న, దేవాలయములకున్ను పోషణజరిగేనిమిత్తమై తమకు వచ్చేశిస్తు డబ్బులలోనుంచి రొఖ్ఖ రూపముగ కొన్ని అల్లవెన్సుల నిచ్చుచుండిరి. వీటికే, "తసదక్" అల్లవెన్సు లనియు, "మోహిసీ" అల్లవెన్సు లనియు పేరు. బ్రిటిష్‌గవర్నమెంటు వచ్చిన తరువాతకూడ వీటిని సాగించుచునే యుండిరి. ఇటీవల, కొన్ని దేవస్థానములవారు రొఖ్ఖపుశిస్తుకు బదులుగ, శిస్తుమాఫీ భూములు కావలయునని కోరికేసికొనిరి. తక్కినవారు, పూర్వమువలెనే, రొఖ్ఖమును పుచ్చుకొనుచుండిరి. అయితే, ఖజానాకు వెళ్లి అక్కడనుండి ఎప్పటికప్పుడు రొఖ్ఖం తెచ్చుకోవడంకంటె, ఏ వూరిలో వసూలైన సొమ్ము ఆవూరిలోనే, ఆయాదేవస్థానాలకు నేరుగ ఇచ్చివేస్తూ వుండవలసినదని చెప్పి గవర్నమెంటువారు తమ గ్రామోద్యోగులకు ఒక్కసారి ఉత్త

రువుల నిచ్చివేసిరి. ఈ ఉత్తర్వుల ప్రకారము, ఈ సంస్థలకు చెందవలసిన తసతక్, మోహినీ అల్లవెన్నల మొత్తము సర్కారుకు ఇర్సాలగు డౌలు మొత్తమునుండి మినహాయింప బడి మిగతాదిమాత్రమే తాలూకాకచేరికి ఇర్సాలు చేయ బడుచుండును. ఈ పద్ధతికే "జేరీజ్ మినహాయింపు" అని పేరు. అనగ డౌలు జేరీజు నుండి లేక, గ్రామం మొత్తము మీద చెల్లవలసిన వెరశిశిస్తునుండి మినయించే పద్ధతి అని అర్థము.

-: ఇనాములను రద్దుపరచవచ్చునా, ఎప్పుడు, ఎట్లు, ఎవరు? :-

ఇనాములు అనేకరకములని చూచితిమి. వీనిలో నౌకరీ ఇనాములు తప్ప మిగతావి ఏవీ రద్దుపరుప బడేవి కావు; దేవ స్థానాలకు ధర్మసంస్థలకు ఇచ్చినవి. ఆచంద్రార్కము ఉండ వలసినవే. వానిని లాగికొనుట మహాపాతక మని చిరకాలాను గతమైన అభిప్రాయం. ఇంతవరకు ఏ గవర్నమెంటుగాని, హిందూరాజులుగాని, తురక నవాబులుగాని, చివరకు మన ఇంగ్లీషువారుగాని, ఇట్టిపాతకమును ఒడిగట్టు కొనుటకు జంకిరి. ఇక బ్రాహ్మణులయు, పకీర్లయు, ఇతరవ్యక్తులయు ఉదరపోష ణకై, ఇవ్వబడిన ఇనాములుకూడ అట్లే ఎవరుగాని రద్దుపరచి యుండలేదు. అయితే, ఈ వంశములు నిర్వంశముగపోతే, ఈ ఇనాములు సర్కారులో కలియవచ్చును. కాని, ఇటీవల ఇనాంకమీషను వారువచ్చి, వీటిపై క్విట్‌రెంటు కట్టుటద్వారా సర్కారువారు ఆఖరు వారసత్వపు హక్కు ఎప్పుడైతే ఇనాం దార్లు తమ ఇనాములను అమ్ముకోడానికి స్వేచ్ఛవచ్చినదో,

అప్పటినుంచి ఈ ఇనాములు సర్కారులో కలియడానికి అవకాశమే పోయినది. వంశం నిర్వంశం కాకపూర్వమే, ఇనాందార్లు తమ ఇనాములను అమ్మివేసి సొమ్ము చేసుకొనుచున్నారు. కొనుక్కొన్నవారు మామూలుగ క్విట్ రెంటు కట్టుచున్నారు. ~~ఇనాందారులు ఈ ఇనాములపై గవర్నమెంటువారు ఎన్నటికిగాని, ఎవరివల్లగాని క్విట్ రెంటు కట్టించుకుంటారని~~ "కాని చూస్తే ఈ ఇనాములపై గవర్నమెంటుకు ఎప్పటికిగాని, ఎవరివల్లగాని, క్విట్ రెంటు ఆశతప్ప, మృతసష్టంగా ఇవి తమలో కలుస్తయ్యనే ఆశలేదు. ఇక కాగా, ఇనాం కమిషన్ వారు నిర్ణయించిన క్విట్ రెంటుకు" ఒప్పుకొనక, పట్టా పుచ్చుకొనక, నిరాకరించినవారి పర్సనల్ ఇనాములు మాత్రము ఎప్పటికైనా సర్కారులో కలియవచ్చును. అయితే, వంశాలు నిర్వంశం అయ్యేలోగా ఈ వంశస్థులలో ఎవరైనాగాని, ఇప్పటికైనాసరే క్విట్ రెంటు నిర్ణయించుకొని, పట్టా పుచ్చుకుంటే, ఆ ఇనాములు సార్కారులో కలియడం అనేసంగతి రద్దుఅవుతుంది.

నౌకరీ ఇనాములలోకూడ చాలవరకు, సర్వీస్ మరతు తొలగించుకొని, క్విట్ రెంటు ఇచ్చుటకు ఒప్పుకొనుట ద్వారా స్వేచ్ఛను పొందినవే గలవు. ఇవికూడ ఎన్నటికీ రద్దుపడజాలవు. ఇవి ఒకరి చేతినుండి ఇంకొకరికి దానాదమనవిక్రయాదుల ద్వారా నడిచి పోతూవుంటవి. గవర్నమెంటుకు మాత్రము క్విట్ రెంటు వస్తూవుంటుంది. అయితే వడ్రంగి, కమ్మరి, కుమ్మరి వగైరా గ్రామశిబ్బందుల సర్వీస్ ఇనాములన్నియు ఈ రీతిగ, నౌకరీ మరతునుండి విముక్తినొంది, చేతులు మారిపోయినవి. గ్రామసంఘము విచ్ఛిన్నమగుటకు ఇదికూడ ఒక కారణ

మయ్యెను. ఇవి ఉన్నన్నాళ్లు గ్రామసంఘము సర్వసంపూర్ణ స్వరూపముతో నుండెను. కాని, ఇనాందార్ల కెవ్వరైతే ఈ స్వేచ్ఛ ఇవ్వబడినదో, అప్పుడువారు గ్రామసంఘానికి నౌకరీ చేయడం మానివేసి, తమ ఇనాములకు అమ్ముకొని, సొమ్ము చేతిలో వేసికొని, ఎక్కడికో లేచిపోయిరి. లేక ఇతర పనులను చేసుకొనుచుండిరి. ఇక గవర్నమెంటన్ననో, తమకు క్విట్ రెంటు వస్తున్నదిగదా యని సంతోషించుకొనుచుండిరి. వీరి సేవలను కోల్పోయినందువల్ల, మన్య అవస్థపడుచున్నవారు గ్రామస్థులు. చెడిపోయినది గ్రామసంఘము. ఈ రీతిగ, స్వయంసంపూర్ణమైన గ్రామసంస్థ విచ్ఛిన్నమై, ప్రతి చిన్న పనికి ఊరుదాటి వెళ్లవలసివస్తున్నది. గ్రామాలన్నీ పరదేశపు సరుకులతో నిండిపోయినవి. ఇంగ్లీషు గవర్నమెంటుకు కావలసినది ఇదేగా !

గ్రామ స్వపరిపాలనను తిరిగి పునరుద్ధరించవలెనంటే, రాజధానిలో ఇంకను రద్దుకాకుండ నిలిచియున్న ఇట్టి సర్వీస్ ఇనాములను పునరుద్ధరించవలెను. అనగ, ఇనాందార్లు తమ ఇనాములను అన్యాక్రాంతములు చేయరాదనిన్నీ, ఎవరైనా గ్రామానికి నౌకరీ చేయడానికి ఇష్టములేకపోతే వారిని తొలగించి, ఆ ఇనామును ఇట్టినౌకరీ చేయుటకు ఇష్టపడిన ఇంకొకరికి ఇచ్చి గ్రామసంఘానికి వారిచేత ఆ నౌకరీ చేయించవలెననియు, లోగడ 1926 సం॥లో లేటు దండు నారాయణరాజు గారొక బిల్లును ప్రవేశపెట్టిరి. కాని, అప్పటి గవర్నమెంటు గ్రామసంస్థల ప్రాశస్త్యమును గుర్తెరుంగునది కాకపోవటంవల్ల ఆ బిల్లు ప్యాస్ కాలేదు. గ్రామంలో కావలసిన సమస్తపనులు,

గ్రామంలో ఆ యా కర్మకారులచేతనే చేయించి, పరదేశపు వా స్తవ్యులను గ్రామసీమలనుండి తరిమివేసి గ్రామమును ఆర్థికముగ, పారిశ్రామికముగ సర్వసంపూర్ణము చేయువలెనంటే పూర్వపు ఇట్టి సర్వీస్ ఇనాములను తిరిగి పునరుద్ధరించవలసి యున్నది. గ్రామ:సులలోని చేతివృత్తులవారి ఇనాములు మద్రాస్ రాజధానిలో అన్నిచోట్లను ఇంకా పూర్తిగ పోలేదు. తెలుగు జిల్లాలలో, ముఖ్యముగ బళ్లారి, అనంతపుర్ము, కడప కర్నూల్ జిల్లాలలోను, చిత్తూరు జిల్లాలోను ఇవి పూరాగా నిలిచి యున్నవి. కాబట్టి కనీసము ఆంధ్రరాష్ట్రములో నైనను ఈ స్కీమును అమలు జరవడానికి పూరా అవకాశమున్నది. ఇప్పటికైనను గవర్నమెంటు మేల్కొనకపోతే ఇవికూడ అంతర్ధానము కావచ్చును. చేతివృత్తులవారితోపాటు గ్రామకరణం వగైరా ఉద్యోగస్థులకు కూడ రొఖ్కజీతములు మానివేసి పూర్వము వలె ఇనాముల నిచ్చుట మంచి దను సంగతిని ఈ అధ్యాయము లోనే వేరొకచోట చెప్పియే యుంటిమిగద.

ఇనాములను రద్దుచేయడానికి ఎవరికి అధికారము కలదు? అను ప్రశ్నకలదు. ఇనాములు రెండు రకములు. పర్మనెంటు సెటిల్మెంటునాడు వీటిమీద ఎన్నటికైనా రాదగిన పూరా శిస్తు జమీందారీ రాబడిలో చేర్చబడినవి. వీటికే (ఇంక్లూడెడ్ ఇనాము) అంటారు. అట్లు చేర్చబడక విడదీయబడినవి (ఎక్సక్లూడెడ్ యినాములు) అంటారు. ఇట్లు విడదీయ బడినవానిని రద్దుపరచడానికి సర్కారుకు తప్ప ఇంకెవరికీ అధికారము లేదు. ఇక ఎస్టేట్లలో చేర్చబడిన ఇనాములను రద్దుపరచడానికి జమీం

దారులకు హక్కు గలదు. వాటిలోకూడ, వాటిమీద ఎన్నటి కైనా రాతగిన పూరాశిస్తు జమీందారు రాబడి క్రింద 1802 సంవత్సరంనాటు జమకట్టబడి ఉంటేనే, జమీందారుకీ అధికారం వుంటుంది. అట్లుగాక, కొంతశిస్తే, భాగము శిస్తే జమకట్టబడివుంటే, అంతవరకు అతను వసూలు చేసుకోవచ్చును గాని, పూరాశిస్తును వసూలుచేసుకోడానికి వీలులేదు. దివా ణంలోని పనులు చెయ్యడానికి, కాళ్లు గ్రుద్దుటానికి, మొదలైన చిల్లరపర్సనల్ సర్వీసు ఇనాములను రద్దుపరుచుకోడానికి జమీం దారుకే అధికార మిచ్చివేయుబడెను. పర్మనెంటు సెటిల్మెంటు దరిమిలా జమీందారుచే ఏవైనా ఇనాములు ఇవ్వబడియుంటే, అట్టి "దరిమిలా ఇనాములను" రద్దుపరుచుకునే హక్కు జమీం దారుదే.

ఇనాములను రద్దుపరచడం అనగ, వాటిపై పూరాశిస్తు కట్టడమని అర్థము. అంతేకాని, భూమినుండి తొలగించడ మని కాదు. ఈ సారాంశము రెండురకాల ఇనాములకున్ను — అనగ, మేల్వరం హక్కువాటికి, మేల్వరం కుడివరం హక్కుగలవాటికి కూడా వర్తిస్తుంది. రెండుహక్కులు వున్న ఇనాముదారుడు ఇదివరకు తక్కువ శిస్తు చెల్లిస్తూ వుండేవాడు, ఇప్పుడు పూరాశిస్తు చెల్లిస్తూ, మామూలుగ భూమిని సేద్యం చేసుకుంటూనే వుంటాడు. అతనిని భూమినుండి తొలగించ డానికి వీలులేదు. ఏలననగ: ఇనాం ప్రశంసతో సంబంధము లేకుండగానే, రైతుకు భూమిహక్కు సహజంగా వుంటుందిగద.

ఇనాములను రద్దుపరచడ మంటే క్రియకు ఏమిటి?

కాబట్టి, ఇట్టి సహజపు హక్కును తీసివేయడానికి ఇటు సర్కారుకుగాని, జమీందారుకుగాని, అధికారంలేదు. ఇనాందారుడు భూమిని అక్రమంగా ఆక్రమించుకొన్నవాడు కానంతవరకు అతనిని భూమినుండి తొలగించడానికి వీలులేదు. కాబట్టి, ఎటు చూచినను ఇనాములను రద్దుపరచడమంటే, క్రియకు జరిగే సంగతి ఏమిటంటే, సదరు ఇనాముభూములపై పూరాశిస్తు కట్టడ మన్నమాట.

ఇనాములను ఎప్పుడు రద్దుపరచవచ్చును?

ఎప్పుడు ఇనాములను రద్దుపరచవచ్చును? గవర్నమెంటుకు గాని, జమీందారుకుగాని ఎప్పుడు కోపమువస్తే అప్పుడేనా? కాదు, సర్వీస్ ఇనాములలో కూడ రెండురకాలు ఉన్నవనిన్ని వాటిలో ఒకరకం వాటినే రద్దుపరచడానికి అవకాశం ఉన్నదిగాని, రెండోరకంవాటిని రద్దుపరచడానికి వీలు లేదనిన్ని ప్రీవీకౌన్సిలువారు చెప్పిరి.

లోగడ ఒక ఘనకార్యం ఎవరో చేశాడని మెచ్చుకుంటూ దాని ప్రతిఫలంక్రిందనున్న, ఇట్టి ఘనకార్యాన్నే అవసరము పడితే ఇకముందుకూడ అతడుగాని అతని సంతతివారుగాని చేయవలసి వుంటుం దను షరతుతోనున్న, ఒక ఇనాము ఇవ్వబడియుండవచ్చును. కొంతకాలానికి అట్టి కార్యము చేయవలసిన అవసరము; కొన్ని సహజకారణాలచేత, తీరిపోతుం దనుకోండి. అప్పుడు, ఈ కార్యము చేయవలసిన అవసరమే తీరిపోయింది గనుక, ఈ ఇనాములను ఉంచవలసిన అవసరమే లేదనిన్ని, దానిని రద్దుపరచవలసియుండు ననిన్ని చెప్ప

వచ్చునా? అట్లు చెప్పరాదని ప్రీవీకౌన్సిలువారు "ఫోర్బస్ - మీర్ మహమ్మద్ తక్కీ" అనే కేసులో ఖండితముగ తీర్పు చెప్పిరి.

ఆ కేసు చరిత్ర యిది :— పూర్వము ఉత్తరహిందూస్థానములో ఒక పరగణా చుట్టు అడవి వుండేది. అడవిలోనుండి అడవి ఏనుగులు వచ్చి చుట్టుపట్లనున్న పంట చేలన్నీ పాడు చేస్తూవుండేవి. ఒకడు బయలుదేరి ఈ అడవి ఏనుగులన్నిటిని వేటాడి తోలిపారవేసెను. ఇందుకు మెచ్చుకుంటూ, 1775 సం॥లో ఈస్టిండియా కంపెనీ వారొక పూరాశిస్తు మాఫీ జాగీరును అతని కిచ్చిరి. ఇస్తూ, ఇకముందు కూడ అవసరం పడితే ఇట్లే ఏనుగులను తరిమివేస్తూ వుండవలసిన దనిన్నీ, చుట్టూ యింకా కొంత అడవిని ఛేదించి సాగుబడి క్రిందికి తీసుకు రావలసినదనిన్నీ షరతులనుకూడ, సదరు జాగీరు దానపత్రములో ఉదహరించిరి. ఇట్లు కొంతకాలం జరిగింది. వ్యవసాయము వృద్ధి అయినది. అడవి అంతా దాదాపు సేద్యపుభూమి అయింది. ఏనుగులు రావడం మానివేసినవి. అప్పుడు, అనగ 1850 సం॥లో, ఈ జాగీరు ఏ జమీలో ఉన్నదో ఆ జమీందారుడు ఏమి పేచీ పెట్టాడంటే, "ఇప్పుడు ఏనుగులు రావడం లేదు గద, ఆ అవసరం తీరిపోయింది గనుక, ఈ జాగీరు ఉండవలసిన అవసరం కూడ లేదు; దీనిని రద్దు చరుస్తా"నని, ఆ జమీందారుడు బయలుదేరాడు. ప్రీవీ కౌన్సిలువరకు దావా నడిచింది.

ఇట్టి సందర్భాలలో జాగీరును రద్దుపరచడానికి వీలులేదని ప్రీవీకౌన్సిలువారు తీర్పుచెప్పారు.

వారు చెప్పిన పబబు ఏమిటంటే — ఈ జాగీరు ఇక ముందు ఏనుగులను తరిమివేసే ఒక్క షరతుకే లోబడియుండ లేదు. దీనితాలూకు ప్రతిఫలములో అంతకు పూర్వము జాగీరు దారుడు చేసియున్న సేవకూడ చేరియున్నది. అదిన్నీగాక, ఏవైనా సహజకారణాలచేత, ఏనుగులు రావడం మానివేస్తే, అది జాగీరుదారుని తప్పా? ఏనుగులువస్తే, వాటిని ఇప్పటి కైనా సరే తరిమివేయడానికి ఇతడు సిద్ధమే. అవిరాకపోతే ఇత డేమి చేస్తాడు? కాబట్టి, ఈ జాగీరును లాగివేయడానికి ఇతడు చేసిన తప్పేమీ లేదు. ఇతడు ఆ నౌకరీ చేయ ననలేదు. ఇట్టి సందర్భాలలో జాగీరును రద్దుపరచడానికి జమీందారుకు కేవలం హక్కు లేదు. ఈ జాగీరు అతను చేయవలసిన నౌకరీకి కేవలం జీతంగా ఇచ్చినదికాదు. లోగడచేసిన ఒకపనికి బహు మానంగా ఇస్తూ, ఇకముందుకూడ అవసరం పడితే, అట్టిపనే చేస్తూవుండవలసినదిసుమా అని చెప్పి యిచ్చిన జాగీరు.

ఇట్లుగాక, ఒక ఉద్యోగానికి నియామకం చేస్తూ: దానికి జీతంక్రింద ఏ ఇనామైనా ఇచ్చియుంటే, దరిమిలా ఆ ఉద్యోగం రద్దుపడితే, ఆ ఇనాముకూడ రద్దుపడుతుంది. ఇది రెండోరకం ఇనాము.

ఈ రీతిగ రెండురకాల ఇనాములను గురించి, ప్రీవీ కౌన్సిలువారు అరా తీసిరి:—

(1) ఒక కొలువు కోసరమై యివ్వబడిన ఎస్టేటు.

(1) Grant of an Estate burdened with a certain service'' అనియు,

(2) ఒక ఉద్యోగము నిర్వర్తించడానికై ప్రతిఫలముగా అనుభవించడానికి యిచ్చిన భూములు.

(2) Grant of an Office the performance of whose duties are remunerated by the use of certain lands" అనియు,

రెండురకాలుగ ఆరా తీయబడెను. మొదటిదానిని రద్దుపరచడానికి వీలులేదనిన్ని, రెండోదానిని, సర్వీస్ తీరి పోయినప్పుడుగాని, సర్వీసుచేయ నిరాకరించినప్పుడుగాని రద్దు పరచవచ్చుననిన్ని వారు చెప్పిరి.

పూర్వకాలములో అనేక పనుల నిమిత్తమై అనేక ఇనాములు ఇవ్వబడెను. దరిమిలా ఆ పనులయొక్క అవసరమే తీరి పోయినది. ఇట్టివాటిని ఇప్పుడు రద్దుపరచవలెనా అను సమస్య వస్తే, దానిని నిర్ణయించడానికి పైన ప్రీవీకౌన్సిలువారు అడవి ఏనుగుల కేసులో చెప్పినమాటలే ఆధారంగా చేసుకొని, మరీ నిర్ణయించవలసి వుంటుంది. పూర్వము నరసాపురంనుంచి బందరు రావడానికి రోడ్డు ఒకటి కాళీపట్నం మీదుగ వుండేది. ఆ రోడ్డువెంట పోయే జనానికి అన్నంపెట్టడానికిగాను కాళీ పట్నంలో ఒక సత్రంవేసి, దాని పోషణనిమిత్తమై కాంగ్రేగుల వారికి కాళీపట్నం గ్రామములో కొంతభూమి ఇనాముగ ఇవ్వబడెను. ఇప్పుడా బాటలేదు. జనం ఎవ్వరూ ఆ బాటను పోవడంలేదు. అచ్చట సత్రం ఉండవలసినపని లేదు. కాబట్టి ఇప్పుడా ఇనామును రద్దుపరచవలసినదేనా ?

ఇట్లే కైకలూరు తాలూకాలో చింతలపూడి అగ్రహారంకూడ బాటసారులకు అన్నదానం నిమిత్తము ఇవ్వబడిన

దట. ఇప్పుడా వూరికి బాటయే లేదు. చుట్టూ మాగాని. కాల్వలు, బోదెలు, అంతా జలప్రళయం, పంక ప్రళయం. బాటయే లేకపోతే, బాటసార్లేరీ? పైగా, అన్నంకోసం ఆవూరు పోతే ఊబిలో దిగపడవలసినదే! ఇదో బ్రహ్మహత్యకూడాను!! కాబట్టి ఇక అన్నదానం ఏ బాటసారికి చేస్తారు? అందుకని చెప్పి, ఆ అగ్రహారాన్ని కూడ ఊడలాగవలసినదేనా? ఇట్టి సమస్యలన్నీ, అసలు దాన పత్రముయొక్క షరతులను జూచి, ప్రీవీ కౌన్సిలువారు అడవి ఏనుగుల కేసులో చెప్పిన వాక్యాలనుబట్టి, నిర్ణయించవలసివుంటుంది. ఇవీ ఇప్పుడున్న "లా" పాయింట్లు.

ఇనాంకమిషనర్ వారిచ్చిన "టైటిల్‌డీడ్సు" (పట్టాలు) అసలు పూర్వోత్తరపు దానపత్రములలో లేని హక్కుల నేమీ ఇవ్వడంలేదు. అదివున్న వాటిని తీసివేయడంలేదు. ఈ పట్టా అనేది పాతగ్రాంటు రద్దుపరచి, కొత్తగ్రాంటు ఇవ్వడం కాదు. పూర్వము ఉన్న హక్కుబాధ్యతలనే ధ్రువపరుస్తూ వున్నదన్నమాట. అందుకనే యీ పాతగ్రాంటులన్నీ "కన్ఫరం" చేస్తున్నామన్నారు కాని, కొత్తగ ఇప్పుడు ఇనాములు మేము ఇస్తున్నామని ఇనాంకమీషన్ వారుగాని, ఇంగ్లీషు గవర్నమెంటువారు గాని, అనలేదు. కాబట్టి, ఏదైనా తగాదా వస్తే అసలు పూర్వోత్తరపు పట్టా దొరికితే, అదే ఇనాంకమిషనర్ వారి పట్టాకంటె, ఎక్కువ ప్రమాణంగా అంగీకరింపబడుతుంది. అదిన్నీగాక, సదరు ఇనాములలో, పరాయివార

ఇనాంకమిషనర్ వారిచ్చిన పట్టాయొక్క విలువ ఎంతవరకు?

లెవరికైనా (అనగ, రైతులు మొదలగువారి కెవరికైనా ఏవైనా హక్కులు వుంటే అవి రద్దు అయినట్లు కాదు. అవి కూడా మన్నింపబడవలెననియే అర్థము. ఇందుకొరకే 1869 సం॥లో గవర్నమెంటువారొక ప్రత్యేక చట్టమును కూడ చేసి యుండిన సంగతిని లోగడ చెప్పియుంటిమి.

ఇనాం కమిషన్ వారిచ్చిన పట్టా, సదరు ఇనాందారుకు సదరుఇనాము ధ్రువపరుపబడి, క్విట్‌రెంటు కట్టబడినట్లు దాఖలాగా మాత్రం పురానా సాక్ష్యంగా మాత్రం పనికివస్తుంది. అంతే. అంత ఎక్కువ విలువ దానికి లేదు.



313

# రెండవ భాగము

## మూడవ అధ్యాయము

### రైతువారీ పద్ధతి

భూమి పంటలో రాజభాగము జమీందారీ, ఇనాందారీ, రైతువారీ, అనబడు మూడు విధములుగ వసూలు చేయబడు చున్నదని చెప్పితిమి. వానిలో మొదటి రెండు భాగములను గురించి, వెనుకటి రెండు అధ్యాయములలోను వర్ణించి యుంటిమి. ఇక ఈ అధ్యాయములో రైతువారీ పద్ధతిని గురించి వివరించెదము.

ఈ పద్ధతి మదరాసు రాజధానిలో 1792 సం॥లో మైసూరు ప్రభువగు టిప్పుసుల్తాను చే కంపెనీవారికి దత్తము చేయబడిన బారామహల్, సేలం పరగణాలలో కర్నల్ రీడ్ అను వానిచే ప్రవేశపెట్టబడెను. బ్రిటిష్ గవర్నమెంటు రాక పూర్వము "రైతువారీ పద్ధతి" యను పేరుతో కాకపోయినను, ఇంక అనేక పేర్లతో అనేక శిస్తువసూలు పద్ధతులు ఈ రాజధానియందు అమలులో నుండెను. వానిని గూర్చి క్లుప్తముగ తెలిసికొందము.

"అమానీ" పద్ధతి:— ఈ పద్ధతి చిరకాలమునుండి, మదరాసు రాజధానిలో అనేక ప్రాంతములలో అమలులో నుండెను. ఇప్పటికిని కొన్ని జమీనులలో ఈ పద్ధతి నిలచియుండెను. మధ్యకంట్రాక్టరుల ద్వారా

"అమాని"

గాక, సర్కారువారే నేరుగ తమ గ్రామ నౌకర్ల ద్వారా శిస్తు వసూలుచేసే పద్ధతికి ఈపేరు ఉండెను.

ఈ శిస్తు ధాన్యరూపేణా వసూలు పరచబడినప్పుడు, దానికి "ఆసరా" పద్ధతి యనియు, దక్షిణాదిని "వరమ్" పద్ధతి యనియు పేర్లుండెను.

ఈ విధమైన శిస్తు పరిష్కారము గ్రామములో ప్రతి రైతులోను నేరుగ చేసికొనబడుచుండెను. అనగ, నేటి రైతు వారీపద్ధతికిన్ని, అనాటి అమానీపద్ధతికిన్ని అట్టే తేడా లేదన్న మాట.

"అప్పనం" పద్ధతి: ఈపద్ధతి బళ్లారి, కడప, కర్నూల్ జిల్లాలలో అమలులో నుండెను. శిస్తుభారమని ఇచ్చుకోలేక ఏ రైతయినా భూమి విడుదల పెట్టితే, వ్యవసాయం వృద్ధికాదనే తలంపుతో, ఆతడా భూమిని వదలి పెట్టకుండా సాగుచేస్తూనే ఉండేటట్టు ప్రోత్సహించడానికిగాను, అతనికి ఇతరమైన శిస్తురాయితీ భూములను అదనంగా ఇస్తూవుండేవారు. ఇందువల్ల రెండుఫలితములు కలిగేవి. రైతు హెచ్చుశిస్తు భూమిని విడుదలపెట్టకుండా వ్యవసాయం సాగిస్తూనే ఉండడం ఒక లాభము. ఇతరభూమి-ఇదివరకు బంజరుగనున్నది క్రమక్రమంగా సాగులోకి రావడం తద్వారా వ్యవసాయము విస్తీర్ణత పొందడం రెండవలాభము.

"అప్పనం" పద్ధతి

ఈ విధముగ ఒక గ్రామములోని సాగుబడి తగ్గిపోకుండ, ప్రతిసాలున విస్తరిస్తూ వుండేటట్టు చెయ్యాలనే ప్యాటీపురాతన కాలములో గ్రామపటేళ్ళకు, రెడ్లకు ఉంటూఉండేది.

ఎవరైనా శిస్తుహెచ్చని చెప్పి భూమిని విడుదల పెట్టితే దానిని అట్లాగే బంజరుగ ఉండనివ్వకుండ, దాని వ్యవసాయానికి వెంటనే తగు ఏర్పాటు చేసేవిధి గ్రామ కరణాలుది. అత డేమి ఏర్పాటు చేసేవాడు? ఆ రైతునో, ఇంకో రైతునో పిలిచి, "ఈ భూమిశిస్తు హెచ్చనిచెప్పి నీవు వదలిపెట్టవద్దు. దీనికి ముజరాగా, ఇంకొంతభూమిని శిస్తు అసలే లేకుండానో తేలిక శిస్తుతోనో నీకు ఇస్తాను. మొదటిదానిలో భారం, ఇదిగో, ఈ తేలికశిస్తు భూమివల్ల నీకు తీరిపోతుంది" అని నచ్చచెప్పి ఆ రెండురకాల భూములలో అతని చేత వ్యవసాయం చేయించేవాడు. ఈ విధంగా హెచ్చుశిస్తు భూమికి ముజరాగా కొంత తేలిక శిస్తు భూమి ఇవ్వడమనే పద్ధతినే "అప్పనం" పద్ధతి అని పేరువచ్చింది. దీనినిబట్టియే కాబోలు, ఎవరైనా ఏ వస్తువునైనా తేలికగ కాజెయ్యాలని చూస్తూవుంటే "ఏమ్, ఇది అప్పనంగా దొరికిందని కాజెయ్యాలని చూస్తూన్నావా?" అని ఎద్దేవా చేస్తారు.

దిట్టమ్, అమరకం, అతుకుబడి, వీలు:—వీటికన్నిటికీ ఒకటే అర్థము. ఎప్పటికప్పుడు రైతులతో శిస్తు పరిష్కారం చేసుకురావడానికే ఈపేరు. "భూములను అమరక పరచి వచ్చావా? అతుకుబడి చేసుకు వచ్చావా? అని సామాన్యంగా అంటారు. పూర్వము సర్కారు ఉద్యోగస్థులు వచ్చి ప్రతి రైతును పిలిచి, "ఏమయ్యా, నీవు ఈఏడు ఇదిగో ఇన్ని ఎకరాలు సాగుచెయ్యి, ఇంతశిస్తు ఇయ్యి" అని వారిని ప్రోత్సహించి, వారు ఒప్పుకొన్న భూమిపై శాల్యమును, శిస్తును, ఒక లెక్కగ

దిట్టమ్, అమరకం, అతుకుబడి, వీలు

వ్రాసి ఉంచేవారు. దీనికే "దిట్టమ్ చేయడం" అని దక్షిణాది నిస్సీ, అమరకం చెయ్యడం, అతుకుబడి చెయ్యడం, అని తెలుగు ప్రాంతాలల్లోను పేర్లుండెను.

ఒలుంగు పద్ధతి:—ఇది దక్షిణాదిని తంజావూరు, తిరునల్వేలి జిల్లాలలో నుండెను. పంటలో సర్కారుకు చెల్లవలసిన భాగమును అంచనావేసి, దానిని ఒక "నిర్ణీతపుధర" ప్రకారం రొఖ్ఖముగ మార్చి, ఆ రొక్కమును శిస్తుగ తీసుకోవడమనే దానికే "ఒలుంగు"పద్ధతి యని పేరు. ఈ "నిర్ణీతపుధర" గతసంవత్సరములలోగల ధాన్యపు మార్కెట్టురేట్లను బట్టి ప్రతిసాలున తేల్చబడుచుండెను. అయితే, గత సంవత్సరపు "నిర్ణీతపుధరకు" ఈ సాలు మార్కెట్టురేటుకు నూటికి పదిరూపాయల లోవుగ పెంపుదల వుంటే దానిని పాటించనక్కరలేదట. అంతకు పైన, ఎంత పెంపుదలవుంటే, అంత పెంపుదలను నిర్ణీతపు రేటుకు చేర్చి, రొఖపు శిస్తు లెక్క తేల్చెదురు. అట్లే, నూటికి 5 రూపాయలవరకు మార్కెట్టురేటులో తగ్గుదలవుంటే రైతు కేమీ శిస్తు తగ్గదు. అంతకు హెచ్చుగ ఎంత ధర పడిపోతే, అంతటి తేడాను బట్టి రైతుకు శిస్తు మురరా వస్తుంది.

ఒలుంగు పద్ధతి

ఏ సంవత్సరపు రొఖ్ఖపు రేటుతోనైనా రైతుకు అసంతృప్తి కలిగేయెడల, అతను రొఖ్ఖముకు బదులుగ ధాన్యమే ఇచ్చి వేయడానికి కూడ ఈ పద్ధతిలో ఒక ఏర్పాటు వున్నది. ఈ పద్ధతిలో జాయింటు బాధ్యత లేదు. ఏరైతుకు ఆ రైతే విడివిడిగ తన ఇష్టప్రకారము ఏర్పాటు చేసుకోవచ్చును. ఈ రీతిగ, ధాన్యము యొక్క మార్కెట్టురేట్లనుబట్టి, సర్కారుకు

చెల్లే శిస్తురేట్లు కూడ ఏ సాలుకు ఆ సాలున మారుతూ వుండ డానికి ఈ "ఒలుంగు" పద్ధతిలో అవకాశంవుంది. ఈ పద్ధతి మంచిదిగ గన్పట్టుచున్నది. ఏలననగ, ధరలు తగ్గినా శిస్తు తగ్గ కుండా రైతులు, ఇప్పటివలె: బాధపడడ మనేది ఈ పద్ధతిలో తొలగింపబడినది. దీనిని, ఇప్పుడు మన మేల అవలంబింపరాదో సర్కారువారు ప్రజలు ఆలోచించతగును.

"మొటఫసల్" పద్ధతి:— ఇదీ "ఒలుంగు" పద్ధతి ఒక్కటే— అయితే ఒక్క తేడా మాత్రం ఉంది. ఏమంటే, "ఒలుంగు" పద్ధతిలో ధాన్యపు "నిర్ణీతపు ధర" మారుతూ వుండడానికి అవకాశం ఉంది; అట్టి అవకాశం "మొటఫసల్" పద్ధతిలో లేదు. ఒక సారి నిర్ణీతమైన ధర ఎల్లకాలం అట్లే ఉంటుంది. మార్కెటు రేట్లను బట్టి అది మారుతూ ఉండదు.

మొటఫసల్ పద్ధతి

"పతహాక్" పద్ధతి:— హైదరాలీ దండయాత్రలవల్ల తంజావూరు రాజ్యాలలో పాడుపడిన గ్రామాలను తిరిగి సాగు బడిలోకి తేవడానికిగాను, "బావా పండితు"డను మహారాష్ట్ర మంత్రి ఈ పద్ధతిని తంజావూరు రాజ్యములో ప్రవేశపెట్టెను. బాగా చెడిపోయిన వూరును ప్రక్కనే ఉన్న ఇంకొక మంచి ఊరుకు చేర్చి, రెంటికి కలిపి ఒక కంట్రాక్టరు ద్వారా శిస్తు నిర్ణయము చేసుకోడానికే ఈ పేరు వచ్చినది. ఈ రీతిగ రెండు గ్రామాలను 'క్లబ్' చెయ్యడం అనగ కలపడం అనేదానికి "పతకం చెయ్యడ"మని పేరు. ఈ "పతకం" చెయ్యబడిన ఊళ్లను కంట్రాక్టు తీసికొన్న మనిషికి "పతహాక్‌దార్" అని

పేరు. ఈ 'పతవాక్' పద్ధతిలో రైతులకు జాయింటు బాధ్యత ఉండెను. ఈ పద్ధతి 1209 ఫసలీలో రద్దుపరచబడెను.

"పట్టుకట్టు" పద్ధతి:— ఒకరైతు ఒక భూమిని ఒకసారి సాగులోనికి తెచ్చిన తరువాత, దాని నతను విడుదలపెట్ట డానికి వీలులేని పద్ధతి ఇది. ఈ భూమి గిట్టుబాటు కాకపోతే, గిట్టుబాటయ్యే ఇంకా మరికొంత భూమినైనా తీసికొని ఈ నష్టమును దానిలో పూడ్చుకోడానికి ప్రయత్నించవలసినదేగాని మొదటి భూమిని మాత్రం వదలిపెట్టడానికి వీలులేదట! ఇది పైనచెప్పిన అప్పనం పద్ధతిని పోలియున్నది.

తరం భర్తీ పద్ధతి:— ఇదికూడ పై మాదిరిదే. శిస్తు హెచ్చుని భూమిని వదలివేస్తే, ఆ శిస్తు భర్తీ ఇతర తేలిక శిస్తు భూములమీద వేసి పుచ్చుకునేవారట!

'వీసబడి' పద్ధతి:—ఇది తెలుగు జిల్లాలలో అమలునందుండెను. సర్కారువారు గ్రామమంతటికి శిస్తు నిర్ణయించేవారు. ఆ శిస్తును చెల్లించడానికి రైతులందరు జాయంటుగ ఒడంబడేవారు. పిమ్మట రైతులందరు ఒక మీటింగుపెట్టుకొని, నేనింతభూమి తీసుకుంటాను, నేనింతభూమి తీసుకుంటాను అని వాటాలు వేసుకునేవారు. భూములయొక్క మెరుగు తరుగులనుబట్టి వాటాలు వేసి, చీట్లువేసుకుని వాటాలుపట్టుకునేవారు. అవసరాన్నిబట్టి, రెండేసి మూడేసి ఏండ్లకు ఒక్కొక్కసారి కొత్తవాటాలు వేసుకోవడం, చీట్లు పట్టుకోవడం జరుగుతూవుండేది. వాటాలను

"వీసబడి పద్ధతి"

బట్టిరేయే, శిస్తుకూడ విభాగించుకునేవారు. ఈ విధంగా వేసుకోబడిన వాటాలు * వీసముల'' వెంబడి వుండేవి.

రైతుకు ఉండే ఎడ్లు, గొడ్లు, మనిషివాంగునుబట్టి నాకిన్ని వీసాల భూమి కావాలనో, నాకిన్ని వీసాలశిస్తు వెయ్యండనో చెప్పి, తీసుకునేవారు. రైతులలో రైతులిట్లు వీసాలవెంబడి భూమిని శిస్తును పంచుకున్నప్పటికి, సర్కారుకు మాత్రం అందరు జాయింటు బాధ్యతే. ఎవరైనా, "నావాటా మీద హెచ్చుశిస్తు వేశా''రని గొణుక్కుంటే, రెండోవాడు వచ్చి, నీకు హెచ్చనితోస్తే వదలివేసెయ్యి. దానిని నేను తీసుకుంటాను. నా తక్కువ శిస్తుది నీవు తీసుకో'' అని సవాళ్లు చేస్తాడు. ఈ విధంగా రైతులలో రైతులు చక్కగ వాటాలు వేసుకొని, సేద్యంచేస్తూ, శిస్తు చెల్లిస్తూ వుండేవారు. ఆనాటి ఐకమత్యం నే డేది? ఈరీతిగ, వీసముల పద్ధతిని భూమిని శిస్తును పంచుకుని, ఉమ్మడి వ్యవసాయం చేసుకునే పద్ధతికి "వీసబడి పద్ధతి" యనియు, అట్టి గ్రామాలకు "వీసబడి గ్రామా''లనియు పేరు.

'గజము' అనే కొలమానము ఇప్పుడెట్లా అమలులో నున్నదో, అట్లే పూర్వము దక్షిణాదిని "వీసబడి వీసమ్" అని కొలమానము ఉండెను. దానిమీద 16 గీట్లు ఉండేవి. ఒక్కొక్కగీటు దగ్గరకు ఒక్కొక్కవీసమ్ లెక్క. ఇట్టి కొలమాన

* వీసమనగ $\frac{1}{16}$ పదహారవవంతు అని అర్థము. ఇప్పుడు పదవవంతును ($\frac{1}{10}$) డెసిమల్'' అంటూ వున్నట్లుగానే, పదహారవవంతును "వీసమ్'' అంటూ వుండేవారు. ఇన్ని డెసిమల్ పాయింట్లు అన్నట్లే, ఇన్ని వీసాలు అంటారు.

ముతో భూములను కొలిచి, ఏభూమికి ఆభూమికి వేర్వేరుగ శిస్తు కట్టేవారు, ఈ ప్రకారం "వీసబడి వీసముతో" కొలిచి శిస్తు కట్టబడిన గ్రామాలకుకూడ "వీసబడి గ్రామా"లను పేరు వాడుకలోనికి వచ్చెను. ఇది దాదాపు రైతువారీ పద్ధతిని పోలియున్నది.

—♦ హిందూరాజుల రివిన్యూ పద్ధతి - షష్ఠభాగము ♦—

పూర్వము హిందూరాజులు భూమిపై ఎట్టి శిస్తురేట్లను విధించిరో చూతము. సాధారణ పరిస్థితులలో నైతే, పండిన పంటలో ఆరవవంతు (షష్ఠభాగము) కంటె ఎక్కువ తీసికో రాదనిన్నీ, యుద్ధములు, దండయాత్రలు వగైరా ఉపద్రవ సమయములలోనైతే నాలుగో వంతు వరకు కూడ తీసికోవచ్చు ననిన్నీ హిందూధర్మశాస్త్రములు చెప్పుచున్నవి. శిస్తు చాల వరకు ధాన్యరూపేణా చెల్లుచుండెడిది. పూర్వము పంట భూముల మీదనే పన్ను పుచ్చుకునేవారుగాని, అడవులు, బీళ్లు, వగైరాలమీద పన్నుపుచ్చుకోకుండ వాటిని ప్రజలకు స్వేచ్ఛగ వదలివేసేవారనిన్నీ కూడ తెలియుచున్నది. అడవుల మేతకు పుల్లరు లని, చేపలు పట్టుకున్నందుకు కట్టెలు కొట్టు కొన్నందుకు, ఆకు ఏరుకొన్నందుకు ఇంకా ఎన్నెన్నో వాటికి రుసుములని పుచ్చుకోవడం దరిమిలా ప్రబలిన ఆచారమని కూడ తెలియుచున్నది. రైతుశిస్తు ఇవ్వాకపోతే, అతనిని భూమి నుండి వెళ్ళగొట్టడమనేది పూర్వము ఉండేదికాదట. అతని చెంబు తప్పేలా వగైరా చరాస్తిని జప్తుచేయడమో, లేక వంగో బెట్టి బండలెత్తడం, బండకొయ్యలు వెయ్యడం వగైరా శరీర

బాధలు పెట్టడమూ జరిగించే వారట. భూములను కొలిచి సర్వే చేయడంకూడ పూర్వము ఉండేది. దక్షిణాదిని చోళరాజ్యములో దొరికిన శాసనాలనుబట్టి చూస్తే చాలా సూక్ష్మమైన కొలతలుకూడ వారు కొలిచేవారని తెలియగలదు.

మెట్టతీర్వ:—మెట్టభూములకు "పుంజ" అనియు, "కుష్కీ"అనియు పేర్లు. ఇవన్నీ మానవ నిర్మిత జలాధారముల వల్లగాక, కేవలము వర్షాధారమువల్ల పండే భూములు. వీటికే "మానవారీ" భూములని దక్షిణాదిని అంటారు. మెట్టభూముల మీద ఒకటినుసుపంటగాక, అనేక రకముల పంటలు పండుచుండుటచే పంటనుబట్టి శిస్తు పుచ్చుకోవడం సర్కారుకు వెసులుబాటు కాదుగనుక, మెట్ట భూములపై రొఖ్ఖపు రేట్లే అమలులో నున్నట్లు తెలియుచున్నది. ఈరొఖ్ఖపురేట్లకే "తీర్వ" "కందాయము" "స్వర్ణాదాయము" అని పేర్లు వచ్చినవి. ఈ రొఖ్ఖపురేటు రెండు విధాలు. (1) పండిన పంటరకముతో నిమిత్తము లేకుండ, నేల యొక్క సారాసారములుబట్టి శిస్తు నిర్ణయించడం. భూసార స్వభావములనుబట్టి, భూమి కొన్ని తరగతులుగ, అనగ తరములుగ - విభజింపబడి, ఒక్కొక్క తరమునకు ఒక్కొక రేటు విధింపబడెను. దీనికే "తరమురేటు" అనెదరు. ఈ శిస్తు భూమిమీద కట్టబడినదిగాని, పంటమీద కట్టబడలేదు. ఇక, (2) భూ స్వభావముతో నిమిత్తంలేకుండ, పంట స్వభావమును బట్టి వేసేశిస్తు "పైరువారీరేటు" లేక "దసను తీర్వ" అని అనుచుండిరి. ఈ పన్ను పంటమీద వేయబడుచున్నదిగాని, భూమిమీద వేయడం లేదన్నమాట.

మానవ నిర్మితమగు చెర్వులు, కాల్వలు, బావులు, వగైరా జలాధారములవల్ల సాగుబడియగు వాటికి "పల్లపు భూము"లనియు "నంజ", "మాగాని," "తరి" భూములనియు వేర్వేరు ప్రాంతాలలో వేర్వేరు పేర్లు. వీటిమీద పన్ను రొఖ్ఖరూపము గాకుండ, పంటలో భాగముగ పూర్వకాలము తీసికొనబడుచుండెను.

పల్లపు మెట్ట

సర్కారుకు చేరవలసిన పంటభాగ నిర్ణయము రెండు విధాల జరిగేది : (1) పండినపంట యావత్తు కోసి, కళ్లము మీదవేసి, నూర్చి రాశిపోసేవారు. ఏవో మామూలు ఖర్చులకు కొంత మినహాయించి, మిగతాది సర్కారున్ను, రైతున్ను నిర్ణయప్రకారము పంచుకునేవారు. దీనికే "వరం" లేక "కైలుపద్ధతి" అని పేరు.

"వరం" లేక "కైలు పద్ధతి"

(2) అంచనాపద్ధతి:— ఇది మరల రెండు రకాలు (a) గ్రామపెద్దలను కొందరిని చేను దగ్గరకు తీసికొనిపోయి, నిలువుపంటను చూపించి, "ఇది ఇంత అవుతుంది" అని ఎస్టిమేషను వేయడం. రైతు కిది తృప్తికరముగ లేకపోతే, ఇంకా మరికొందరి చేతగాని, పొరుగూరి పెద్ద మనుష్యులచేతగాని, మరల ఎస్టిమేషను వేయించుకోవచ్చును. నిలువుపంటను కంటితో చూడగానే, "ఇది ఇంత ధాన్యమౌతుం"దని సరిగ్గా లెక్క చెప్ప నేర్పరులు, ప్రవీణులు ఎందరో పూర్వము ఉండిరి. ఇప్పుడును కలరు. (b) చేనిలో కొంతమేర

"అంచనా పద్ధతి"

కంటితో చూచి అంచనా వేయడం

"కులిశోధన" పద్ధతి

పంటకోయించి, నూర్చి, చూచి ఆ దామాషాను మొత్తము చేనుమీద ఎంతపంట తేలుతుందో లెక్కకట్టడం. దీనికే దక్షిణాదిని "కులిశోధన" అనెదరు.

ఈ విధముగ పంటమొత్తమును తేల్చి దానిలో రాజ భాగం తీసికోవడం పూర్వము జరుగుచుండేది. రాజభాగము తీరేవరకు రైతు ధాన్యాన్ని ఇంటికి తీసికొనిపోవడానికి హక్కు లేదు. పంటమీద రాజుకు "ఫస్టుచార్జి" వుండేదన్నమాట. కళ్లములోని ధాన్యపురాశినుండి రైతుగాని, ఇతరులుగాని దొంగిలించకుండ ఉండడానికిగాను, సర్కారు ఉద్యోగులు వచ్చి, ధాన్యం కొలిపించుకునే వరకు, ఆ రాశిచుట్టు వెడల్పుగ ముల్తానువలె మట్టితో మందముగ పూసి, ఆ మెత్తని మన్నుమీద, అక్షరాలు గల కొయ్య బల్లతో ముద్రలు గుద్దేవారు. రాశిని ఏ మాత్రం కదిలించినా ముద్రలు చెరిగి; దొంగతనం బయటపడేది. ఇట్టి దొంగతనాలు జరగకుండ, ఈ ఉపాయం అవలంబింపబడుతూ వుండేది. ఇప్పటికిని ఆనరా వగైరా పంట భాగపు పద్ధతులు గలచోట్ల ఈ ఉపాయం అవలంబింపబడుతూ వున్నది.

"బీజవారీ" పద్ధతి

"బీజవారీ"శిస్తు:— ఒక భూమిలో పంట పండడానికి ఎన్ని విత్తనాలు (బీజములు) కావలసివస్తవో, ఆ లెక్కను బట్టి, రొఖ్ఖపుశిస్తు నిర్ణయించడానికి "బీజవారీ" పద్ధతి అనిపేరు. ఇది విజయనగర ప్రభువగు హరిహరరాయలవారి కాలములో దక్షిణకన్నడ జిల్లాలో అవలంబింపబడెను.

తాత్కాలికావసరములను బట్టి, ఏవో అదనపుపన్నులు

విధించుచు వచ్చినప్పటికి మొత్తముమీద పూర్వపు హిందూ ప్రభు లెవరును ఇండియాలో ఎక్కడగాని, షష్ఠభాగము కంటె హెచ్చు శిస్తును రైతునుండి తీసికోలేదని మనకు "ఎయిని అక్బరీ" మొదలైన ఇటీవలి గ్రంథప్రమాణాలను బట్టికూడ తెలియుచున్నది.

## మహమ్మదీయ పాలనలో మార్పు

ఇక, మహమ్మదీయ పరిపాలనసంగతి చూద్దాము. టర్కీ, ఇరాన్, తురాన్ మొదలైన తురకరాజ్యాలలో శిస్తు 5 వ వంతు, 6 వ వంతు 10 వ వంతు చొప్పున ఉండేది. కాని తురాన్, ఇరాన్ రాజ్యాలలో దరిమిలా వచ్చిన నిరంకుశ ప్రభువులు పంటలో సగము వరకు హెచ్చించిరి. ఈ హెచ్చు శిస్తునే (అనగా పంటలో సగమునే) ఇండియాలోకూడ మహమ్మదీయులు అవలంబింపసాగిరి. ఇదిగాక, వారి రాజ్యము విస్తీర్ణత నొందినకొలది, ధాన్యరూపేణా పన్నులిచ్చుకోవడం వీలుగాక, రొక్కపు రేట్లుగ శిస్తు పుచ్చుకొనసాగిరి. ఇట్లు చేసినవారిలో ముఖ్యులు * షేర్ఖాన్ సలీమ్ఖాను లనబడు

* 1539 సం॥లో బక్సార్ యుద్ధములో మొగల్ బాదుషాయగు హుమాయూన్‌ను ఓడించి, దేశమునుండి తరుమగొట్టి, ఢిల్లీ సింహాసనము నాక్రమించుకొని, "షర్ షా" అను బిరుదుతో "సూర్" రాజవంశమును స్థాపించి ప్రజాహిత దక్షుడని చరిత్రలో గొప్ప ప్రఖ్యాతి పొందినదితడే. ఇతనికొడుకే "సలీమ్ఖానుడు". ఈ "సూర్" రాజవంశము 16 సంవత్సరములు మాత్రము ఢిల్లీరాజ్య మేలెను. తదుపరి, హుమాయూనుడు అజ్ఞాతమునుండి గొప్పబలముతో బయటికి వచ్చి, అప్పుడు ఢిల్లీలో రాజ్యము చేయుచుండిన మహమ్మద్ సారా యను నతనిని 1555 సం॥లో రెండవపాని పట్టు యుద్ధములో ఓడించి, ఢిల్లీలో మొగల్ రాజ్యమును పునఃస్థాపితము చేసెను. హుమాయూన్ కొడుకే అక్బరు చక్రవర్తి.

వారు. వీరిపద్ధతినే, దరిమిలా 1572-1593 సం॥లమధ్య అక్బరు చక్రవర్తి 'తోడర్ మల్' అను సుప్రసిద్ధ రాజపుత్ర సేనాపతియు మంత్రియు నైన వానిద్వారా కొనసాగించెను.

ఇండియాలో మొట్టమొదటగ రూపాయి నాణెమును ముద్రింపించినది ఈ షేర్ ఖానుడే. అయితే వీరు శిస్తును పంటలో నాల్గవవంతుగ తగ్గించిరి.

—♦ తోడర్ మాల్ రివిన్యూ పద్ధతి ♦—

తోడర్ మల్ చేసిన పని యిది:—

అదివరకు ఇండియాలో ఆయా ప్రాంతాలలోనున్న నానారకపు కొలమానముల నన్నింటిని రద్దుపరచి, ఒకే కొలమానమును నిర్ధారణ పరచెను. ఈ కొలమాన ప్రకారము భూములను కొలిపించి, సర్వేచేయించెను. అదివరకున్న నానావిధ నిరంకుశపు పన్నులన్నింటిని రద్దుపరిపించెను. దేశమునంతను ఒక్కొక్క కోటి 'దాము'ల శిస్తు (అనగ, 2½ లక్షల రూపాయల శిస్తు) చెల్లేఖండాలుగ, విడగొట్టించి ఒక్కొక్క ఖండమునుమీద ఒక్కొక్క "కోరీని" శిస్తువసూలు పనికై నియమించెను. 'కోరి'లనబడు ఈ ఉద్యోగులే దరిమిలా జమీందార్లుగ మారిరని లోగడ చెప్పియుంటిమి. భూములు నాలుగు రకాలుగ విభజింపబడెను. (1) "పులెజ్" అనగ ప్రతిసాలున పంట పండేవి - ఎన్నడు బంజరుగ వుండనివి. (2) "పెరాటి":— బలాన్ని పుంజుకోడానికిగాను, అప్పుడప్పుడు తాత్కాలికముగ

తోడర్ మాల్ పద్ధతి

పైరు వెయ్యకుండ ఖాళీగా ఉంచేవి. (3) చెంచర్:— మూడునాలుగేండ్లు వరుసగ బంజరుగ వుండినవి. (4) బంజర్:- అయిదేండ్లకున్ను అంతకు ఎక్కువ కాలమున్ను సాగులేక ఖాళీగ వదలి వేయబడినవి. మొదటి రెండురకాలభూములలో మెరుగు తరుగు భూములమీద నగటు పంట చూచి, దానిలో మూడవవంతు రాజభాగముగ నిర్ణయించబడెను. దానికి ఒక మారకం రేటు ప్రకారం రొఖ్ఖపుధర కట్టేవారు. ఇందుకొరకై గత 19 ఏండ్లలో ధాన్యపు మార్కెట్టురేట్లు ఎట్లా వుండేవో చూచి, వాటిమీద ఒక నగటురేటు (ఏవరేజిరేటు) నిర్ణయింపబడేది. ఈ నిర్ణీతపు రేటు ప్రకారం రొఖ్ఖపుశిస్తు తేల్చబడేది. అయితే ప్రతి రైతు యీ ప్రకారం రొఖ్ఖపు శిస్తే యిచ్చితీరవలె నను నిర్బంధము లేదు. అది రైతు ఇష్టము. ఏరైతైనా రొఖ్ఖపు శిస్తు ఇచ్చుకోలేకపోతేగాని, సదరురేటు హెచ్చుగ వున్నదని అతనికి తోస్తేగాని, అతనివల్ల ధాన్యమే పుచ్చుకోడానికి గవర్నమెంటు కేమిన్నీ ఆక్షేపణ ఉండేదికాదు.

ఈ విధముగ సెటిల్మెంటు మొదట ఏక్సాలాపద్ధతిని చేయబడెను. తరువాత దస్సాలాకు చేయబడెను. కొలతలు ఇతర లెక్కలు జాగ్రత్తగ ప్రతిగ్రామమునకు రికార్డుచేసి యుంచబడెను. శిస్తు కంట్రాక్టు పద్ధతి రద్దుపరుపబడెను. ప్రతి రైతుతోను విడివిడిగ శిస్తు ఫైసలా చేసుకోబడెను. కాని, గ్రామమంతటిమీద రావలసిన మొత్తము శిస్తులకు అందరిమీద ఉమ్మడి బాధ్యత మాత్రం అట్టే ఉంచబడెను. గ్రామవ్యవహారా లన్నిటిని గ్రామస్థులే ఉమ్మడిగ పరిష్కారం చేసుకునేవారు. బంజర్లను వారిలో వారే పంచుకొని సాగులోకి

తెచ్చుకొనేవారు. ఈ అధికారము గ్రామస్థులకే వదలివేయ బడెను. శిస్తుమాఫీభూములు (అనగా ఇనాములు) వేరుగ నమోదు చేయబడెను. దొంగతనముగ సంపాదింపబడిన ఇనాములు రద్దుపరుపబడెను. అతివృష్టి అనావృష్టులవల్ల పంటలు నష్టమైతే, రిమిషనులు ఇచ్చేవారు. శిస్తు చెల్లించకపోతే భూమి వేలంవేసేవారు కారు. కాని, చరాస్తి జప్తులవల్లను, బందికొయ్యలు వగైరాలవల్ల మనుష్యులను నిర్బంధించుట మూలముగను, రివిన్యూ వసూలు చేసేవారు. సాగుబడి అభివృద్ధి కావడానికి గాను, సర్కారువారు సర్వవిధాలా ప్రయత్నించేవారు. ఎవరుగాని భూమిని బంజరుగ వదలివేసి పోవడానికి సర్కారువారు అంగీకరించేవారుకారు. అట్టివరైనా భూమిని బంజరుగ వదలిపెట్టితే, ఆ భూమిని ఆ రైతునుండి లాగికొని, ఇంకొకరైతుకు ఇచ్చి వేసే అధికారాన్ని సర్కారువారు తమ చేతులలో అట్టే ఉంచుకొనిరి.

అసల్ తుమార్ జమ్మా

ఈరీతిగ తోడర్‌మాల్‌చే ప్రవేశపెట్టబడిన రివిన్యూ పద్ధతికి "అసల్ తుమార్ జమ్మా" అనిపేరు. దరిమిలా దానికి చేర్చబడిన పన్ను "అబ్‌వాబ్" లనేవారు.

ఈరీతిగ సాగుబడి విస్తరించి, జనసంఖ్య హెచ్చినకొద్ది, సర్కారుకుకూడా హెచ్చురాబడి వచ్చే ఉపాయము ఈతోడర్‌మాల్ ఏర్పరచిన పద్ధతిలో గలదు. సాగుబడి విస్తరించినందువల్ల సర్కారుకు హెచ్చుశిస్తు రావడమేగాని, మొదటగ రైతుమీద విధింపబడిన రేట్లు మాత్రము ఎన్నడూ హెచ్చేవికావు. అవి ఒక్కసారే శాశ్వతముగ నిర్ణయింపబడి యుండెను.

తోడర్‌మాల్ పద్ధతియే తరువాత దక్షిణదేశములో మంత్రి మాలిక్కాంబర్ చేతనున్నూ, శివాజీ ప్రభువు చేతనున్నూ, ప్రవేశ పెట్టబడెను.

—బ్రిటిష్ గవర్నమెంటు హయాము—

బ్రిటిష్ గవర్నమెంటు వచ్చిన మొదటిరోజులలో వారు పడిన తికమకలు దరిమిలా జమీందార్ల ద్వారా ఏర్పరుచు కొన్న పర్మనెంటు సెటిల్‌మెంటులు మున్నగు వానిని గురించి లోగడ అధ్యాయములలో తెలిసికొనియున్నాము. కొంత కాలానికి పర్మనెంటు సెటిల్‌మెంటు సీమ డైరెక్టర్లకు అయిష్టమయ్యెను. దాని నికమీద చెయ్యవద్దని వారు 1814 సం॥లో హుకుములబంపిరి. ఇట్లుండగ, క్రొత్తక్రొత్త ప్రదేశాలు కంపెనీ వారికి వచ్చి కలియుచుండెను. ఈ క్రొత్త ప్రదేశాలలోనున్న, ఇంకా సెటిల్‌మెంటులు కాని ఇతర ప్రదేశాలలోనున్న ఏ విధముగ శిస్తుఫైసలా చేసుకోవలెనను సమస్య కంపెనీవారిని ఎప్పటికప్పుడు ఎదుర్కొనుచుండెను.

ఈ సమస్యను పరిష్కరించుకొనుటకై వారికి తోచిన పద్ధతులలో ప్రధానమైనది గ్రామవారీ లేక (మౌజావారీ) సెటిల్‌మెంటు.

దీనికే "క్రోష్టగుత్త", "ముస్తజారీ" పద్ధతు లని కూడ పేరు. గవర్నమెంటు ఆఫీసర్లు పోయి గ్రామపెద్దల నందరిని

"గ్రామవారీ సెటిల్‌మెంటు" ఒక పెద్ద చెట్టునీడకో, గ్రామ చావడిలోనికో, దేవాలయానికో పిలిచి, గ్రామమంతటి మీది ఒకే మొత్తమును వీరి ద్వారా నిర్ణయించుకొనేవారు. దరి

మిలా ఈ గ్రామపు పెత్తనదార్లు మిగతా రైతులందరితో సంప్రదించి భూమినిన్నీ, శిస్తునున్నూ, వంతులుగ పంచుకొనేవారు. ఈ లోతప్సీలు ఏర్పాటుతో సర్కారుకు పని లేదు. గ్రామం మీద సర్కారుకు చెల్లవలసిన మొత్తం శిస్తుకు రైతులందరు జాయింటుగా జబాబుదారీ. ఇది దాదాపు పూర్వపు "మిరాశీ" పద్ధతిని పోలియున్నది. ఈ విధమగు గ్రామవారీ పద్ధతిని క్రమ క్రమంగా పర్మనెంటు చేయవలెనని రివిన్యూ బోర్డువారి యొక్కయు, మద్రాస్ గవర్నమెంటు యొక్కయు సంకల్పమై యుండెను. ఈ సంకల్పముతో మద్రాస్ గవర్నమెంటువారు మూడేండ్ల కొరకు ఏర్పాటు (తీన్‌సాలా సెటిల్‌మెంటు) చేస్తూ, "మీరు గనుక అంగీకరించే పక్షములో, దీనినే పర్మనెంటు చేస్తాము" అని చెప్పి, సీమ డైరెక్టర్లకు తెలిపిరి. వీరు మూడేండ్ల ఏర్పాటును అంగీకరిస్తూ, "ముందుగ మా పర్మిషన్ లేనిది మాత్రం దీనిని పర్మనెంటు చేయవద్దు" అనిరి. దరిమిలా, 1812 సం॥లో ఏమని హుకుముల పంపినారంటే, ఇదివరకు సెటిల్‌మెంటు కాకుండ ఉన్నచోట్ల ఇంతటినుండి రైతువారీ సెటిల్‌మెంటే చేయవలెనుగాని, ఇంకో రకం సెటిల్‌మెంటు చేయవద్దు. లోగడ ఏ రకంమీదనైనా సెటిల్‌మెంటు జరిగివుంటే, దాని కాలపరిమితి తీరిపోగానే ఆ చోటకూడ రైతువారీ సెటిల్‌మెంటే చేయవలెను"—ఈ ఉత్తర్వులబంపిరి. కాని ఈ ఉత్తర్వులు మద్రాస్ చేరేటప్పటికి ఆలస్యమైనది. లోగడ చేసిన తీన్‌సాలా సెటిల్‌మెంటు కాలపరిమితి తీరిపోగానే మద్రాస్ గవర్నమెంటువారు పదేండ్ల (దస్‌సాలా)

సెటిల్ మెంటు చేసివేసిరి. ఇందుకు సీమ డైరెక్టర్లకు కోపము వచ్చెను. "మాతో చెప్పకుండ తొందరపడి మీ రెందుకు ఇట్లా చేశారు" అని వారు గొణుగుకొని ఊరుకొనిరి. పిమ్మట సర్ థామస్‌మన్రో ఇంగ్లండు వెళ్లడం తటస్థించినది. అతని పట్టుదలవల్ల సీమడైరెక్టర్లు గ్రామవారీ సెటిల్‌మెంటును పూరాగా రద్దుపరుస్తూ, ఇకనుండి రైతువారీ సెటిల్‌మెంట్లు తప్ప, ఇంకో విధంగా చేయరా దని గట్టిగ నిషేధపు ఉత్తర్వులను 1817 సం॥లో జారీ చేసిరి.

—కర్నల్ రీడ్-బారామహల్ సెటిల్‌మెంటు—

కర్నల్ రీడ్-బారామహల్ సెటిల్‌మెంటు

మన్రో మొదటగ నిర్వచించిన రైతువారీ సెటిల్‌మెంటు ఎట్టిదో తెలిసికొనుట అవసరము. అతడు మొదట చెప్పినదానికిని, దరిమిలా గవర్నమెంటు అవలంబించిన దానికిన్నీ, చాలా తేడా వున్నది.

టిప్పుసుల్తాన్‌వల్ల ఇంగ్లీషు కంపెనీవారికి సేలం, బారామహల్ పరగణాలు 1792 సం॥లో సంక్రమించెను. ఈ జిల్లాల మీద శిస్తు ఫైసలా చేసుకురావలసిన దని చెప్పి, అప్పుడు గవర్నర్ జనరల్‌గ నున్న కారన్‌వాలీస్ అనుసతడు "కర్నల్ రీడ్" అనే సైనికోద్యోగిని పంపించెను. అప్పటికి ఇంగ్లీషువారు జయించుకొన్న ఇతరప్రాంతాలలో అమలులో నున్న పద్ధతి పర్మనెంటు సెటిల్‌మెంటు పద్ధతియే. దీనినే కర్నల్ రీడ్ ఈ జిల్లాలలో కూడ అనుసరిస్తా డని అందరు ఉద్దేశపడిరి. కాని, ఈ దేశపు రివిన్యూ పరిస్థితులు తుపాకికట్టి పుచ్చుకొని యుద్ధరంగంలో తిరిగే ఈ పరదేశపు సిపాయిగారి కేమి తెలుస్తుంది?

అదిగాక, ఏ విధముగ శిస్తు పైసలా చెయ్యాలో పై అధికారుల నుండి అతని కేమీా ఖచ్చితమగు సలహాలు కూడ లేకపోయెను. అందుచేత ఏ విధంగా చేస్తే ఏమివస్తుందో అనే జంకుచేత, ఇతడు ఏ విధమైన ఖాయపు సెటిల్ మెంటు చెయ్యకుండ అప్పుడు భూమిని సేద్యముచేయు చున్నవారితో సరాసరి ఏవో తాత్కాలికపు ఏర్పాటును చేసుకొనివచ్చెను. దీనికే దరిమిలా "రైతు వారీ", లేక "కుల్ వారీ" సెటిల్ మెంటని పేరు వచ్చెను.

కర్నల్ రీడ్ అవలంబించిన పద్ధతి ఏమిటంటే:— గ్రామములో ప్రతి రైతుకు గల భూమిని కొలిచి, ఆ భూమియొక్క సారాసారములనుబట్టి, ప్రతిపొలానికి శిస్తు నిర్ణయించడం.

"కర్నల్ రీడ్" అవలంబించిన రైతువారీ పద్ధతి యొక్క లక్షణాలు

ఇదివరకు గ్రామలెక్కలలో నమోదై యుండిన అంకెలను బట్టిన్నీ, రైతులు చెప్పిన మాటలను బట్టిన్నీ, సర్వేయందు భూమిమీాద కనబడిన మొక్కలు, మోళ్లనుబట్టిన్నీ "ఈ పొలము మీాద ఇంతకు మించనిశిస్తు చెల్లుతుంది" అని ఒక అంకెను నిర్ధారణ పరచడం. ధాన్యరూపేణ చెల్లుబడియగు చుండిన చోట్ల సదరు ధాన్యానికి రొఖ్ఖపు విలువకట్టడం- ఇట్లు నిర్ణయింపబడిన అంకె ఇంకా ఇతర కారణాలనుబట్టి కొంత తగ్గించడం కూడా కలదు. ఎట్లనగ రోడ్లకు, మార్కెట్టులకు పొలం దూరంగా ఉంటేగాని, రైతు ముసలివా డనో శరీర దారుఢ్యం లేనివాడనో వ్యవసాయము కులవృత్తిగలేని బ్రాహ్మణుడనో, ఇంకోవర్ణస్థుడనో, ఎద్దూ నాగలి లేనివాడనో పేదవాడనో, ఇట్టి కారణాలుంటేగాని, సదరు అంకెలో కొంత తగ్గిస్తూ వుండేవారు. కర్నల్ రీడ్ పద్ధతిలో రైతు కేవ

లము కౌలుదారుగ ఎంచబడెనేగాని, భూమికి హక్కుదారుగ ఎంచబడలేదు! ఈ విధంగా, ప్రతిరైతుతో విడివిడిగ శిస్తు పరిష్కారం చేసుకొన్నప్పటికి, గ్రామముమీది మొత్తపు డౌలుకుకూడ ఇతడు జాయింటుగ బాధ్యుడు చేయబడెను.

కర్నల్ రీడ్ అవలంబించిన ఈ పద్ధతిలో అనేక లోపము లున్న వనుట స్పష్టము. శిస్తుడిమాండు వచ్చి మీదపడే వరకు తాను ఈ యేడు ఎంతశిస్తు చెల్లించాలో రైతుకు తెలియదు. భూమి హక్కు రైతుదికాదు కాబట్టి, సర్కారు వారు ఎంతశిస్తు ఇమ్మంటే అతడు అంత శిస్తు చచ్చినట్లు ఇచ్చుకోవలసిన దే — మారుమాట మాట్లాడడానికి వీలులేదు. అందువల్ల, ఈ పద్ధతిమీద విధింపబడిన శిస్తులు ఎంతో హెచ్చుగనుండెను. ఇది ఇట్లుండగ, ఇతరుల శిస్తుకుకూడ ఇతనినే బాధ్యుని చేయుడంవల్ల ఇతనిపని మరింత అధ్వాన్నమైనది. అయితే, దీనిలో ఉన్న ఒక్క సుగుణ మేమిటంటే, ఇంతకు మించకుండ విధిస్తా మన్న రేటును శాశ్వతంగా ఉంచుతా మని మాత్రం అప్పుడు చెప్పిరి.

కర్నల్ రీడ్ చేతిక్రింద ఆనాడు బారామహాల్, సేలం పరగణాలలో పనిచేసిన కుర్ర ఆఫీసర్లలో సర్ థామస్ మన్రో ఒకడు. ఇతడు దరిమిలా, అనేక జిల్లాలలో రైతువారీ సెటిల్

సర్ తామస్ మన్రో

మెంటుచేసి ముఖ్యముగ బళ్లారి, అనంతపురం, కడప, కర్నూలు లనబడు దత్తమండలములలో మిక్కిలి పేరుప్రఖ్యాతులను గణించెను. ఇతడు గుర్ర మెక్కి స్వయముగ గ్రామ గ్రామము తిరిగి, రైతులతో పాటు ఊరిలో ఏచెట్టుక్రిందనో కూర్చుని, వారితో

మనసిచ్చి కష్టసుఖములు స్వయముగమాట్లాడి, శిస్తుపరిష్కారం వగైరా పనులు చేసేవాడట. ఇతడు కుటిలరాజ్యాంగతంత్రము లందును, మిలిటరీ వ్యవహారము లందును ఎట్టివాడైనను, పరిపాలనావ్యవహారములందు మాత్రము ప్రజాపక్షపాతి యని పేరొందెను. ముఖ్యముగ, పైన పేర్కొన్న నాలుగు జిల్లాలలోను ప్రజలు అతిపేదవారనిన్ని వారిమీద తాను పైవారి వత్తిడివల్ల చేచేతులా హెచ్చుశిస్తు విధించవలసివచ్చిన దనిన్ని విలపించినాడట. ప్రజల సౌఖ్యముసకై అతడు అనేకచోట్ల చింతలు, మామిళ్లు వగైరా తోపులను నాటించినాడు. వాటికి ఇప్పటికిని "మన్రోతోపు"లని పేరు. గుత్తిపట్టణములోని కొండ మీది దేవాలయమున కిత డొక పెద్దగంగాళమును దానము చేసె నట. దాని నిప్పటికిని "మన్రోగంగాళ"మని పిలుతురు. ఈ రీతిగ దత్తమండలములలో ఇతనిపేరు ప్రతియింటను నేటికిని స్మరింపబడుచున్నది. ఇతడు ప్రతిరైతుతోను నేరుగ పర్మనెంటు సెటిల్మెంటు చేసుకోవలసిన దనిన్ని, జమీను వరియాలలో వలెనే, షేరీ వరియాలలో కూడ రైతు సర్కారుకు చెల్లించవలసిన శిస్తు మితముగను, శాశ్వతముగను, ఎన్నటికి మారనిదిగను నిర్ణయించవలె ననిన్ని ఎంతో పట్టుపట్టెను. కాని "శాశ్వతత్వం, మితత్వం" అనేమాటలు మినహా ఇతర అంశములను మాత్రము సర్కారువారు తమ రైతువారీ పద్ధతిలో అవలంబించిరి.

అనగ, ఇతడు నిర్వచించిన "పర్మనెంటు రైతువారీ" పద్ధతిలో "పర్మనెంటు" అనే ప్రాణప్రదమైన పదమును తీసి

వేసి, మిగతా వట్టిడొల్లను మాత్రము సర్కారువారు అవలంబించి రన్న మాట.

1820 సం॥లో ఈ మన్రో సర్ థామస్ మన్రో, అనే పేరుతో మద్రాసుకు గవర్నర్ అయి పై సీమఅధికారి నిర్ణయించిన రీతిగ రైతువారీ పద్ధతిని 1820–27 సంవత్సరముల మధ్య మద్రాస్ రాజధానిలో పెక్కుచోట్ల అమలులో పెట్టెను. పర్మనెంటు సెటిల్‌మెంటుతో బంగాళా దేశములో కారన్ వాలీస్ పేరు ఎట్లు ప్రసిద్ధమయ్యెనో, అట్లే రైతువారీ సెటిల్‌మెంటుతో మద్రాస్ రాజధానిలో మన్రో పేరు అట్లు ప్రఖ్యాతమయ్యెను. అతని శిలావిగ్రహము గుర్రముమీద నున్నట్లుగ నేటికిని మద్రాస్ మౌంటురోడ్డులో అతి గంభీరముగ, ఎత్తుగా కనబడుతూ వుంటుంది. ఇతడు, కర్నూలుజిల్లా ప్రత్తికొండ అనే గ్రామంలో 1827 సం॥లో కలరావల్ల చనిపోయెను. ఆతని సమాధి ఇప్పటికిని అక్కడ కనిపించును.

## —♦ పర్మనెంటు రైతువారీ పద్ధతి ♦—

దాదాపు 1870 సంవత్సరంవరకు, రైతువారీ సెటిల్‌మెంటు పర్మనెంటుగనే ఉండవలె నని, గవర్నమెంటువారు సంకల్పించినట్లు, వారు అప్పుడప్పుడు చేయుచు వచ్చిన ప్రకటనలను బట్టిన్నీ, వ్రాసిన వ్రాతలను బట్టిన్నీ, తెలియుచున్నది. గవర్నమెంటు రికార్డులను జాగ్రత్తగ పరిశీలించిన వారికి ఈ అంశము సుస్పష్టము కాగలదు.

ఆదిలో బారామహాల్ సేలం పరగణాలలో కర్నల్ రీడ్ ప్రజలకు బహిరంగముగ చెప్పి చేసిన ప్రకటనలోను, దరిమిలా

ఆ యా చోట్ల మన్రో చేసిన ప్రకటనలలోను, ఈ పర్మనెంటు సిద్ధాంతము ఘంటాపథముగ వెల్లడించబడెను. దత్తమండల ముల సెటిల్‌మెంటునుగూర్చి గవర్నమెంటుకు రిపోర్టు పంపిస్తూ అప్పటికి వున్న రేట్లలో నాలుగోవంతు తగ్గించి, దానిని శాశ్వ తపు రేటుగ స్థిరపరచవలసిన దని మన్రో శిఫార్సు చేసెను. కాని, గవర్నమెంటువారు దీనికి అంగీకరించ లేదు. 1860 సం॥లో దేశములో కరువురాగా, దీనికి కారణము లేమిటో కనుక్కోడానికిగాను ఇండియా గవర్నమెంటువారు "కర్నల్ బెయిర్డు స్మిత్"అను వతని నియమించిరి. అతడు దేశమంతా తిరిగి విచారించి చెప్పినదేమిటంటే, "కరువులు రావడానికి ముఖ్యకారణములలో ఒకటి గవర్నమెంటు విధించే అతిభారపు శిస్తులే" అనిచెప్పెను. కాబట్టి పర్మనెంటు సెటిల్‌మెంటు పద్ధతి యావత్తు ఇండియాకున్ను వర్తింపజేయువలె నని అతడు గట్టిగ వ్రాసెను. దీనిని గురించి మీ అభిప్రాయ మేమి టని ఇండియా గవర్నమెంటువారు మద్రాస్ గవర్నమెంటువారిని అడిగితే, 1862 సం॥ ఫిబ్రవరి, 8 వ తేదీగల తమ 241 నెం బరు ఉత్తరములో వారేమన్నారు ?- మా రాజధానిలో అమ లులో నున్నది పర్మనెంటు సెటిల్ మెంటే నన్నారు! *

ఈ అభిప్రాయమే 1818 సం॥ జనేవరి 5, తేదీగల రివిన్యూబోర్డు ప్రొసీడింగ్సులోనున్ను, 1855-56సం॥ తాలూకు అడ్మినిస్ట్రేషన్ రిపోర్టులోనున్ను, 1857 సం॥ జులై 15.వ. తేది గల రివిన్యూబోర్డు ప్రొసీడింగ్సులోను, వెల్లడింపబడినది.

* "The leading characteristic of Ryotwari tenure is the permanancy of assessment"

సర్. చార్లెస్ ఉడ్-పర్మ నెంటు రైతువారి సెటిల్ మెంటునుగూర్చిన ప్రఖ్యాత మైన ఉత్తరము.

దరిమిలా 1862 సం॥ జూలై 9 తేదీగల ఉత్తరువులలో సీమమంత్రియైన 'సర్ చార్లెస్ ఉడ్' కూడ, పర్మనెంటు సిద్ధాంతమును అంగీకరించినాడు. *

పూర్తి అయిన శిస్తుమొత్తములో ఎక్కువచ్చేవరకు శిస్తును టెంపరరీగ సెటిల్ చేస్తూ, పూరా అంకె వచ్చిన పిమ్మట దానిని పర్మనెంటు చేయవలెనని ఆతడు చెప్పెను.

ఇట్లు చేసినందువల్ల, ప్రజలకు ప్రభుత్వము నెడ భక్తి యేర్పడుటయేగాక, దేశసంపదయు, అభివృద్ధియై, ప్రజలు సంతుష్ట్యానందముల పొందుదురనికూడ సర్ చార్లెస్ ఉడ్ ఈ ఉత్తరములో వ్రాసెను. ఈ పద్ధతివల్ల సర్కారుకు రివిన్యూనష్టము వస్తుందని చెప్పే ఆక్షేపణను అత డీ రీతిగ ఖండించెను.§

"భూమిని అంటిపెట్టుకొని యున్న రైతులకేగాక, యావద్దేశానికి ఇంతటి లాభాలు వస్తూవుంటే, ఒకవేళ ముందెప్పుడో రివిన్యూ నష్టము వస్తూందంటే, రానివ్వండి,

---

* "......A full fair and equitable rent must be imposed on all lands under a temporary settlement" and that where. ever this has been done, a permanent settlement of the revenue might be made.

§ "Her Majesty's Government are of opinion that the advantages which may reasonably be expected to accrue not only to those immediately connected with the land but to the community generally, are sufficiently great to justify them i. e. the Government in incurring the risk of some prospective loss of land revenue in order to obtain them" (i. e; the advantages).

—S. Sundararaja Iyyer,
Land Tenures in the Madras Presidency P. 154

మరేమీ ఫరవాలేదు. ఇన్ని ఈ లాభాలముండగ, ఆ వస్తుందను కొనే నష్ట మేమీ అంత గొప్పదికాదు. దానిని భరించడానికి గవర్నమెంటువారు సంసిద్ధముగనే ఉన్నారు అని సర్ చార్లెస్ ఉడ్ చెప్పిన ఇంగ్లీషు వాక్యాల సారాంశము.

ఈ మాటలు అమృతగుళికలనుటలో సందేహము లేదు. ఏ ప్రభుత్వముగాని ప్రజల సుఖమునే ముందుగ అన్నిటికంటె ఎక్కువ పాటింపవలయునుగాని, ఏదో రివిన్యూనష్టము వస్తుందని రూపాయి అణాలు పైసలు లెక్కపెట్టుకుంటూ కూర్చుండడం పెద్దబుద్ధిగల రాచకీయవేత్తలకు లక్షణముకాదు. ఇట్టి ఉత్తమ ప్రజాపరిపాలనాధర్మమును నిర్వచించిన సర్ చార్లెస్ ఉడ్ నిజముగ అభినందనీయుడు కాని క్రియలో ఇతని వాక్కును నెగ్గకపోవుట శోచనీయము. ఎంత మంచి ధర్మసూత్రము లైనను క్రియలో మన్నుచేసే లక్షణము రాజ్యాంగయంత్రమం దేర్పడుట భారతదేశదౌర్భాగ్య మనక తప్పదు.

దేశములో నున్న భూమినంతను ఈ దిగువరీతిని 3 తరగతులుగ విభజింపవలసినదని సర్ చార్లెస్ ఉడ్ చెప్పెను. ఎట్లనగ (1) వ్యవసాయము హీనస్థితిలో వున్న జిల్లాలు, (2) వ్యవసాయము బాగా వృద్ధిలోనుండి జలాధారములు పగ్గైరా సంపదుత్పత్తిసాధనములు పూరాగా పెంపొందియున్న జిల్లాలు, (3) వ్యవసాయము ఒకమాదిరిగా ఉండి సంపదుత్పత్తి సాధనములు ఇంకను పెంపొందవలసియున్న జిల్లాలు.

వీటిలో రెండవ తరగతి జిల్లాలలో పర్మనెంటు సెటిల్మెంటు తక్షణమే ప్రవేశపెట్టవలసిన దని అతడు చెప్పెను.

మొదటిదానితో వర్ధనెను. ఇక మూడవతరగతి జిల్లాలలో గల పరిధులలో నూటికి 80 యెకరాలుగనుక సాగుబడి క్రిందికి వచ్చియుంటే, అట్టివాటిలోకూడ తత్క్షణమే పర్మనెంటు సెటిల్‌మెంటు చేయడానికి ఆక్షేపణ ఏమిన్నీ లేదని ఇతడు చెప్పెను.

ఈ పర్మనెంటు సిద్ధాంతమును సర్ చార్లెస్ ఉడ్డ్‌గారు ఎరల్ డి గ్రే, రిప్పన్, నార్తుకోట్ వగైరా ఇండియా మంత్రులును, తదితరులునుకూడ ఎన్నియో పర్యాయములు ధ్రువపరచి యున్నారు.

నార్తుకోట్ వ్రాసిన దేమనగ :—

"రైతులు బ్రిటిష్ గవర్నమెంటుకు అండగ అంటిపెట్టుకొని ఉంటా రనుకొన్నప్పుడు ముందెప్పుడో రాబోతుందనుకునే రివిన్యూను వదలుకోడానికి గవర్నమెంటువారి కేమీ ఆక్షేపణ లేదు. అది వారి కొక లెక్కకాదు" అని ఇత డనెను.*

ఇంతమంది మంత్రులు ఇన్నిరీతులుగ చెప్పిన నీతులన్నియు క్రియలో బూతులయ్యెను. తీరా సెటిల్‌మెంటు డిపార్టుమెంటువారు కష్టపడి కొన్ని ప్రాంతాలలో శిస్తు రేట్లను నిర్ణయించి, ఈ రేట్లను పర్మనెంటుగ ప్రకటన చేయవలసినదని కోరితే, అప్పుడు అనగ 1869 సం॥లో ఇండియా మంత్రిగనున్న మహానుభావుడు "వల్లకాదు" పొమ్మనెను. "గవర్నమెంటుకు

* "Sir Stafford Northcote wrote that Her Majesty's Government who prepared to sacrifice the prospect of an increase in land revenue "in consideration of the great importance of connecting the interests of the proprietors of the land with the stability of the British Government"

— Sundararaja Iyyar, p. 155.

ముందుముందు రాబోయే రివిన్యూలో వదలుకుంటామా ? దీనికింతమాత్రం సబబులేదు. పోపొమ్మ"ని అత డెగురగొట్టెను. ఇదివరకు చెప్పుచూ వచ్చిన మాటలన్నీ ఏమయిపోయినవో!! అవి అన్నీ గంగలో కాదు, లండను ప్రక్క ప్రవహించే తేమ్సు మురికి కాల్వలలో కలిసిపోయినవి. అప్పటినుంచి, పర్మనెంటు సెటిల్ మెంటు మాట ఎత్తినవాడే లేడు. ఆఖరుకు 1883 సం॥ మార్చి 28 తేదీగల తన 24 వ ఉత్తరములో సీమ మంత్రి ఇట్లని వ్రాసెను.

"1862 సం॥లో నిర్వచించిన సిద్ధాంతమును (అనగ, పర్మనెంటు ల్యాండురివిన్యూ సిద్ధాంతమును) మనము వదలు కొన్నట్లు ఈ రోజుననే బహిరంగముగ తిలోదకములు వదల వలసినది.*

పర్మనెంటు సెటిల్ మెంటు అనేది 1869 సం॥లోనే చచ్చిపోయినప్పటికి, దానికి లాంఛనముగ చేయవలసిన అపర కర్మను ఇండియామంత్రి 1883 సం॥వరకు వేల ఆపియుంచెనో! ఆ నాటితో (1883 సం॥ మార్చి 28 తో) పర్మనెంటు సెటిల్ మెంటు శాశ్వతముగ భూస్థాపన అయిపోయినది.

—రైతువారీపద్ధతి (ఇప్పుడున్నట్లు)—

మన్రో నిర్వచించిన "పర్మనెంటు రైతువారీ సెటిల్ మెంటు"లో గల "పర్మనెంటు" అనే పదాన్ని తీసివేసి, 30 ఏండ్ల కొకసారి భూమిశిస్తును ఏవో మిషలచేత హెచ్చిస్తూ వుండ

*"The policy laid down in 1862 should now be formally abandoned".

డానికిగాను, మద్రాస్ గవర్నమెంటువారు ఏర్పరుచుకొన్న రైతువారీపద్ధతి ఎట్టిదో ఇచ్చట క్లుప్తముగ వర్ణించెదను.

1856 సం॥లో సెటిల్‌మెంటు డిపార్టుమెంటు ఏర్పరచి నప్పుడు ల్యాండురివిన్యూ భూమిపంట మొత్తములో నూటికి ముప్ఫయ్యోవంతు వుండవలె నని మద్రాస్ గవర్నమెంటు వారు సూచించిరి. కాని, ఇందుకు సీమడైరెక్టర్లు ఒప్పుకో లేదు. ల్యాండురివిన్యూ మొత్తపుపంటలోగాక, నికరపు పంటలో భాగముగ వుండవలె ననిన్నీ, అది నికరపుపంటలో సగముగ ఉండవలె ననిన్నీ వారు నిశ్చయించిరి.

దీనికే "నికరపు పంటలో సగము సిద్ధాంతము" అని పేరు వచ్చెను. ఇది క్రియలో ఎట్లు జరిగెనో చూతము.

"Half - net Principle" "నికరపు పంటలో సగం సిద్ధాంతం"

ఈ దిగువ చెప్పబోవు ప్రయోగము లన్నియు గవర్నమెంటువారు సెటిల్‌మెంటు డిపార్టుమెంటువారికి బోధపరచిన సలహాల ప్రకారము గావింపబడెను.

## 1. నేలమీద ప్రయోగములు (Soil Experiments)

(1) అక్కడక్కడ భూములో కొన్నిచోట్ల కొద్దిగ కుచ్చుకు మట్టితీసి, వండి కొన్ని రసాయనిక, భౌతిక ప్రయోగ ములద్వారా ఆ మట్టిలో అంతర్గతమై యున్న లోహములు, ఉప్పులు, ఇతర రసాయనిక భౌతిక పదార్థములయు పాళ్లను, లక్షణములను గమనించి ఆ యా నేలలయొక్క మెరుగు తరు గులనుబట్టి వాటిని కొన్ని "ప్రధానతరగతులు"గ విభజించిరి.

Main "Classes" తరగతులు

ఈ ప్రకారము మద్రాస్ నేలలలో 14 ప్రధాన తరగతులు గలవని సెటిల్‌మెంటు డిపార్టుమెంటువారు కనిపెట్టిరి.

(2) ఒక్కొక్క తరగతినేల మరల 3, లేక 5 "రకములుగ" అంతర్భాగములు చేయబడెను. నేలల పైపొరలలోను, లోపల పొరలలోను గల సారాసారము లనుబట్టి ఈ "రకములు" నిర్ణయింపబడెను. ఇట్టి రకములు రాజధాని మొత్తముమీద 66 కనిపెట్టబడెను. నీటిసాగులో నున్న భూములుగాని, లేని భూములుగాని అన్నీ ఈ 66 రకములలో ఇముడ్చబడెను.

66 "Sorts" రకములు

(3) అయితే నీటిసాగు క్రింద వున్న భూములన్నియు వాటివాటికి నీటివనరులయొక్క వెసులుబాట్లనుబట్టి మరల కొన్ని "గ్రూపులుగ" వర్ణరచబడెను.

"గ్రూపులు"

## II. పంటమీద ప్రయోగములు (Crop Experiments)

ఇంతవరకు నేలమీద చేయబడిన ప్రయోగములగూర్చి చెప్పితిమి. ఇక పంటమీద చేయబడిన ప్రయోగముల జాతము.

(4) "నేలలో పంట యెంత పండుతుందో" అని కనుకొవడం తరువాత చేసినపని. నీటిసాగు నేలలో ఎంత పండుచున్నదీ, నీటిసాగులేని మెట్టపొలాలలో ఎంత పండుచున్నదీ ఆరాగా కనుక్కోబడినది. ఇందు నిమిత్తమై మెట్టభూములలో ఆ యా ప్రాంతములలో మామూలుగ పండే ఒక దినుసుపంటనున్ను, పల్లపు భూములలో మామూలుగపండే వరిపంటనున్ను, ప్రమా

సగటుపంట నిర్ణయము

ణంగా తీసికొని ఇవి ఒక్కొక్క "రకం" నేలలో సగటున ఎంతెంత పండుతవో కొన్ని సంవత్సరాలపాటు జాగ్రత్తగ సెటిల్‌మెంటు ఉద్యోగస్థులు స్వయంగా పండించి తనిఖీచేసి చూచి నిర్ణయింతురు.

అతివృష్టి అనావృష్టి వగైరా దోషాలకు నూటికి 15, 20 మినహాయింపు

(5) అసాధారణ మగు అతివృష్టి, అనావృష్టి దోషములకున్ను, ఏకారణంచేతనైనా చేలమధ్య అక్కడక్కడ మొక్క మొలవక పండని చెక్కలకున్ను కొంత మినహాయించే తలంపుతో పైనచెప్పిన రీతిగ తేల్చిన సగటుపంటలో నూటికి 15 మొదలు 25 వరకు తీసివేయుదురు. ఇట్లు తీసివేయగా మిగిలినదే నికరపుపంట.

## III. ధాన్యాన్ని రొఖ్ఖంలోకి మార్చడం ఎలా ? (Commutation)

ఈ విధముగ తేల్చబడిన నికరపు పంటకు, ఇక రొఖ్ఖపు విలువ కట్టడం ఎలాగో చూతము. కరవు సంవత్సరాలు

మారకపు రేటు కమ్యుటేషన్ రేటు నిర్ణయం

మినహా, గత 20 సంవత్సరాలలో ధాన్యాదుల ధరలు ఎట్లున్నవో చూతురు. ఈ ధరలో బండ్ల కిరాయి, వర్తకుని లాభముల క్రింద నూటికి 8 మొదలు 20 వరకు తీసివేయుదురు. మిగతాది రైతుకు వచ్చే ధరగ నిర్ణయించబడును. ధాన్యాన్ని రొఖ్ఖంలోకి మార్చడానికి ఈ ధరయే మారకపు రేటుగ అంగీకరింపబడును.

ధాన్యాన్ని రొఖ్ఖంలోకి మార్చడం

(7) ఈ మారకపురేటు ప్రకారము, పైన 5. వ. పేరాలో చెప్పిన నికరపుపంట ధాన్యమును రొఖ్ఖములోకి మార్తురు.

## IV. వ్యవసాయపు ఖర్చుల మినహాయింపు

(8) ఇట్లు మార్చబడిన రొఖ్ఖములోనుండి, ఇంకను రైతుకగు వ్యవసాయపు ఖర్చులు తీసివేయవలసివున్నవి. ఇది చాల ప్రధానమైన విషయము. దీనిని నిర్ణయించ డానికి ఖచ్చితమగు సూత్రములులేవు. అంతయు సెటిల్‌మెంటు డిపార్టుమెంటు ఉద్యోగుల ఊహ మీాద ఆధారపడియున్నది. వీరు అక్కడక్కడ రైతులను, ఇతర పెద్ద మనుష్యులను వాకబుచేసి ఈ అంకె తేల్చవలసి వుంటుంది. ఇట్టి గాలివాకబు తప్ప, దీనికి వేరే ప్రమాణా లేవిన్నీ లేవు. ఇట్లు వాకబువల్ల తెలిసికొన్న ఏదో మొత్త మును వారు, పైన చెప్పిన రొఖ్ఖపు విలువలో నుండి మినహా యింతురు.

వ్యవసాయపు ఖర్చులు - గాలి వాకబులు

## V. నికరాదాయము - అందులో సగం సర్కారుకు.

(9) ఇట్లు మినహాయింపగ మిగిలేదే, రైతుకు సదరు భూమిపై నికరాదాయముగ ఎంచబడుచున్నది. ప్రతిరకము నేలమీాద ఇట్టి ప్రయోగములద్వారా నికరాదాయము సెటిల్‌మెంటు డిపార్టుమెంటు వారివల్ల తేల్చబడినది.

నికరాదాయము

(10) ఇట్టి నికరాదాయములో సగము ఆ నేలమీాద సర్కారుకు చెందవలసిన పన్నుగ (శిస్తుగ) నిర్ణయింపబడెను.

నికరంలో సగం గవర్నమెంటు శిస్తు

## VI. గ్రామముల గ్రూపింగ్

(11) పై చెప్పబడిన లెక్కలలో ఇంకను ఒకటి రెండు సర్దుబాట్లు చేయవలసియున్నది.

(a) ఎట్లనగ, ఒక జిల్లాలో అన్ని తాలూకాలలోను, అన్ని గ్రామాలలోను ఒకటే ధాన్యపురేటు ఉండకపోవచ్చును. ఆయా గ్రామాలకు గల రోడ్లు, కాల్వలు వగైరా రాకపోకల సౌకర్యాలనుబట్టిన్ని, మార్కెట్టులయు, ఫ్యాక్టరీలయు, దూరము దగ్గరలను బట్టిన్ని, ఒక గ్రామములోని రేటు ఇంకొక గ్రామములో ఉండక పోవచ్చును. ఇట్టి సందర్భములో జిల్లా కంతకు ఒకటే ధాన్యపురేటు లెక్కగ తీసికొనుట సరికాదు.

(b) ఇదిగాక రెండు ప్రదేశములలో వున్న నేల ఒకే "రకముది" అయినప్పటికి, ఆ ప్రదేశముయొక్క చుట్టుపట్టుల స్థితిగతులనుబట్టి, పండేపంట మొత్తములలోకూడ తేడా వుండవచ్చును.

ఉదాహరణ:- ఒకరకము రేగడినేల ఉప్పునీరు తగిలే సముద్రపు టంచున వుండవచ్చును. లేదా తీపినీరు తగిలే ఏటి ఒడ్డున ఉండవచ్చును. లేదా, చట్టుకొనిపోయిన కొండదరిని ఉండవచ్చును. ఈ మూడుచోట్ల వుండేనేల ఒకేరకపు రేగడ నేల అయినప్పటికి, ఈ మూడుచోట్ల ఒకేమొత్తము పంట పండుతుం దని గట్టిగ చెప్పడానికి వీలులేదు. సముద్రం, ఏరు, కొండ, వగైరా స్థానిక ఆవరణలను బట్టి, పంటమొత్తం తేడా లుండవచ్చును.

కాబట్టి ఈ (ఏ) (బి) పేరాలలోగల సందర్భాలను పరిచేయడానికిగాను, గ్రామాలను ఆ యా స్థానికపరిస్థితులను ఆవరణలనుబట్టి, కొన్నికొన్ని గ్రూపులుగ ఏర్పరచిరి. ఒక్కొక్క గ్రూపుయొక్క స్థితిగతులనుబట్టి, పంటయొక్క రొఖ్ఖపు విలువను కొంత హెచ్చించుటయో, తగ్గించుటయో జరుగుచుండును. ఇదియు క్రియలో కేవలము ఊహలమీదను, అంచనాలమీదను ఉంటుందని వేరుగ చెప్పనక్కరలేదు.

## రీ-సెటిల్‌మెంట్లు

పైన తప్సీలుగ వర్ణించిన "నికరపుపంటలో సగము" అనే సిద్ధాంతప్రకారము మదరాసు రాజధానిలో 1860 సంవత్సర ప్రాంతమున ఆ యా జిల్లాలలో మొట్టమొదట సెటిల్‌మెంటు చేయబడెను. ఆ మొదటి సెటిల్‌మెంటునాడు ఆ యా రకపు భూములకు శిస్తు రేట్లు నిర్ణయింపబడెను. అవే తరము రేట్లని సాధారణముగ వాడబడుచున్నవి. అయితే, అప్పటి తరము రేట్లు శాశ్వతముగ నిలుప ఉద్దేశింపబడినవా? లేక, తమ ఇష్టము వచ్చినప్పుడు ఇష్టమువచ్చినట్లుగ గవర్నమెంటుచే హెచ్చింప నుద్దేశింప బడినవా? ఒక వేళ, అట్లు హెచ్చించుటకే ఉద్దేశింపబడియుంటే, ఏ కారణములచేత హెచ్చింపతగును? ఈ ప్రశ్నల కిప్పుడు మనము సమాధానము చెప్పుకోవలసి యున్నది. ఈ సమాధానము కొంతవరకు ఈ అధ్యాయము లోనే లోగడ చెప్పియుంటిమి. 1870 సం॥ వరకుగల గవర్నమెంటు రికార్డులనుబట్టి చూస్తే మొదట చేయబడిన ఈ రైతువారీ సెటిల్‌మెంటు రేట్లు పర్మనెంటుగనే వుండవలెనని,

వానిని ఏ కారణంచేతగాని, హెచ్చింపరాదనీన్ని, గవర్న మెంటువారి సంకల్పమైనట్లు తెల్పియగలదు. కాని, 1769-70 సంవత్సరము నాటికి సీమడైరెక్టర్ల అభిప్రాయములు పూర్తిగ మారిపోయెను. ఆ కాలమున అనేక కారణములచే, ప్రపంచములో ధాన్యాదుల ధరలు హెచ్చనారంభించెను. దీనినిచూచి కంపెనీవారికి నోరుఊరెను. "అరెరే, మనం పొరపడ్డామురా, ధాన్యాదుల ధరలు హెచ్చుతూవుంటే, ఆ లాభాన్ని మనం పొందకుండ రైతుకు వదలిపెట్టివేయడమేమి"టను చుప్పనాతితనము కంపెనీయజమానులకు కలిగెను. అందుచే వారు, లోగడ చెప్పిన పర్మనెంటుసిద్ధాంతాల నన్నిటిని చల్లచల్లగ జారవిడువసాగిరి. ఇకమీదట ఎక్కడాగాని పర్మనెంటుసెటిల్ మెంటనే మాట ఎత్తవద్దని వారు ఇండియాలో నున్న తమ యావన్మంది తాబేదారుల యొక్కయు నోళ్ళను గట్టిగ నొక్కిరి. సెటిల్‌మెంటులు పర్మనెంటుగ కాకుండ, 30 ఏండ్ల కొకసారి (పంజాబు. మధ్యపరగణాలు వగైరా కొన్ని ప్రాంతాలలో 20 ఏండ్లకొకసారికూడ) మారుస్తూ వుండవలసినదనివారు ఇండియాకు హుకుము లంపిరి. ఆ ప్రకారమే మన మద్రాస్ రాజధానిలో 30 ఏండ్ల కొకసారి "రీ-సెటిల్‌మెంటు" అను పేరుతో ప్రతిజిల్లాలోను గవర్నమెంటు శిస్తులను హెచ్చింపసాగిరి. ఈ రీతిగ ఇప్పటికి 1866,1896,1926 సంవత్సరాలలో మూడుపర్యాయములు మన జిల్లాలలో "రీ-సెటిల్‌మెంటు" జరిగెను. ప్రతిపర్యాయము శిస్తులు వెనుకటికంటె హెచ్చించడమేగాని తగ్గించడంలేదు. ఇందువల్ల "రీ - సెటిల్‌మెంటు" అంటే, శిస్తులు హెచ్చించడమనేమాట రూఢమైపోయినది.

—♦ ఏ మిషలచే రీ-సెటిల్‌మెంట్లు చేయబడుచున్నవి ♦—

ఏ కారణములచేత ఈ శిస్తు హెచ్చింపులు ప్రతి రీ-సెటిల్‌మెంటులోను జరుగుచున్నవో కొంత చూతము. వీనిలో ప్రధానమైనవి నాలుగు - అవేవనగ:—

* 1. నేలల సారాసారముల పునర్విభజన.

2. నీటివనరుల పునర్విభజన.

3. పంటదినుసుల మార్కెటు రేట్ల పెంపుదలలు.

4. ఇతరుల కృషివల్ల రైతుకు తేరగా వచ్చే లాభాలు.

వీటిలో ఒక్కొక్కదానిని గురించి క్లుప్తముగ తెలిసికొందాము:

(1) నేలలను, ముప్పదేండ్ల కొకసారి, సారాసారములను బట్టి తిరిగి విభజించి లోగడ దిగువ తరగతిలో నున్న వాటిని, ఇప్పుడు పై తరగతిలో వేసి, తద్వారా హెచ్చుశిస్తు పుచ్చుకొనుట.

(2) గత ముప్పదేండ్లలో జరిగినవని చెప్పబడిన నీటి వనరుల పెంపుదలలను, అభివృద్ధులను బట్టి, భూములను దిగువ తరగతులలోనుండి ఎగువ తరగతులలో వేసి, తద్వారా హెచ్చుశిస్తు విధించుట.

(3) ధాన్యాముల ధరలు ముప్పదేండ్లకంటె ఇప్పుడు

---

* 1. Re-classification of soils. 2. Re-classification of irrigation sources. 3. Rise of Price levels. 4. Un-earned increments.

పెరిగిన పనే కారణంచేత, కొఖ్కువు మారకపు రేటును పెంచి తద్వారా శిస్తును హెచ్చించుట.

(4) ముప్పదేండ్ల నాటికంటె ఇప్పుడు రైళ్లు, మోటార్లు, మార్కెట్లు, వగైరా రాకపోక సౌకర్యాలు, సరుకు విడుదల సౌకర్యాలు గవర్నమెంటుచే కల్పింపబడి రైతు పండించే పంటకు ఎక్కువ ధరలను రాబట్టి రైతులు సిల్కులు, రిస్టు వాచీలు, వేసుకుని దర్జాగా మోటారుకారులలో తిరుగుతూ, కాఫీహోటళ్ళలో మెక్కుతూ, సినీమాలవెంట పరుగులెత్తుతూ వుండే నవనాగరికులను చేయడానికి గవర్నమెంటు కృషిచేసింది కాబట్టిన్నీ, ఇట్టి లాభాలు రైతుకృషివల్లగాక కేవలం సర్కారు కృషివల్లనే రైతుకు కలిగినవి కాబట్టిన్నీ, ఈ లాభంలో భాగం సర్కారుకు రావాలనే మిషమీదకూడ ప్రతి రీసెటిల్‌మెంటు లోను భూమిపన్ను ఎగబొడుపబడుచున్నది. రైతుకృషివల్ల కాకుండ ఇతరుల కృషివల్ల రైతుకు తేరగావచ్చే ఇట్టిలాభానికే (అన్ -ఎరన్డ్ ఇన్‌క్రిమెంటు) అంటారు. ఉదాహరణ:—

ఒక రైతుభూమి గుడివాడ సమీపములో వున్నది. కొన్నాళ్ళకు రైలువచ్చినది, మోటార్లు వచ్చినవి, ఆఫీసులు పెరిగినవి. గుడివాడ జనసంఖ్య హెచ్చింది. ఊరుపెరిగి మ్యునిసిపాలిటీ ఏర్పడింది. ఊరును ఆనుకొనియున్న సదరు రైతుభూమికి మంచిధర వచ్చింది. వెనుక య 1కి రు 200 లు కూడ అడగనివారు ఇప్పుడు ఇండ్లనివేశనమునకు పనికివస్తుందనే తలంపుతో య 1కి రు 2000/- లు కూడ అడుగుతున్నారు. ఈ పెంపుదల ఎట్లావచ్చినది? దీనికి రైతు ఏమికృషి చేశాడు? ఏమీచెయ్యలేదు. తాను కష్టపడకుండ ఇంట్లోకూర్చుంటే

ఈ పెంపుదల దాసంతట అదివచ్చి అతనిమీద పడింది. ఈ సంపాదన నిజంగా అతడు సంపాదించినదికాదు. అందుకనే దానికి "అన్-ఎర్న్‌డు ఇన్‌క్రిమెంటు" అనగ "తానుసంపాదించని పెంపుదల" అని పేరుపెట్టారు. ఈరీతిగ తేరగవచ్చిన లాభంలో సర్కారువారేల భాగంకోరకూడదు, అని వారివాదన. మేము రైళ్లువెయ్యబట్టిగదా, రోడ్లువెయ్యబట్టిగదా, మ్యునిసిపాలిటీ చెయ్యబట్టిగదా, నీ భూమి కింత ధరవచ్చింది. ఇదంతా మా కృషియే కాబట్టి నీకు వచ్చిన లాభంలో మాకుకూడ భాగంపెట్టు అంటారు గవర్నమెంటువారు. ఇది సాధారణంగా మ్యునిసిపల్ ఏరియాలకు వర్తిస్తుందిగాని ఈ కారణంచేత మొత్తం జిల్లాలన్నిటిమీద శిస్తు హెచ్చింపుచేయడానికి ఈ వాదన వర్తింపదని ముందు ముందు తెలుసుకో గలము.

ఈ నాలుగు కారణాలచేత ముప్పదేండ్ల కొకసారి రీసెటిల్‌మెంటు అనే పేరుతో భూమిశిస్తును హెచ్చించుట సబబుకాదని ఖండిస్తూ ఇకముందు భూమి శిస్తు విధానము ఎట్లా వుండాలో తెలిసికొందాము.

ల్యాండు రివిన్యూ పాలసీ

## ఇకముందు అవలంబింపవలసిన రివిన్యూ విధానము.

## (Future Land Revenue policy)

రీ-సెటిల్‌మెంటులు జరిగేవిధానము మిక్కిలి వింతగ నున్నది. భూమిశిస్తును విధించుటగాని, ఇట్లు ముప్పదేండ్ల కొక సారి హెచ్చించుటలోగాని, ఇంతవరకు ప్రజలకుగాని, వారి ప్రతినిధులకుగాని, ఎట్టి జోక్యము లేకుండ జేసిరి. సర్కారు

అప్పుడు మదరాసు గవర్నమెంటుచే అంగీకరించబడెను. కాబట్టి, మన మిప్పు డా రేట్లనే అంగీకరిస్తూ, దరిమిలా ఏవో సాకులచే చేయబడిన పెంపుదలల నన్నిటినీ కొట్టివేయవలెను. ఇకముం దీ రేట్లు పెంచవలెనంటే, లేక తగ్గించవలెనంటె ప్రజా ప్రతినిధులతో కూడిన శాసనసభకే తప్ప, ఇంకెవరికీ అధికారము ఉండరాదు.

(7) నేల తరగతుల పునర్విభజన:—30 ఏండ్లక్రిందట ఒక భూమి చవుడుగ వున్నదనిన్నీ, ఇప్పుడు చవుడుపోయి అది మంచి సారవంతమైన దనిన్నీ, కాబట్టి దానిమీద ఇప్పుడు హెచ్చురేటు విధించవలె ననిన్నీ, ఇంతవరకు సెటిల్‌మెంటు వారు చెప్పుచుండిరి. కాని, దీని కొక అభ్యంతరము కలదు. "రైతు స్వయముగ చేసుకొన్న అభివృద్ధిమీద పన్ను విధింపరా"దను సిద్ధాంతము ఎల్లరిచే అంగీకరింపబడినదే. ముప్పది ఏండ్లక్రింద చవుడుగా నున్న భూమి ఇప్పుడు సారవంతమైనది. ఎట్లయినది? రైతు పెంటగట్టి బాగుచేసుకొన్నందువల్ల నేగద! ఒకవేళ సర్కారువారి తీపినీరు పారినందువల్ల బాగుపడినదని చెప్పవచ్చును. అయితే, ఆ నీరు సర్కారువారు ఉచితముగ ఇవ్వలేదు గద! రైతు డబ్బుపెట్టి ఎరువులు కొనుక్కున్నట్లే, నీటినిన్నీ కొనుక్కొన్నాడు. కాబట్టి అదియు రైతు స్వయముగ చేసుకొన్న అభివృద్ధియే. కాబట్టి, ఏ విధం చేతచూచినా, భూమి బాగుపడడానికి రైతుయొక్క స్వయం కృషియేగాని, ఇంకొకటి కారణంకాదు. అందువల్ల భూమి నేడు వెనుకటికంటె సారవంతమైన దనే కారణంచేత నేడు హెచ్చు శిస్తు విధింపరాదు. ఈ సిద్ధాంతమునుకూడ రివిన్యూ

చట్టములో పొందుపరుపవలెను. 1860 సం॥లో ఒక్కొక్క తరగతికి లేక తరమునకు ఒక్కొక్క రేటు నిర్ణయింపబడెను. ఒక భూమి ఇప్పుడు ఎక్కువ తరగతిభూమిగ మారినను,—(అది రైతు స్వయంకృషివల్ల మారింది కాబట్టి)— దానిమీద హెచ్చు తరగతి రేటు విధింపరాదు. వెనుక 1860 నాడు మెట్టగ నుండి నేడు పల్లమైతే, దానిమీద ఇప్పుడు పల్లపురేటు మాత్రం విధించవచ్చును; అంతే. ముప్పదేండ్లకొకసారి భూమి తరగతులను మార్చరాదనిన్నీ, అందువల్ల రైతుయొక్క స్వయంకృషిని భంగపుచ్చినట్లగు ననిన్నీ, 1860 సం॥ నాడే సిద్ధాంతరీత్యా నిర్వచించబడెను. కాని క్రియలో ఇది శూన్యము చేయబడుట ఆశ్చర్యము! ఆనాడే నిర్వచించబడిన ఈ మంచి సిద్ధాంతమును మన మిప్పు డవలంబించి, దానిమీద చట్ట బద్ధము చేయవలెను.

(8) జలాధారముల పునర్విభజన:— ఆనకట్టలుకట్టి, చేలకు నీరు సప్లయిచేయుడం సాగించినతరువాత, నీటితూములను పెంపుజేసినా మనియో, లెవెలులు హెచ్చించినా మనియో, తగ్గించినామనియో, మురుగునీరు పోవడానికి వసరుల నేర్పరచినా మనియో ఏవోవంక జెప్పి, భూములపై పన్నును ౩0 వండ్ల కొకసారి హెచ్చుచేయుచున్నారు. దీనికిని సబబు కనిపించదు. ఏల ననగా, కావలసిననీరును కావలసిన కాలములో సప్లయి చేయుట సర్కారు విధి. అట్లు సప్లయి చేసినప్పుడే సర్కారు రైతునుండి నిర్ణీత మగు నీటిపన్నును వసూలుచేయుటకు అధికారమేర్పడును. అట్టి నీరును సర్కారువారు పెద్దతూములో నుండి యిచ్చిన నేమి? చిన్నతూములోనుండి ఇచ్చిననేమి? లేక

ఎత్తు చానల్ ద్వారా ఇచ్చిననేమి, తగ్గుచానల్ ద్వారా ఇచ్చిన నేమి? ఈ వర్పాట్లతో రైతు కేమి నిమిత్తము? అట్లు తగు వర్పాట్లు చేయనియెడల, తగునీరు తగుకాలములో సప్లయి చేయనియెడల, రైతుకుండి నీటిపన్ను అడగడానికే సర్కారుకు హక్కు వుండదు. లేదా నీటిపన్ను రిమిషను ఇవ్వవలసిన స్థితి నైనా వర్పడును. అంతేకాని, "పెద్ద తూముగానుండి సప్లయి చేశాను కాబట్టి, పెద్దరేటు ఇ"మ్మని సర్కారు ఎట్లడుగగలదు? సర్కారువారు పెద్దతూములు కట్టిస్తే ఇంకా ఎక్కువ భూము లకు నీరు సప్లయి చేయడానికి, తద్వారా ఎక్కువ నీటిపన్ను వసూలు చేసుకోడానికి వారు వర్పాటుచేసుకొన్నట్లే అవుతుంది గాని, ఇదివరకున్న భూమిమీదనే హెచ్చునీటిపన్ను వసూలు చేయడానికి ఎట్లు వీ లేర్పడుతుంది? కాబట్టి నీటితూములు వగైరావనరులు పెంపుచేశామనే కారణంచేత ఆ వనరుల క్రిందనున్న భూములమీద హెచ్చుశిస్తు విధింపరాదను సిద్ధాంత మును కూడ, రాబోవు రివిన్యూచట్టములో బొందుపరచ వలెను.

ఈ వంక చెప్పి, సెటిల్ మెంటు ఆఫీసర్లు భూములపై హెచ్చు రేట్లను అక్రమముగ విధించుట చాలచోట్ల జరిగినది. ఈ నీటివనరుల విభజన తరగతులలో, ఎంతైనా ప్రజలను మోసము చేయుటకు వారినుండి లంచములు గుంజుటకు బుద్ధి మెతక ఉద్యోగస్థులకు (సెటిల్ మెంటువారికి, పి. పి. డబ్లియు వారికి) ఎంతేని అవకాశమున్నది. ఒకతూము క్రింద ఒక భూమి వున్నది. అది 30 వండ్లనాడు పల్లముగనుండి నీరునిలచి పంట సరిగా పండకుండెను. ఇప్పుడా పొలమును రైతు మెరక చేసు

కొన్నాడు. ఇప్పుడు నీరు నిలవడం లేదు. పంట సరిగ పండు తున్నది. కాబట్టి, ఇప్పుడు సెటిల్‌మెంటు ఆఫీసరువచ్చి ఆ తూమును, దిగువతరగతిలోనుండి ఎగువ తరగతిలోనికి వేసి, ఆ తూముక్రింద నున్న భూములకన్నిటికి ఒక్కొక్క రూపాయి అదనంగా శిస్తు విధించినాడు? తూము పాతతూమే. దానిని వెడలుపైనా చేయలేదు. ఎత్తయినా చేయలేదు. అయినా, దానిక్రిందనున్న భూమిని రైతు మెరకచేసినాడట. అందువల్ల మురుగునీరు వెనుకటివలె నిలువడం లేదట. పంట బాగా పండు తోందట. కాబట్టి, ఈ జలాధారమును—అనగ తూమును పై తరగతిలో వేసినాడట! కొబ్బరిచెట్టు ఎందు కెక్కినావురా అంటే, దూడమేతకోసం అన్నట్లున్నది ఈ సమాధానం. ఇట్టి అవకతవక జలాధారపు తరగతుల మార్పులు ఎన్నో మన అనుభవములో చూచుచున్నాము. కాబట్టి, ఈ జలా ధార విభజనపద్ధతికూడ పోవలెను. నీరు సకాలంలో అన్ని భూములకు - తూము దగ్గర వాటికి, దూరం వాటికికూడ - సమానంగా పంటకు కావలసినంత నీరు సప్లయి అయ్యేటట్లుగ తూములు, వగైరాలను అరేంజిమెంటు చేసుకోవలసిన బాధ్యత సర్కారువారిది-డి. పి. డబ్లియు వారిది. అట్లు సప్లయి చేయుటకు డి. పి. డబ్లియువారు అసమర్థులయ్యే యెడల, (ఆ ఇంజనీర్ల విద్యాసామర్థ్యము అంత కుంటిదయ్యే యెడల) — వారు ఆమాట ఒప్పుకొని, సప్లయి చేయలేని భూములకు తగు రిమిషన్ ఇచ్చునట్లు ఏర్పాటు చేయవలెను. అంతేగాని, పైన చెప్పిన అసందర్భపరిస్థితులకు వారు తావియ్యరాదు.

—ధాన్యపు ధరల పెంపుదలలు—

(9) పన్ను పంటమీద గాక, భూమిమీద వేసినప్పుడు పంటలయొక్క ధరలను బట్టి, భూమిపన్ను హెచ్చించుటకు సబబులేదు. ఇంతకాలమునుండి ఇట్టి అనబ బైనపనే జరుగుచుండెను. ధాన్యాదులకు ధరలు హెచ్చిన వనే కారణంచేత, రీసెటిల్ మెంటులలో భూమిపన్ను హెచ్చించబడుచు వచ్చెను. ఈ పద్ధతి నికమీద విరమించవలె నని, రివిన్యూ చట్టములో స్పష్టము చేయవలెను. 1860 సం॥లో జరిగిన మొదటి సెటిల్ మెంటు నాటినుండి, నేటివరకు ఈ కారణంగా విధింపబడుచు వచ్చిన పెంపుదలల నన్నిటిని ఇప్పుడు కొట్టివేయవలెను. ధాన్యాదుల ధరలు పెరగడానికి సర్కారు కృషిగాక, ఇంక అనేక ఇతరమైన అదృశ్యకారణము లున్నవి. ప్రపంచరాజ్యాంగముల కరెన్సీ మారకపు రేట్లనుబట్టియు, వర్తకపు గిరాకీలను బట్టియు, ప్రపంచములో ఇతర దేశాలలో గలిగిన పంటల అభివృద్ధినిబట్టియు ధాన్యాదుల ధరలు పెరుగుచున్నప్పుడు దానిలో సర్కారువారు భాగం కోరడం సబబుకాదు.

అదిన్నీగాక, ధాన్యాదుల ధరలు ఒకరు చెప్పేటట్లు వినేవికావు. ఈ సందర్భములో గవర్నమెంటువారు వేసే అంచనాలు ఊహించే మారకపురేట్లు ఒక్క క్షణంలో వారికి తెలియకుండ, ఎట్లు తల్లక్రిందులుగ మారి ప్రపంచరాజ్యాంగము లనే ఎట్లు తల్లక్రిందులుగ పడగొట్టునో తెలుసుకోడానికి 1930 సం॥లో ప్రారంభమైన ప్రపంచ ఆర్థికపతనమే నిదర్శనము. ఎప్పటివలెనే ధరలు ఊరక పెరుగుతూపోతవనే ఆశచేత 1926 సం॥

రీసెటిల్ మెంటు నాడు శిస్తులను రూపాయికి మూడణాలవంతున సెటిల్ మెంటు ఆఫీసరైన "హోల్డ్సువర్తు" అను నతని శిఫార్సు మీాద గవర్నమెంటువారు కృష్ణాగోదావరి జిల్లాలలో పొడిగించివేసిరి. "పెరుగుట విరుగుటకొరకే" యను ఈ మాత్రపు సుమతీశతక వాక్యమును మన బడిపిల్లలు చదువుకొనే పద్యాన్ని హోల్డ్సువర్తు ఎక్కడా చదువుకోలేదు కాబోలు! తీరా 1930 సం॥లో ఈ రీ సెటిల్ మెంటు రేట్లను అమలులో పెట్టబోయేటప్పటికి, ధరలు మున్నెన్నడెరుగనిరీతిగ పడిపోయెను. అయినా, గవర్నమెంటువారు పంతానికి పెనగులాడి రీ సెటిల్ మెంటు రేట్లు వద్దని ఆందోళనచేసిన శ్రీ ప్రకాశంపతులు మొదలగువారిని అరెస్టుచేసి జైళ్లలో వేసిరేగాని, ధరలను లేవగొట్టలేకపోయిరి! తమ వశములోలేని ఇట్టి ధరలను నమ్ముకొని చేసే పనులన్నీ, కుక్కతోక పట్టుకొని గోదావరి ఈద మన్న సామెతలో కేవస్తాయి. ధరలు వెనకటికంటె విపరీతముగ పడిపోయినప్పుడు, వెనుకటి శిస్తు రేట్లనే తగ్గించవలసియుండగ, ఆ పని చేయుటకు సర్కారువారికి మనసురాకపోయెను! అదనంగా వేసిన మూడణాలలో రెండణాలు ఈ సాలుకు వసూలు ఆపుదల చేస్తామని మాత్రము మెహార్బానీగ ప్రకటించిరి. 1926 సం॥ నాటి ధరలు 1940 సం॥ నాటికి కూడ కోలుకోలేదు. అయినప్పటికి, మూడణాల అదనపురేటు మాత్రం తగ్గలేదు. కాంగ్రెస్ గవర్నమెంటు వచ్చిన తరువాత సాలుకు 75 లక్షల జనరల్ రిమిషన్ ఇస్తూ భూమిశిస్తును శాశ్వతమైన పునాది మీాద చట్టబద్ధము చేయడానికిగాను ప్రయత్నములు జరిగినవి. కాని ప్రజల దౌర్భాగ్యము వారిని వెన్నంటియే యున్నదన్నట్లు

ఇతర రాచకీయ కారణములచేత కాంగ్రెస్‌వారు 1939 సం॥ అక్టోబరు 30 వ తేదీనుండి రాజీనామా యివ్వవలసి వచ్చుటచే మన ప్రజలస్థితి "ఎక్కడవున్నావంటే, వేసినచోటనే ఉన్నా" నన్న సామెతలోకి వచ్చింది.

"సంపాదింపని పెంపుదల"—అనగ "తేరలాభాలు"

రైళ్ళు, మోటార్లు, మార్కెట్లు, వగైరాలవల్ల రైతులకు తేరగా లాభాలు వస్తున్నవి కాబట్టి వాటినిబట్టికూడ భూమిశిస్తు హెచ్చించవచ్చునని సర్కారు అనడం సబబుకాదు. ఏలనంటే రైళ్ళు ప్రజలిచ్చిన రివిన్యూలోనుండియే, పరదేశపు కంపెనీలకు లాభాలుగ్యారంటీ ఇవ్వటం మూలంగా వేయబడినవి. రైళ్లచరిత్ర నిజంగా చెప్పవలెనంటే ఎంతో గ్రంథము వున్నది. ప్రపంచములోని ఇతరదేశములలోవలెగాక ఇండియాలో వేయబడిన రైళ్లపద్ధతి దేశానికి ఎంతో అనర్థదాయకముగ నున్నవి. సరుకులయెగుమతి దిగుమతులలో దేశప్రజలకు ప్రతికూలమగు రీతిగ రేట్లు ఏర్పాటుచేయబడెను. ప్రయాణీకుల సౌకర్యము లేశమాత్రమున్ను గమనించబడుటలేదు. రైల్వే ఉద్యోగాల విషయములో దేశప్రజలకెంతో అక్రమము జరుగుచున్నది. రైళ్లు దేశసంపదను వృద్ధిచేయడానికి బదులుగ, అవి ఇండియాద్రవ్యములను, ముడిపదార్థములను పరదేశములకు ఊడ్చిపెట్టుకొని పోవునవిగ వున్నవి. ఇదేరీతి మోటార్లు, సినీమాలు, రిస్టువాచీలు, సిల్కులు మొదలైనవి దేశసంపదను పరదేశాలకు ఊడ్చిపెట్టుకొని పోవుటకే తోడ్పడుచున్నవిగాని దేశసంపదను వృద్ధిపరచునవిగ లేవు. ఇవన్నీ దేశాంతర్భాగ

ములో దేశీయులపెట్టుబడి డబ్బుతో, దేశీయుల మేనేజమెంటుతో, దేశప్రజల పరిశ్రమతో తయారైనవి అయియుంటే అవి నిజానికి దేశానికి ఉపకారు లనియే చెప్ప వచ్చును. కాని అట్టిప్రయోజనానికి ఈ దేశము నోచుకొనలేదు. ఈ నవనాగరకచిహ్నము లన్నియు దేశమును ఆర్థికముగ క్రుంగదీయుచుండగ, ఇవే దేశసంపదను పెంపొందించే చిహ్నము లని విపరీతార్థముచెప్పి, తత్కారణముగ భూమిశిస్తును హెచ్చించజూచుట విపరీతముగనున్నది. చెంపపెట్టు, గోడపెట్టు అన్నట్లుగ రెండందాల నష్టము కలుగుచున్నది. కాబట్టి ఈ కారణముగ ప్రతి రీసెటిల్మెంటులోను భూమిపన్నుకు చేయుబడిన పెంపుదల లన్నియు న్యాయముగ కొట్టివేయబడవలెను. ఇవి రైతుపొందిన లాభము లెన్నడూకాదు. తేరలాభాలు అంతకంటెకాదు. ఈ పేరుచెప్పి సర్కారువారు తేరలాభము పొందజూచుట వారి గడుసరితనమునే తెలియజేయుచున్నదిగాని వేరుకాదు. ఒకవేళ ఇవి రైతుకు లాభాలో, తేరలాభాలో అని వారి సౌకర్యానికి అంగీకరించినను— ఇవి సర్కారుకృషివల్ల వచ్చినవా? బ్రిటిష్ గవర్నమెంటువారేమైనా తమ సీమదేశమునుండి డబ్బుతెచ్చి మనప్రజలకేమైనా తేరగా ఇచ్చారా? ప్రతి దమ్మిడీకి, దమ్మిడీవడ్డీ పుచ్చుకొని మన దేశాన్నుంచి అనేక దృశ్యాదృశ్యమార్గాలుగ ఎంతో సొమ్మును వారు తేరగా దోచుకొనిపోతూ పైగా, ఏవో కుంటిసాకులు చెప్పి, ఈ రీతిగ భూమిపన్నును చీటికి మాటికి హెచ్చింపజూచుట వారి సాహసమునే తెలియ పరుచుచున్నది. ఈ విషయమై అట్టేదూరము తరచితే, గవర్నమెంటు వాదము ఎంతమాత్రము నిలువజాలదు.

ఆర్థిక వాణిజ్య వ్యాపారములలో వారు ఇంతకాలమునుండి చేయుచు వచ్చిన కుళ్ళునంతా కడిగించుకోడానికి ఇష్టపడక పోతే, వా రింతటితో నైనా బుద్ధిమంతులై ఈ వాదనను వదలుకోవడం వారి మర్యాదను వారు గుంభనగ కాపాడు కొన్నట్లు అవుతుంది.

—♦ వివిధ విషయములు ♦—

ప్రతి రీసెటిల్ మెంటులోను భూమిపన్నను హెచ్చించుటకుగాను సర్కారువారు చెప్పుచువచ్చిన నాలుగు ప్రధాన కారణములను ఖండించి, ఇకముందు సర్కారు యొక్క "ల్యాండు రివిన్యూ పాలసీ" ఎట్లుండవలెనో సూచించితిమి. ఇక ఈ రివిన్యూ పాలసీకి సంబంధించిన వివిధవిషయముల గూర్చి క్లుప్తముగ చెప్పెదము.

(11) పైరువారీ రేట్లు:—పన్ను విధించునది భూమిమీద గాని, పంటరకముమీద కాదు అనునది ప్రధానసూత్రము లలో ఒకటిగ 1818 సం॥ నాడే అంగీకరింపబడెను. రైతు విలువైన పంట పండించుకున్నా, విలువలేనిపంట పండించుకున్నా దాని లాభాలాభములు రైతువేగాని, సర్కారువికావు. ఈ సిద్ధాంతము నిప్పుడు మన కొత్త రివిన్యూచట్టములో నిముడ్చవలెను. కొన్ని జమీాలలో ఈ సిద్ధాంతము భంగపుచ్చబడి, పైరువారీ రేట్లు బయలుదేరెను. జమీాందారీ చట్టములో కూడ పైరువారీ రేట్లు కొట్టివేయుటకు ప్రకాశం కమిటీవారు శిఫార్సు చేసియున్న సంగతిని జమీాందారీ అధ్యాయములో లోగడ చెప్పియే యుంటిమి.

12. "తిండి తర్వాత పన్ను" అనే సిద్ధాంతం మంచిది. తిండితినకుండా, కడుపు మాడ్చుకొని పన్ను ఇవ్వవలసిన దని ఎవరినిగాని కోరరాదు. సామాన్యసంసారపు తిండికి కనీసము అయిదు ఎకరాలలోని ఆదాయ మైనను ఉండుట అవసర మని అనుకొందము. కాబట్టి, అయిదు ఎకరాలకుగాని, అంతకు తక్కువగాని, భూమిగల ఆసామీకి అసలు భూమి పన్నే ఉండ రాదను నియమ ముంచుట అత్యుత్తమముగ గన్పించుచున్నది. ఇందలి లోటును ఎక్కువ ఎకరాలు గల ఆసామీల నుండి ఎక్కువ రేటును వసూలు చేయడం మూలంగా భర్తీచేసుకో వచ్చును. ఇన్‌కంటాక్సు పద్ధతిని, ఎక్కువ ఎకరాలు ఉన్నకొద్దీ ఎక్కువ రేట్లను విధించవచ్చును.

ఒకను వర్తకం చేసుకొంటే, వానికి 1999 రూపాయలు నికరాదాయం వచ్చేవరకు, దమ్మిడీపన్ను లేదు. మరియొకడు ఎకరం భూమి సేద్యంచేస్తే, వచ్చే నికరాదాయం శూన్యమైనా, 6, 7 రూపాయలు పన్ను చెల్లిస్తున్నాడు! ఇతరవృత్తులకంటే, భూమి ఏ రీతిగ అక్రమంగా కుంగదీయబడిందో, ఈ ఒక్క ఉదాహరణవల్ల తెలియగలదు. భూమి ఎముకగూడ కనబడు తోంది. కాబట్టి, ప్రతిబరువును తీసికొనివచ్చి దానిమీద పడ వేసినారు. ఇప్పుడా విస్తారపుబరువును భూమిమీద నుండి తగ్గించి అన్నివృత్తులమీద సమపాళంగా సర్దవలసియున్నది. అందుకని, అయిదెకరాల ఆసామీలకు భూమిపన్ను అసలే లేకుండా రాబోవు రివిన్యూచట్టములో చేయవలెను.

(Differential water-rate)

13. నీటిపన్ను:- సర్కారువారు కోట్లకొలది ద్రవ్యము

వెచ్చించి ఆనకట్టలు, కాల్వలు, వగైరాలు నిర్మించియున్నారు గనుకనున్ను ఆ సంబంధమైన సిబ్బందిని పోషించవలసియున్నది గనుకనున్ను, చేలకు సప్లయిచేసిన నీటికిగాను నీటిపన్ను పుచ్చుకొనుట అవసరము. ఈ "నీటిపన్నును" విధించు సూత్రములు ఇరిగేషన్ సెస్సు ఆక్టులో వివరింపబడియున్నవి.

పైన పేరాలలో చెప్పబడిన సూత్రములు మామూలు మెట్టభూములకు వర్తించును. భూములలో ఇకనుండి మెట్ట, పల్లం, అను రెండుతరగతులను మాత్రమే అంగీకరించిన చాలును. మనరాజధానిలో చాలచోట్ల మెట్టశిస్తు, నీటిపన్ను-రెండు ఒకటిగ కలిపివేయబడినవి. దీనికే "కన్సాలిడేటెడ్ పల్లపురేటు"— అనిపేరు. ఇట్టి రేటు విధింపబడిన భూములు ఖాయపు పల్లపుభూములుగ రిజిష్టరు చేయబడ్డవి. వీనికి నీరు తప్పక (గ్యారంటీగా) సప్లయి చేయవలసిన బాధ్యత సర్కారుకు కలదు.

ఇవిగాక, మెట్టశిస్తు విడిగ వసూలుచేస్తూ, దానికి నీరు సప్లయిచేసినప్పుడు నీటితీరువను ప్రత్యేకముగ ఎకరమున కింత యని విధించుటయు కలదు. ఇట్లు విధింపబడు ప్రత్యేకపు నీటితీరువకు (సమాసపు రేటు) అనిపేరు. ఇది ఎకరం ఒకటింటికి రు 2 లు మొదలు రూ 6¼ ల వరకు కలదు. కృష్ణాగోదావరీ డెల్టాలలో ఈ రేటు మొదట 3 రూపాయలుగ వుంచి, రాను రాను గత రీసెటిల్మెంటుకు పూర్వము రూ 5 లుండెను. 1930 రీసెటిల్మెంటులో దీనిని రు 6¼ లకు హెచ్చించిరి.

పైనచెప్పిన కన్సాలిడేటెడ్ పల్లపురేటుకంటె, మెట్ట రేటు నీటితీరువ కలిపిన మొత్తము సాధారణముగ హెచ్చుగ

నుండును. అదెన్నిగాక, నీరు చవిటినేలకు సప్లయిచేసినా, క్రొవ్విన నేలకు సప్లయిచేసినా, నీటితీరువ ఒకటే సమానమైన రేటుగ పుచ్చుకొనబడు చున్నది. ఇప్పుడీ పద్ధతిమార్చుట అవసరము. కన్‌సాలిడేటెడ్ పల్లపురేటుకు, మెరక రేటుకు వున్న తేడానే, నీటితీరువగ విధించుట ఉచితము. అట్లయినయెడల, చవిటి పర్రలపై పడుచున్న భారము తగ్గిపోయి, అవి త్వరగ సారవంతమైన భూములుగ అభివృద్ధి పొందడానికి అవకాశ ముండును.

14. దుఫ్ఫసల్ పంట:—ఆరునెలలకు మించి ఎక్కువ కాలము నీరుతీసుకునే పంటలకు 'దుఫ్ఫసల్ పంట' అని పేరు. అట్టివానికి మామూలు నీటితీరుపకంటె, హెచ్చుతీరువ - $1\frac{1}{2}$ రెట్లు—విధించవచ్చును.

15. క్రొత్త ప్రాజెక్టులు - ఆయకట్టు నజరానాలు:— ఏవైనా క్రొత్త ప్రాజెక్టులు కట్టినప్పుడు, వాటిఖర్చు ముట్టుటకై ప్రత్యేకపు నీటిరేట్లు, కొంత పరిమితి కాలమునకు మాత్రమే విధించవచ్చును. అట్టి ప్రత్యేకపురేట్లు మామూలు నీటితీరువ రేట్లకంటె హెచ్చుగ నుండవచ్చును. అప్పుడు నజరానాలు పుచ్చుకోవలసిన పనియుండదు.

16. ఊటకాల్వలు (Spring Channels) :—బాపట్ల తాలూకా సముద్రపు అంచుపొడుగున "సాన" లనియు, దత్తమండలములలో "ఊట కాల్వలు, బుగ్గలు" అనియు, దక్షిణాదిని "కసమ్ కాల్వ" లనియు, అనేక పేర్లతో రైతులు స్వయముగ ఇసుక పొరలనుతీసి, దానిలోనుండి ఊరు నీటిని

కాల్వలద్వారా పొలములకు పారించి, సేద్యము చేయుచున్నారు. కర్నూల్ జిల్లా మహానందిక్షేత్రములో ఇట్టి పెద్ద ఊట ఒకటికలదు. దానిక్రింద కొన్నివందల ఎకరాలు సేద్యమగుచున్నది. ఈ ఊటకాల్వలకుగాను సర్కారువారు ఒక్క దమ్మిడీ ఖర్చుపెట్టలేదు. దీనికి వారు పోషించు సిబ్బందియు లేదు. అంతర్వాహినిగ నున్న ఈ నీరు కేవలము రైతు కృషి వల్లనే పైకి వచ్చుచున్నది. ఇట్టిదానికికూడ సర్కారువారు నీటిపన్నును వసూలు చేయుచున్నారు! రైతుల కళ్లనీళ్ళు తుడవడానికో యన్నట్లు, మామూలు డెల్టారేటుకంటె కొంచెము తగ్గించినారు. ఈ ఊటలు సర్కారుస్థలములో వున్న కేసులలోమాత్రం, సర్కారుయొక్క హక్కును నిరూపించు కొనుటకుగాను నామకః ఎకరానికి బేడో పావలో విధించుచు, మిగతా ఊటలపై ఏమాత్రమున్ను నీటిపన్ను విధించరాదు. దీనికొరకై బళ్ళారిజిల్లా ప్రతినిధిగనుండిన శ్రీ ఆర్కాటు రంగనాథ మొదలియారుగారు ఎన్నాళ్లనుండియో వాదించుచుండిరి. మొట్టమొదట బాపట్ల వగైరా తాలూకాలను సెటిల్‌మెంటు చేసిన ఆఫీసర్లు ఈ ఊటలక్రింది భూములను కేవలము మెట్టభూములుగానే భావించవలెననియు, వానిమీద ఎట్టి నీటితీర్వాగాని విధింపరాదనియు, గట్టిగ చెప్పియుండిరి. కాని, అప్పటినుండి ఇప్పటివరకు నీటిపన్నును విడువక విధించుచునేయున్నారు. దీనికి సబబులేదని సర్కారుకు తెలిసినను కేవలం డబ్బు పోతుందనే కారణంచేతనే వారు ఈ సబబుకు విరుద్ధముగ ప్రవర్తించుచు వచ్చిరి. "ఇటువంటి సొనలు రాజధానిలో అన్నిచోట్లవున్నవి. ఒకచోట నీటిపన్ను తీసివేస్తే,

అన్నిచోట్ల తీసివేయవలసి వస్తుంది'' అనే సాకు తప్ప, వారు ఇంకొక సబబును చెప్పలేకపోవుచున్నారు.

ఇప్పుడు చేయబోవు రివిన్యూచట్టములో ఈ ఊట కాల్వల క్రింది భూములకు—పైన సూచించిన ఒక్క మినహాయింపుతో— నీటి పన్ను విధింపరాదనుమాట చేర్చవలెను. సర్కారు సొమ్ము ఖర్చుపెట్టని ఏ నీటివనరులపైగాని, నీటి పన్ను విధించరాదను సూత్రమును బొంబాయి రాజధానిలో కాంగ్రెసు గవర్నమెంటువారు అంగీకరించిరి. ఈ సూత్రమునే మన మద్రాసు రాజధానిలో కూడ అంగీకరించుట అవసరము.

మరా:—సర్కారు కాల్వలక్రింద ఊట దిగుటవల్ల, (జోమువల్ల) సాగుబడియగు పొలములపై ఇప్పుడున్నట్లుగానే నీటిపన్నును విధించుచుండవచ్చును.

(17) సెలవులేని సాగు అపరాధపు పన్నులు కాల్వల క్రింద, చెర్వులక్రింద, ఇతర జలాధారముల క్రింద నీటియొక్క సప్లయిని బట్టి, వీలైనంత ఎక్కువ భూమిని సేద్యము క్రిందికి తెచ్చుటకై రివిన్యూ, డి. పి. డబ్లియు డిపార్టుమెంటులు ప్రయత్నించవలయును. నదులలోను, వాగులలోను, చెరువులలోను నీరు వృథాగా సముద్రానికి పోకుండ, దానిని భద్రపరచుటకు వీలైనన్ని ప్రయత్నములను వారు హృదయ పూర్వకముగ చేయువలెను. కాని, ఇప్పుడున్న పరిస్థితులను విచారించగ, ఈ డిపార్టుమెంటులవారు ఇరిగేషనును విస్తరింపజేసి తద్వారా సర్కారుకు, ప్రజలకు, ఎక్కువ ద్రవ్యలాభమును చేకూర్చుటకు మారుగ, దానిని సంకుచిత పరచుటకు చూచుచున్నట్లు కనబడుచున్నది. సెలవులేని సాగనియు, పినాల్టీలనియు, పేరు

పెట్టి, ఆయకట్టును వారు కుదింపజేయుచున్నారేగాని, విస్త
రింపజేయుటలేదు. ఏదో నిరంకుశంగా "ఆయకట్టు ఇంతే"నని గిరిగీసి, దానిని దాటి ఎవరైనా సేద్యంచేసుకుంటే, దానిమీద విపరీతపు పినాలిటీలు వేస్తున్నారు. ఈ ఆయకట్టు నిర్ణయమునకు సామాన్యప్రజలు తెలిసికోదగ్గ నియామకము లేమియు గన్పట్టవు. అంతయు డి. పి. డబ్లియువారి గుట్టు. దీనివల్ల లంచములకు, లంచములివ్వని రైతుల భూములను ఆయకట్టులోనుండి తొలగించి హింసించుటకును చక్కని రాచబాట లేర్పడెను. సర్కారుకు ఒక రైతుమీద రాచకీయవిషయమైగాని ఇంకే కారణంచేతగాని కోపంవచ్చి అతని భూమిని ఆయకట్టులోనుంచి తొలగించిన కేసులు కూడ గలవు. కనుక ఈ పద్ధతిలో కొంత మార్పు అవసరము. రిజిష్టరై సర్కారుచే నీరు గ్యారంటీ చేయబడిన భూములకు ఇబ్బంది కలిగించకుండ ఉండేరీతిగ, ఏరైతైనా తన పొలము ప్రక్కగ ప్రవహించు సర్కారునీటితో సేద్యము చేసుకొనేయెడల అది ఆయకట్టులో చేరలేదనే సాకుచెప్పి — దాని మీద పినాలిటీలు విధింపరాదు.

అట్టి నీరు తనపొలానికి అందుబాటులో నున్నప్పుడు అది ఇతరులకు ఇబ్బందికరము కానప్పుడు, అతడానీటిని వినియోగించుకోరాదనడం, వినియోగించుకుంటే శిక్షార్హపుపన్ను విధిస్తామనడంకంటె అపభ్రంశపుపని ఇంకొకటి యుండదు. వీలైనంత నీరు, వీలైనంత హెచ్చు ఎకరాలకు సప్లయి అయ్యేటట్లు చూడడం, తద్వారా సర్కారుకు ఎక్కువ నీటిపన్ను వచ్చేటట్లు చూడడం, రైతులకు ఎక్కువపంట పండేటట్లు చూడడం, డిపార్టుమెంటు ఉద్యోగస్థుల విధియైయుండగ, ఏవో అవకతవక

రూల్సుపెట్టి, సాగుబడిని చంపివేయడం ఏమిసబబు ? సాగుబడిని చంపి, పినాల్టీలవల్ల సర్కారుకు హెచ్చుశిస్తు తెప్పిస్తామనడం పాడుగుకోసుకుని పాలుత్రాగుతా మనడం వంటిది.

పినాల్టీలనునవి కొన్ని సందర్భాలలో మాత్రమే విధింవ తగియుండును. ఎట్లనగ, ఏరైతైనా కాల్వకట్టలు, బోదెలు అక్రమంగా తెగగొట్టడమో, ఇతరులకు హానికరంగా అడ్డ కట్టలువేసి, నీరును నిరోధించడమో, జబర్దస్తీగా ఇతరుల పొలాలకు పోయే నీటిని తన పొలంలోకి మళ్ళించుకొని, పొరుగు రైతులతో కలహాలు పెట్టుకోవడమో,—ఇటువంటి అక్రమపు పనులు చేసినప్పుడు డిపార్టుమెంటువారు అట్టి పనులను వారించుటకై పినాల్టీలుగాని, ఇతరశిక్షలుగాని, విధించవచ్చును. అంతేగాని, తనకు అందుబాటులో నున్న నీరు వాడుకున్నాడనే కుంటి సాకుచెప్పి, అతనిపై పినాలిటీలు విధించుటతప్పు. కాబట్టి పినాలిటీలు పై జెప్పిన సందర్భంలో తప్ప ఇంకొకప్పుడు విధింపరాదని కూడ ఖండితముగ చట్టములో నిరూపించవలెను. భగవంతు డిచ్చిన నీటిని భద్రపరచడానికి, దానిని సక్రమంగా రైతుల పొలాలకు సప్లయి చేయుటకు తగు ఏర్పాట్లు చెయ్యడానికి, అందువిషయమై రైతుల మధ్య తగవులురాకుండ నివారించడానికి మాత్రమే డి. పి. డబ్లియు వారికి జోక్యముండవలెను. అంతేగాని, ఏవో అయోమయపు రూల్సుపెట్టి, ఇరిగేషనను చంపివేయడానికి, ప్రజలను హింసించడానికి, నీరంతా సముద్రానికి పోతూవుంటే చూస్తూవుండడానికి కాదు.

(18) రిమిషనులు:- పంటలు నష్టమైనప్పుడు శిస్తులు రిమిషను ఇచ్చుటకు గవర్నమెంటుకు అధికార ముండవలెను.

ఇందునుగూర్చిన రూల్సుచేయడానికిన్ని గవర్నమెంటుకు అధికారముండవలెను.

(19) పట్టాట్రాన్సుఫర్లు:- రైతులు తమ భూములను అమ్ముకొన్నప్పుడు, మార్చుకొన్నప్పుడు, విభాగం చేసుకొన్నప్పుడు విధిగ సదరు మార్పులను గవర్నమెంటుకు గ్రామోద్యోగులద్వారా లిఖితపూర్వకముగ తెలుపవలెను. అందుకు తగిన ఫారములు, రూల్సు, రైతులు కోరినప్పుడు సప్లయి చేయబడవలెను, ఈ మార్పులు జరిగిన వెంటనే వానిని సర్కారుకు తెలిపి, పట్టా ట్రాన్సుఫర్లు పొందనియెడల, సదరురైతులు జరిమానా శిక్షకు పాత్రులగుదురు. పైన 12-వ పేరాలో అయిదెకరాల ఆసామీకి భూమిపన్ను వుండరాదని చెప్పితిమి. ఎవరెవరికి ఎంతెంత భూమివున్నదో, అప్పటప్పటికి నిర్ణయించడానికిగాను, ఈ పట్టా మార్పులు తక్షణమే జరుగుట అత్యవసరము. ఈ సందర్భములో భూమి ఎవరిదని నిర్ణయించుటకు, పట్టాలే ఋబ్రిల ప్రమాణముగ నుండవలెను. అందుకని, ఈ శిక్షానియమ మేర్పరచుట అవసరము. ఈ ఏర్పాటే జమీ భూములలోను, ఇనాం భూములలోను కూడ చేయవలసియుండును.

(20) భూమిపన్ను ధాన్యపుశిస్తా? రొక్కపుశిస్తా? రొక్కరూపముగ ఇకముందు ఏర్పరుపబడబోవు గ్రామపంచాయితీలద్వారా, గ్రామకరణం మునసబులవల్ల వసూలుచేయబడవలెను. ధాన్యరూపముగ వసూలుచేయుట మంచిదేయైనను, ఈ కాలమున కది ఆచరణయోగ్యము కాదేమో!



—♦ యూరోపియనుల భూములకు పన్నులు లేవు,
రీ-సెటిల్‌మెంట్లు లేవు ♦—

(21) ఈస్టిండియా కంపెనీవారు మదరాసు రాజధానిలో ప్రభుత్వమును చేపట్టిన కొత్తలో కోయంబత్తూరు, సేలం వగైరా జిల్లాలలో మిక్కిలి ఫలవంతమైన కొండప్రదేశములు టీ, కాఫీ, వగైరా పంటలకు మిక్కిలి అనుకూల మని గ్రహించిరి. వెంటనే లోగడ అనాదినుండి ఆ ప్రదేశములలో నివసించు కొండజాతులవారిని అచ్చటనుండి లేవగొట్టి వేలాది ఎకరముల ప్రదేశములను శిస్తులేకనున్ను, కొన్నిచోట్ల నామకః శిస్తురేటుతోనున్ను యూరపియనులకు యిచ్చివేసిరి. ఆ భూముల నన్నిటిని( చుట్టుపట్లనుండు పేద ప్రజలచే) సేద్యములోనికి తెప్పించి టీ, కాఫీ తోటలను సదరు యూరోపియనులు నాటించిరి. అంతకు పూర్వము మన దేశీయులకు టీ, కాఫీ దురభ్యాసము లేదు. అయినా యీ టీ, కాఫీ పొడుములను చిన్నచిన్న శాంపిలు పొట్లములుగ కట్టి ఆ చుట్టువట్ల జిల్లాలలో తమకు సన్నిహితు లగు ఉద్యోగస్థులు వగైరాలకు ఉచితముగ పంచిపెట్టించిరి. అవి కాచుకొని త్రాగడంకూడ ఎల్లాగో ప్రచారకులచేత చూపించిరి. ఈ రీతిగ సంఘములో పై తరగతి ఉద్యోగస్థులకు యీ దురలవాటు నేర్పుటచేత, వారిని చూచి తక్కిన సామాన్యులుకూడ యిదేదో గౌరవప్రదమైన పని యనుకొని త్రాగడం మొదలుపెట్టినారు. అరవవారు, అరవ ఉద్యోగస్థులు మన తెలుగుదేశం వచ్చి కాఫీలు ధారాళంగా త్రాగడం చూచి, మనవారుకూడ ఆ వ్యసనములో పడిరి. తెలుగులో మొట్టమొదటగ నేర్చినవి అరవ

కాఫీహోటళ్లే. నేడు ఊరూర అల్లుకుపోయినవి. చీనాదేశప్రజల గొంతులలో బలాత్కారముగ నల్లమందు కుక్కి, ఆ జాతిని యావత్తు "నల్లమందు భాయి"లను దుర్బలులను చేసినట్లుగ మన హిందూదేశస్థులనుకూడ యీ రీతిగ టీ, కాఫీలకు దాసులను చేసివేసి, నిర్వీర్యులను చేయుటయే గాక, అపారధనమును యూరోపియను కంపెనీలు సంపాదించు కొనుచున్నవి. ఈ సంగతి నిత్యము కాఫీ, టీలు త్రాగే మన దేశస్థులకు తెలియదే మో!

ఎకరం ఒకటికి వెయ్యేసి రెండేసి వేల రూపాయల నికర ఆదాయం యీ టీ, కాఫీ తోటలమీద యూరోపియనులకు వచ్చుచున్నను, దానిమీద వారు సర్కారుకు చెల్లించు పన్ను ఎంత? కొన్నిచోట్ల యీ రోజువరకు అసలే లేదు: ఉన్నచోట్ల ఎకరం ఒకటికి నామకః ఒకరూపాయి. వీటికి మన రైతుల భూములకున్నట్లుగ 30 ఏండ్ల కొకసారి రీ-సెటిల్ మెంట్లు నిన్న మొన్నటివరకు లేనే లేవు. ఇటీవల రీ-సెటిలుమెంటు చెయ్యాలన తలపెట్టి, య 1కి ఒకరూపాయి అదనంగా శిస్తు వెయ్యాలని మదరాసు గవర్నమెంటు చూస్తే ఆ యూరోపియను కంపెనీలన్నీ గగ్గోలుపెట్టి గవర్నమెంటుమీద విరుచుకుపడ్డవి. దానితో ఆ యత్నము నిలుపుదల చేయబడెను. ఎకరం 1కి నికరాదాయం 25, 30 కూడ లేని మన రైతుల పొలాలకు 6 మొదలు 12 వరకు పన్ను వుండడమున్ను, వేలకొలది నికరాదాయం వచ్చే యూరోపియనుల పొలాలకు అసలే శిస్తు లేకపోవడం, ఉంటే నామకః ఒకరూపాయి వుండడం, అవి

హెచ్చించకపోవడం చూస్తే, ఈ బ్రిటిషు రాజ్యంలో ఎంతటి కటిక పక్షపాతం, అక్రమము జరుగుచున్నదో తెలియ గలదు.

ఇక ముందైనను కాంగ్రెసు ప్రభుత్వములు ఈ అక్రమమును తొలగించవలెను. మదరాసు రాజధానిలో "ల్యాండు రివిన్యూ" పాలసీని నిర్ణయించే టప్పుడు, మన మంత్రులు ఈ టీ, కాఫీ తోటల సంబంధమైన పాత పురాణపు ఫైల్సు నన్నిటిని పైకి లాగి దాని కుళ్లు నంతను కడుగుదురు గాక.

ఈ విషయమిట్లుండగ, గత కాంగ్రెసు ప్రభుత్వపు హయాములో, ప్రధాన మంత్రి శ్రీమాన్ రాజగోపాలాచార్యులుగారు కల్లుదుకాణములను సేలంజిల్లాలో మూయించినపుడు దానికి బదులుగ టీ, కాఫీ, షాపులను తెరపించుట తాను పబ్లిక్‌గ బజారులలో త్రాగి ప్రజాసమూహానికి చూపించుట ఆఫొటోలను పత్రికలలో ప్రచురింపించుట మిక్కిలి ఘోరపాతకముగ గన్పట్టకమానదు. మన దేశీయులు గీయుచవకకల్లు మాన్పించి, యూరోపియన్ కంపెనీలు దోపిడీ చేసికోడానికి అనుకూలమైన టీ, కాఫీలు ప్రజలకు మప్పజూచుట ప్రజలను మంగలములోనుండి మంటలోనికి త్రోసినట్లగుచున్నది. అట్టిపని సదరు ఆ ప్రధానిగారి బుద్ధిపాటవమునే చాటుచున్నది. ఇకముందైనను ఇట్టిలోపము జరుగకుండ రేపువచ్చే మన కాంగ్రెస్ మంత్రులుచేస్తే చేయగలిగితే దేశముఅదృష్టవంతమైనదనియే చెప్పుకొనవచ్చును. ఇంతకు ఒక్కమాట కాఫీ, టీ, లకు వశులై పోయిన వారెవరుగాని, నిజానికి మద్యపాననిషేధపు మంత్రిత్వము వహించడానికి పనికిరారని మొన్నటిచరిత్రవల్ల ఋజువగుచున్నది.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA128B142 |
| పుస్తకం పేరు | |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 397 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | IV,372 |
| లేని పేజీలు | I TO IV |
| తయారు చేసినది | munisha |
| పేజీలు విడదీసినది | munisha |
| స్కాన్ చేసినది | S.Harsha |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | GOOD |